శ్రీనారాయణ భట్ట విరచిత

# త్రిస్థలీసేతువు

## ప్రథమభాగము- కాశీప్రకరణము


అనువాదకులు :

**శ్రీ చివుకుల సత్యనారాయణశాస్త్రి** బి.ఎ;బి.ఇడి.

రిటైర్డు ఉపాధ్యాయుడు - కాశీవాసి

హిందూకాలేజిహైస్కూలు-గుంటూరు(ఆ.ప్ర)

&

**డా॥ జోస్యుల సూర్యప్రకాశ రావు**.ఎమ్.ఎ,పిహెచ్,డి

రిటైర్డు తెలుగు ప్రొఫెసరు

బెనారస్ హిందూ యూనివర్సిటీ, వారణాసి



**భరణి ప్రచురణలు**

రాజమండ్రి

ప్రథమ ముద్రణ :

జనవరి 2002

ప్రతులు : 1000

మూల్యము : రూ.150/-

ప్రతులకు

జె.వి.ఎస్.ఎస్.ఎస్. భరణీకుమార్

భరణి ప్రచురణలు

6-16-5/2, కస్తూరివారివీధి

టీ నగర్ - రాజమండ్రి - 533 101



ముద్రణ :

శ్రీ శారదా ప్రింటర్స్

17-1-49/1

సీతంపేట రాజమండ్రి

ఫోన్ : 473554



కలౌ వేఙ్కటనాయకః

## ఏతద్గ్రంథ ముద్రణమునకు

తిరుమలతిరుపతి దేవస్థానముల అధికారులు "రచయితలకు ఆర్థికసాహాయ్యము" అను పథకముద్వారా రు20,000/-ల విరాళ మొసగియున్నారు

వారికి

## మా కృతజ్ఞతలు

రచయితలు

# గ్రంథకర్తృ పరిచయము



శ్రీ చివుకుల సత్యనారాయణశాస్త్రి - ధర్మపత్ని శ్రీమతి శకుంతల

| | |
|---|---|
| జన్మస్థానము | గుంటూరుజిల్లా వినుకొండతాలూకా వేట్రాయుని అప్పాపురం అగ్రహారం |
| తల్లిదండ్రులు | తండ్రిగోపాలకృష్ణశాస్త్రి, తల్లి రుక్మిణమ్మ |
| జననము | శ్రీ విభవనామసంవత్సర భాద్రపద శుద్ధతదియ సోమవారం (17 09 1928) |
| కుటుంబము | ధర్మపత్ని శకుంతల ఇద్దరు పుత్రులు ఇద్దరు పుత్రికలు |
| దీక్షాగురువులు | శ్రీజన్నాభట్ల రామచంద్ర సిద్ధాంతిగారు గుంటూరు |
| విద్యార్హతలు | బి.ఎ బి యిడి(ఆంధ్రవిశ్వవిద్యాలయము) రాష్ట్ర |
| భాషావిశారద | (దక్షిణభారత హిందీ ప్రచారసభ మద్రాసు) |
| వృత్తి | హిందూకాలేజి హైస్కూలు గుంటూరులో అధ్యాపక వృత్తి (1953 నుంచి 1986 వరకు) 1 10 1986 పదవీ విరమణ |
| అభిరుచులు | సనాతన ధర్మాభిమానము వైదిక మార్గానుష్ఠానము భారతరామాయణ భగవద్గీతలపఠనము |
| ధ్యేయము | "కాశ్యాంతు మరణాన్ముక్తి అని నిరంతర కాశీవాసము |

# గ్రంథకర్తృ పరిచయము



**డా॥ జోస్యుల సూర్యప్రకాశరావు - సహధర్మచారిణి శ్రీమతి సుబ్బలక్ష్మి**

అభిజనము — కరుగోరుమిల్లి పశ్చిమగోదావరిజిల్లా

పితరులు — శ్రీమతి సూర్యకాంతమ్మ, శ్రీ శే సత్యనారాయణగారు

కుటుంబము — ఒక కుమారుడు కోడలుముగ్గురు మనుమరాండ్రు

విద్యాభ్యాసము — మ్యునిసిపల్ హైస్కూలు పాలకొల్లు డబ్ల్యు జి బి కాలేజి<br>భీమవరం ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వాల్తేరు

విద్యార్హతలు — ఎం ఏ (తెలుగు హిందీ సంస్కృతము) పిహెచ్ డి<br>భాషాప్రవీణ రాష్ట్రభాషాప్రవీణ సాహిత్యకోవిద బి ఓ ఎల్ వగైరా

గురుపరంపర — సర్వశ్రీ తంగిరాల సత్యనారాయణశాస్త్రి నందుల శేషగిరిశర్మ<br>కృత్తివెంటి వెంకటసుబ్బారావు శ్రీపాద లక్ష్మీనారాయణశాస్త్రి<br>రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి అప్పల్ల సోమేశ్వరశర్మ<br>వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి,ఆచార్య యస్వీ జోగారావుగారలు

దీక్షాగురువులు — బ్ర॥ వే॥ ఓరుగంటి నరసింహయోగిగారు

అధ్యాపకత్వము — తూర్పుగోదావరిజిల్లా పరిషద్ ఉన్నత పాఠశాలలు ప్రభుత్వ<br>జూనియర్‌కళాశాల పిఠాపురం ఆంధ్రవిశ్వకళాపరిషత్తువాల్తేరు<br>కాశీవిశ్వహిందూవిశ్వవిద్యాలయం వారణాసి<br>(ఆచార్యులు ఆంధ్రశాఖాధ్యక్షులు)

అభిరుచి — సద్గ్రంథ పఠనము సత్సాంగత్యము సదాకాశీ నివాసము

విషయసూచిక

శుభమస్తు ఓం అవిఘ్నమస్తు

# త్రిస్థలీ సేతు సర్వస్వము

(ప్రథమభాగము)

## (కాశీప్రకరణము)

*శ్లో॥ విశ్వేశం మాధవం ఢుంఢిం దండపాణిం చ భైరవమ్।*
*వందే కాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికామ్॥*

**(1) కాశీ మాహాత్మ్యము**

తత్ర మాహాత్మ్యజ్ఞానస్య ప్రవృత్త్యౌపయికత్వేన తస్యావశ్యం వక్తవ్యత్వాత్తదేవ ప్రథమం నిరూప్యతే। అత్ర ఏవ పద్మపురాణే పాతాలఖండే భృగుం ప్రతి ఋషికృతేషు పంచప్రశ్నేషు ప్రథమం మాహాత్మ్య ప్రశ్న ఏవ కృతః॥

భావము మాహాత్మ్య జ్ఞానము పరవాది ప్రవృత్తి యందు ఉపయోగపడుట చేత దానిని అవశ్యము చెప్పవలసి యుండుటచే అదే మొదట నిరూపించబడుచున్నది. అందుచేతనే పద్మ పురాణ మందలి పాతాళ ఖండమున భృగు మహర్షిని గూర్చి ఒక ఋషి చేసిన ఐదు ప్రశ్నలలో మాహాత్మ్యమును గూర్చిన ప్రశ్నయే మొదటిది

*శ్లో॥ కిం మాహాత్మ్యం కథం వేద్యం సేవ్యా కైశ్చ ద్విజోత్తమః*
*పరిణామం చ తస్యాః కిం కేనోపాయేన లభ్యతే॥ ఇతి॥*

భావము కాశీ మహిమ ఏమి? అది ఎట్లు తెలియబడును? అది ఎవరిచే సేవింపబడదగినది? ఆ సేవవలన ఫలితమేమి? అది ఎట్లు లభించునో ఓ ద్విజోత్తమా! చెప్పుము

తత్ర స్కాందే *శ్లో॥ వారాణసీ మహాపుణ్యా త్రిషులోకేషు విశ్రుతా*
*అంతరిక్షే పురీ సా తు మర్త్యలోకస్య బాహ్యతః॥*

భావము మహాపుణ్యరాశియగు వారాణసి భూలోకమునకు బాహ్యముగ అంతరిక్షమందుండి త్రిలోకముల యందును భూరి విఖ్యాతిని గాంచి యున్నది.

*శ్లో॥ పంచక్రోశాంతరే రాజన్! బ్రహ్మహత్యా న సర్పతి।*
*అష్టావింశతి కోట్యస్తు లింగానాం తత్ర భారత॥*

భావము పంచక్రోశాత్మకమగు ఈ మహానగరి యందు బ్రహ్మ హత్యాది పాతకములు ప్రసరించవు. ఇరువది ఎనిమిదికోట్ల లింగములచటు ప్రసిద్ధి గాంచి యున్నవి

మాత్స్యే -

శ్లో॥ వారాణసీతి భువనత్రయ సారభూతా
ధన్యా సదా మమ పురీ గిరిరాజపుత్రి॥

భావము ఓ గిరిరాజపుత్రి! నా పురియగు వారాణసి ధన్యమైనదియును భువన త్రయమందు సారభూతమైనట్టిదియును అగుచున్నది

శ్లో॥ అత్రాఽఽగతా వివిధ దుష్కృత కారిణోఽపి।
పాపక్షయా ద్విరజసః ప్రతిభాంతి మర్త్యాః॥

భావము అచటకు చేరినట్టి వివిధ మానవులు దుష్కృత్యములు గావించిన వారలయ్యును పాపక్షయముకాగా నిర్మలులై భాసిల్లుదురు

శ్లో॥ ఏవం స్మృతం ప్రియతమం మమదేవి నిత్యమ్।
క్షేత్రం విచిత్ర తరుగుల్మలతా సుపుష్పమ్॥

భావము దేవీ! విచిత్రమైన వృక్షములు లతలు సుగంధ పుష్పములతో గూడినట్టి ఈ వారాణసి నాకు మిక్కిలి ప్రియతమ మైనది యని నిత్యము స్మరింపవగును

శ్లో॥ అస్మిన్మృతాస్తమభృతః పదమాప్నువన్తి।
మూర్ఖాగమేన రహితాస్తు న సంశయోఽత్ర॥

భావము ఇచట మృతులైన దేహధారులు మూర్ఖులైనను దోష రహితులై నా యొక్క పరమ పదమును పొందెదరు ఇందు ఎంత మాత్రమును సందియము లేదు

లైంగే

శ్లో॥ భూర్లోకే చాంతరిక్షే చ దివి తీర్థాని యాని చ।
అతీత్యవర్తతే సర్వాణ్యవిముక్తం స్వభావతః॥
క్షేత్రం తీర్థోపనిషదమవిముక్తం న సంశయః॥
తీర్థ రహస్య మిత్యర్థః॥

భావము భూలోకమందుకాని అకాశమందుకాని స్వర్గమందుకాని యున్నట్టి సమస్త తీర్థములు అవిముక్త క్షేత్రమందు సహజముగనే సిద్ధమై యున్నవి ఈ తీర్థము సర్వోపనిషద్రహస్యమనుటలో సంశయము లేదు

శ్లో॥ మాఘే సర్వాణి తీర్థాని ప్రయాగ మభియాన్తి హి।
కాశీ స్థితాని తీర్థాని మునే! యాన్తి న కుత్ర చిత్॥

భావము మాఘమాసమందు సర్వతీర్థములు ప్రయాగ క్షేత్రమును చెందును కాని కాశీ స్థితమగు తీర్థములు మాత్రము ఎన్నడును అన్య ప్రదేశములను పొందవు

తథా శ్లో॥ ఇదం గుహ్యాతమంక్షేత్రం సదా వారాణసీ మమ।
సర్వేషామేవ జంతూనాం హేతుర్మోక్షస్య సర్వదా॥

భావము నా పురియగు వారాణసి గుహ్యాతి గుహ్యామైనది ఇది సర్వ ప్రాణులకును సదా మోక్ష హేతువగుచున్నది

పాద్మే భటాన్ప్రతియమః (పద్మ పురాణమందు యమ ధర్మరాజు తన భటులతో నిట్లు చెప్పుచున్నాడు)

శ్లో॥ ప్రాణ ప్రయాణావసరే యే కాశ్యాం సంగతా జనాః
యే వా కాశీతి భాషన్తే యేవా విష్ణుపరాయణాః
యేవా మహాదేవరతా యేవా నత్యర్థ మృత్యవః,
తేషాం నాహం ప్రభుః క్వాపి శ్యాజ్యా యుష్మాభిరేవ తే॥

భావము "ప్రాణప్రయాణ కాలమందు కాశీ చేరుకొనిన వారు గాని లేక కాశీ కాశీయని నిత్యము స్మరించువారుగాని విష్ణు పరాయణులు గాని లేక మహా దేవభక్తి రతులు గాని లేక కాశీ క్షేత్రమందు మృతినందువారుగాని నాప్రభుత్వమునకు శాసనమునకు ఎంత మాత్రమును గురికారు అట్టి పుణ్యాత్ములు ఎప్పటికిని మీచే సమీపింపబడనివారు మాత్రమే యగుదురుసుమా" యని యమధర్మరాజు తన భటుల నాదేశించి పలికెను

బ్రహ్మవైవర్తే -శ్లో॥ కాలాద్భయం నాస్తి యత్ర యత్ర పాపభయం నహి।
జన్మాంతర సహస్రేషు కృతం నశ్యతి దర్శనాత్॥

భావము ఏ కాశీ క్షేత్ర దర్శనము వలన కాలుని భయము కాని పాప భయముగాని ఉండదో అట్టి కాశీ దర్శన మాత్రముచేతనే సహస్రాధిక జన్మాంతర కృత పాపములన్నియు నశించి పోవును

శ్లో॥ తత్క్షేత్ర మహిమానం కః సమ్యగ్వర్ణయితుం క్షమః
అన్యత్రైవ మృతానాంతు జీవానాం కీకసం యది॥
వారాణస్యాం ప్రపతతి నరకే న పతన్తి తే।
స్వర్గం దుష్కృతినః పాపా అపి గచ్ఛన్తి నాన్యథా॥ (కీకసమస్థి)

భావము అట్టి క్షేత్ర మహిమను వర్ణించుటకెవ్వడు సమర్థుడగును? అన్యత్ర మృతి హొందిన ప్రాణుల అస్థులు వారాణసి (గంగ) లో పడినచో అట్టి వారు నరక కూపమున యెన్నడును పడరు దుష్కృతులగు పాపులు సైతము సద్గతి హొందుదురు ఇందుకు అన్యథా జరుగదు

శ్లో॥ అస్థి కేశా నఖా మాంసం యేషాం కాశ్యాం పతేదిహ
మహాపాపాస్తదా స్వర్గం యాన్తి సాహస్రవత్సరాన్
పునఃకాశీం సమాసాద్య ముక్తాః స్యుః సర్వజన్తవః॥

భావము  మహాపాపులైనను ఎవరి అస్థులు కేశములు గోళ్ళు మాంసము మొదలగునవి కాశీ (గంగ) లో పడునో సహస్రాధిక వర్షములు వారు స్వర్గమును పొందెదరు పునః వారు కాశిని పొంది ముక్తులగుదురు

*పాద్మే:- శ్లో॥  మారుతేరిత కాశ్యరేణు యోగేన కిల్బిషమ్।*
*దూరీభవతి బ్రహ్మర్షే నాత్రకార్యావిచారణా॥*

భావము:- గాలి తాకిడి చేత కాశీ పురియందలి రేణువులు ప్రాణుల ఉపాధితో సంయోగము చెందినప్పుడు వారి పాపములు దూరమగును దీనిని గురించి సంశయము లేదు

*తథా:- శ్లో॥  కాశీవాసీ క్షుత్కృశః పుల్కసో ఽ పిశ్రేష్ఠో రాజన్ముక్తి కన్యావృతోయతః।*
*అన్యత్రస్థః సార్వభౌమః స్వధర్మే సస్యాచ్ఛ్రేష్ఠో గర్భ భాజైక యోగ్యః॥*

భావము  ఓ రాజా! క్షుద్బాధచే కృశించిన కాశీవాసి యగు అంత్యజుడును అతనిని ముక్తి కన్య వరించుటచే శ్రేష్ఠుడే యగుచున్నాడు అన్యత్ర ధర్మనిరతుడై యుండి సార్వభౌముడైనను అతడు పునః మాతృగర్భములో ప్రవేశించవలసిన వాడగుటచే కాశీవాసి యగు ఆ అంత్యజుని కంటె శ్రేష్ఠుడు గానేరడు

*తథా:- శ్లో॥  అన్యత్రాపి ప్రమీతానాం శ్రాద్ధం శ్రద్ధాసమేధితమ్॥*
*అత్రదీయత తేన స్యాత్తేషాం కైలాస సంగమః॥*

భావము  అన్యత్ర మృతి చెందిన వారికై చేయబడు శ్రాద్ధాదులు శ్రద్ధా సహితములైనను కాశీలో ఇవ్వబడునట్టి పిండాదులచేతనే ఆ మృతులకు కైలాస ప్రాప్తి సంభవించును

*శ్లో॥  అత్ర సంగ్రామ మధ్యే యే ప్రాణాం స్త్యక్ష్యన్తి శస్త్రిణః॥*
*ఏతాసాం తే విషయగా న భవిష్యన్తి వాసవ॥*
*(ఏతాసా మప్సరసాం)*

భావము. ఓ ఇంద్రా! కాశీలో రణ రంగములో మృతిచెందు ఆయుధధారులు అప్సరసాది కామభోగ యోగ్యతను పొందక అంతకంటె ఉత్తమ గతుల నొందుదురు

*తథా:- శ్లో॥  జన్మాంతరసహస్రేషు విహితైర్ధర్మ కర్మభిః॥*
*మహాదేవార్పితైః సాహి ప్రాప్యా వైశ్వేశ్వరీపురీ॥*

భావము  సహస్రాధిక జన్మాంతర శంకరారాధన చేతను ఈశ్వరార్పిత విధ్యుక్త స్వధర్మానుష్ఠానము చేతను ఉత్పన్నమైన శంకరానుగ్రహము వల్లనే విశ్వేశ్వర పురనివాసములభించును

*శ్లో॥  శంభోరనుగ్రహా దేవ శంకరారాధనేక్షితాత్।*
*తత్క్షేత్రం ప్రాప్యతే ప్రియా! నాన్యైః సాధనకోటిభిః॥*

భావము:  కోట్ల కొలది అన్యసాధనలు సైతము కాశీవాస ఫలము నివ్వజాలవు ఈశ్వరారాధన వలననే అది లభించును

శ్లో॥ నైతత్ క్షేత్ర సమం కించిత్ త్రిషులోకేషు విద్యతే।
అధికం వా మునిశ్రేష్ఠాః సత్యమేతద్బ్రవీమి వః॥

భావము ఓ మునిశ్రేష్ఠులారా! త్రిలోకములయందును ఈ క్షేత్రమునకు సమానమైనట్టిదిగాని అధికమైనట్టిది గాని మఱియొకటి ఏమాత్రమును గాన్పించదు మీకు నేను సత్యమును చెప్పుచున్నాను

బ్రహ్మవైవర్తే -

శ్లో॥ వారాణస్యాం స్వల్పమపి ప్రాయశ్చిత్తం మహాఘనుత్।
న కాశికాయాం పతితోఽపి ధర్మకృద్దుఃఖం సమాప్నోతి మమ
ప్రసాదాత్। ఇతి ప్రజ్ఞా జగదీశ్వరస్య మహానుభావస్య శివస్య విశ్వాః॥

భావము వారాణసీగతస్వల్ప ప్రాయశ్చిత్త మునైతము ఘోర పాపములను హరించివేయును "నాయొక్క అనుగ్రహము చేత కాశీలో ధర్మము నాచరించుచు పతితులైనను అట్టి వారికి దుఃఖము సంప్రాప్తించదు అనిజగదీశ్వరుడు మహానుభావుడునగు విశ్వనాధుని యొక్క నిత్యమగు ప్రతిజ్ఞయై యున్నది

శ్లో॥ కాశ్యాం ప్రదీపః ప్రథయాప్రకాశితః పాపాన్ధకారః ఖలు నాశమేతి।
విశ్వేశదేహోద్భవయా సువిద్యయా మహాత్మనాం పుణ్యకృతాం కృతాత్మనామ్॥

భావము కాశి గొప్పతేజో పుంజము విశ్వేశ్వరుని దేహము నుండి ఉద్భవించిన జ్ఞానవిద్య పుణ్యాత్ముల యొక్కయు మహాత్ముల యొక్కయు మోక్షప్రతిబంధకరూపమగు పాపమును సమూలముగ నాశనము చేయుచున్నది

తథా - శ్లో॥ అన్యత్ర యః కృతో ధర్మః సాంగః శ్రద్ధా దయాయుతః।
అనేకకాల సంపాద్యః స సిద్ధో ఽత్ర క్షణాద్భవేత్॥

భావము అన్యత్ర శ్రద్ధ, దయా సహితముగ సాంగోపాంగముగ బహుకాలముగ సంపాదించబడిన పుణ్యఫలము కాశీలో క్షణమాత్రముననే సిద్ధించుచున్నది

తథా - శ్లో॥ అస్మిన్కలియుగే ఘోరే లోకాః పాపానువర్తినః।
భవిష్యన్తి మహాబుద్ధే వర్ణాశ్రమ వివర్జితాః॥

భావము ఘోరమగు ఈ కలిలోని జనులు పాపభూయిష్ఠులు వర్ణాశ్రమ కర్మ వివర్జితులు నగుదురు

శ్లో॥ నాన్యత్పశ్యామి జన్తూనాం ముక్త్వావారాణసీం పురీమ్।
సర్వపాపప్రశమనం ప్రాయశ్చిత్తం కలౌయుగే॥

భావము సర్వప్రాణులకు కాశియే మోక్షపురి.ఇట్టిస్థితిమతెచ్చటను గాన్పించదు కలిలో సర్వపాపములు ఉపశమించుటకు ప్రాయశ్చిత్త సాధనము కాశియే సుమా!

శ్లో॥ కలౌ విశ్వేశ్వరోదేవః కలౌవారాణసీ పురీ।
కలౌ భాగీరథీ గంగా దానం కలియుగే మహత్॥

భావము కలిలో విశ్వేశ్వరుడే సేవ్యుడగు దేవుడు వారాణసియే గమ్యస్థానము భాగీరథియే సేవ్యురాలు కలిలో దానమే మిక్కిలి శ్రేయోదాయకమైనది

శ్లో॥ అష్టాంగాదిభిరన్యైశ్చ తపోయజ్ఞాదిభిః సదా
సాధితైః సాక్షికీ సిద్ధి రవిముక్తే నిరర్గలా॥

భావము అన్యత్ర అష్టాంగాది యోగములచేతగాని తపస్సు యజ్ఞాదుల చేతగాని లభించు ఫలము సాక్షికమైనదియేయగును గాని అవిముక్త క్షేత్రమునాశ్రయించినచో పరిపూర్ణ ఫలము సిద్ధించును

తథా శ్లో॥ మాతాపితావా ఽపి దేవైర్మునీశైః కర్తుం శక్యం కాశికా యత్కరోతి।
నోశక్యం తన్మంత్ర తీర్థాభిర్వ్యాహ్యన్యైర్యూపైః కిం వరాకైశ్చలోకైః॥

భావము తల్లితండ్రులు గాని దేవతలు మునీశ్వరులు గాని చక్రవర్తులు గాని కాశీ సేవనముచే గల్గునంతటి ఫలమునిచ్చుటకు సమర్థులు గానేరరు ఇంక అల్పులగు ఇతర జనుల అశక్తతను గురించి చెప్పవలసిన పని యేమి యున్నది?

శ్లో॥ ప్రవేశ మాత్రేణ నరః కృతార్థః స్థిత్వా పునః పాపరతో యదాస్యాత్।
న తస్యాస్తి శరీర మాత్రేమృతే విముక్తి ర్భైరవ యాతనాస్తి॥

భావము నరులు కాశిని ఆశ్రయించుట చేతనే కృతార్థులగుచున్నారు కాశిలో యుండియు పాపరతులగుచో కాశీ మృతితో వారు మోక్షగాములు కానేరరు కాశీ గతపాపులకు భైరవ యాతన అనుభవించిననే గాని మోక్షము సిద్ధించదు

శ్లో॥ శ్రుతా స్మృతా గదితా బన్ధమోక్షం కరోతి యత్కాశికా కాశరూపా
న కాశికా శంకర చింతకానాం భవన్తి పాపాని మునీశ్వరాణామ్॥

భావము చైతన్య రాశియగు కాశిని స్మరించినను కీర్తించినను శ్రవణము చేసినను భవ బంధ విచ్ఛేదము జరుగును కాశీ శంకరులను నిరంతరము చింతన సేయు మునీశ్వరులు పాప రహితులే యగుచున్నారు

తథా- శ్లో॥ తీర్థార్థీ న బహిర్గచ్ఛే న్నదేవార్థీ కదాచన
సర్వతీర్థాని దేవాశ్చ వసన్త్యత్రా విముక్తకే॥

భావము సమస్త లోకములందలి సర్వ దేవతలు తీర్థములు ఈ అవిముక్త క్షేత్రములో చక్కని స్థితిని పొందియున్నవి అందువలన తీర్థార్థులు గాని దేవతల అనుగ్రహమును కాంక్షించు వారు గాని ఈ కాశిని వదలి బయటికి వెళ్ళుట నిరర్థకము

తథా శ్లో॥ కేచిన్నామ్నా కే ఽపి సందర్శనేన కేచిద్గత్వాస్నాన మాత్రేణ కేచిత్,
బిద్గేవం దక్షిణీ కృత్య కేచిత్ పూజాంకృత్వా కే ఽపి ముక్తా బభూవుః॥

భావము కొంతమంది జనులు కాశీ నామస్మరణ జేసియు మరి కొందరు కాశీని స్మరించియు కొందరు గంగ యందు స్నాన మాచరించియు ఇంకను కొందరు కాశీప్రదక్షిణ మాచరించియు పూజా విధులను నిర్వర్తించియు ముక్తిభాగులగుచున్నారు

బ్రహ్మ శ్లో॥ *వదన్తి కాశీం ప్రణమన్తి కాశీం గచ్ఛన్తి కాశీం శివరాజధానీమ్।*
*పూజా జపస్నాన పరిక్రమస్తుతిశ్రమై ర్నరాయాన్తి పరం సదాశివమ్॥*

భావము పరమేశా జనులు నీ నివాస స్థానమగు కాశిని స్మరించియు కాశీకి ప్రణతులర్పించియు కాశిని సమాశ్రయించి పూజలు జపములు స్నానములు ప్రదక్షిణములు చేసి స్తోత్ర పాఠములు భక్తి శ్రద్ధలతో సల్పించియు సదా శివుడవగు (నిత్య మంగళ ప్రదుడు) నీ యొక్క పరమ పదమును పొందించ జేసుకొనుచున్నారు

తథా శ్లో॥ *యథాలోహం స్పర్శమణౌ పతితం కనకం భవేత్।*
*తథా కాశ్యాం బ్రహ్మరూపం ప్రాప్నుయాచ్ఛివ రూపతామ్॥*

భావము ఇనుము స్పర్శమణిపైబడి సువర్ణమగుచున్నది అటులనే బ్రహ్మ స్వరూపమగు కాశిలో ప్రాణులు తనుత్యాగము చేసి సాక్షాచ్ఛివ స్వరూపులే యగుచున్నారు

శ్లో॥ *తీర్థయాత్రార్థినో యేహి కాశ్యామాగత్య ధార్మికాః।*
*అకృత్వా పాపనిచయం పునర్యాన్తి బహిర్నరాః॥*
*తేపునః కాశికాం ప్రాప్య జితేన్ద్రియ మనోగుణాః।*
*భవన్తిశుద్ధాః శుద్ధాత్మన్ శుద్ధ బ్రహ్మ స్వరూపిణః॥*
*స్మరణం కీర్తనం కాశ్యా దర్శనం మోక్ష బీజకృత్॥*

భావము తీర్థయాత్రా పరులై జనులు కాశిని సమాశ్రయించియు కాశిలో పాప కర్మాచరణ గావించక, ప్రారబ్ధ వశమున తమ నిజస్థలములు చేరి మృతి నొందినచో అట్టి వారు మరుజన్మలో కాశీ స్థితిని పొంది ఇంద్రియమనో వ్యాపారములను నియమించుకొనునట్టి వారై పరిశుద్ధులును బ్రహ్మ స్వరూపులును నగుదురు కాశీ యొక్క స్మరణము కీర్తనము దర్శనము మోక్ష బీజప్రాప్తికి హేతు భూతములగుచున్నవి

శ్లో॥ *కాశ్యాం మృతానాం హి శివం గతానాం ముక్తా న వేతి ప్రవిచారణేయ।*
*తే గృధ్ర కాకాజగరాహ్యలూకా మహామలాదాః ప్రభవన్తి పాపాః॥*

భావము కాశీమృతులు శివుని పొంది ముక్తులగుదురా? కారా? యని సందేహించు జనులు మహామల భక్షకములగు గ్రద్దలు కాకులు కొండ చిలువలు గుడ్ల గూబలు మొదలగు పాప యోనులందు జన్మింతురు

శ్లో॥ *బ్రహ్మాత్మ రూపా కాశీయం దహేత్పాపాని సర్వశః।*
*దృష్టా స్పృష్టా స్మృతావాఽపి కిం పునర్ధర్మవాసినామ్॥*

భావము బ్రహ్మాత్మరూపమగు కాశిని చూచినను స్పృశించినను స్మరించినను ప్రాణుల యొక్క ఉపాధిగత సర్వ పాపములు దహించి వేయబడుచున్నవి అట్లగుచో స్వధర్మానుష్ఠాన పరులై సత్సంబంధులై కాశీవాసము చేయునట్టి ధర్మ పరాయణులకు గలుగు ఉత్తమ గతులను గురించి చెప్పవలసిన పని ఏమి యున్నది?

శ్లో॥ సంసార దావ దహనే పతితానాం స్వకర్మభిః॥
కాశ్యేవ శరణం నాన్య న్ముక్తానా మపి పార్వతి॥

భావము ఓ పార్వతీ! తమ తమ స్వకీయమైన ప్రారబ్ధ కర్మ వశముచే సంసారమనెడి దావాగ్నిలో దగ్ధమగుచున్న పతితులకు కాశియే ఏకైక శరణ్యము జీవన్ముక్తులకును కాశీ మినహా సమాశ్రయింప దగిన మరియొక క్షేత్రరాజము నభూతో నభవిష్యతి

శ్లో॥ చతుర్విధాశ్చ యేజీవా యేచ దేవాదయః పరే।
తే సర్వే ముక్తిమాయాన్తి కాశ్యాం స్థావర జంగమాః॥

భావము జరాయుజ అండజ స్వేదజ ఉద్భిజ్జములగు చతుర్విధ ప్రాణులగు స్థావర జంగమములును దేవాదులును ఇతరులును సర్వులు కాశిలో ముక్తిని పొందుచున్నారు

శ్లో॥ పూర్వజన్మకృతైః పాపై ర్మహాపాతక సంయుతైః
ముచ్యతే కాశీమరణా జ్జన్తో జనిరుపార్జితైః॥

భావము అన్యత్ర చేయబడిన జన్మాంతర కృతమహా పాతకములతో గూడియున్న వారైనను కాశీ మరణముతో సర్వప్రాణులు జన్మ రాహిత్యమును పొందుచున్నవి

శ్లో॥ బహిష్కృతానాం పాపానా మిద మేవమహత్తరమ్।
ప్రాయశ్చిత్తం కాశికాయాం మరణం వాస ఏవవా॥

భావము అన్యత్ర బహుపాప సంచయము చేసినట్టి వారికి కాశీ వాసము కాశీ మరణమే ఏకైక శరణ్యము

తథా శ్లో॥ కాశ్యాం దేవః శంకరః కేశవశ్చ, కాశ్యాం దేవీ హ్యన్నపూర్ణా రమావ।
కాశ్యాం ఢుంఢిర్విఘ్నహర్తా గణేశః, కాశ్యాం శాస్తా కాలరాజో మహేశః॥

భావము కాశిలో శంకరుడు కేశవుడు దేవతలు కాశిలో అన్నపూర్ణ రమాదేవి దేవీ మూర్తులు కాశిలో ఢుంఢిగణపతి విఘ్న నివారకుడు కాశిలో కాలభైరవ రూపుడగు మహేశ్వరుడు శాసకుడు

శ్లో॥ కాశ్యాం గంగాదక్ష్వహావిష్ణురూపా కాశ్యాం బ్రహ్మావేద ఘోషైరుపేతః॥
కాశ్యాం దుర్గా దుఃఖదారిద్ర్యహర్త్రీ కాశ్యాం సూర్యో వ్యాధిబాధానిహన్తా॥

భావము కాశిలో ఉత్తర వాహిని యగు భాగీరథి విష్ణు స్వరూపిణి కాశిలో బ్రహ్మ దేవుడు నిరంతరము వేద ఘోష చేయుచు విరాజమానుడై యున్నాడు కాశిలో ప్రాణుల దుఃఖ దారిద్ర్యములను హరించి వేయునట్టి దేవత దుర్గాదేవి కాశిలో సర్వ రోగ బాధా ప్రశమనుడు సూర్యదేవుడు

శ్లో॥ *జీవతాం యత్సుఖం కాశ్యా మవిక్లిష్టేంద్రియాత్మనామ్*
*న తత్సత్యేవ కైలాసే నవైకుంఠే కథంచన॥*

భావము ఇంద్రియ విక్షేప రహితులగు కాశీ వాసులకు కల్గు సుఖ శాంతులు యథార్థముగ కైలాసములోగాని వైకుంఠములో గాని ఎవరికిని ఏమాత్రమును లభించవు.

తథా— శ్లో॥ *యాదృష్టా పాపసంఘౌఘా స్మృతా జన్మశతస్యచ*
*స్పృష్టా శతసహస్రస్య నాశయ త్యేవ కాశికా॥*

భావము — సందర్శన మాత్రముచేతనే శతాధిక సహస్రాధిక జన్మల యందలి పాపరాశులన్నిటిని దగ్ధము చేయుటకు కాశీ సమర్థమగుచున్నది.

శ్లో॥ *మాత్రా సహ సమానత్వం న కాశ్యర్హ తిక్వచిత్*
*గర్భవాస ప్రదామాతా కాశీ గర్భ వినాశినీ॥*

భావము తల్లి గర్భవాస నరకమును గల్పించుచుండగా కాశీ గర్భవాస కూపమునుండి ఉద్ధరించును అందుచేత తల్లితో సహా కాశికి సరివచ్చునట్టిది మరెచ్చటను ఎన్నడును లేదు

తథా శ్లో॥ *యైర్దృష్టా యైః శ్రుతా కాశీ యైః స్మృతాకీర్తితా తథా*
*త ఏవ వన్ద్యాః పూజ్యాశ్చ కృతార్థా ముక్తి భాగినః॥*

భావము కాశీ నెవరు దర్శింతురో కాశీ మాహాత్మ్యము నెవరు శ్రవణము జేయుదురో కాశిని అనుదిన మెవరు స్మరింతురో కాశీ నెవరు కీర్తింతురో అట్టివారు మాత్రమే వందనీయు లును పూజ్యులును కృతార్థులును ముక్తి భాగులును అగుచున్నారు

వచనము మహాప్రళయే ఒపి కాశీ న నశ్యతీతి సనత్కుమార సంహితాయాముక్తం శివేన భవానీం ప్రతి।

భావము "మహాప్రళయము సంభవించినను కాశికి నాశము లేదు" అని సనత్కుమార సంహితయందు శివుడు పార్వతికి చెప్పుచున్నారు

శ్లో॥ *గతే పరార్థద్వితయే విలీనే జగత్యశేషేమయి దేవి సర్వః*
*రక్షన్తి సమ్యగ్వివిధాయుధౌఘైః ర్వారాణసీం కాశిత మోక్షసిద్ధమ్॥*
*(సర్వే ప్రమథగణాః)*

భావము బ్రహ్మ యొక్క ద్వితీయ పరార్థము గతించగా ఓ దేవీ! అశేష సర్వ జగత్తు నాయందు విలీనమై పోవును అంతట మోక్షస్థితిని పొందిన కాశిని శివగణములు వివిధాయుధ సమూహములచే చక్కగా రక్షించును

శ్లో॥ *దైనందినే౽థ ప్రళయే త్రిశూలకోటౌ సముత్క్షిప్య పురం హరః స్వామ్॥*
*బిభర్తి సంవర్త మహాస్థిభూషణ స్తతోహి కాశీ కలికాలవర్జితా॥*

భావము దైనందిన ప్రళయ మందు స్వాత్మకీయ పురియగు కాశిని స్వత్రిశూలాగ్రమున నిలిపి రక్షింతును ప్రళయ మందును నేను కాశిని భరింతును గాన కాశీ పురి కలి కాల ప్రభావములకు గురికాదు.

వచనము ఇత్యాది వచనైః "కామారి శూలాగ్రధృతాऽపి" ఇత్యాది వచనైశ్చ దైనందిన ప్రళయే శూలాగ్రస్థితా కాశీ న నశ్యతు। మహాప్రళయేతు సర్వస్య ప్రకృతి కార్యస్యనాశాత్కథం కాశీతిష్ఠతీతి వక్తవ్యమ్। ఉచ్యతే। ప్రాకృతస్య కార్యస్య బ్రహ్మాండాంతర్గతస్యచ సర్వస్య భవతునామ లయః కాశ్యాస్తు "శుద్ధ సత్త్వాత్మకం జ్ఞాత్వా స్తుతం స్తుతిశతైః పృథక్" ఇత్యాది బ్రహ్మవైవర్తాది వచనాచ్ఛుద్ధచైతన్యాత్మికాయాః॥

సారాంశము కామారి కాశీని శూలాగ్రమందు ధరించినను" ఇత్యాది వచనములను బట్టి దైనందిన ప్రళయ కాలమందు త్రిశూలాగ్రమున స్థితమైయుందుకాశీ నశించదు. కాని మహాప్రళయ మందు సమస్త ప్రకృతి కార్యములు నశించుచుండగా కాశీ మాత్రము నాశము గాదని చెప్పుట ఎట్లు సిద్ధగును?" అను పూర్వపక్షము చేయబడగా దానికి సిద్ధాంత మిట్లు చేయబడుచున్నది లయమనగా బ్రహ్మాండాంతర్గత మగు సర్వ ప్రకృతి కార్యము నశించును గాని కాశీ శుద్ధ బ్రహ్మాత్మక చైతన్య స్వరూపమని బ్రహ్మ వైవర్తాది వచనములు బహు రీతుల స్తుతించుచున్నవి అందుచేత మహాప్రళయ మందును కాశీకి చ్యుతి సంభవించదు

శ్లో॥ *అవిముక్త మిదం క్షేత్ర మపి బ్రహ్మాండ మధ్యగమ్।*
*బ్రహ్మాండమధ్యే న భవేత్పంచక్రోశ ప్రమాణతః॥*

భావము పంచక్రోశ ప్రమాణ పరిమితమగు కాశీ ప్రాకృత కార్యమగు బ్రహ్మాండము యొక్క మధ్యలో నున్నట్లు దృశ్యమానమగుచున్నను ఈ అవిముక్త క్షేత్రము బ్రహ్మాండమునకు బహిర్భూతమే యని గ్రహింపనగును

వచనము ఇత్యాది కాశీఖండవచనాచ్చ బ్రహ్మాండ బహిర్భూతాయాః లయః నస్యాత్। ఇదం చ స్వరూప నిరూపణే స్ఫుటం భవిష్యతి।

భావము – ఈ విధముగ చెప్పబడిన కాశీఖండ వచనముచే బ్రహ్మాండ బహిర్భూతమైన కాశీకి నాశము లేదు ఈ విషయము కాశీ స్వరూప నిరూపణ మందును స్పష్టము కాగలదు

కాశీఖండే – శ్లో॥ *కాశ్యాం పతితైస్తుల్యా న వయం స్వర్గిణః క్వచిత్।*
*కాశ్యాం పాతాద్భయం నాస్తి స్వర్గే పాతాద్భయం మహత్॥*

భావము స్వర్గవాసులగు దేవతలమైన మేము కాశీలోనుండు పతితులతోను సరిగాము కారణ మేమనగా కాశీలో పతనభయము లేదు కాని స్వర్గములో గొప్ప పతన భయమున్నది.

శ్లో॥ *వరం కాశీపురీవాసో మాసోపవసనాదిభిః।*
*విచిత్రచ్ఛత్ర సంఛాయం రాజ్యం నాన్యత్ర నిర్రిపుః॥*

భావము – మాసోపవాసాది నియమయుక్త కాశీవాసము కడుంగడు శ్రేష్ఠమైనది అన్యత్ర ఏకచ్ఛత్రాధిపత్యము క్రింద విలసిల్లు రాజ్యము సైతము శత్రు రహితము గాజాలదు.

శ్లో॥ *తద్వైర్యత్నైః కాశ్యాం యత్పదం హేలయాऽఽప్యతే।*
*తత్పదం నాऽऽప్యతే ఽన్యత్ర యోగయుక్త్యాऽపి యోగిభిః॥*

భావము   దోమలు నల్లుల వంటి అల్పప్రాణులకు గూడ కాశీ మరణముతో సుహాయాసముగా ఎట్టి ఉత్తమగతులు సంప్రాప్తించుచున్నవో అట్టి పరాగతిని యోగయుక్తులగు మహాయోగులును అన్యత్ర పొందజాలరు.

శ్లో॥   వరం వారాణసీ రంకో విశ్శంకో యో యమాదపి।
న వయం త్రిదశా యేషాం గిరితో ఽపీద్భశీదశా॥

భావము   శ్రేష్ఠమైన వారాణసీయందు అతిప్రాకృత జనులును యమభయరహితులై విస్పందేహముగా ఎట్టి సద్గతిని పొందుచున్నారో అట్టి స్థితి త్రిదశులమైన మాకు గల్గుటలేదు

తథా శ్లో॥   ధర్మార్థ కామమోక్షాఖ్యం పురుషార్థ చతుష్టయమ్।
అఖండం హి యథా కాశ్యాం న తదాఽన్యత్రకు త్రచిత్॥

భావము   ధర్మార్థ కామమోక్షములగు చతుర్విధపురుషార్థములు కాశిలో అఖండముగా నెట్లు లభించుచున్నవో అట్లు అవి మరెచ్చటను ఏనాటికిని ప్రాప్తించనేరవు.

తథా- శ్లో॥ ప్రయాగాదపి తీర్థాగ్ర్యాదవిముక్తం విశిష్యతే।
యదాఽవిముక్తే నిర్వాణం న తథా క్వాప్యసంశయమ్॥

భావము   ప్రయాగాది తీర్థములన్నిటికంటె అవిముక్త క్షేత్రము మిక్కిలి విశిష్టమైనది అవిముక్తములో లభించునట్టి నిర్వాణము మరెచ్చటను లభించదు. ఇందెంత మాత్రమును సంశయము లేదు

శ్లో॥   అన్యాని ముక్తిక్షేత్రాణి కాశీప్రాప్తి కరాణి హి
కాశీం ప్రాప్య విముచ్యేత నాన్యథా తీర్థకోటిభిః॥

భావము   కాశీ మినహా శేషించిన ఆరు మోక్షపురులందలి మరణము పునః కాశీ ప్రాప్తిని మాత్రమే గల్గించుటకు సమర్థవంతమగుచున్నది గాని కాశీ ప్రాప్తినేరుగా మోక్షహేతు వగుచున్నది ఇట్టి ఉత్తమ స్థితిని అన్యత్ర యుండెడి కోట్లాది తీర్థములును గల్గించజాలవు.

తథా శ్లో॥   పురా యమస్తప స్తప్త్వా బహుకాలం సుదుష్కరమ్।
త్రైలోక్యాధిపత్యం ప్రాప్త స్త్వక్ష్యా వారాణసీంపురీమ్॥

భావము   పూర్వము యమధర్మరాజు బహుకాలము అతి దుష్కరమైన తపశ్చర్యగావించి వారాణసీ పురి మినహా శేషించిన త్రిలోకములపై శాసనాధికారమును సంపాదించెను

వచనము   కాశ్యాం యాత్రాయాం ధర్మానుష్ఠానే వా కాలదోషో నాస్తీత్యుక్తమ్॥
భావము   కాశీయాత్రకు ధర్మానుష్ఠానమునకు కాల దోషము లేదు

శ్లో॥   సదా కృతయుగం చాస్తు సదా చాయుత్తరాయణమ్।
సదా మహోదయశ్చాస్తు కాశ్యాంనివసతాం సతామ్॥
సదాకృతయుగం చాత్ర మహాపర్వప్పదాఽత్రనై।
న గ్రహాస్తోదయకృతో దోషో విశ్వేశ్వరాశ్రమే॥

*సదా సౌమ్యాయనం తత్ర సదా తత్ర మహోదయః॥*

*సదైవ మంగళం తత్ర యత్ర విశ్వేశ్వర స్థితిః॥*

భావము:- కాశీవాసులగు మనుష్యులకు సర్వకాలములయందును కృతయుగమే ఉత్తరాయణమే, మహోదయమే మహాసర్వపుణ్య కాలమే ఆ విశ్వేశ్వర పురియందు గ్రహోన్మోద యాది దోషములు సంభవించవు. విశ్వేశ్వర స్థితి గలిగిన ఆ కాశీయందు సదా మంగళమే.

శ్లో॥ *యథాభూమితలే విప్ర! పుర్యః సన్తి సహస్రశః॥*

*తథా కాశీ న మన్తవ్యా కాపిలోకోత్తరాత్వియమ్॥*

భావము భూభాగమందు సహస్రాధిక పురములున్నవి గాని కాశిని వానితో సమానమని భావించరాదు ఇదిలోకోత్తరమైనది

శ్లో॥ *మయా సృష్టాని విప్రేన్ద్ర! భువనాని చతుర్దశ*

*అస్యాః పుర్యా వినిర్మాతా స్వయం విశ్వేశ్వరః ప్రభుః॥*

భావము ఓ విప్రోత్తమా! నాచే చతుర్దశ భువనములు నిర్మించబడినవి గాని ఈ కాశీపురి నిర్మాత స్వయముగా సర్వప్రభువగు విశ్వేశ్వరుడే సుమా! అని విధాత వచనము

శ్లో॥ *వినాతపో జపాద్యైర్వా వినా యోగేన సువ్రత*

*నిర్వ్రేయా లభ్యతే కాశ్యామిహైకేనైవ జన్మనా॥*

భావము ఓ శీలవంతుడా! గొప్ప తపశ్చర్యగాని జపముగాని యోగాభ్యాసము గాని లేకుండనే కాశిలో నిశ్శ్రేయస ముక్తి ఒకే ఒక జన్మలో ప్రాణులకు లభించుచున్నది

శ్లో॥ *ఉత్తమం సర్వతీర్థానాం స్థానానా ముత్తమం మహత్*

*జ్ఞానానా ముత్తమం జ్ఞాన మవిముక్తం పురం మమ॥*

భావము: నా యొక్క ఈ అవిముక్త క్షేత్రము సర్వతీర్థములలోను ఉత్తమమైనది శ్రేష్ఠమైన మహత్తు కలది. సర్వజ్ఞానములలోను లోకోత్తర జ్ఞాన విధానము ఈ కాశీయే

శ్లో॥ *భూర్లోకేనైవ సంలగ్నమంతరిక్షే మమాలయమ్॥*

*అయుక్తాస్తం న పశ్యన్తి యుక్తాః పశ్యన్తి చేతసా॥*

భావము భూలోకముతో సంలగ్నము గాకుండ అంతరిక్షములో విరాజమానమై యున్నట్టి నానివాసమగు కాశీ పురిని అయోగ్యులు గాంచలేరు జ్ఞానులు మాత్రమే తమ జ్ఞానదృష్టిచే తిలకించగలరు.

శ్లో॥ *నానావర్ణ వివర్ణాశ్చ చండాలాద్యా జుగుప్సితాః॥*

*కిల్బిషైః పూర్ణదేహా యే విశిష్టైః పాతకైస్తథా॥*

*భేషజం పరమంతేషా మవిముక్తం విదుర్బుధాః॥*

భావము నానావర్ణాశ్రమ వాసులకును చండాలాది నికృష్టులకును పాపములతో కూడిన దేహధారులకును మహాపాతకులకును కాశీ యొక్కటియే పరమౌషధమని పండితులు చెప్పుదురు

శ్లో॥ సర్వేషామపి తీర్థానామేతేషాం పరమాపురీ।
నామ్నా వారణసీ దివ్యా కోటికోట్యయుతాధికా॥

భావము  వారణాసియను సార్థకనామధేయము కల ఈ కాశీపురి కోట్ల కొలది సర్వతీర్థముల కంటెను మిక్కిలి శ్రేష్ఠమైనది

లైంగే - శ్లో॥ పింగలానామ యానాడీ అగ్నేయీ సా ప్రకీర్తితా
శుష్కా సరిచ్చ సాజ్ఞేయా లోలార్కో యత్ర తిష్ఠతి॥

భావము  అగ్నేయీయని ప్రసిద్ధిగాంచిన పింగళాయనునాడి లోలార్కస్థానమందున్న శుష్క నదియగు అస్సీయే సుమా।

శ్లో॥ ఇడానామ్నీచ యా నాడీ సా సౌమ్యా సంప్రకీర్తితా
వరణానామ సాజ్ఞేయా కేశవో యత్ర సంస్థితః॥

భావము  సౌమ్యాయని కీర్తిగాంచిన ఇడానాడి అది కేశవ స్థానమందలి వరణానదియే సుమా।

శ్లో॥ అభ్యాం మధ్యేతు యా నాడీ సుషుమ్నాచ ప్రకీర్తితా।
మత్స్యోదరీ చ సా జ్ఞేయా విసువత్తత్ప్రకీర్తితా॥

భావము  ఈ రెంటి మధ్యలో విసువత్ అని పేరు పొందిన సుషుమ్నానాడి మత్స్యోదరీ యని కీర్తింపబడినది

కాశీఖండే  శ్లో॥ దక్షిణోత్తర దిగ్భాగే కృత్వాఽసిం వరణాం సురాః।
క్షేత్రస్యమోక్ష నిఃక్షేప రక్షాం నిర్వృతి మాయయుః॥

భావము  దేవతలుకాశీకి దక్షిణ ఉత్తర దిశలయందు అస్సీ వరణ నదులను నిర్మింపజేసి క్షేత్రము యొక్క మోక్ష నిక్షేపమునకు రక్షగావించి ఆనందమును శాంతిని పొందిరి

శ్లో॥ క్షేత్రస్యపశ్చాద్దిగ్భాగే తం దేహలి వినాయకమ్।
స్వయం వ్యాపారయామాస రక్షార్థం శశిశేఖరః॥

భావము  క్షేత్ర రక్షణార్థమై పశ్చిమ దిగ్భాగమున శశిశేఖరుడు స్వయముగా దేహళి వినాయకుని ప్రవర్తింప జేసెను

శ్లో॥ అనుజ్ఞాత ప్రవేశానాం విశ్వేశేన కృపావతా
తే ప్రవేశం ప్రయచ్ఛన్తి నాన్యేషాం హి కదాచన॥

భావము  విశ్వేశ్వరుని కృపకు పాత్రులైన వారికి మాత్రమే కాశీ ప్రవేశమునకు అనుమతి లభించును ఇతరులకు ఎంతమాత్రము లేదు

(తీర్థాంతర సమతాబుద్ధిశ్చ కాంశ్యాం న కార్యా। తదుక్తం కాశీ ఖండే  ఇతర క్షేత్రములతో కాశీ సమానమే యను తలంపు చేయదగదు  కాశీఖండములో ఆ విషయమిట్లు చెప్పబడినది)

శ్లో॥ రాగాదిదోష పరిపూరమనోస్తుషీశా॥
కాశీపురీ మతులదివ్యమహాప్రభావామ్॥
యేకల్పయన్త్యవరతీర్థ సమాం సమంతా
త్తైపాపినో న సహతైః పరిభాషణీయమ్॥

అర్థము రాగాది దోషములతో నిండిన మనస్సుగల వారు మాత్రమే అత్యంత దివ్య ప్రభావము గల కాశిని అన్యతీర్థములతో సమానమని భావింతురు అట్టి పాపాత్ములతో సంభాషణ సదా వర్జనీయమే

కాశీఖండే – శ్లో॥ గృహీయుః పాపకర్మాణి కాశీమృత వివిందకా॥
సుకృతాని స్తుతికృతో ముచ్యన్తే ఽత్రేతి జన్తవః॥

భావము కాశీమృతులను నిందించువారు పాపభాజనులగు చున్నారు కాశిలో మృతి చెంది ముక్తి నొందువారిని స్తుతించువారు సుకృతాత్ములై కృతార్థులగుచున్నారు

తథా– శ్లో॥ ఐహాజన్మ శతాభ్యాసా ద్యోగముచ్యేతవా నవా
మృతమాత్రేఽపి ముచ్యేత కాశ్యామేకేన జన్మనా॥

భావము శతాధిక జన్మలనుండి చక్కగా అనుష్ఠించబడిన యోగాభ్యాసము చేత నరులు ముక్తులు గావచ్చును గాకపోవచ్చును కాని కాశీ మృతి వలన ఒకే ఒక జన్మతోనే ముక్తులగుట తథ్యము

తథా– శ్లో॥ పుణ్యవానితరో వాఽపి మమక్షేత్రస్య సేవయా॥
ముక్తో భవతి దేవేశి! నాత్ర కార్యావిచారణా॥

భావము ఓ పార్వతీ! పుణ్యులు గాని ఇతరులు గాని నా యొక్క క్షేత్రమును సేవించినచో ముక్తులగుదురు దీనిని శంకించజనదు

తథా– శ్లో॥ గంగా విశ్వేశ్వరః కాశీ జాగర్తి త్రితయం యతః॥
తత్ర నైశ్రేయసీ లక్ష్మీ ర్లభ్యతే చిత్రమత్ర కిమ్॥

భావము గంగా విశ్వేశ్వరుడు కాశీ ఈ మూడును ఎచ్చట స్థిరమైయున్నవో అట్టి అవిముక్త క్షేత్రమందు నిశ్శ్రేయస మగు మోక్షలక్ష్మి సిద్ధించుచున్నది ఇంతకంటె విచిత్రమేమియుండును?

శ్లో॥ విశ్వేశ వంశీలన మేవ యోగస్తపశ్చ విశ్వేశ్వరపురీ నివాసః
వ్రతాని దానం నియమాయమాశ్చ, స్నానం ద్యునద్యాం యదుదగ్వహాయామ్॥

భావము కాశిలో విశ్వేశ ధ్యానమే గొప్ప యోగనిష్ఠ. అవి ముక్త నివాసమే మహత్తరమైన తపస్సు. ఉత్తర వాహిని యగు భాగీరథీ స్నానమే భూరి వ్రతము దానము యమనియమాదు లగుచున్నవి

తథా– శ్లో॥ చరణౌ చరితుం విత్త స్థావేవ కృతినామిహ
చరణౌ విచరేతాం యౌ విశ్వభర్తుః పురీం భువి॥

శ్లో॥ *తావేవ శ్రవణౌ శ్రోతుం సంవిదాతే జనాశ్రితౌ*
*జనాశ్రుతిమతాం పుంసాం యాభ్యాం కాశీ శ్రుతా సకృత్॥*

శ్లో॥ *తదేవ మనుతే సర్వం మనస్త్విహ మనస్వినామ్,*
*యేనానుమన్యతే నైషా కాశీ సర్వప్రమాణభూః॥*

భావము కాశీపురిలో తిరుగాడు చరణములే సార్థకములగు చరణములు కాశిని గురించి ఒక్క పర్యాయమైనా వినగలుగునట్టి వీనులే సమస్త శ్రుతుల నాకర్షించి ధన్యత గాంచినట్టి వీనులగుచున్నవి సర్వ ప్రమాణ భూతమగు కాశిని చింతించు మనస్సే సార్థకమగు మనస్సు.

శ్లో॥ *మరణం మంగళం యత్ర విభూతిర్యత్ర భూషణమ్*
*కౌపీనం యత్ర కౌశేయం సా కాశీ క్వేవమీయతే॥*

భావము మరణమెచ్చట మంగళప్రదమో విభూతి ఎచ్చట భూరి భూషణమో కౌపీనమెచ్చట పట్టువస్త్రమో అట్టి మహత్తర మైన కాశికి ఉపమానమే లేదు

శ్లో॥ *కాశీరజోఽపి యన్మూర్ధ్ని పతే దన్యనిలాహతమ్।*
*చంద్రశేఖర తన్మూర్ధా భవేచ్ఛ్వ కలాంకితః॥*

భావము గాలి తాకుడుచేనైనను కాశీ యొక్క రజోలేశము ఎవని శిరస్సుపై పడునో అట్టి వాని శిరస్సు చంద్రకళతో శోభిల్లునట్టి చంద్రశేఖరుని శిరస్సు వంటిదే యగుచున్నది

శ్లో॥ *బ్రహ్మహత్యాం నరః కృత్వా పశ్చాత్సంయత మానసః*
*ప్రాణాంస్త్యజతి యః కాశ్యాం స ముక్తో నాత్ర సంశయః॥*

భావము నరుడు బ్రహ్మ హత్య గావించియు పరితప్త మానసుడై మనోనిగ్రహ పరుడై కాశిలో ప్రాణ పరిత్యాగముగావించినచో అతడు ముక్తుడే ఇందెంత మాత్రము సందియము లేదు

శ్లో॥ *స్త్రియః పతివ్రతా యాశ్చ మమభక్త సమాహితాః*
*అవిముక్తే మృతావిప్రా! యాస్యంతి పరమాంగతిమ్॥*
(విప్రాః ఇతి సంబోధనమ్)

భావము ఓ విప్రులారా! స్త్రీలు పతివ్రతలై సమాహిత చిత్తలై అవిముక్తమందు మృతి చెందినచో పరమ పదమును పొందెదరు

మాత్స్యే-శ్లో॥ *మత్సమః పురుషోనాస్తి యోషిన్నాస్తిచ త్వత్సమా*
*అవిముక్త సమం క్షేత్రం నభూతం న భవిష్యతి॥*

భావము ఓ పార్వతీ! నాతో సమానమైన పురుషులుగాని నీతో సమానమైన స్త్రీలు గాని అవిముక్తముతో సమానమైన క్షేత్రముగాని పూర్వమందు లేవు భవిష్యత్తులో ఉండబోవు

శ్లో॥ *అవిముక్తే పరోయోగో హ్యవిముక్తే పరాగతిః*
*అవిముక్తే పరోమోక్షః క్షేత్రం నైవాస్తి తాదృశమ్॥*

భావము  అవిముక్త క్షేత్రమున కంటె మించిన యోగముగాని అవిముక్తమున కంటె అధికమగు పరాగతిగాని అవిముక్తమున కంటె అతిశయించిన మోక్షము గాని లేనేలేవు

శ్లో॥ పృథివ్యామీదృశం క్షేత్రం న భూతం న భవిష్యతి।
చతుర్మూర్తిః సదా ధర్మ స్తస్మిన్సంనిహితః ప్రియే॥

భావము  ఓ ప్రియురాలా! పృథివియందు కాశీవంటి క్షేత్రము న భూతో న భవిష్యతి. నాలుగు పాదముల తోడి ధర్మముసదా ఇచ్చట సన్నిహితమై యుండును

శ్లో॥ చతుర్ణామపి వర్ణానాం గతిస్తు పరమా స్మృతా
మద్భక్తా స్తత్ర తిష్ఠన్తి విష్ణుభక్తా స్తథైవ చ॥

భావము  చతుర్వర్ణముల వారికిని పరమగతి కాశియే నాభక్తులును విష్ణు భక్తులును అచట నిత్య సన్నిహితులై యుందురు

శ్లో॥ యే భక్తా భాస్కరేదేవే లోకనాథే దివాకరే।
శ్రేయ విహిత నిష్ఠానాం పరమానంద మిచ్ఛతామ్॥

భావము  పరమానందమును గోరు భాస్కరారాధకులకును విధి విహిత నిష్ఠాపరులకును ఎట్టి గతి విహితమైనదో అట్టి పరమగతి అవిముక్త మందు మృతి నందినవారికి అనాయాసముగ లభించును

శ్లో॥ యాగతిర్విహితా సద్భిః సాఽవిముక్తేమృతస్య తు।
అవిముక్త గుణా వక్తుం దేవదానవమానవైః॥
న శక్యన్తే ఽప్రమేయత్వాత్స్వయం యత్ర భవః స్థితః॥

భావము  అప్రమేయుడగు భవుడు ఎచ్చట స్వయముగ విరాజమానుడై యున్నాడో అట్టి అవిముక్తి క్షేత్రము యొక్క అనంతగుణ గణములను స్తుతించుటకు దేవతలుగాని దానవులుగాని మానవులుగాని అశక్తులేసుమా।

శ్లో॥ కృత్వాపాపసహస్రాణి పశ్చాత్సం తాపమేత్యవై।
యోఽవిముక్తే వియుజ్యేత సయాతిపరమాంగతిమ్॥

భావము  సహస్రాధిక పాపములు జేసినను పిదప పశ్చాత్తాపము జెంది ఎవరు అవిముక్తమందు ప్రాణ పరిత్యాగము జేయుదురో అట్టివారు పరమగతిని పొందుదురు

శ్లో॥ ఉత్తరం దక్షిణం వాఽపి అయనం న వికల్పయేత్।
సర్వస్తస్య శుభః కాలో హ్యవిముక్తే మ్రియేత యః॥
న తత్ర కాలో మీమాంస్యః శుభో వా యది వాఽశుభః॥

భావము ఉత్తరాయణమనిగాని దక్షిణాయనమని గాని కాశిలో ఎట్టి మీమాంస లేకయే కాశీ మృతులకు సర్వకాల సర్వావస్థలును శుభప్రదములే కాశీ మృతులకు శుభాశుభకాల విచారణతో పనిలేదు

తథా- శ్లో॥ జపధ్యాన విహీనానాం జ్ఞానవర్జిత చేతసామ్॥
తథా దుఃఖహతానాంచ గతి ర్వారాణసీ నృణామ్॥

భావము జపధ్యానాది విహీనులకును అజ్ఞానావృతులకును దుఃఖ పీడితులకును కాశీయే ఏకైక శరణ్యము

అగ్నిపురాణే - శ్లో॥ వారాణసీం వరం తీర్థం గౌర్యై ప్రాహ మహేశ్వరః
భుక్తిముక్తిప్రదం పుణ్యం వసతాం భజతాం హరిమ్॥

భావము ఓగౌరీ! వారాణసి పరమోత్కృష్టమైన తీర్థము. అది భుక్తి ముక్తులను ప్రసాదించునట్టిది. పుణ్య ప్రదమైనది. హరి భక్తులకును వాసయోగ్యమైనది.

శ్లో॥ గౌరి! క్షేత్రం న నై ముక్త మవిముక్తం తతః స్మృతమ్॥
జప్తం దత్తం హుతం తప్త మవిముక్తే కిలాక్షయమ్॥
అశ్మనా చరణౌ హత్వా వసేత్కాశీం నహి త్యజేత్

భావము ఓ గౌరీ! నేను ఈ క్షేత్రమును ఎన్నడును విడువను కనుక ఇది అవిముక్తమని ప్రసిద్ధి గాంచినది. ఇచట గావించిన జపము దానము హవనము, తపస్సు మున్నగునవి అన్నియును అక్షయ ఫలప్రదములగును అందుచే పాషాణము చేత చరణములను ఖండించుకొనియైనా కాశిలో నివసించవలసినదే గాని ఎట్టి పరిస్థితులలోను కాశిని త్యజించరాదు

తథా- శ్లో॥ వరణాస నదీచాసి తయోర్మధ్యే వారాణసీ
అత్ర స్నానం జపో హోమో మరణం దేవ పూజనమ్,
శ్రాద్ధం దానం నివాసశ్చ యద్యత్ స్యా ద్భుక్తి ముక్తిదమ్॥
(అత్ర భుక్తి ముక్తి పద మిత్యుపక్రమోప సంహారాభ్యాం తే నిరాకృతపాపాః కాశ్యా ముక్తిక్షేత్రత్వాత్ కామ్యకరణే౽ త్రాతిశయః కశ్చిన్నాస్తీతి జ్ఞేయమ్)

భావము వరణా అసీనదుల మధ్యమున్నట్టి వారాణసీయందు గావించు స్నానము జపము హోమము దేవీపూజనము శ్రాద్ధము దానము నివాసము యజ్ఞము తుదకు మరణము మొదలగునవి భుక్తి ముక్తి ప్రదములని గ్రహించవలెను

('కాశీ భుక్తి ముక్తి ప్రదము అని ఉపక్రమోపసంహారములు చెప్పబడుటచే, ఇచటి వారు నిరస్తపాపులగుదురనుటయు వారి కామ్యములు నెరవేర్చ బడునటయు అతిశయోక్తులే మాత్రమును గానేరవు )

పాద్మే- (సృష్టిఖండే)

శ్లో॥  వరణాచాప్యసిశ్చైవ ద్వే నద్యౌ సురనిర్మితే।
అంతరాలే తయోః క్షేత్రం వధ్యా న విశతే క్వచిత్॥  (వధ్యా= బ్రహ్మహత్యా)

భావము  దేవ నిర్మితమైన వరణ అస్సినదుల మధ్యనున్నట్టి కాశీ క్షేత్రమందు బ్రహ్మ హత్యాదిపాతకము లెంత మాత్రమును ప్రవేశించవు

శ్లో॥  తత్తీర్థం సర్వతీర్థానా ముత్తమం పరికీర్తితమ్।
త్యజన్తి తత్ర యే ప్రాణాన్ప్రాణినో నియతాత్మనః॥

భావము  సర్వ తీర్థములలో కాశీ సర్వోత్తమమైనది నియతాత్ములైన మహాభాగు లెవ్వరచ్చట ప్రాణ త్యాగముగావింతురో వారు రుద్రత్వమును పొంది భవునితో గూడి ఆనందము ననుభవింతురు

శ్లో॥  బ్రహ్మఘ్న గోఘ్న గురుతల్పగ భిన్నవృత్త న్యాసాపహారి కుహకాది నిషద్ధవృత్తిః।
సంసార భూతదృఢపాశవిముక్త దేహో వారాణసీం మమపురీం సము పైతిలోకః॥

భావము  బ్రహ్మహత్య గావించినవారు గోహత్య గావించినవారు గురుపత్నీ గమనము చేసినవారు విధి విరహిత ప్రవృత్తి గల వారు న్యాస భూతముగ నుంచబడిన (దాచమని యిచ్చునట్టి) సంపదను హరించువారు మోసగరులు నగు జనులు సైతము నాయొక్క పురమగు కాశిని పొందినచో భవబంధ విముక్తులగుదురు

నారదీయే - శ్లో॥  తీర్థానా ముత్తమం తీర్థం క్షేత్రాణాం క్షేత్రముత్తమమ్।
వారాణసీతి విఖ్యాతం సర్వదేవ నిషేవితమ్॥

భావము  సర్వతీర్థములలోను ఉత్తమోత్తమమును క్షేత్రములలో సర్వశ్రేష్ఠమును నై విఖ్యాతి నందిన కాశీ సర్వదేవతల చేతను సేవించబడుచున్నది

వచనము  అద్వైతేషాం పురాణ వాక్యానాం మూల భూతాః శ్రుతయోప్యుచ్యన్తే తత్ర జాబాలోపనిషది। అథైన మత్రి స్సప్రచ్ఛ యాజ్ఞవల్క్యమ్। య ఏషోఽనంతో ఽవ్యక్త ఆత్మా తం కథమహం విజానీయామితి। సహోవాచ యాజ్ఞవల్క్యః -సోఽవిముక్త ఉపాస్యో య ఏషోఽనంతో ఽవ్యక్త ఆత్మా సోఽవిముక్తే ప్రతిష్ఠిత ఇతి సోఽవిముక్తః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి। వరణాయాం నాస్యాంచ మధ్యే ప్రతిష్ఠిత ఇతి కావై వరణా కాచనాసీతి సర్వానింద్రియ కృతాన్దోషాన్వారయతి తేన వరణేతి సర్వానింద్రియ కృతాన్పాపా న్నాశయతి తేన నాసీతి। జాబాలే అవి ముక్తం వై దేవానాం దేవ యజనం సర్వేషాం భూతానాం బ్రహ్మ సదన మత్రహి జన్తోః ప్రాణేషూత్క్రమమాణేషు రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచష్టే. యేనాసావ మృతీభూత్వా మోక్షీ భవతి తస్మాద విముక్త మేవ నిషేవేతా విముక్తం న విముంచే దేవమేవైతద్యాజ్ఞవల్క్యః రామతాపనీయో పనిషద్యపి శ్రీరామస్య మనుం కాశ్యాం జజాప వృషభధ్వజః మన్వంతర సహస్రైస్తు జపహోమార్చనాదిభిః తతః ప్రసన్నోభగవాన్ శ్రీరామః ప్రాహ శంకరం వృణీష్వ యదభీష్టం తద్దాస్యామి పరమేశ్వర ఇతి। అథ సచ్చిదానంద ఆత్మానం శ్రీరామం ఈశ్వరః సప్రచ్ఛ

శ్లో॥ మణికర్ణ్యాం మమ క్షేత్రే గంగాయాం వా తటే పునః
ప్రియేత దేహీ తజ్జన్తోః ముక్తిం నాతో వరాన్తరమ్॥
అథ సహోవాచ శ్రీరామః.
శ్లో॥ క్షేత్రేఽత్ర తవ దేవేశ యత్రకుత్రాపి వా మృతాః
క్రిమికీటాదయోఽప్యత్ర ముక్తాః సన్తు న చాన్యథా॥
శ్లో॥ అవిముక్తే తవక్షేత్రే సర్వేషాం ముక్తిసిద్ధయే।
అహం సన్నిహితస్తత్ర పాషాణ ప్రతిమాదిషు॥
శ్లో। క్షేత్రే ఽస్మిన్యోర్చయే ద్భక్త్యా మన్త్రేణానేన మాం శివ।
బ్రహ్మహత్యాది పాపేభ్యో మోక్షయిష్యామి మాశివః॥
శ్లో॥ త్వత్తోవా బ్రహ్మణోవాఽపి యే లభన్తే షడక్షరమ్।
జీవన్తే మన్త్రసిద్ధాః స్యుర్ముక్తా మాం ప్రాప్నువంతి తే॥
శ్లో॥ ముమూర్షోర్దక్షిణేకర్ణే యస్యకస్యాపి వాస్వయమ్।
ఉపదేక్ష్యసి మన్మంత్రం న ముక్తో భవితా శివః॥

పురాణ శ్రుతిప్రథిత పృథుమహిమ్నః వారాణస్యాః కియాన్ మాదృశైః మహిమా ఉల్లేఖనీయ ఇత్యుపరమ్యతే। ఇతి సామాన్యతః కాశీ మహిమా సంక్షేపేణ॥

సారాంశము ఈ పురాణ వాక్యములకు ఆధార భూతములగు వేద వాక్యములు గూడ చెప్పబడుచున్నవి జాబాలోపనిషత్తులో ఇట్లున్నది అవ్యక్త ఆత్మతత్త్వజ్ఞానమునుపదేశించుడని" అత్రిమహాముని యాజ్ఞ వల్క్యులను ప్రార్థించగా వారిట్లు సెలవిచ్చిరి అవ్యక్త ఆత్మతత్త్వమే అవిముక్తము అదియే ఉపాస్య భూతమైనది అనంతము అవ్యక్తమునైన ఆ పరబ్రహ్మతత్త్వము వరణా అస్సి నదుల మధ్య ప్రతిష్ఠితమై ఉన్నది. సర్వేంద్రియగత దోషములను వారించును గాన వరణయనియు సర్వేంద్రియకృత పాపములను నాశము చేయును గాన అస్సియనియు సార్థకనామధేయములై యున్నవి అట్టి అవిముక్త క్షేత్రములో దేవతాసేవ యజనములచే సర్వులు బ్రహ్మ సదనమును పొందుదురు అచట ప్రాణోత్క్రమణ కాలమందు తారక బ్రహ్మోపదేశము చేయబడుటచే ప్రాణులు ముక్తులగుచున్నవి ఈ కారణము వలన అవిముక్తము అవశ్యము సేవింపదగినది ఎప్పుడును దానిని త్యజించరాదు" రామ తాపనీయోపనిషత్తులో ఇట్లున్నది తొల్లి శంకరుడు కాశిలో శ్రీరామమంత్రమును సహస్ర మన్వంతరపర్యంతము హోమార్చనాదుల చేత నిష్ఠగా జపించెను అట్టి తీవ్రతపశ్చర్యకు ప్రసన్నుడైన శ్రీరాముడు శంకరునితో ఇట్లు నుడివెను "ఓ శంకరా! నీ యభీష్ట వరమును కోరుకొనుము దానిని ప్రసాదించెదను అంతట శ్రీరాముని శంకరుడిట్లు కోరెను మణికర్ణికలో గాని నా క్షేత్రమందలి గంగా తీరములో గాని ఏ ప్రాణులు తను త్యాగము చేసినను వానికి ముక్తి ప్రసాదించుట కంటె కోరదగిన మఱియొక శ్రేష్ఠమైన వరము నాకు గాన్పించదు

అంతట శ్రీరాముడిట్లు చెప్పెను "ఏ క్షేత్రమగు అవిముక్తములో ఎచ్చటెచ్చట ప్రాణులు మృతి చెందినను క్రిమి కీటకాదులకు సైతము ముక్తి లభించును దీనికి తిరుగులేదు నీక్షేత్రమగు అవిముక్తములో సర్వులకును ముక్తిని సిద్ధింపజేయుటకు నేను అచటి సర్వపాషాణ ప్రతిమాదులలో నిత్యసన్నిహితుడనై యుందును ఇట్టి క్షేత్రములో నా మంత్రమును భక్తి శ్రద్ధలతో జపించువారిని బ్రహ్మ హత్యాది పాపముల నుండి ఉద్ధరించి మోక్షమును ప్రసాదింతును. సంశయింపకుము నీవలన గాని బ్రహ్మావలన గాని నా షడక్షరి తారక మహామంత్రముపదేశించబడిన వారు జీవించి యుండగనే మంత్ర సిద్ధిని పొందినవారై అంతమున ముక్తులై నన్ను పొందుదురు. మరణోన్ముఖులగు ప్రాణుల దక్షిణకర్ణములో నా మంత్రమును స్వయముగా ఉపదేశించుము. దాని వలన వారు ముక్తులగుదురు "

శ్రుతి పురాణాదులలో ఉల్లేఖించబడినట్టి ఈ వారాణసీ మహిమాతిశయమును వర్ణించుట కెంతటి వారును సమర్థులు గానేరరు. అందుచేత కాశీ మహిమ సామాన్యత. సంక్షేపముగ చెప్పబడినది.



# కాశీ మాహాత్మ్య శ్రవణాది మహిమా

కాశీఖండే

## ౨ కాశీమాహాత్మ్యము యొక్క శ్రవణ మహిమ

శ్లో॥ శ్రుతాశ్చ సర్వధర్మాస్తై ర్మహాపుణ్యైకరాశిభిః
శ్రుతం యైః స్థిర చేతోభిః కాశీమాహాత్మ్య ముత్తమమ్॥

భావము ఏకాగ్రతతో శ్రుతులు సర్వ ధర్మములు శ్రవణము చేసినచో గల్గునంతటి మహాపుణ్యరాశి స్థిర చిత్తముతో ఉత్తమమైన కాశీ మాహాత్మ్య శ్రవణము చేసినదాని చేతనే సంప్రాప్తించును

కౌర్మే- శ్లో॥ యః పఠేదవిముక్తస్య మాహాత్మ్యం శ్రుణుయాదపి।
శ్రావయేద్వా ద్విజాన్శాంతాన్సోఽపి యాతి పరాంగతిమ్॥

భావము అవిముక్త క్షేత్ర మాహాత్మ్యమును పఠించినను వినినను శాంత చిత్తులగు ద్విజులకు వినిపించినను అట్టివారు పరాగతిని చెందుదురు

శ్లో॥ శ్రాద్ధేవా దేవకార్యేవా రాత్రావహని వా ద్విజః
నదీనాం చైవ తీరేషు, దేవతాయతనేషువ
జపదీశం నమస్కృత్య స యాతి పరమాంగతిమ్॥

భావము శ్రాద్ధ కాలమందుగాని దైవ కార్యముల యందుగాని రాత్రిగాని పగలుగాని నదీ తీరములలో గాని దేవాలయములలో గాని విశ్వేశ్వరునికి ప్రణతులార్పి జపించినట్టి ద్విజుడు పరమగతిని పొందును

లైంగే:- శ్లో॥ ఏతద్వః కథితం సర్వం కథా సర్వస్యమాదరాత్।
యః పఠే చ్ఛృణుయాద్వాఽపి క్షేత్రమాహాత్మ్య ముత్తమమ్॥

భావము మీకు మిక్కిలి ఆదరముతో ఈ కాశీ మాహాత్మ్య శ్రవణ మహిమను సర్వమును సంపూర్ణముగ వినిపించితిని ఉత్తమమైన ఈ కాశీ క్షేత్ర మాహాత్మ్యమును పఠించినను వినినను అట్టి వారికి సర్వ క్షేత్రముల యందును పుణ్యమాచరించిన గల్గునంతటి సత్ఫలితము సమగ్రముగ లభించును

శ్లో॥ సర్వక్షేత్రేషు యత్పుణ్యం తత్పుణ్యం సకలం భవేత్।
శ్రావయేద్వాద్విజాన్శాం తా న్ఛుచీన్వాన్జితేంద్రియాన్,
స ఏవం సర్వయజ్ఞానాం ఫలం ప్రాప్నోతి మానవః॥

భావము శాంత చిత్తులు శుచిర్భూతులు జితేంద్రియులునగు ద్విజాలకు కాశీ మాహాత్మ్యమును వినిపించినచో సర్వ యజ్ఞము లాచరించుట వలన గల్గు ఫలితమును అట్టి కథకులు పొందుదురు

పాద్మే - భృగు    శ్లో॥ ఇత్థం తపోధనాః కాశ్యామాహాత్మ్యం ప్రోక్తవానహమ్।
యచ్ఛ్రుత్వాఽపి విలీయన్తే పాపాని సుమహాన్త్యపి॥

భావము    ఓ తపోధనులారా! ఈ విధముగ కాశీ మాహాత్మ్యమును మీకు చెప్పినవాడనైతిని  దీనిని వినినంత మాత్రముననే ఎట్టివారికైనను ఎటువంటి మహాపాపములైనను నశించును

**3) అథ కాశీ స్వరూపమ్  పద్మపురాణే**
**(కాశీ స్వరూప వర్ణన)**

శ్లో॥    *బ్రహ్మైవైతన్నిర్గుణం, నిర్వికారం  నిరంతరం క్షేత్రరూపేణ నిత్యమ్।*
*శివస్త్వేవ త్ర్యంబకో ఽ స్యత్ర నిత్యం  తద్రూపత్వాత్సంనిహిత ఏవవాఽ ఽ స్తే*
*విభూతిం స్వాం దర్శయిష్యన్గిరీశః, క్షేత్రాకారం ప్రాప తీర్థాకృతించ॥*

భావము    నిర్గుణ నిర్వికార బ్రహ్మమే ఇచట క్షేత్ర రూపేణ సదానిత్యమై యున్నది  ఇచట త్ర్యంబకుడగు శివుడే క్షేత్ర రూపముతో సన్నిహితుడై యున్నాడు క్షేత్రాకారముతో పాటు  తీర్థాకృతిని గూడ ధరించినవాడై తన విభూతిని ప్రదర్శించుచున్నాడు

**సనత్కుమార సంహితాయాం -**

శ్లో॥    *యత్తచ్చిదానంద మనంతమాద్యం, యదావయోర్నిత్యమభిన్న రూపమ్।*
*దృశ్యం సమస్తోపనిషత్సుభక్తైర్యదీహ తేజస్తదదోఽ విముక్తమ్॥*

భావము    శుభకరము ఆనందమయము అనంతము అనాదియైన మన ఉభయులకును అభిన్న రూపమగునది ఏది గలదో  సమస్త ఉపనిషత్తులందును భక్తులచే ఏ తేజస్సు దృశ్యమానమగుచున్నదో  ఆ తేజస్సే ఈ అవిముక్తము

శ్లో॥    *జ్యోతిర్లింగం త్వమేవాఽ ఽ ర్యే లింగివాహం మహేశ్వరః*
*తదేత దవిముక్తాఖ్యం జ్యోతిరాలోక్యతాం ప్రియే॥*

భావము    ఓ పూజ్యురాలా! నీవు జ్యోతిర్లింగ స్వరూపమవు  మహేశ్వరుడనగు నేను లింగి (జ్యోతి) రూపుడను  ఓ దేవీ! అవిముక్త మను పేరుగల ఆ జ్యోతిని దర్శింపుము

కాశీఖండే - శ్లో॥    *పరంబ్రహ్మాయదామ్నాతం నిష్ప్రపంచం నిరాత్మకమ్।*
*నిర్వికల్పం నిరాకార మవ్యక్తం స్థూల సూక్ష్మవత్*
*తదేతత్ క్షేత్ర మాపూర్య స్థితం సర్వగమవ్యయోః॥*

భావము    పరబ్రహ్మము నిష్ప్రపంచము  నిరాత్మకము  నిర్వికల్పము నిరాకారము  అవ్యక్తము  స్థూల సూక్ష్మ రూపములలో నుండునట్టిదిగను వేదములలో చెప్పబడినది  ఆ పరబ్రహ్మమే ఈ క్షేత్రమందంతటను పూరింపబడియున్నది

శ్లో॥    *శంభోః శక్తిరియం కాశీ  కాచిత్సర్వైక గోచరా*
*శంభురేవ హితాపీయాదేతస్యాః పరమంసుఖమ్॥*

భావము సాక్షాత్తు శివుని శక్తిరూపమైన ఈ కాశీయొక్క నిజస్వరూపము పర్వులకు గోచరము గాదు ఈ కాశీ క్షేత్రము యొక్క పరమ సుఖము కేవలము శివునకు మాత్రమే తెలియును

*బ్రహ్మవైవర్త ఋషయ ఊచుః బ్రహ్మవైవర్తములో ఋషుల ప్రశ్న*

శ్లో॥ *ఛత్రాకారం తు కిం జ్యోతిర్జలాదూర్ధ్వం ప్రకాశతే।*
*నిమగ్నాయాం ధరణ్యాంతు న నిమజ్జతి తత్కథమ్॥*

భావము జలరాశికి ఊర్ధ్వముగా గగనమందు ఛత్రాకారమున ప్రకాశముతో సంచరించు ఆ జ్యోతి ఏమి? భూమియంతయు జలమగ్నమైనను అది ఎల మునుగదు?

*విష్ణురువాచ - శ్లో॥ ఛత్రాకారం పరం జ్యోతిర్దృశ్యతే గగనే పరమ్।*
*తత్పరం పరమం జ్యోతిః కాశీతి ప్రథితం శ్రుతౌ॥*

భావము ఆకాశమున చరించుచు ప్రకాశించుచున్న ఛత్రాకారముగ నున్నట్టి ఆ జ్యోతి పరంజ్యోతియే ఆ జ్యోతియే వేదములయందు కాశీయని ప్రసిద్ధమై యున్నది

శ్లో॥ *రత్నం సువర్ణే ఖచితం యథాభవేత్తథా పృథివ్యాం ఖచితా హి కాశికా*
*న కాశికా భూమిమయీ కదాచిత్తతో న మజ్జేన్మమ సత్కృతిర్యతః॥*

భావము రత్నములు బంగారమునందు పొదగబడిన విధముగా కాశి పృథివి యందు పొదగబడియున్నది కాశి ఎన్నడును పృథివ్యాత్మకముగాదు అందుచేత నాచే నిర్మించబడిన ఈ కాశీ జలరాశిలో మునిగిపోదు

శ్లో॥ *జడేషు సర్వేష్వపి మజ్జమానేష్వియం చిదానందమయీ న మజ్జతి।*
*స్వయం నిమగ్నః కథముద్ధరేత్ పరాన్‌లోకే చ వేదేచ విచార్యమేతత్॥*

భావము జడపదార్థములు సర్వము మునిగిపోవును గాని చిదానంద మయమగుట చే కాశీ మునిగిపోదు స్వయముగాతానే జలమునందు మునిగిపోవునట్టి జడ పదార్థము ఇతర పదార్థముల నెట్లు ఉద్ధరింప సమర్థవంతమగును? లోకరీతిని వేద సాంప్రదాయమును పరికించి ఈ విషయము విచారింపనగును

ఋషయ ఊచు - (ఋషులు చెప్పుచున్నారు)

శ్లో॥ *వాసుదేవ మహాదేవ బ్రహ్మరూప నమోస్తుతే।*
*త్వత్స్వరూపా కథం కాశీ కథం వా ఖచితా త్వయా*
*భూమౌ భువననాథేశ కిమర్థం వా పృథక్కృతా॥*

భావము త్రిమూర్తి స్వరూపమగు వాసుదేవా! మహాదేవా! బ్రహ్మదేవా! నీకు అనంతకోటి నమస్కారములు సమస్త భువనాధీశా! కాశి నీ స్వరూపమగుట ఎట్లు? అది భూమండలములో నీ చేత పొదగబడుట ఎట్లు? అలాగయ్యును పృథివి కంటె వేరగుటచే ప్రయోజనమేమి?

విష్ణురువాచ  శ్లో॥ సదాశివో మహాదేవో లింగరూపధరః ప్రభుః
మయా స్మృతో లోక ముక్త్యై ప్రాదేశ పరిమాణతః॥

భావము  నాచే కీర్తించబడిన మహాదేవుడగు సదాశివుడు లోకోద్ధరణ నిమిత్తముగా ప్రాదేశ (జిట్టెడు) పరిణామముగ లింగాకృతిని ధరించెను

వచనము :- ముముక్షవో మోక్షసాధనామష్ఠానే ఇంద్రియ వైషమ్యా ద్విఘ్నప్రాప్తే మాం ప్రార్థితవన్త స్తతో మయాలోకానుగ్రహకామ్యయా ప్రాదేశ పరిమాణః సదాశివః స్మృతః

భావము  ముముక్షువులు మోక్ష సాధనమార్గముల ననుష్ఠించుచున్నను ఇంద్రియ చాపల్యముచే తమ సాధనములకు విఘ్నములు సంభవించగా వారునన్ను (విష్ణువును) ప్రార్థించిరి అంతట నేను వారి పట్ల కృపామతినై ప్రాదేశ పరిమాణుడగు సదాశివుని స్మరించితిని

శ్లో॥ లింగరూపధరః శంభుర్హృదయాద్బహిరాగతః
వృద్ధి మాసాద్యమహతీం పంచక్రోశాత్మకో ఒభవత్॥

భావము  లింగ రూపాకృతి ధరించిన శంభుడు నా హృదయాంతరాళము నుండి బహిర్గతుడై వృద్ధినొంది పంచక్రోశాత్మక పరిమాణుడయ్యెను

శ్లో॥ ఆపాతాళాదావైకుంఠం వ్యాప్యచోర్ధ్వమవస్థితః॥
మమేష్టదేవోదయితః పరమాత్మాపినాకధృత్॥

భావము  నా ఇష్టదైవమును పరమాత్మయునైనట్టి పినాకపాణి పాతాళమాదిగా వైకుంఠముపరకు ఊర్ధ్వముగా వ్యాపించి యుండెను

శ్లో॥ కైలాసా దభ్యగాద్దేవ్యా భవాన్యాసహితః ప్రభుః
దృష్ట్వా లింగం పరానందం జ్యోతీరూపం మనిర్మలమ్॥

భావము  నిర్మలమై జ్యోతీరూపమై పరమానందప్రదుడై శంకరుడు భవానీ సహితుడై లింగాకృతితో కైలాసమునుండి అవతరించుట గాంచితిని

శ్లో॥ దృష్ట్వా మాముక్తవాన్రుద్ర స్త్వయా వమ్యగిదం కృతమ్।
జ్యోతిర్లింగం ప్రకటితం సర్వప్రాణి విముక్తిదమ్॥

భావము  అంతట నన్ను జూచి రుద్రుడిట్లు పలికెను జ్యోతిర్లింగముగా ప్రకటితమైన ఈ లింగము సర్వ ప్రాణులకు ముక్తి ప్రదమైనది

శ్లో॥ రుద్ర వచనం శ్రుత్వా మయా తత్ స్థాణురూపధృత్।
శుద్ధ సత్త్వాత్మకం జ్ఞాత్వా స్తుతం స్తుతిశతైః పృథక్॥

భావము  రుద్రుని వచనముల నాలకించిన విష్ణువు ఆ స్థాణు రూపాకృతి ధరించిన లింగము శుద్ధ సత్త్వాత్మకమైనది యని గ్రహించి శతాధిక శ్రుతి వచనములతో దానిని స్తుతించెను

శ్లో॥ లింగాకారం క్వచిద్భాతి దండాకారం క్వచిత్పునః॥
ఛత్రాకారం క్వచిద్భాతి పిండాకారం త్రికోణకమ్॥

దృశ్యతే మునిసంఘైస్తథామతి తద్దైవతః
జడత్వాత్పృథివీమగ్నా సహస్రాదీ నగకాననా॥

భావము  ఆ జ్యోతి రూపమొకప్పుడు లింగాకారముగను మరియొకప్పుడు దండాకారముగను వేరొకప్పుడు ఛత్రాకారముగను ఇంకొక సమయమందు త్రికోణాత్మకముగు పిండాకారముగను మునిసంఘములచే వారి వారి దృక్పథమననుసరించి దర్శింపబడును సహస్రాధిక పర్వతములతోను వనములతోను గూడి జడాకారముగనున్న పృథివి జలమగ్నమగును

శ్లో॥  అజడత్వాదిదం లింగం ఛత్రాకారమవస్థితమ్।
చైతన్యజడయోరైక్యం కథమేకస్థయోరపి॥

భావము  కాని అజడమగు ఈ లింగము ఛత్రాకారముగ స్థితి నొందియే యుండును ఈ రీతిని ఒకే చోట చైతన్యము జడత్వము సమ్మిళితమై యుండవు కనుక ఛత్రాకారముగనున్న ఈ లింగము జడపదార్థము గానేరదు

శ్లో॥  భవేదితి మహాభాగా జానన్తి కథయన్తి చ।
తస్మాత్కాశీ బ్రహ్మరూపా ఽజడా పృథ్వ్యా న సంగతా॥

భావము  కనుక జడచైతన్యములు రెండింటికిని ఏకత్రత యున్నను ఐక్య భావము లేదు మహామనీషులగువారు దీనిని జ్యోతిస్స్వరూపముగ తెలిసికొని కీర్తించుచున్నారు ఈ కారణముచేత బ్రహ్మ స్వరూపము అజడ పదార్థమునైనట్టి ఈ కాశీ జడమగు పృథివిలో కలిసిలేదు

అన్యచ్చ- (ఇంకను) శ్లో॥  దృష్టం తత్కాశికారూపం నిర్మితం న మయా పరమ్।
వదన్తి లోకాః సతతం కాశీ కేశవనిర్మితా॥

భావము  పరమగు ఈ కాశీ స్వరూపము నాచేత నిర్మించబడలేదని తెలియదగును కాని లోకులు సతతము ఈ కాశీ కేశవనిర్మితమని అందురు

శ్లో॥  నిర్మాణంతు జడస్యాత్ర క్రియతే నో పరాత్మనః॥
ఉద్ధరిష్యామి చ మహీం వారాహం రూపమాస్థితః॥
తదాప్యనః పృథివ్యాం హి కాశీ స్థాస్యతి మత్ప్రియా॥

భావము  కాని జడమగునట్టిదియే నిర్మించబడుచున్నది పరమాత్మ స్వరూపమునకు అట్టి నిర్మాణ దశలేదు శ్వేత వరాహ రూపము ధరించి నేను జలమగ్నమైన భూమిని ఉద్ధరించునప్పుడు జ్యోతీ రూపమగుచు నాకిష్టమైన కాశీ మరల భూమితో సంలగ్నమగును

స్కాందే శ్లో॥  పంచక్రోశా పరిమితా తమరేషా పురీ మమ।
అవిచ్ఛిన్న ప్రమాణ స్థిర్భక్త నిర్వాణ కారణమ్॥

భావము  పంచక్రోశాత్మక వ్యాప్తి గలిగిన ఈ నా కాశీపురి భక్తులకు అప్రమేయమగు నిర్వాణ హేతువగుచున్నదని శివుడు చెప్పుచున్నాడు

బ్రహ్మవైవర్తే - శ్లో॥ శివశక్త్యాత్మకం లింగం శ్రుతిభిః పరివర్ణ్యతే।
యోనిః శక్తిః శివోలింగః ప్రకృతేః పురుషస్యచ
స్వరూపం ప్రథితం వేదే పురాణాదిషు పార్వతి
సదాశివ స్వయా కాచిచ్ఛక్తి శ్చైతన్యరూపిణీ॥

భావము  ఈ జ్యోతిర్లింగము శివశక్త్యాత్మక మని వేదముల యందు ప్రశంసించబడినది ఓ పార్వతీ! వేదములయందును పురాణముల యందును ప్రకృతి పురుషుల ప్రత్యేకమగు ఈ యుగళమున యోని (సర్వ జడములకు ఉత్పత్తి స్థానము) శక్తియనియు శివుడు లింగ స్వరూపమనియు అనగా బీజ ప్రదాత స్వరూపుడనియు కీర్తింపబడినది (అనగా ప్రకృతి పురుషుల సంయోగము చేతనే స్థావర జంగమమగు ఈ సృష్టి జరుగుచున్నదని భావము)

శ్లో॥ సైవ కాశీతిసంప్రోక్తా లింగరూపాఽనపాయినీ
కేచిత్కాశీం వదన్త్యేతా మవిముక్తం తథాపరే॥

భావము  సదాశివుని యొక్క చైతన్య స్వరూపిణియగు ఆ శక్తియే వియ్యానపాయిని (అనగా శివునితో ఎప్పుడును ఎడబాటు లేనిది) లింగ రూపమునగు కాశీయనియు మరికొందరు అవిముక్త క్షేత్రమనియు పేర్కొందురు

శ్లో॥ పంచక్రోశాత్మకం లింగం రుద్రా వాసమథాపరే
బ్రహ్మావాసం, విష్ణువాసం, వారాణసీమథాపరే॥

భావము  పంచక్రోశాత్మకమై లింగరూపమైన ఈ కాశిని రుద్రావాసమని చెప్పుదురు సనాతనమగు ఈ కాశీ వస్తుతః ఏకరూపమే యైనను కొందరు దీనిని బ్రహ్మ వాసమనియు మరికొందరు దీనిని విష్ణువాసమనియు వారాణసీయనియు వివిధ నామములతో పేర్కొందురు

శ్లో॥ ఇత్యాది నామ భిరుక్తమేవ సనాతనమ్।
లింగం సదాశివం శుద్ధం బ్రహ్మాఖ్యం పూర్ణ చిద్ఘనమ్॥
యల్లింగం దృష్టవంతౌతు నారాయణపితామహౌ
తదేవ లోకే వేదేచ కాశీతి పరిగీయతే॥

భావము  పరిపూర్ణము చిద్ఘనము శుద్ధము అని పరబ్రహ్మ రూపముగ చెప్పబడు ఈ లింగరూపమగు కాశీ సదాశివునితో అభిన్నమైనది విష్ణువు చేతను బ్రహ్మ చేతను దర్శింపబడిన ఈ జ్యోతిర్లింగమే లోకుల చేతను వేదమునందును కాశీయని కీర్తింపబడుచున్నది

కాశీఖండే - శ్లో॥ క్షేత్రమేత త్రిశూలాగ్రే శూలినస్తిష్ఠతిద్విజ॥
అంతరిక్షేన భూమిష్ఠం నేక్షన్తే మూఢబుద్ధయః॥
అవిముక్తం మహాక్షేత్రం పంచక్రోశపరిమితమ్॥
జ్యోతిర్లింగం తదేకం హి జ్ఞేయం విశ్వేశ్వరాభిధమ్॥

భావము  ఓ విప్రా! ఈ కాశీక్షేత్రము శివుని త్రిశూలాగ్రమున అంతరిక్షమున ధరింపబడినదియై యున్నది మూర్ఖజనులు దీనిని భూమి యందున్నట్లు భావించి యథార్థమును తెలియకున్నారు పంచక్రోశపరిమితము అవిముక్తము నగు ఈ మహాక్షేత్రమును జ్యోతిర్లింగ స్వరూపమగు విశ్వేశ్వర స్వరూపముగనే గ్రహింప వలసి యున్నది

**కాశీఖండే - (వింధ్య వర్ణనమ్)**

*శ్లో॥   భూమిష్ఠాపి న యాత్ర భూస్త్రిదివతో ప్యుచ్చైరధః స్థాపి యా*
*యాబద్ధా భువి ముక్తిదాస్యు రమృతం యస్యాం మృతా జంతవః*
*యా నిత్యం త్రిజగత్పవిత్రతటినీ తీరే సురైః సేవ్యతే*
*సా కాశీ త్రిపురారి రాజనగరీ పాయా దపాయాజ్జగత్॥*

భా॥ భూమిపై నున్నను స్వర్గమునకు ఏవిధముగను తక్కువకాని ఈ కాశీ నగరము జగములను సంరక్షించును గాక! ఆ క్షేత్రమున మరణించిన జంతువులకు మోక్షములభించును ముల్లోకములను పునీతము చేయు గంగానది యొడ్డున ఈ నగరమున్నది అది విశ్వేశ్వరుని నివాసము ఆ విశ్వేశ్వరుని రాజధాని సందర్శనమునకు త్రిలోకాధిపతులు దేవతలును మూడు సంధ్యలయందును విచ్చేయుచుందురు

బ్రహ్మవైవర్తే - *శ్లో॥ కదాచిల్లింగరూపేణ శివేన పరమాత్మనా*
*శక్తిః పృథక్కృతా శాంతా కాశీతి ప్రథితిం గతా॥*

భా॥ ఒకానొకప్పుడు లింగరూపియు పరమాత్మయునగు శివునిచే శక్తి పృథక్కరించబడినది అదియే శాంతరూపమై కాశియని ప్రసిద్ధి గాంచినది

*శ్లో॥   అధిష్ఠాత్రీ దేవతా త్వమితి క్షేత్ర స్వరూపిణీ*
*భవ త్వం సర్వభక్తానాం మహామోక్ష ప్రదాయినీ॥*

భా॥ ఓ దేవీ! నీవే దీనికి క్షేత్ర స్వరూపిణివి అధిష్ఠాన దేవతవు అయి యుండిని సర్వ భక్తులకు నీవు మహాముక్తి ప్రదాయినివి కావలసినది యని శివుడాన తీయగా)

*శ్లో॥   ఆరభ్య తద్దినం దేవీ గంగాకేశవ సన్నిధౌ*
*అవిముక్తే శ్వరం ధ్యాయన్ పశ్చిమాభిముఖీస్థితా*
*పూజితా సా ప్రయత్నేన కాశీవాస ఫలప్రదా॥*

భా॥ ఆ దినము మొదలుకొని దేవి గంగా బిందుమాధవుల సన్నిధిని అవిముక్తేశ్వరుని ధ్యానించుచు పశ్చిమాభిముఖియై యుండి కాశీవాస ఫలమునిచ్చు చున్నది

దేవ్యువాచ - శ్లో॥ మూర్తిమత్యాః కాశికాయాః కో౽ధికారో మహేశ్వర।
క్షేత్రమూర్తి ప్రభేదేన స్థితాయాః కిం ప్రయోజనమ్॥

భా॥ ఓ పరమేశ్వరా! సాకారమగు ఈ కాశికి అధికారి ఎవరు? క్షేత్రమూర్తి స్వరూపముతో ఈ కాశి ఇట్లుండుట వలన ప్రయోజన మేమి? యని దేవి ప్రశ్నించెను

శ్లో॥ క్షేత్రరూపాతు యా కాశీ మోచయే త్సర్వదేహినః
ఆధారభూతా జీవానా మాద్యాప్రకృతి రవ్యయా॥

భా॥ క్షేత్రరూపిణి అగు కాశి సర్వ జీవులకును ముక్తి కల్గించును అద్య ప్రకృతి అవ్యయ రూపిణియగు ఈ కాశి సర్వజనులకు ఆధారభూతమై యున్నది

శ్లో॥ మూర్తి రూపా చిత్స్వరూపా ఽ విముక్తేశ్వరసేవయా।
పూర్ణరూపా స్వమాహాత్మ్యం స్వయమేవ విచారయేత్॥

భా॥ సాకారమైన ఈ చైతన్య స్వరూపిణి అవిముక్తేశ్వరుని సేవచే పరిపూర్ణురాలైనది. తన మాహాత్మ్యమును స్వయముగా తాను మాత్రమే విచారించి తెలిసికొనగల్గును

వ. లింగ పురాణేతు విశ్వేశ్వరాత్పశ్చిమ భాగే అస్యాః స్థల ముక్తమ్ (లింగ పురాణములో విశ్వేశ్వర స్వామికి పశ్చిమ భాగమందు ఈమె స్థానమున్నట్లు చెప్పబడినది )

శ్లో॥ తత్ర వారాణసీ దేవీ స్థితా విగ్రహరూపిణీ
మానవానాం హితార్థాయ స్థితా దేవస్య పశ్చిమే॥

భా॥ భగవానుని పశ్చిమ దిక్కునందు విగ్రహరూపముతో సర్వమానవ కోటి హిత కారిణియై వారాణసీదేవి విలసిల్లుచున్నది

శ్లో॥ వారాణసీం చ యోదృష్ట్వా భక్త్యా చైవ నమస్యతి।
తస్య తుష్టా చ సాదేవి వసతించ ప్రయచ్ఛతి॥ ఇతి॥

భా॥ కాశి విగ్రహ రూపిణి యని దర్శించి భక్తి పూర్వకముగా నమస్కరించిన వారి యెడల సంతోషించినదియై ఆదేవి కాశీలో వసతి గల్గించుచున్నది యని పార్వతి పలికెను.

అథ ధ్యానమ్:-

శ్లో॥ శ్యామాషోడశవార్షికీ మకరుణామూర్తిం దధానావరమ్,
హస్తా భ్యామభయంచ విశ్వజననీ విద్యేతి యా గీయతే।
యా ఽ దృష్టా స్మరణం గతా౽పి సతతం యా కీర్తితా సంస్తుతా
యాదృష్టా నృణి రాత్మతత్త్వమమలం దద్యాద్ధ్రువం కాశికా॥

భా॥ శ్యామలాకారిణి, షోడశ వర్షప్రాయ కరుణామూర్తి, రెండుహస్తములతోను వర అభయ ముద్రలను ప్రదర్శించునట్టిది యగు కాశీ తనను దర్శించినను స్మరించినను కీర్తించినను స్తోత్రము చేసినను అట్టి మానవుల కందరకును స్వచ్ఛమైన ఆత్మ తత్త్వమును ఈ కాశి కల్గించును

అథప్రార్థనా -

శ్లో॥ జయకాశి మహావిద్యే పతితానాంచ పావని।
త్వామృతే గతిరన్యా న సంసారే ముక్తికామినాం॥

భా॥ ఓ కాశీ! నీకు జయము నీవు మహావిద్యా స్వరూపిణివి పతితుల నుద్ధరించునట్టి దానివి సంసారార్ణవమగ్నులగు జనులకు ఈ లోకమున నీవు తప్ప మరియొక గతిలేదు

4 అథకాశీ కథా మహిమా:- బ్రహ్మవైవర్తే:-

శ్లో॥ సహస్రకార్యాణి విహాయ కాశ్యాం కాశీగుణాన్సంశృణుయాద్యథావత్।
క్షేత్ర స్వరూపం ప్రతిబుధ్యతేద్యైః శ్రద్ధారతిః పాపనివృత్తిరుద్భవేత్
కాశీకథాసంశ్రవణేన సమ్యగంతః శుద్ధి ర్జాయతే వైనరాణామ్॥

భా॥ వేయి పనులను విడిచిపెట్టి యైనను కాశియందుండి కాశీగుణ గణములను యథావిధిగా వినవలెను అట్లు శ్రవణము చేసి కాశీ క్షేత్ర స్వరూపమును తెలిసికొనిన వారికి శ్రద్ధ, అనురక్తి పెరిగి పాపనివృత్తి యగును అట్లు చేసినచో మానవులకు అంతరంగ శుద్ధి ఏర్పడును

అథ శ్లో॥ కాశీ కథా శ్రవణ మంగళపూర్ణమూర్తి।
ర్మూర్తః స ఏవ భగవాన్ శివశాంతమూర్తిః॥

భా॥ కాశీ కథా శ్రవణము చేత మంగళాలయమూర్తి యైన వాడు సాక్షాత్తు శాంతమూర్తి యగు పరమేశ్వరుని రూపమును ధరించిన వాడగుచున్నాడు

తథా - శ్లో॥ కాశ్యామాగత్య సతతం శ్రోతవ్యా కాశీ సత్కథా
న వినా శ్రవణం పుణ్యం పాపం వావేత్తి కశ్చన
విదిత్వా యతతే భూయో నిస్తారాయ పరాయవః॥

భా॥ కాశీకి వచ్చిన వారు సదా కాశీ సత్కథలనే వినవలెను అట్లు శ్రవణము చేయని వారు పుణ్య పాపములను తెలియనేరరు కాశీ మహిమను తెలిసికొనినచో అట్టి ఉత్తముడు మాటిమాటికి పరమగు ముక్తి కొరకు ప్రయత్నించును

తథా॥ శ్లో॥ స్వధర్మదాన వ్రత ధర్మసాధనై రన్యైశ్చ యోగాదిభి రాప్యతేయత్।
పుణ్యం ధ్రువం తేన భవేన్మతిః సతాం కాశీకథాశ్రవణేన మానవానామ్॥

భా॥ స్వజాతికి విహితమగు ధర్మాచరణము దానము వ్రతము మొదలగు ధర్మసాధనములచేతను ఇతరమగు యోగాదులచేతను పొందగల్గునట్టి పుణ్యము కాశీ కథా శ్రవణమునందు మనస్సు లగ్నము చేసినట్టి సత్పురుషులకు నిశ్చయముగా గల్గును

శ్లో॥ శ్లోకార్థం శ్లోక పాదం వానిత్యం కాశీకథామృతమ్।
పిబంతి యే మహాభాగాస్తేషాం భీతిర్న భైరవీ॥

భా॥ నిత్యము శ్లోకార్ధముగాని శ్లోక పాదముగాని కాశీ కథామృతమును పానము చేసిన మహాభాగులకు భైరవ యాతన లేదు

శ్లో॥ *కాశీకథాశ్రవణతః కాశీకీర్తనతః స్మృతేః*
*యత్ఫలం జాయతే నృణాం న తద్యోగాదిభిః క్వచిత్॥*

భా॥ కాశీ కథా శ్రవణము చేతను కాశీ కీర్తనము చేతను కాశీ కాశీ యని స్మరించుట చేతను గల్గునంతటి ఫలము మానవులకు యోగాదులను అనుష్ఠించుట వలన సైతము గలుగనేరదు

**౭. అథ కాశీనామ మహిమా:- నారదీయే**

శ్లో॥ *బహునాఽత్ర కిముక్తేన వారాణస్యా గుణాన్ప్రతి।*
*నామాపి గృహ్ణతాం కాశ్యా శ్చతుర్వర్గో న దూరతః॥*

భా॥ కాశీ గుణగణములను గురించి విశేషముగ చెప్పవలసిన పని ఏమి యున్నది? (కైముత్యన్యాయముగ ఉదా మహాగజా పలాయన్తే మశకానాంతుకాగతిః) అన్నట్లు కాశీనామమును స్మరించినంత మాత్రమున చతుర్విధ పురుషార్థములు శీఘ్రముగా సిద్ధించును

పాద్మే:- శ్లో॥ *కాశీతివర్ణద్వితయం స్మరం స్త్యజతి పుద్గలమ్।*
*యత్ర క్వాపి భవేత్తస్య కైలాసే వసతిః స్ఫుటా॥*

భా॥ కాశీయను రెండక్షరములను స్మరించుచు ఎచ్చటనైనను తమ శరీరమును త్యజించు మానవులకు సైతము కైలాస నివాసము నిశ్చయముగా గల్గుచున్నది (పుద్గల = మన శరీరము)

స్కాందే శ్లో॥ *కాశీ కాశీతి కాశీతి రసనా రస సంయుతా।*
*యస్య కస్యాపి భూయాచ్చే త్సరసజ్ఞా న చేతరః॥*

భా॥ కాశీకాశీ కాశీ యనుచు ముమ్మారు ఎవని జిహ్వ మరల మరల కాశీ స్మరణము చేయుచుండునో అతని జిహ్వయే రసానందము ననుభవించునట్టిది యగుచున్నది ఇతర జిహ్వలట్టివి గానేరవు.

శ్లో॥ *తావద్గర్జన్తి పాపాని బ్రహ్మహత్యాది కాన్యలమ్।*
*యావన్నామ నగృహ్ణన్తి కాశ్యాః పాపాచలాశనేః॥*

భా॥ పాపములనెడి పర్వతములకు వజ్రపాతమువంటి దగు కాశీ నామమును ఎంత వరకు పలుకనేరరో అంతవరకును బ్రహ్మ హత్యాది పంచమహాపాతకములు మిక్కిలిగా గర్జించుచుండును

శ్లో॥ *బ్రహ్మహత్యాది పాపాని యస్యానామ్నోఽపి కీర్తనాత్।*
*త్యజన్తి పావనం కాశీ సా కేన హోపమీయతే॥*

భా॥ కాశీ నామమును కీర్తించినచో అట్టివాని బ్రహ్మహత్యాది పాపములును వానిని వదిలి పలాయనమగును అటువంటి కాశీతో ఉపమింపదగిన (పోల్చదగిన) వస్తువు మరేమి యున్నది?

శ్లో॥ *వారాణసీతి కాశీతి మహామన్త్ర మిమంజపన్।*
*యావజ్జీవం త్రిసంధ్యంతు జంతుర్భూతు న జాయతే॥*

భా  వారాణసియనిగాని కాశీయని గాని కాశీ మహామన్త్రమును త్రిసంధ్యలయందును జపించునట్టి ప్రాణికి పునర్భవము (మరుజన్మ) లేని ముక్తి లభించును

శ్లో॥ *తత్క్షేత్ర స్మరణా స్నన భూయోఽభిజాయతే॥ ఇతిచ॥*
*భా- కాశీ క్షేత్ర స్మరణ శీలి మరల జన్మించడని భావము*

శ్లో॥ *యస్తు కాశీతి కాశీతి ద్విస్త్రిర్వదతి పుణ్యవాన్।*
*అపి సర్వపవిత్రేభ్యః స పవిత్ర తరోమహాన్॥*

భా  కాశీ కాశీయని రెండు మూడు పర్యాయములు జపించు పుణ్యశాలి సర్వ పవిత్రవస్తువుల కంటెను పవిత్రుడగును

శ్లో॥ *వారాణసీతి కాశీతి రుద్రావాస ఇతిస్మృతమ్।*
*ముఖాద్వినిర్గతం యేషాం తేషాం న ప్రభవేద్యమః॥*

భా  వారాణసి కాశీ రుద్రావాస మనుచు కాశీ నామము ఏది స్మరించబడినను అట్టివారిపై యముని ప్రభావమేమాత్రము ప్రసరించదు

శ్లో॥ *యేన బీజాక్షరయుతం కాశీతి హృదిధారితమ్।*
*అబీజాని భవన్త్యేవ కర్మబీజాని తస్యవై॥*

భా  బీజాక్షర సంయుక్తముగా కాశీని హృదయమందు ధరించి జపించువానికి కర్మ బీజములు మొలకెత్తని బీజముల వంటివి యగును అనగా అట్టివాని యొక్క త్రివిధ కర్మలు నశించగా ముక్తి సిద్ధించును

శ్లో॥ *శ్రుతం కర్ణామృతం యేన కాశీత్యక్షర యుగ్మకమ్।*
*న నమాకర్ణ యత్యేవ న పునర్గర్భజాం కథామ్॥*

భా  కాశీయను రెండు అక్షరములనెడి అమృతమును కర్ణపేయముగా గ్రోలినవారు తిరిగి భూలోకమున జన్మించుట యను వార్త వినరు

బ్రహ్మ వైవర్తే -

శ్లో॥ *యథావిష్ణోః శంకరస్యాపి నామ్నా లోకః శోకం నాశ్య మోక్షం ప్రయాతి।*
*వారాణస్యానామ గృహ్ణన్విశేషా త్తీర్త్వా మృత్యుం మృత్యుజేతా స్వయం స్యాత్॥*
*(ఇత్యాది కాశీనామ మహిమా)*

భా  విష్ణు నామమును గాని శివనామమునుగాని జపించిన వారు జన్మ మృత్యు రూప శోకమునుండి విడుదల పొందినవారై మోక్షము ఎట్లు పొందెదరో అట్లే విశిష్టమగు కాశీ నామమును జపించువారు గూడ మృత్యువును తరించి స్వయముగా మృత్యుంజయులగుదురు ఈ విధముగా కాశీ నామ మహిమ ఉగ్గడించబడినది

(6) అథకాశ్యాది శబ్దనిర్వచనమ్ - కాశీఖండే -

శ్లో॥ కాశతేఽత్ర యతో జ్యోతి స్తదనాఖ్యేయమీశ్వరః
అతో నామాపరంచాస్తు కాశీతి ప్రథితంవిభోః

భా॥ ఓపరమేశ్వరా! జ్యోతిరూపముగ ప్రకాశించుచున్నది కనుక దీని మహిమ చెప్పశక్యముగాదు గనుకనే దీనికి కాశియను మరియొక నామము ప్రసిద్ధి గల్గినది

తథా- శ్లో॥ కాశీ బ్రహ్మేతి విఖ్యాతం తద్ర్బహ్మాప్యతేఽత్రహి॥
కాశీబ్రహ్మేతి విఖ్యాతం తద్వివర్తో జగద్భ్రమః॥
అవిముక్తం తదేవాఽఽహుః కాశీతి బ్రహ్మావాదినః॥

భా॥ ఈ కాశీపరబ్రహ్మ స్వరూపమని ప్రఖ్యాతి పొందినది ఇక్కడ నుండియే పరబ్రహ్మమును పొందవచ్చును ఈ జగత్తు ఆ బ్రహ్మము యొక్క వివర్త రూపమగు భ్రమయే ఈ కాశియే అవిముక్తమని బ్రహ్మావాదులు చెప్పుదురు

మాత్స్యే ఈశ్వర ఉవాచ -

శ్లో॥ విముక్తం నమయా యస్మాన్మోక్ష్యతే వా కదాచన।
మహత్క్షేత్ర మిదం తస్మాద విముక్త మితి స్మృతమ్॥

భా॥ ఈ కాశీ నా నుండి ఎప్పుడునూ విడిపోయియుండదు ఒకప్పుడును నాకు దూరముగాదు ఆ కారణముచేత ఈ మహాక్షేత్రము అవిముక్తమని పిలువబడును

కాశీఖండే అగస్త్య ఉవాచ -

శ్లో॥ అవిముక్త మిదం క్షేత్రం కదా ఽఽరభ్య భువస్తలే।
పరాం ప్రథితి మాపన్నం మోక్షదం చాభవత్కథమ్॥

భా॥ ఈ భూమండలమున నెప్పటి నుండియో ఈ క్షేత్రము అవిముక్తమని గొప్ప ప్రఖ్యాతిని పొందియున్నది. ఇది మోక్షప్రదము ఎట్లు అయినది? యని అగస్త్యుడు ప్రశ్నించెను

వారాణసీతి కాశీతి రుద్రావాస ఇతి ప్రభో
మహాశ్మశానమితి చ కథం ఖ్యాతం శిఖిధ్వజ॥

భా॥ వారాణసియని కాశియని రుద్రావాసమని మహాశ్మశానమని ఇది ఎట్లు ప్రఖ్యాతిని పొందియున్నది? అని కుమారస్వామిని అగస్త్యుడు ప్రశ్నించెను

స్కంద ఉవాచ -

శ్లో॥ మునే ప్రళయకాలేఽపి న తత్క్షేత్రం కదాచన।
ప్రవిముక్తం శివాభ్యాం యదవిముక్తం తతః స్మృతమ్॥

భా॥ ఓమునీ! ప్రళయకాలమందు సైతము ఎప్పటికిని ఈ క్షేత్రము శివ పార్వతుల నుండి విడిపోదు అందుచే ఇది అవిముక్త మనబడినది

వచనము  యద్యపి మందరాచల గతేన సదాశివేన చిరకాలం త్యక్తమేవ తథాఽపి లింగరూపేణ కదాఽపి న త్యక్తమిత్యాశయః

భా  మందరాచలమును కొంత కాలము తన నివాస స్థానముగ సదాశివుడు చేసికొనుట చేత ఈ క్షేత్రము త్యక్తమైనదిగా భావించరాదు ఏమనగా లింగరూపముతో దీనిని ఎప్పటికిని విడిచిపెట్టలేదని ఆశయము

అత ఏవ తత్రైవ ముక్తమ్ -

శ్లో॥  మందరాద్రి గతేనాఽపి క్షేత్రం నైతత్త్రినాకినా
విముక్తం లింగరూపేణ అవిముక్తం తతః స్మృతమ్॥

భా  పైవచన భావమే దీనికిని అన్వయించుకొనవలెను

శ్లో॥  యియాసునా చ దేవేన మందరం చిత్రకందరమ్।
నిజమూర్తిమయం లింగ మవిజ్ఞాతం విధేరపి॥

భా  మందరాచలగుహకు శివుడు వెళ్లగోరినప్పుడు తన నిజమూర్తిని లింగరూపమున బ్రహ్మకును తెలియకుండ ఇచట స్థాపించెను

శ్లో॥  స్థాపితం సర్వసిద్ధీనాం సాధకేభ్యః సమర్పకమ్।
నివస్తాంచ జంతూనాం దాతుం నైశ్రేయసీం శ్రియమ్॥

భా  సర్వసిద్ధులను సాధింపగోరు వారికి, వానిని సమర్పించునట్టిదిగ ఈ క్షేత్రము స్థాపించబడినది ఇది నివసన్నులైన ప్రాణులకు నిశ్శ్రేయసమును ఇచ్చునట్టిది

శ్లో॥  సర్వేషా మిహ సంస్థానాం క్షేత్రం త్రైవాభిరక్షితుమ్।
నామావిముక్తమ భవదుభయోః క్షేత్ర లింగయోః॥

భా  ఈ క్షేత్రమున నివసించు సర్వులకును రక్షణ గల్గించుటకై క్షేత్రము మరియు లింగము ఈ రెండింటికిని అవిముక్తమను పేరు గల్గినది

వచనము  తతశ్చ "ఆదిలింగమిదం ప్రోక్తం శ్రీవిశ్వేశ్వర పూజితమ్"
ఇత్యుపక్రమాదవిముక్తేశ్వర లింగరూపేణ న విముక్త మిత్యభిసంధిః॥

భా  శ్రీవిశ్వేశ్వర పూజితమైన లింగము అని ఉపక్రమించుటచే అవిముక్తేశ్వర లింగరూపము చేత అవిముక్తమని గ్రహింపవలెను

లైంగే - శ్లో॥  అవి శబ్దేన పాపంతు కథ్యతే వేదవాదిభిః।
తేన పాపేన తత్ క్షేత్రం వర్జితం వరవర్ణిని॥

భా  ఓ దేవీ! అవి యను శబ్దము వేద విదులు పాపమును పేర్కొందురు అట్టి పాపముచే ఈ క్షేత్రము రహితమైనదిగ గ్రహింపవలెను

ఇత్యాది - పాద్మే- శ్లో॥  ఆనందకాననం తద్ధి శంకరస్యాపి వల్లభమ్।
న విముంచతి విశ్వాత్మా అవిముక్తం తతః స్మృతమ్॥

భా॥ శంకరునకు మిక్కిలి ప్రియమైన ఈ ఆనందకాననము ఎప్పుడునూ శివరహితముగా నుండదు అందుచే అవిముక్తమని పిలువబడుచున్నది

*తథా కాశీఖండే*

శ్లో॥ *అస్యాఽఽనందవనం నామ పురాఽకారి పినాకినా*
*క్షేత్రస్యాఽఽనందహేతుత్వాద విముక్తం నిరన్తరమ్॥*

భా॥ పూర్వమీ క్షేత్రమునకు పినాకియగు ఈశ్వరుడు ఆనందవనమను పేరును గల్గించెను ఎల్లప్పుడు ఆనందమును గల్గించునట్టి హేతువుచే ఇది అవిముక్తమైనది

శ్లో॥ *యేతు వర్షేషవో దేవా దివి దేవి ప్రకీర్తితాః*
*వాతేషవోఽన్త రిక్షే యే యే భువ్యన్నేషవః ప్రియే॥*
*రుద్రా దశ దశ ప్రాచ్యవాచీ ప్రత్యగుదక్స్థితాః*
*ఊర్ధ్వదిక్స్థాశ్చయేరుద్రాః వర్ణ్యన్తే వేదవాదిభిః*
*తే సర్వేభ్యోఽధికాః కాశ్యాం జన్తవో రుద్రరూపిణః*
*రుద్రావాసన్త్వతః ప్రోక్తమవిముక్తం ఘటోద్భవ॥*

భా॥ వర్షమాయుధముగ గల్గియుండు దేవతలు దివియందును వాయువు ఆయుధముగా గల్గిన దేవతలు అంతరిక్షమందును భూమియందు అన్నము ఆయుధముగా గల్గిన మానవులును అట్లే తూర్పు, పశ్చిమము దక్షిణము ఉత్తరము ఊర్ధ్వ దిక్కులయందు పదేసి మంది వంతున యున్నట్టి రుద్రులును వేద విదుల చేత కీర్తింపబడు వేలకొలది రుద్రులును ఎవరెవరుండిరో వారి యందరికంటెను కాశీయందు నివసించు ప్రాణులు రుద్రరూపులై యధికులగుచున్నారు ఈ కారణము చేత రుద్రావాసమైన ఈ కాశీ అవిముక్తమని కీర్తింపబడుచున్నదని పార్వతికి శివుడు చెప్పినట్లుగ అగస్త్యమహర్షికి కుమారస్వామి చెప్పెను

శ్లో॥ *శ్మశబ్దేన శవః ప్రోక్తః శానం శయనముచ్యతే।*
*నిర్వచన్తి శ్మశానార్థం మునే! శబ్దార్థకోవిదాః॥*

భా॥ శ్మ శబ్దము శవమును తెల్పునదియు శానం శయనార్థక మనియు శబ్దార్థకోవిదులైన పండితులు శ్మశాన శబ్దార్థమును నిర్వచింతురు

శ్లో॥ *మహాన్త్యపిచ భూతాని ప్రళయే సముపస్థితే।*
*శేరతేఽత్ర శవాభూత్వా శ్మశానంచ తతోభవేత్॥*

భా॥ ప్రళయ కాలముపన్నమైనప్పుడు మహాభూతములు గూడ ఇచట శవాకారమున శయనించి యుండుటచే ఇది శ్మశానమగుచున్నది.

శ్లో॥ *అసిశ్చ వరణాచైవ క్షేత్రరక్షాకృతే న తే।*
*వారాణసీతి విఖ్యాతా తదారభ్య మహామునే॥*

భా ఈ క్షేత్రము యొక్క రక్షణకొరకు ఇరువైపుల అస్సీ, వరణానదులు సృష్టించబడి యుండుటచే ఇది అప్పటినుండి వారాణసియని విఖ్యాతమైనది

పాద్మే- శ్లో॥ లింగం లింగశరీరస్య విశేషం గమయేత్పరమ్।
తేన లింగమితిఖ్యాత మపవర్గైక సాధనమ్॥

భా లింగశరీరముయొక్క అంతర్లింగము ఇచటవేరు చేయబడుటచే ఇది అపవర్గముఖ్యసాధనమై లింగము అని చెప్పబడుచున్నది

బ్రహ్మవైవర్తే -

శ్లో॥ మహాతత్త్వమయే పాత్రే బ్రహ్మశుద్ధ సనాతనమ్।
మాయాప్రవేశ రహితమవిముక్తం తదుచ్యతే॥

భా మహాతత్త్వ వికారమునకు అధిష్ఠానమగు సనాతన శుద్ధ బ్రహ్మము మాయా ప్రవేశ రహితమై ఇచట యుండుటచే ఇది అవిముక్తమని చెప్పబడుచున్నది

శ్లో॥ ఆనందకందబీజానామంకురాణి యతస్తతః।
జ్ఞేయాని సర్వలింగాని తస్మిన్నానందకాననే॥

భా ఈ ఆనందకానన మందు అచ్చటచ్చట నున్న సర్వలింగములను ఆనంద కంద బీజముల యొక్క అంకురములని గ్రహించవలెను

శ్లో॥ మమలింగాని సర్వాణి హ్యంకురాణీవ సర్వశః।
ఆనందాదుదితానీతి హ్యానందవనముచ్యతే॥

భా నా రూపమగు ఈ లింగములన్నియును ఆనందరసోద్భవమైన అంకురములవలె యుండుటచే ఇది ఆనందకాననమగుచున్నది

లైంగే శ్లో॥ అవిముక్తం పరంక్షేత్రం శంకరస్య సదైవహి।
తన్నామ్నా తత్ప్రసిద్ధం చ త్రైలోక్యే శూలపాణినః॥
నిమగ్నాఖ్యాం పురీపాచ నామ్నావారాణసీ మునే॥

భా శూలపాణి యగు శంకరుని యొక్క సాహచర్యమును సదా గలిగి యుండుటచే ముల్లోకములయందును ఇది అవిముక్త క్షేత్రమని ప్రసిద్ధి గాంచినది అస్సీ వరణా నదులను ఇరువైపుల గలిగి యుండుటచే వారాణసియని పిలువబడుచున్నది

7 అథ కాశీస్మరణమహిమా నారదీయే

శ్లో॥ యోజనానాం శతస్థోఽపి యోఽవిముక్తం స్మరేద్హృది।
బహుపాతక పూర్ణోఽపి న స పాపైః ప్రబాధ్యతే॥

భా యోజనముల కొలది దూరమున నుండియైనను ఎవరు హృదయ పూర్వకముగ కాశిని స్మరింతురో వారు అనేక పాపములు చేసిన వారు అయినను ఆ పాపములచే వారు బాధింపబడరు

బ్రహ్మవైవర్తే -

శ్లో॥ స్మరన్తియేనరాః కాశీం యత్రకుత్రాపి సంస్థితాః
తేప్యఘౌఘవినిర్ముక్తా భవన్తి జ్ఞానభాగినః॥

భా॥ ఎక్కడనుండి యైనను కాశిని స్మరించిన వారు తమ పాపసమూహముల నుండి విముక్తులై జ్ఞాన సంపన్నులగుదురు

తథా- శ్లో॥ మనసా ప్యై కాశికాయాః స్మృతమౌదార్యమార్యకైః॥
తేషాం మనో న స్మరతి స్మరారి నగరీంవినా॥

భా॥ ఉదార గుణములు గల పూజ్యులు మనసా కాశిని ఒక్కసారి స్మరించినను అట్టివారి మనస్సు, కాశిని విడిచి మరియే ఇతర వస్తువును స్మరించుటకు ఉత్సాహపడదు

నారదీయే, కాశీఖండే చ -

శ్లో॥ మమ ప్రియస్య క్షేత్రస్య యోఽవిముక్తస్య సంస్మరేత్ ।
ప్రాణప్రయాణ సమయే దూరగోఽప్యఘవానపి॥

శ్లో॥ స పాపపూగముత్సృజ్య స్వర్గభోగాన్సమశ్నుతే॥
కాశీస్మరణ పుణ్యేన స్వర్గాద్భ్రష్టోపిజాయతే॥

భా॥ నాకు ప్రియమైన కాశీక్షేత్రమును ప్రాణోత్క్రమణ సమయమున స్మరించినవాడు దూరమునందున్నప్పటికిని పాపియైనను అట్టివాడు తన పాప సమూహముల నుండి ముక్తిని పొంది స్వర్గభోగములను అనుభవించును

శ్లో॥ పృథివ్యామేకరాట్ భూత్వా భుక్త్వా భోగానవేకశః॥
ప్రాప్యావిముక్తం తత్పుణ్యాన్నిర్వాణపదభాగ్భవేత్॥

భా॥ క్షీణపుణ్యుడై స్వర్గ భ్రష్టుడైనను ఈ భూమిమీద ఏక చ్ఛత్రాధిపతిగ పుట్టి అనేక భోగములను అనుభవించి తుదకు అవిముక్తమగు కాశిని చేరి ఆ పుణ్య వశమున జన్మరాహిత్య రూపమగు నిర్వాణమును పొందును

కౌర్మే - శ్లో॥ యే స్మరంతి పరంకాలం విదంతి చ పురీమిమామ్॥
తేషాం వినశ్యతి క్షిప్రమిహాముత్ర చపాతకమ్॥

భా॥ ఎవరు చిరకాలము కాశిని స్మరించుచు కాశీ తత్త్వమును తెలిసికొందురో అట్టివారియొక్క ఇహపరలోక సంబంధమైన పాపములన్నియు శీఘ్రముగా నశించును

బ్రహ్మపురాణే -

శ్లో॥ సంస్మరిష్యన్తి యే స్థానమవిముక్తం సదానరాః॥
నిర్ధూతసర్వపాపాస్తే భవిష్యన్తి గణేసమాః॥

భా॥ అవిముక్త క్షేత్రమైన కాశిని సదా సంస్మరణ జేయు మానవులు సర్వ పాపములు నశించిన వారై ప్రమథగణ సమానులగుదురు

బ్రహ్మవైవర్తే -

శ్లో॥ *కాశీకాశీతి కాశీతి బహుధా సంస్మరన్త్విజాః*
*న పశ్యతీహ నరకాన్వర్తమానాన్స్వయం కృతాన్॥ (స్వకృతకర్మజానిత్యర్థః)*

భా॥ కాశీ కాశీ కాశీయనుచూ సర్వథా సంస్మరణము చేయు ద్విజులు స్వకీయకర్మఫల స్వరూపమగు నరకములను పొందరు

భవః శ్లో॥ *అద్యాఽఽరభ్యమహాభాగా యేస్మరిష్యన్తి కాశికామ్।*
*తేషాం పాపక్షయో భూయో మోక్షబీజం భవత్యను॥*

భా॥ ఇది మొదలు కాశీయని నిత్యము స్మరించునట్టి మహాత్ములు తమ తమ పాపములను పోగొట్టుకొని వెంటనే మోక్ష బీజమును పొందిన వారగుదురు

శ్లో॥ *అవిముక్తం మహాక్షేత్రం స్మరన్ప్రాణాంస్తు యస్త్యజేత్।*
*దూరదేశాన్తరస్థోఽపి సోఽపి జాతు న జాయతే॥*

భా॥ దూరదేశస్థుడై యుండియు అవిముక్తమగు కాశీక్షేత్రమును స్మరించుచు ప్రాణత్యాగమొనర్చినవాడు ఎప్పటికిని పునర్భవమును పొందడు

శ్లో॥ *ఆనందకాననం యస్యచిత్తం సంస్మరతే సదా।*
*తత్క్షేత్ర నామస్మరణాన్న న భూయోఽపి జాయతే॥*

భా॥ ఎవడు మనస్సును సంలగ్నము జేసి ఆనందకాననమగు కాశీక్షేత్ర నామమును స్మరించుచుండునో అట్టివానికి తిరిగి జన్మించవలసిన యవసరముండదు

తథా:- శ్లో॥ *కాశీస్మరణ మాత్రేణ కిం చిత్రం యదఘం వ్రజేత్।*
*గర్భవాసోఽపి నశ్యేత విశ్వేశానుగ్రహాత్పరాత్॥*

భా॥ కాశీ స్మరణచే విశ్వేశ్వరానుగ్రహము గల్గి పునః గర్భవాస దుఃఖమే నశించుచుండగా కాశీ స్మరణచే పాపములన్నియు నిర్ధూతమగునమటలో విచిత్రమేమున్నది?

తథా

శ్లో॥ *తిష్ఠన్గచ్ఛన్స్వపన్భుంజన్కర్మకుర్వన్త సన్నపి।*
*యోఽవిముక్తం స్మరేద్దేవి! తస్య జన్మభయం కుతః॥*

భా॥ ఓ దేవీ! మనస్పూర్తిగా కాకున్నను యాదృచ్ఛికముగ నైనను నడచుచు నిలబడియు నిద్రించుచు భుజించుచు కర్మలను నిర్వహించుచు నవ్వుచు ఇట్లు ఎట్టి స్థితిలో నైనను కాశిని స్మరించువానికి పునర్జన్మ భయము లేదు

తథా- శ్లో॥ కాశ్యాం యేషాం నామ గృహ్ణంతి లోకా బీజంతేషాం జాయతే మోక్షమార్గే।
కాశీం య నై సంస్మరన్త్యన్యదేశే తానప్యాత్మా శంకరస్తార యేచ్చ॥

భా లోకులు ఎవరైనను కాశీయందుండి తన్నామగ్రహణము చేసినంత మాత్రమున వారి మోక్ష మార్గమునకు బీజావాపము జరుగును ఇతర దేశములందుండియు కాశిని స్మరించునట్టి వారి ఆత్మలను శంకరుడు తరింపజేయును

8) అథ స్తుతి మహిమా - కాశీఖండే -

శ్లో॥ యః కాశీం స్తౌతి మేధావీ యః కాశీం హృది ధారయేత్।
తేనతప్తం తపస్తీవ్రం తేనేష్టంక్రతుకోటిభిః॥

భా మేధావియై కాశిని స్తుతించినను హృదయమందు ధారణ చేసినను అట్టివారికి తీవ్రతపః ఫలమును కోటియజ్ఞములు చేసిన ఫలమును లభించును

తథా శివ

శ్లో॥ మునే న మే ప్రియస్తద్వద్దీక్షితో మమపూజకః॥
యావత్ప్రియతరస్సత్యం కాశీస్తవన లాలనః॥

తథా కాశీస్తవము చేయుట యందు లాలనగలిగిన వానియంతగా నా పూజలను దీక్షగా చేయునట్టి వాడు గూడ నాకు అంత ఇష్టుడు గాడు ఇది ధ్రువము

శ్లో॥ తాదృక్తుష్టి ర్నమే దానై స్తాదృక్తుష్టిర్నమే మఖైః॥
న తుష్టి స్తపసా తాదృగ్యాదృక్స్యాత్ కాశిసంస్తవైః॥

భా కాశీస్తవము చేయువారి యెడల సంతుష్టుడనైనంతగా దానములు యాగాదులు తపస్సు చేయువారి యెడల గూడ అంతగా సంతుష్టుడనుగాను

శ్లో॥ ఆనందకాననం యేన స్తుతమేతత్సుచేతసా।
తేనాహం సంస్తుతః సమ్యక్సర్వైః సూక్తైః శ్రుతీరితైః॥

భా ఆనందకాననమగు ఈ కాశిని దృఢచిత్తులై స్తుతించినచో సర్వ వేదసూక్తుల చేతను నేను స్తుతింపబడినవాడనగుదును

శ్లో॥ వారాణస్యాః స్తుతిమపి యో నిశమ్యానుమోదతే।
అపి బ్రహ్మాండమఖిలం ధ్రువం తేనానుమోదితమ్॥

భా కాశీస్తోత్రము స్వయముగా చేయకున్నను ఇతరులు కాశీస్తోత్రము చేయుచుండగా విని ఆనందించిన వారికి గూడ అఖిల బ్రహ్మాండమును స్తుతించినంతటి ఫలము గల్గును

8) అథ కాశీగమనమహిమా- బ్రహ్మవైవర్తే

శ్లో॥ ప్రసంగతో యే గమనం ప్రకుర్యు ర్వ్యాపారతః ప్రేషణేనాపి కచిత్।
ఏష్వాపి యే కాశికాం సంప్రణీతా స్తే స్యుః కృతార్థాః శ్రుతివాద ఏషః॥

భా  అనుకోకుండ కాశీ ప్రయాణము చేసినవారు గాని వ్యాపారరీత్యాగాని ఇతరుల పనికై పంపబడినవారుగాని కఠినము బలవంతులచే బంధింపబడి కాశీకి తీసికొని రాబడిన వారు గాని వీరందరును కృతార్థులగుదురని వేద వాక్యము గలదు

*గమనేచ విఘ్నకర్తారో గణా తత్రైవ*

శ్లో॥ *జయకేశవ దేవేశ జయ కాశీప్రియాచ్యుత।*
*కాశీం ప్రాపయ దేవేశ దేహి వాసం జనార్దన॥*

భా  దేవదేవుడవైన కేశవా! నీకు జయము ఓ కాశీప్రియా! అచ్యుతా! నీకు జయము ఓ దేవదేవా! నన్ను కాశీ చేర్చుము ఓ జనార్దనా! నాకు కాశీ వాసము గల్పించుము

ఎనట్క్యాము త నంవాతాయాం

శ్లో॥ *వారాణసీమేవ యదా ప్రవృత్తో గన్తుం నర స్తస్య సమస్తపాపమ్।*
*వినాశ్య సార్ధం గణశైర్యుక్తో స్సైః ప్రీతః సుహృత్త్వమ్యతి ధర్మరాజః॥*

భా  కాశికి పోగోరి బయలుదేరిన వెంటనే అట్టివాని సర్వపాపములను పశం ౦ఱేఎ యముధర్మరాజు వారిగుఁగణములచే ౧ ప్రీతుడై మిత్రభావము పహాంచు ను

శ్లో॥ *వృత్స్నుస్య లోక్యస్య నృపస్య ఖ ర్ధే ర్మిత్రస్య పిత్రోర్మ్వా రో గురోర్వా।*
*యాదామథా  జ్ఞా మభవేపదేశం కుర్యాన్నగార్యాం గమనస్యవిఘ్నమ్॥*

భా  సర్వుల కముంను శాసించువారుగాని బంధువులుగాని మిత్రులు గాని ౦౧౧౦(౩ ౨౧ ౧ ౮ గుంపుగ ని కాశ గమనమునకు ప్రార్థన పూర్వకముగా గాని ౯ ౧ ౧౦చిగ ని ౬౨దేశ పూర్వకము గ గ ని విఘ్నము గలిగింపరాదు

యాఛ ృటయావం విఘ్నమితిలోబవా కాశీఖండే
(ఓ శిగమనము చేయవద్దని ప్రార్థించుట గూడ విఘ్నకారియే)

శ్లో॥ *బ్రహ్మహా యోగ్ని గచ్ఛేత్త్వై దైవాద్వారాణసీంపురీమ్।*
*తస్య క్షేత్రస్య మాహాత్మ్యాద్బ్రహ్మహత్యా నివర్తతే॥*

భా  బ్రహ్మహత్య చేసినవాడైనను ఇచ్ఛాపూర్వకముగ గాకున్నను దైవ వశమున నైనను కాశీని చేరుచో ఆ పుణ్యక్షేత్రము యొక్క మాహాత్మ్యము వలన వాని బ్రహ్మహత్య నివర్తించబడును

కౌర్మే  శ్లో॥  *అగచ్ఛతామిదం స్థానం సేవితుం మోక్షకాంక్షిణామ్।*
*మృతానాంచ పునర్జన్మ న భూయో భవసాగరే॥*

భా  ముముక్షువులగు వారు అవశ్యము ఆ పుణ్యక్షేత్రమగు కాశీకి వచ్చి దానిని సేవించవలెను అట్టివారు ఇచట మృతులైనచో వారికి భవసాగరమున పునర్జన్మ భయముండదు

భా అందుచే సర్వసంగ పరిత్యాగమొనర్చి ధృఢమనస్కుడవై విశ్వేశ్వరుడు స్వయముగ వెలసియున్న ఆనందకాననమగు కాశీ క్షేత్రమును పొందుము

మాత్స్యే- శ్లో॥ యది పాపో యది శఠో యది వాఽధార్మికో నరః॥
ముచ్యేత సర్వపాపేభ్యో హ్యవిముక్తం ప్రవేద్యదిః॥

భా పాపాత్ముడైనను దుర్మార్గుడైనను అధార్మికుడైనను కాశిని చేరినచో అట్టి వాని సర్వ పాపములు నాశనమగును

తథా- శ్లో॥ అవిముక్తం సదాదేవి! యే ప్రజన్తి సువిశ్చితాః॥
తే తిష్ఠన్తీహ సుశ్రోణి! మద్భక్తాశ్చ త్రివిష్టపే॥

భా ఓ దేవీ! నిశ్చయబుద్ధి గల్గినవారై ఎవరు కాశిని చేరుదురో అటువంటి వారును నా భక్తులును స్వర్గసుఖము ననుభవింతురు

తథా- శ్లో॥ దూరం మే మరణం యువాఽహ మధునాధార్యం న చిత్తేత్వితి
శ్రోతవ్యో విభ్రుతం కృతాన్తమహిషగ్రైవేయఘంటారవః
నైకట్యాత్ప్రకటోత్కట శ్రుతి పుటేం సంప్రాప్య హిత్వా తతో
జీర్ణాం పర్ణకుటీం తతః పటుమతిర్గచ్ఛేత్పురం ధూర్జటేః॥

భా నేనింకను యువకుడను నాకు మరణము సుదూరమున నున్నది అందుచే ఇప్పుడే నా చిత్తము భగవంతుని యందు లగ్నము గానక్కర లేదు అని ఎవరును భావింపరాదు ఏమనగా యముని వాహనమగు మహిషము యొక్క మెడయందలి ఘంటారవము మిక్కిలి సమీపమందే చెవులయందు ప్రతిధ్వనించుచుండును (నిత్యం సన్నిహితో మృత్యుః) మరణమెప్పుడైనను సంభవించవచ్చును అందుచేత జీర్ణపటకుటీరము వంటి ఈ శరీరమును విడచి స్థిర బుద్ధి గల్గినవాడు సదా భగవద్ధ్యాన పరుడై శివుని నివాసమగు కైలాసమును చేరును

బ్రహ్మ వివర్తే -

శ్లో॥ శృణ్వన్తులోకాః పరమార్థయుక్తా రహస్యమన్త్రం పర మాదరేణ!
కలౌ నిషన్నవ్రత ధైర్యవీర్యా గచ్ఛన్తు కాశీం పరమార్థరాశిమ్॥

భా పరమార్థతో గూడిన ఓ జనులారా! మిక్కిలి ఆదరముతో రహస్యమైన ఈ మంత్రమును విందురు గాక! కలియుగమున వ్రతములు చేయలేనివారు ధర్మ కార్యములందు ధృఢత్వము శక్తి యుక్తులు లేనివారైన మీరు పరమార్థ స్వరూపమగు కాశిని చేరుదురు గాక!

శ్లో॥ వారాణస్యాం మహాతీర్థే నరః పాపాద్విముచ్యతే!
సప్తజన్మకృతాత్పాప ద్గమనాదేవ ముచ్యతే॥

భా వారాణసిని చేరినవాని యొక్క సప్త జన్మలయందు చేయబడిన పాపములు గూడ పూర్తిగ నశించును

*లైంగే - కాశీం ప్రకృత్య-*

*శ్లో॥ సత్యం సత్యం పునఃసత్యం త్రిసత్యం వాప్యతః శుభే।*
*శీఘ్రం తత్రైవ పంయాతు యదీచ్ఛేన్మామకం పదమ్॥*

భా॥ ఓ శుభగాత్రి! మా యొక్క సాన్నిధ్యమును గోరినవారు శీఘ్రముగ కాశిని చేరి అచట నివసించవలెను ఇది ముమ్మాటికిని నిజము ఇతర సాధనములచే నాసాన్నిధ్యము సిద్ధింపదు

*తథా- కాశీఖండే -*

*శ్లో॥ ఉడ్డీయ సర్వతో దేశాద్యావం వారాణసీం ప్రతి।*
*ఉడ్డీయమానో మహాబంధ ఏష ముక్త్యై ప్రకల్పతే॥*

భా॥ ఇతర సర్వదేశములకు ప్రయాణమగుటను విడనాడి కాశిని గూర్చి మాత్రమే వెళ్లగోరవలెను ఇదియే ముక్తికి గట్టి సాధనము

వచనము యోగేప్యుడ్డీయాన బంధోఽస్తి హత్యయమే వేత్యర్థః తథాఽ వేకాని మరణ చిహ్నాన్యుక్త్వా ద్విచత్వారింశే ఽధ్యాయ ఉక్తమ్॥

భా॥ యోగాభ్యాసములో ఉడ్డీయమాన బంధమనునది యొకటి గలదు అదియే ఇచట ప్రస్తావించబడినది. (ఉడ్డీయమానమనగా ఆకాశ గమనము దీనికి లక్ష్యము కాశీ యోగ్యమనుటలో తాత్పర్యము) 42వ అధ్యాయమున ఇట్లే అనేక మరణ చిహ్నములు సూచింపబడినవి

*శ్లో॥ ఏతాని కాల చిహ్నాని సన్త్యన్యాని బహూన్యపి।*
*జ్ఞాత్వా ఽభ్యసేన్నరో యోగమథవా కాశికాం శ్రయేత్॥*

భా॥ ఇటువంటి మరణ చిహ్నములు ఇంకను బహుసంఖ్యలో నున్నవి వానిని తెలిసికొని మానవుడు యోగమభ్యసించవలెను లేదా కాశిని ఆశ్రయించవలెను

*తథా -శ్లో॥ సర్వేషా మిహపాపానాం ప్రాయశ్చిత్త చికీర్షయా*
*విః శ్శంకై రేవ వక్తవ్యం ప్రమాణజ్ఞైరిదం వచః॥*

భా॥ సర్వ పాపములకు ప్రాయశ్చిత్తమును చేసికొనగోరునట్టి వారిచే అనగా ప్రమాణము తెలిసిన వారిచే నిస్సందేహంగా ఇది చెప్పబడవలెను

*శ్లో॥ పురశ్చరణ కామశ్చేచ్ఛ్రుతోఽపి యది పాపతః*
*మన్యసే యది వః సత్యంవాక్యం శాస్త్రప్రమాణతః॥*

భా॥ పురశ్చరణ చేయుటచే పాపక్షయమగునను విశ్వాసమున్నచో శాస్త్ర ప్రామాణ్యబుద్ధి సంపన్నుడవేయైనచో మా వాక్యమును సత్యమని విశ్వసించుము

*శ్లో॥ తతః సర్వం పరిత్యజ్య కృత్వా మనసి నిశ్చయమ్।*
*ఆనందకావనం యాహి యత్ర విశ్వేశ్వరః స్వయమ్॥*

పాద్మే:- శ్లో॥ కాశీంప్రతి ప్రస్థితానాం జనానాం పాపకర్మణామ్॥
ఘూర్ణంతే సర్వపాపాని సర్వధాతు గతాన్యపి॥
భా॥ కాశీగమనమునకు బయలుదేరిన వారు ఎంతటి పాప కర్ములైనను సప్త ధాతుగతమైనవిర్యైనను వారి పాపములన్నియును శీఘ్రముగా క్షీణించును

శ్లో॥ కాశీముద్దిశ్య యాతానాం సర్వః స్యాత్సమయః శుభః
మంగళం సకలం వస్తు న కించిద్ధి విచారయేత్॥
భా॥ కాశీకి వెళ్లగోరినవారికి ఎట్టి సమయమైనను శుభప్రదమైనదే ఎట్టి వస్తువులైనను మంగళ ప్రదములే ఇందుమ గురించి ఎట్టి సందేహము కూడదు (కాశీ గమనే ముహూర్తశకునయోః ప్రతీక్షా న కార్యేత్యర్థః) మంచి ముహూర్తము కొరకు గాని మంచి శకునముల కొరకు గాని వేచి యుండ బనిలేదని భావము)

శ్లో॥ దేవాః సర్వే భవేయుర్హి ప్రతిబంధకరాః పరమ్॥
తానుపేక్ష్యైవ గన్తవ్యా కాశీ ముక్తి ప్రకాశికా॥
భా॥ సాధారణముగ దేవతలు ఏ పనికైనను మిక్కిలి ప్రతిబంధక ములను గల్గించుచుందురు. అట్టి వానిని నిర్లక్ష్యము చేసియే, ముక్తి ప్రకాశకయైన కాశీకి యాత్ర చేయవలెను.

10) అథకాశీదర్శన మహిమా:- కాశీఖండే :-

శ్లో॥ తులాపురుషదానేన యత్పుణ్యం సమ్యగాప్యతే
కాశీదర్శన మాత్రేణ తత్పుణ్యం శ్రద్ధయాఽప్నుయాత్॥
భా॥ తులాపురుష దానము చేసిన వారికి ఎట్టి పుణ్యము లభించునో అట్టి పుణ్యము శ్రద్ధతో కాశీయాత్ర చేసి, దానిని దర్శించిన వారికి లభించును

తథా:- శ్లో॥ ప్రయాగ స్నానపుణ్యేన యత్ఫలం ప్రాప్నువన్నరమ్॥
కాశీదర్శన మాత్రేణ తత్పుణ్యం శ్రద్ధయాఽప్నుయాత్॥
భా॥ ప్రయాగ స్నానముచే గల్గునంతటి పుణ్యము కాశీదర్శన మాత్రముననే ప్రాప్తించును.

తథా:- శ్రేయసాం భాజనం నైతజ్జన్మ న ముధా నయేత్
దేవానామపి దుష్ప్రాప్యం కాశీ సందర్శనాప్యతే॥
భా॥ సర్వశ్రేయస్సులకు యోగ్యమైన ఈ నరజన్మను ఎవరును వృథా పరచరాదు. దేవతలకు సైతము దుర్లభమగు కాశీదర్శనము జన్మలో ఒకసారియైనను తప్పక చేయవలెను.

శ్లో॥ కః కలిః కోఽథవా కాలః కింవా కర్మాణ్యనేకధా
వారాణసీపదం క్షేత్రమవిముక్తం యదీక్షితమ్॥

భా॥ పరమానంద ప్రదము అవిముక్త క్షేత్రమునగు ఈ కాశిని దర్శించిన వారికి కలి భయమేముండును? యముడు వారినేమి చేయగలడు? అనేక శుభ కర్మలను చేయవలసిన అవసరము వారికేమి యున్నది?

శ్లో॥ ప్రపంచకేఽపి యన్నేత్రపథమానందకాననమ్।
యాతం తేఽత్ర న జాయన్తే నేక్షంతే పితృకాననమ్॥

భా॥ నేత్రములకు సర్వ కారణము ఆనందకాననమునగు కాశిని చేరి అప్రయత్నము గానైనను ఎవరిచే చూడబడునో అట్టి వారు తిరిగి భువిపై జన్మించరు. వారు శ్మశాన భూమిని చూడరు అనగా అట్టివారికి జన్మరాహిత్య మోక్షము గల్గును.

శ్లో॥ యైర్ దృష్టా దూరతః కాశీ తే పుణ్యాః పాపవర్జితాః
స్పృష్టా యైస్తైఽపి చ తతః శ్రేష్ఠా మోక్షైకభాజనమ్॥

భా॥ కాశిని చేరి దర్శించలేనివారు దూరమున నుండి చూచినను వారు పాపరహితులే యగుదురు. మోక్ష హేతువగు కాశిని చేరి స్పృశించిన వారు అంతకంటెను శ్రేష్ఠులగుదురు

బ్రహ్మపురాణే:-

శ్లో॥ ఆగమిష్యన్తి యే భక్త్యా సర్వే నానా యోజనేభ్యస్తు
తే బ్రహ్మహత్యామోక్షార్థం భవిష్యన్తి మమానుగాః॥

భా॥ యోజనముల కొలది దూరమున నుండియైనను వచ్చి కాశిని ఎవరు చేరుదురో అట్టివారు పవిత్రులై బ్రహ్మహత్యాది పాతకముల నుండి ముక్తులై నా భక్తులగుదురని శివుడు చెప్పెను. ఇది నిశ్చయము.

మాత్స్యే- శ్లో॥ అజ్ఞానాత్ జ్ఞానతో వాఽపి వర్తమానమతీతకమ్।
సర్వం తస్యైవ తత్పాపం క్షేత్రం దృష్ట్వా వినశ్యతి॥

భా॥ కాశీ క్షేత్రమును దర్శించుట చేత తెలిసి గాని తెలియక గాని చేసిన ప్రారబ్ధ సంచిత కర్మలన్నియును సంపూర్ణముగ నశించును

పాద్మే- శ్లో॥ అస్యాః సందర్శనం వ్యాస సర్వపాతకనాశకమ్।
అస్యాం నివాసో నిర్వాణం సాధయత్యాశు జాయతే॥

భా॥ ఓ వ్యాసమహర్షి కాశీ సందర్శనము సర్వపాపనివారకము. కాశీవాసము శీఘ్రముగా నిర్వాణమును సిద్ధింపజేయును

బ్రహ్మవైవర్తే - శ్లో॥ పశ్యతాత్ర పరమార్చితాం పురీం యోగిభిః సుకృతిభిర్ మునీశ్వరైః
యాం నిరీక్ష్య పురుషః పురాకృతైః పాతకైః కఠినై ర్వియుజ్యతే॥

భా॥ నాయనా! ఇది గ్రహింపుము యోగులచేతను సుకృతులగు మునీశ్వరుల చేతను మిక్కిలిగ అర్చింపబడిన కాశిని దర్శించిన వారు పురాకృతము లగు పంచమహాపాతకముల నుండి గూడ ముక్తులగుదురు

శ్లో॥ *జన్మాంతర సహస్రైస్తు యత్పుణ్యం సముపార్జితమ్*
*తేన పుణ్యకదంబేన దర్శనం యాతి కాశికా॥*

భా॥ పూర్వజన్మ సహస్రములందు చేసికొనిన పుణ్య సమూహముచే కాశిని దర్శించుట జరుగును

*తథా॥- శ్లో॥ బహిష్కృతాని పాపాని పూర్వజన్మార్జితాన్యపి*
*కాశీదర్శన మాత్రేణ నాశమేష్యన్తి నాన్యథా॥*

భా॥ అట్లే కాశీక్షేత్రమునకు చేరకముందు పూర్వ జన్మలందుచేయబడినట్టి పాపములు సైతము కాశీ దర్శన మాత్రముచే నశించును ఇది నిశ్చయము

వచనము అత్ర బహిష్కృతానీతి నిర్దేశాత్ పూర్వవచనాన్యప్యేత ద్విషయాణ్యుపసంహ్రియన్తే చతుర్థాకరణవాక్యానీవాఽఽగ్నేయ విషయత్వేన అన్యథా కాశ్యన్తఃకృతపాతక పరిహారార్థం పంచక్రోశయాత్రాది విధాన నైయర్థ్యం స్యాత్॥

భా॥ "బహిష్కృతాని పాపాని" యని చెప్పబడుటచే కాశికి వెలుపల చేసిన పాపములే కాశీ దర్శనముచే నశించును కాశిలో చేసిన పాపములైన పంచ క్రోశయాత్రాది ప్రాయశ్చిత్త విధానముచేసి కొనవలసియే యున్నది లేనిచో కాశియందు చేసిన పాపములు పోవుటకు పంచక్రోశయాత్రాదులు చేయవలెనని చెప్పుట నిరర్థకమగును

*తథా॥- శ్లో॥ పూర్వజన్మశతకోటి సంచితం పాపరాశిమతులం వినాశయేత్*
*కాశికాపరపదప్రకాశికా దర్శనశ్రవణకీర్తనాదిభిః॥*

భా॥- శతకోటి పూర్వజన్మలందలి సాటిలేని సంచిత పాపరాశి నంతటిని పరపదమును ప్రాప్తింపజేయునట్టి కాశియొక్క దర్శనము శ్రవణము తత్కీర్తనాదులచే నశింపజేసికొనవలెను

తత్రైవ మనుః-

శ్లో॥ *బ్రహ్మన్నాశం కాశికాశేషతత్త్వాం యే యే లోకాః సంస్మరన్త్యత్ర కుత్ర।*
*తే తే ముక్తాః కింపునర్దర్శనాత్స్పృష్ట్వా యేవై కాశికాం సంగతాశ్చ॥*

భా॥ అట్లే మనువు ఈ విధముగ చెప్పుచున్నాడు. ఓ బ్రహ్మవిదురా! సర్వమును ప్రకాశింపజేయునట్టి స్వయంప్రకాశకయగు కాశిని ఎవరెవరు ఎచ్చట నుండి యైనను సంస్మరించు చుందురో అట్టివారు సర్వపాపముల నుండి ముక్తులగుదురు. ఇక సాక్షాత్తు కాశిని దర్శించి స్పృశించి అందు నివాసమున్నవారి మాట చెప్పవలసిన పని ఏమి యున్నది?

**11) అథ కాశీ ప్రవేశ మహిమా - బ్రహ్మవైవర్తే:-**

శ్లో॥ *మహాపాతక యుక్తోఽపి శ్రద్ధయా రహితోఽపివా*
*కాశీప్రవేశాదనఘః సమ్యక్స్థిత్యాసుఖీభవేత్॥*

భా॥ మహాపాతకములు చేసినవాడైనను శ్రద్ధారహితుడైనను కాశీ ప్రవేశించినంతనే అట్టివాడు పాపరహితుడై సమ్యక్ స్థితితో సుఖముగ నుండును

వచనము అత్ర కశ్చిత్కాశీ ప్రవేశే పాపం న నశ్యతి కింతుబహిరేవ తిష్ఠతి। ఏతదేవానఘత్వమ్। అత ఏవలింగపురాణే॥

భా॥ ఎవడైనను కాశీ ప్రవేశించినప్పుడు నిజమునకు వాని పాపములు నశించవు కాశీకి బయట ఆ పాపములు వేచి యుండును అందుచేతనే అనఘత్వము లభించును లింగపురాణ మందిట్లు చెప్పబడినది

శ్లో॥ *వారాణస్యాంతు యః కశ్చిత్ప్రవిష్టో బ్రహ్మఘాతకః।*
*తిష్ఠతే బాహ్యతః పాపం నిర్గతే గృహ్యతేపునః॥*

భా॥ బ్రహ్మఘాతకుడై యుండియు ఎవ్వడు వారాణసిని ప్రవేశించునో వాని పాపములు కాశీకి బయట వేచి యుండును అతడు కాశీనుండి బయటకు రాగానే మరల ఆ పాపములు అతనిని గ్రసించును

*స్కాందేఽపి శ్లో॥ పంచక్రోశాన్తరే రాజన్బ్రహ్మహత్యా న సర్పతి॥*

భా॥ ఓ రాజా! పంచక్రోశ పరిధికి లోపల బ్రహ్మహత్యగూడ ప్రవేశించదు

*తథా- పిశాచమోచనాఖ్యానే -*

శ్లో॥ *ప్రవేశో నాస్తి చాస్మాకం ప్రేతానాం తపసాం నిధే।*
*మహతాం పాతకానాం చ వారాణస్యాం శివాజ్ఞయా॥*

భా॥ ఓ తపోనిధీ! శివుని యాజ్ఞచే అటువంటి ప్రేత భూతములకు పంచమహాపాతకములకు కాశీ ప్రవేశమే లేదు

వచనము ఏవమన్యాన్యపి పురాణవచనాని జ్ఞేయాని। ఇదంతు విచారాసహం పాపస్యాఽఽత్మ గుణస్యామూర్తస్యచ బహిరవస్థాన సంభవాత్। అథపూర్వం శరీరావచ్ఛిన్నే స్థితమిదానీం తు వ్యాపకత్వా దాత్మనో బహిరవచ్ఛిన్నే తస్మింస్తిష్ఠతి నతు కాశ్యవచ్ఛిన్న ఇతి మన్యసే తన్న। అదృష్టస్య ప్రదేశావచ్ఛేదేన వృత్త్యభావాత్। యదిచ పూర్వమేవ బహిరవచ్ఛిన్న ఉత్పన్నం పాపం న తు కాశ్యవ చ్ఛిన్నేతర్హి కాశీ ప్రవేశేన కిమధికంకృతమ్। అతః స్వార్థా సంభవాద్బహిః పాపస్థితి ప్రతిపాదక వాక్యాని బహిర్నగంతవ్యం కింత్వత్రైవవాసః కార్యః ఇత్యేవం పరాణి। నిర్గతే గృహ్యతేపునరితి చ నహినిందానిందితుం ప్రవర్తతేఽపితు విధేయం స్తోతుమితి న్యాయేన బహిర్భయాయాదితి స్ఫుటమేవాఽఽహ। కించ బహు తరాణి వచాంసి పాప వినాశమేవ ప్రతిపాదయన్తి। తథాహి పాద్మే।

భా ఈ విధముగ ఇతర పురాణములయందలి వచనములను గూడ గ్రహించవలెను ఈ విషయమున ఈ క్రింది విచారణ గలదు పాపము ఆత్మగుణమైనందున అది సాకారము గాదు గనుక కాశికి బయటయుండుట యనునది అసంభవము గుణము ద్రవ్యమును ఆశ్రయించునే గాని స్వతంత్రముగ యుండనేరదు వ్యాపకమైన ఆత్మకు శరీరదేశమందు చేసిన పాపము ఆ శరీరమెచట నుండునో అచటనే ఆ ఆత్మయొక్క పాపము ఉండును గనుక శరీరముతో పాటు పాపము గూడ ఆత్మతో కలిసి వచ్చును ఇక "కాశికి వెలుపల చేసిన పాపము వెలుపలనే యుండును ఆత్మ కాశిలో నున్నప్పుడు కూడ ప్రవేశించనేరదు గనుక పాపము కాశికి వెలుపల నుండును తిరిగి కాశినుండి వెడలుటతోడనే మరల పట్టుకొనును" అను వాక్యములు అర్థవాదములు అనగా కాశీవాసము చేయువారు కాశిని విడువరాదు అని యభిప్రాయము ఇచట నహినిందా నిందితుం ఉత్సహతే అపితు స్తుత్యం స్తోతుమ్ అను న్యాయముచే కాశీ వాసము స్తుతిపరము నిందించుటకు ప్రవర్తించినను అది పరోక్షముగ స్తుతియందు పర్యవసించ బడవలెను కాశీ వాసము చేయువారు కాశిని విడిచి బయటకు పోరాదు అని స్పష్టముగ చెప్పినట్లు అయినది కాశీ వాసము చే పాపములు నశించును అని స్పష్టముగ చెప్పునట్టి బహుపురాణ వచనములు గలవు పద్మపురాణమున గూడ ఇట్లే చెప్పబడినది

*పాద్మే - శ్లో॥ అత్ర ప్రవిష్టమాత్రస్య జన్తోః పాపం పురార్జితమ్।*

*వినాశమాప్నోతి పరం పుణ్యరాశిశ్చ వర్ధతే॥*

భా కాశీయందు ప్రవేశించిన మాత్రముననే అట్టి ప్రాణుల యొక్క పూర్వార్జిత పాపములన్నియు నశించుచున్నవి ఇంకను వారి పుణ్య రాశి వృద్ధియగుచున్నది

*మత్స్యపురాణే - శ్లో॥ వారాణసీతి భువన త్రయ సారభూతా*

*ధన్యా సదా మమ పురీ గిరిరాజపుత్రి।*

*పాపక్షయా ద్విరజసః ప్రతిభాన్తి మర్త్యాః॥*

భా ఓ గిరిరాజపుత్రి! వారాణసియనునది త్రిలోకములందును సారభూతమైనది ఈ నా యొక్క పురి సదా ధన్యమైనది వివిధములగు పాపములు చేసిన వారైనను ఈ కాశిని ప్రవేశించినంతనే పాపక్షయమును పొంది పుణ్యాత్ములై భాసించుచున్నారు

*శివపురాణే - శ్లో॥ అవిముక్త ప్రవిష్టానాం సద్యః పాపం విలీయతే।*

భా అవిముక్త క్షేత్రమగు కాశిని ప్రవేశించినట్టి వారి పాపములు తత్క్షణమే నశించును

పాద్మే - శ్లో॥ చత్వారోబ్రాహ్మణా॰ శస్తా ఏకాస్త్రీ చ సతీవ్రతా॰
(సంతవ్యమానం భూరిద్యుమ్నం ప్రతి శాలంకాయనజ వచనమ్)
(శస్తా మయా నిహతా॰ ఇతి)

భా॥ పద్మపురాణములో ఇట్లు చెప్పబడినది "నాచేత నలుగురు బ్రాహ్మణులు పతివ్రతయగు నొకస్త్రీ చంపబడిరి" అని చెప్పి పశ్చాత్తప్తుడగు భూరిద్యుమ్నమహారాజును గూర్చి శాలంకాయన మహర్షి పుత్రుడు పలికిన వచనము

శ్లో॥ కాశీం గచ్ఛ మహారాజ సర్వపాప ప్రణోదినీమ్।
తాం ప్రాప్య సకలం పాపం క్షపయిష్యసి సర్వథా॥

భా॥ ఓమహారాజా! సర్వపాపములను పోగొట్టగలిగిన కాశీక్షేత్రమునకు వెళ్లుము కాశిని పొందుటవలన సర్వపాపములను క్షయింపజేసికొనగలవు

శ్లో॥ ప్రత్యయార్థంచ రాజేన్ద్ర నీలీనిచయ సంభవాన్।
అవిశం కంచుకాన్పంచ పరిధత్స్వ మహామతే।
అకాశీ దర్శనాత్తాం హి ద్రష్టాస్యచ్ఛశిసంనిభా॥

భా॥ నీకు విశ్వాసము గల్గుటకై నల్లని వస్త్రముతో తయారుచేయబడిన ఐదు చొక్కాలను ధరించుము కాశీ దర్శనము వలన అవి చంద్రుని వలె తెల్లనివియగుట నీవు చూడగలవు

శ్లో॥ కంచుకాహి యదానైల్యం జహ్యు॰ కాశీవిలోకనాత్।
తదా త్వం తత్సకలుషం క్షపితం వేత్సి సర్వశ॥ (ఇతి)

భా॥ కాశిని చూచుటవలన నీ చొక్కాలు ఎప్పుడు నలుపు వర్ణమును వీడి తెల్లబడునో అప్పుడు నీ పాపములు సర్వము నశించినవని తెలిసికొనగలవు

లైంగేఽపి శ్లో॥ బ్రహ్మహా యోఽభిగచ్ఛేత్తు అవిముక్తం కదాచన।
తస్య క్షేత్రస్య మాహాత్మ్యాద్బ్రహ్మహత్యా వివర్తతే॥

భా॥ బ్రహ్మహత్య చేసినవాడును ఎప్పుడైనా కాశిని ప్రవేశించినచో ఆక్షేత్రము యొక్క మహత్తువలన బ్రహ్మహత్యాపాతకము నివర్తించును

తథా - శ్లో॥ బ్రహ్మహత్యాపహం తీర్థం క్షేత్రమేతన్మయాకృతమ్
అజ్ఞానాత్ జ్ఞానతోవాఽపి స్త్రియావా పురుషేణవా
యత్కించదశుభం కర్మ కృతం మానుషబుద్ధినా
అవిముక్తం ప్రవిష్టస్య తత్సర్వం భస్మసాద్భవేత్॥

భా॥ బ్రహ్మహత్యా పాతకమును సైతము పోగొట్టగలిగిన ఈ క్షేత్రము నాచే సృజింపబడినది తెలిసిగాని తెలియకగాని స్త్రీగాని పురుషుడుగాని మానవ దౌర్బల్యముచే ఎట్టి అశుభ కర్మలను చేసినను అట్టివి అవిముక్త క్షేత్రమందు ప్రవేశించగనే ఆ సమస్త పాపములు నశించిపోవును

తథా శ్లో॥ అవిముక్తం గతా యేవై మహాపుణ్యా కృతే నరాః
అపాపా హ్యజరాశ్చైవ అదేహాశ్చభవన్తితే॥

భా॥ అవిముక్త క్షేత్రమును చేరి అందు నివాసముపొంద గలిగిన పుణ్యవంతులు నిష్పాపులు జరాభయము లేనివారు మరల దేహమును ధరింపవలసిన యవసరము లేని వారును నగుదురు

శ్లో॥ జన్మాంతర సహస్రేణ యత్పాపం పూర్వసంచితమ్।
అవిముక్తం ప్రవిష్టస్య తత్సర్వం వ్రజతి క్షయమ్॥

భా॥ పూర్వజన్మ సహస్రములందు చేయబడిన సంచితమైనట్టి పాపమైనను కాశిని ప్రవేశించినచో అంతయు పూర్తిగ నశించును

నన్వేకామ్ర మాహాత్మ్యే - (ఏకామ్రమాహాత్మ్యమునందు)

శ్లో॥ ఏష విశ్వేశ్వరోదేవ ఏషైవ మణికర్ణికా।
కలావన్తర్హితా కాశీ ముక్తి రత్రైవ లభ్యతే॥

భా॥ ఈ విశ్వేశ్వర దేవుడు ఈ మణికర్ణిక ఈ కాశి కలియుగమున అంతర్హితములై యుండును ఇచటనే ముక్తి లభించును

వచనము ఇతి కాశ్యాంతర్ధాన శ్రవణాత్కుతస్తత్ప్రవేశగమనాదితి (అని చెప్పబడినందున కలియుగమున కాశీ అంతర్ధాన మగును అట్లయినచో అందు ప్రవేశించుట ఎట్లు సాధ్యమగును?)

శ్లో॥ అంతర్ధానం కలౌయాతి తత్పురం తు మహాత్మనః
అంతర్హితే పురేతస్మి న్పురీతు వసతే నిత్యం సర్వప్రాణి విముక్తిదా॥
ఇతి హరివంశే వచనాత్

భా॥ 'కలియుగమునందు ఆపురము అదృశ్యరూపమున ఉండును కాశీపురము అంతర్హితమైనను బాహ్యాకారము కన్పించుచునే యుండును? అను హరివంశవచనము చేత కలియుగమందు మహాదేవుడు అంతర్హితుడై ఆతని జ్యోతి రూపమగు కాశీ గూడ అంతర్హితమగును కాని పురము నిత్యమై సర్వ ప్రాణులకు ముక్తి నొసగునట్టిదియై ఉపస్థితి యందుండును అందు కాశీ లక్షణము త్యజింపబడకుండుటచే కాశీపురము పుణ్యమును ముక్తిని ఇచ్చునట్టిదియై యున్నదనుటలో అనుపపత్తి ఏమియు లేదు

**సనత్కుమార సంహితాయాం:-**

శ్లో॥ అతః కృతాఘం న బహిర్నశ్యత్యశ్వమేధతః
బహిష్కృతా బ్రహ్మహత్యాఽ ప్యన్తర్యాతస్య నశ్యతి॥

భా॥ కాశీయందుండి పాపము చేసినచో అది కాశీ బయటకు పోయి అశ్వమేధ యాగము చేసినను నశించదు గాని కాశికి బయటచేసిన బ్రహ్మ హత్యాపాతకమైనను కాశీయందు ప్రవేశించగనే నశించును

కౌర్మే- శ్లో॥ మహాపాతకినో యేచ యే నైభ్యః పాపకృత్తమాః
వారాణసీం సమాసాద్య తేయాన్తి పరమాంగతిమ్॥

భా॥ మహాపాపముచేసిన వారైనను వారికంటె నికృష్టమైన పాపము చేసిన వారైనను కాశిని చేరినంతనే పరమగతిని పొందుదురు.

తథా- శ్లో॥ ప్రవిష్టమాత్రే దేవేశే బ్రహ్మహత్యా కపర్దిని।
హాహేత్యుక్త్వా సనాదం సా పాతాలం ప్రాప దుఃఖితా॥

భా॥ దేవదేవుడైన కపర్ది (ఈశ్వరుడు) కాశిని ప్రవేశించినంతనే అతనియందున్న బ్రహ్మహత్యాపాతకము హాహాయని మొఱపెట్టుచు దుఃఖించుచువట్టి దిగ్గైని పాతాళలోకమునకు పోయినది.

వచనము. ఇతి మహాదేవ బ్రహ్మహత్యానాశవ్యాజ దర్శనాదేవ తన్నాశోఽపి ఫలముక్తమ్।

భా॥ ఇట్లనుటచే, మహాదేవస్థితమగు బ్రహ్మహత్య నశించినది అర్థ వాదమున, ఇతరుల బ్రహ్మహత్యయు కాశీ ప్రవేశ క్షణముననే నశించును అను ఫలము చెప్పినట్లు అయినది (ఇచట శివుని లేక కాలభైరవుని బ్రహ్మహత్యాపాతకము నశించిన కపాల మోక్షణ కథా విధానము అను సంధేయము)

తథా- శ్లో॥ మేరుమందరమాత్రోపి రాశిః పాపస్యకర్మణః
అవిముక్తం సమాసాద్య తత్క్షణాత్ వ్రజతి క్షయమ్॥

భా॥ మేరుమందర ప్రమాణమైన పాపము చేసినవారైనను అవిముక్త క్షేత్రమును ప్రవేశించినంతనే వారి పాపము తత్క్షణమే నశించును.

కాశీఖండే -

శ్లో॥ కాశీప్రాప్తిరయంయోగః కాశీప్రాప్తిరిదం తపః
కాశీప్రాప్తి రిదం దానం, కాశీప్రాప్తిః శివైకతా॥

భా॥ కాశిని చేరుటయే యోగము కాశీ వాసమే తపస్సు కాశీ యందుండుటయే దానము, కాశీ ప్రాప్తియే శివైక్య సాధనము.

తథా-

శ్లో॥ అన్యాన్యపిచ పాపాని మహాన్త్యల్పాని యానిచ
క్షయన్తి తాని సర్వాణి కాశీం ప్రవిశతాం సతామ్॥

భా॥ ఇతరములైన పాపములు ఎంత గొప్పవియైనను అల్పమైనవియైనను అన్నియును కాశిని ప్రవేశించగనే సత్పురుషులగుటచే నశించిపోవును.

మత్స్యపురాణే-

శ్లో॥ సర్వగుహ్యోత్తమం మమ ప్రియతమం శుభమ్॥
ధన్యాః ప్రవిష్టాః సుశ్రోణి మమభక్తా ద్విజాలయః॥

భా- ఓదేవీ! నాకు క్షేత్రము గుహ్యతమమైన స్థానము నాకు మిక్కిలి ఇష్టమైనది శుభకరమైనది. ఇందు ప్రవేశించిన నా భక్తులగు ద్విజాదులు ధన్యులు

*తథా- శ్లో॥ అవిముక్తం శుభం ప్రాప్య మద్భక్తాః కృతనిశ్చయాః*
*నిర్ధూతపాపా విమలా భవన్తి విగతక్లమాః॥*

భా ధృఢచిత్తము గల నా భక్తులు శుభప్రదమగు ఈ అవిముక్తమును ప్రవేశించగనే పాపరహితులు నిర్మలులు అయి తమకు గల క్లేశములను దూరము చేసుకొనెదరు

వచనము. కాశీ ప్రవేశే శుభాశుభకాల విచారోஉపి న కార్యః

అత ఏవ ఉక్తమ్ః (కాశీప్రవేశము పట్ల శుభాశుభ సమయ విచారము చేయనక్కరలేదు గనుక ఇట్లు చెప్పబడినది)

*కాశీఖండే - శ్లో॥అథవా కాశీ సంప్రాప్తి న చిన్త్యం హి శుభాశుభమ్।*
*తదైవహి శుభః కాలో యదైవాஉஉప్యేత కాశికా ॥ఇతి॥*

భా- కాశీ ప్రవేశించుటకు ఇది శుభ సమయము ఇది అశుభసమయమని విచారణ చేయనక్కరలేదు ఎప్పుడు కాశిని చేరగలరో అదియే శుభసమయము

వచనము:- ఇదంచ అసంభవ విషయం। సంభవేతు శుభకాలః శోధ్యయేవ। అథవేతి వచనాత్ అత్ర ప్రవేశ దర్శనాదిమ అవిశేషశ్రవణేపి ప్రారబ్ధవ్యతిరిక్త పాపక్షయో ద్రష్టవ్యః ప్రారబ్ధ కర్మణాం భోగాదేవక్షయ ఇతి వచనాత్। ప్రారబ్ధ కర్మక్షయే ప్రవేశమాత్రేణ శరీరపాత ప్రసంగాచ్చ అత ఏవ బ్రహ్మవైవర్తే గోదావరీ తీరదేశోత్పన్నస్య వేదధర్మ సంజ్ఞస్య గురోర్దీపకాఖ్యేన శిష్యేణ సహ కాశ్యామా గతస్యాపి ప్రారబ్ధ నాశోనాభూదిత్యుక్తం। తతస్తౌ సహితౌ విప్రౌ కాశీం గత్వా స్థితౌసుఖం। ఇత్యాద్యుక్త్వా

భా - ఇది అసంభవ విషయము శుభ సమయము సంభవమైనచో అనుసరణీయమే యగుచున్నది అథవా యని చెప్పుటలో కాశీ ప్రవేశ దేవదర్శనాది విషయములలో అవిశేష మని చెప్పుటచే ప్రారబ్ధ వ్యతిరిక్తమైన పాపక్షయమని గ్రహించవలెను (ప్రారబ్ధము అనుభవము చేతనే క్షయమగునని చెప్పబడుట చేత) కాశిని ప్రవేశించినంతనే ప్రారబ్ధము నశించును అని చెప్పినచో శరీర పాతము జరుగవలెను అందుచేతనే బ్రహ్మవైవర్త పురాణమున గోదావరీ తీరమందు పుట్టిన వేదధర్ముడను పేరు గల గురువు దీపకుడను శిష్యునితో సహా కాశికి వచ్చినను అతనికి ప్రారబ్ధ నాశము గలుగలేదని చెప్పబడినది అంతట ఆ గురుశిష్యులిద్దరు కాశిని చేరి సుఖముగ నుండిరి యని చెప్పుచూ

*శ్లో॥ ప్రారబ్ధ భోగమఖిలం గురుర్భుక్తుం ప్రచక్రమే*
*కుష్ఠరోగం సమాపద్య నేత్రాంధత్వమపి ప్రభుః॥*

భా ప్రారబ్ధమును పూర్తిగ అనుభవించుటకు గురువు సిద్ధపడెను. దానిచేత అతడు కుష్ఠరోగమునకు అంధత్వమును పొంది ప్రారబ్ధాను భవమునకు సిద్ధపడెను

వచనము ఇత్యాది అత్రేదం విలక్షణమ్ కిమ్ కాశీ ప్రవేశాత్ అశేషాశేష జన్మార్జితం పాపం నశ్యతి ఉత ఏతజ్జన్మజమేవేతి అత్రకేచిత్ అనేక జన్మీయపాపనాశః

భా ఈ విధముగ చెప్పగా ఇచట ఇట్లు గ్రహించవలెను. కాశిని ప్రవేశించినంతనే గత జన్మలన్నిటిలో ఆర్జించిన పాపము నశించునా? లేక ఈ జన్మలో చేసిన పాపము మాత్రమే నశించునా? యని అశంక కలుగగా కొందరిట్లు చెప్పిరి అనేక జన్మలలోని పాపము నశించుననుటకు

శ్లో॥ లింగం దశాశ్వమేధేశం దృష్ట్వా దశహరాతిథౌ।
దశజన్మార్జితైః పాపైః త్యజ్యతే నాత్రసంశయః॥

భా దశహరాతిథుల యందు దశాశ్వమేధ మందలి దశాశ్వమేధేశ్వర లింగమును దర్శించిన వారికి గత పదిజన్మలందు చేసినట్టి పాపములు నశించుననుటలో సందేహము లేదు.

వచనము ఇత్యాద్యనుపపత్తిః ఏవం దశాశ్వమేధే జ్యేష్ఠ శుక్ల ప్రతిపదాది దశమ్యంతం స్నానే క్రమేణ ఏకద్వ్యాది జన్మపాతక నాశ ప్రతిపాదకానిచ, అనుపపన్నాని వచనాని స్యుః క్షేత్ర ప్రవేశా దేవ అశేషపాపక్షయాత్ అతః ప్రవేశాత్ ఏతజ్జన్మార్జితమేవ పాపం నశ్యతి। తత్ర తీర్థ స్నానాదినా ప్రాగ్జన్మీయ పాపక్షయ ఇతి। ఏవంతు జన్మాంతర సహస్రేషు ఇత్యాది ప్రాగుదాహృతైః ప్రవేశాత్ అనేక జన్మ పాపనాశప్రతిపాదక వచనైర్విరోధాపాతాత్ తత్తతీర్థ స్నానాదినా పాపాది శబ్దలక్షితా పాపవాసనా ఉనేక జన్మీయా నశ్యతి। ప్రవేశాత్తు అఖిలపాపనాశయేవ। న చ తతో వాసనాపి నశ్యతీతి వాచ్యమ్। తథాసతి కాశీ ప్రవిష్టానాం వాసనాభావాత్పాపే ప్రవృత్త్యభావాపత్తేః తస్యా ప్రవేశాన్ని వర్తత్వాత్ కారణాంతరాదేవ నివృత్తేః తదుక్తం బ్రహ్మవైవర్తే

భా ఇట్లు చెప్పుట అనుపపత్తి (కుదరనిది) యగునా? ఈ రీతిగా దశాశ్వమేధ మందు జ్యేష్ఠ శుక్ల ప్రతిపం తిథి (పాడ్యమి) మొదలు దశమితిథి వరకు స్నానము చేయుటచే వరుసగా ఒకటి లేక రెండు గత జన్మల పాపము నశించునని ప్రతిపాదించు వాక్యములు నశించునని చెప్పు వాక్యములు అనుపపన్నములు (అసందర్భములు) అగు చున్నవి ఏమనగా కాశీ క్షేత్రమును ప్రవేశించినంతనే అశేష పాపముక్షయమగుచున్నది. అందుచేత ఇట్లు గ్రహించవలెను కాశీ ప్రవేశముచే ఈ జన్మలో చేసిన పాపములు నశించుననియు ఆయా తీర్థ స్నానాదుల వలన పూర్వ జన్మలయందలి పాపములు నశించుననియు చెప్పబడుట చేత సహస్ర జన్మల యందుచేసిన పాపములు పోవునని పూర్వము ఉదాహరించుటచే కాశీ ప్రవేశము వలన అనేక జన్మలయందలి పాపములు నశించును అని ప్రతిపాదించు వచనములకు విరోధము లేదు ఆయా తీర్థములందు చేయు స్నానాదుల చే పాపము మొదలగు శబ్దములచే లక్షితమైన అనేక జన్మలందలి పాపవాసన (సంస్కారము) నశించును అనగా ప్రవేశ మాత్రమున అఖిల పాపములు నశించును కాని వాసనలు నశించునని చెప్పుటకు వీలులేదు అట్లైనచో కాశీ ప్రవేశించిన వారికి వాసనారాహిత్యమే పాపమునందు ప్రవృత్తి యుండదని) చెప్పవలసి వచ్చును.కాశిని ప్రవేశించుట నుండి నివృత్తి పొందిన వారికి కారణాంతరములచే పాపము నివర్తింపబడును బ్రహ్మవైవర్తమున ఇట్లు చెప్పబడినది

సంభవాత్. తథాచ ప్రవేశాత్ యజ్ఞాతీయం సర్వం పాపం నష్టమ్ తద్విజాతీయమేవ ఏకద్వ్యాది జన్మీయం తత్తత్తీర్థ స్నానాత్ నశ్యతీత్యాహుః అత్రపరీక్షకై విచార్యయుక్తః పక్షోగ్రాహ్యః। ( ఈ వచనము యొక్క పూర్తిపాఠమును త్రిస్థలీసేతు కాశీ ప్రకరణము పేజి 99 100 చూడనగును)

సారాంశము కాశీ ప్రవేశము వలన సమస్త పాపములు నశించువనుటలో అనుపపత్తి లేదు కాశీ ప్రవేశము వలన సజాతీయమగు పాపములు నశించునని కొందరన్నను అయా తీర్థ స్నానాదులు దైవ దర్శనాదుల వలన ఇతర జన్మలలోని విజాతీయ పాపములు గూడ నశించునని పెద్దలు వక్కాణించుచున్నారు

***(12) అథకాశ్యాదిక్షేత్ర పరిమాణమ్ :-***

*పాద్మే పాతాళఖండే*

శ్లో॥ *పరిమాణంచ వక్ష్యామి తన్నిబోధత సత్తమాః*
*మధ్యమేశ్వర మారభ్య యావద్దేహలి విఘ్నపమ్॥*

శ్లో॥ *సూత్రం సంస్థాప్య తద్దిక్షు భ్రామయేన్మండలాకృతి॥*
*తత్ర యా జాయతే రేఖా తన్మధ్యేక్షేత్రముత్తమమ్॥*

శ్లో॥ *కాశీతి యద్వేదుర్వేదాస్తత్రముక్తిః ప్రతిష్ఠితా*
*కాశ్యన్తః పరమంక్షేత్రం విశేషఫలసాధనమ్॥*

భా ఓ సత్తములారా! మీకు తెలియుటకై కాశీక్షేత్ర పరిమాణమును చెప్పుచున్నాను ఎనుడు మధ్యమేశ్వరుని కేంద్రముగ జేసి అచ్చట నుండి దేహలి వినాయకుని వరకు సూత్రమును (త్రాటిని) యేర్పరచి దానిని (అర్ధవ్యాసముగ జేసి) అన్ని దిక్కులను చుట్టినచో ఏ మండలాకృతి ఏర్పడునో దాని పరిధిలోపల నున్నట్టి క్షేత్రము ఉత్తమ మైనదని భావించవలెను దానినే కాశీయని వేదములు ప్రశంసించినవి ఆ క్షేత్రమందు ముక్తి ప్రతిష్ఠితమై యుండును ఆ పరమ క్షేత్రము విశేష ఫలసాధనమై ప్రకాశించుచుండును

శ్లో॥ *వారాణసీతి విఖ్యాతం తన్మానం నిగదామి వః*
*దక్షిణోత్తర యోర్నద్యో వరణాఽసి పూర్వతః॥*

శ్లో॥ *జాహ్నవీ పశ్చిమే చాపి పాశపాణిర్గణేశ్వరః*
*తన్మాఽన్తః స్థితం దివ్యాః విశేషఫలసాధనమ్॥*

శ్లో॥ *అవిముక్తమితి ఖ్యాతం తన్మానంచ బ్రువీమి వః*
*విశ్వేశ్వరాచ్చతుర్దిక్షు ధనుః శతయుగోన్మితం*
*అవిముక్తాభిధం క్షేత్రం ముక్తిస్తత్ర న సంశయః॥*

భా వారాణసి యని ప్రఖ్యాతి పొందిన క్షేత్ర పరిమాణమును మీకు చెప్పెదను. ఉత్తరమున వరణ దక్షిణమున అస్సీనదులును తూర్పున గంగానదియు పడమర పాశపాణి వినాయకుడు హద్దులుగల్గి ఆ మధ్యలో నున్న వారాణసి క్షేత్రము దివ్యమైనదియై విశేషఫలసాధన మగుచున్నది

అవిముక్తమని ప్రఖ్యాతి గాంచిన క్షేత్ర పరిమాణమును చెప్పుచున్నాను శ్రీ విశ్వేశ్వర ప్రభువు నుండి నాల్గు దిక్కులయందును రెండువందల ధనువుల పరిధిలోపల నున్న స్థలము అవిముక్తమను పేరుగల క్షేత్రమై ముక్తి ప్రదాయకమగుచున్నది ఇందుకు సందేహము లేదు

శ్లో॥ *గోకర్ణేశః పశ్చిమే పూర్వతశ్చ గంగామధ్య ముత్తరే భారభూతః*
*బ్రహ్మేశావ దక్షిణే సంప్రదిష్ట స్తత్సుప్రోక్తం భవనం విశ్వభర్తుః॥*

వచనము విశ్వభర్తుర్భవన మంతర్గృహం। తతశ్చ కాశీవారాణస్య విముక్తాన్తర్గృహాఖ్యానాం చతుర్ణాం ఉత్తరోత్తరం పూర్వపూర్వాన్తర్వర్తి పూర్వపూర్వాపేక్షయా న్యూనపరిమాణంచేతి స పిండితార్థః।

భా పడమరగా గోకర్ణేశ్వరుడు తూర్పున గంగా మధ్యము ఉత్తరమున భార భూతేశ్వరుడు దక్షిణమున బ్రహ్మేశ్వరుడును పరిహద్దులుగా గల క్షేత్రము విశ్వభర్తృగృహమగు అంతర్ గృహముగా చెప్పబడుచున్నది

కాశీ వారాణసీ అవిముక్తము అంతర్గృహము అని చెప్పబడిన వాట్గింటిలో ఉత్తరోత్తరము పూర్వపూర్వమునందుండి పరిమాణమున చిన్నది యగుచుండునని గ్రహించవలెను

(అనగా కాశీ పరిధిలోపల వారాణసి వారాణసి పరిధిలోపల అవిముక్తము అవిముక్తము యొక్క పరిధిలోపల అంతర్భావములుగా అంతర్ గృహము స్థితమైయున్నవని భావము)

*తథా బ్రహ్మపురాణే రుద్రం ప్రతి బ్రహ్మ కాశీక్షేత్ర మాహ -*
*(బ్రహ్మ పురాణమున శివునకు బ్రహ్మ కాశీక్షేత్రమును గురించి ఇట్లు చెప్పుచున్నాడు)*

శ్లో॥ *పంచక్రోశప్రమాణం క్షేత్రం దత్తం మయా తవ।*
*క్షేత్ర మధ్యే యదా గంగా గమిష్యతి సరిత్పతిమ్॥*

భా ఓ రుద్రుడా నీకు నాచేత పంచక్రోశ పరిమాణముగల క్షేత్రము ఇవ్వబడినది ఆ క్షేత్ర మధ్యమునుండి గంగ ప్రవహించి సముద్రమును చేరుచున్నది

శ్లో॥ *తేన సా మహతీపుణ్యా పురీ రుద్ర భవిష్యతి।*
*పుణ్యాచోదఙ్ముఖీ గంగా ప్రాచీచాపి సరస్వతీ॥*

భా దానిచే ఆపురము మిక్కిలి పుణ్యనగరమగును అచ్చట గంగ ఉత్తరాభిముఖముగ ప్రవహించుచుండుటచే పవిత్రమైనది. తూర్పు ముఖముగ ప్రవహించు సరస్వతినది గూడ అట్టిదే

శ్లో॥ *ఉదఙ్ముఖీ యోజనే ద్వే గచ్ఛతే జాహ్నవీనదీ।*

భా గంగ ఇచ్చట ఉత్తరాభిముఖముగ రెండు యోజనముల దూరము ప్రవహించును

వచనము మధ్యమేశ్వరాత్సర్వదిక్షు పంచక్రోశప్రమాణమిత్యర్థః। యత్తు బ్రహ్మవైవర్తే కామకలావచః।

భా మధ్యమేశ్వరమునుండి సర్వదిక్కులయందు పంచక్రోశపరిమాణముగలది యని అర్థము అట్లే బ్రహ్మవైవర్త పురాణమందు కామకలా (మంత్రగ్రంథము) వచన మిట్లు గలదు

శ్లో॥ *అహో మహాలింగమయం జనార్దనం పశ్యామి కాశ్యాం పరమాత్మరూపమ్।*
*అవాహితో యోజనపంచకాత్మం విస్తారి గవ్యూతి యుగంతు సార్ధమ్ ॥ఇతి॥*

అత్రయోజనం క్రోశస్తేన సమన్తతః పంచక్రోశత్రైవేతి న విరోధః వారాణసీక్షేత్రం తు వరణాస్యోరన్తరా తుదక్తం కౌర్మే

భా॥ కాశీయందు మహాలింగమయమగు జనార్దనుని పరమాత్మరూపముగ చూచుచున్నాను ఐదు యోజనముల పొడవు రెండున్నర గవ్యూతుల (2×21/2=5 క్రోసులు) వెడల్పుగలది (ఇచ్చట యోజనమనగా క్రోశము దానివలన అన్ని వైపుల ఐదు క్రోసుల పరిమాణమనుటలో విరోధము లేదు వారాణసీ క్షేత్రము వరణ అస్సీనదుల మధ్య నున్నది అని చెప్పబడుటలో విరోధము లేదు కూర్మ పురాణమున గూడ ఇట్లు చెప్పబడినది)

శ్లో॥ *వరణాయాస్తథైవాస్యామధ్యే వారాణసీపురీ ॥ఇతి॥*
(వరణనుండి అస్సీ వరకు మధ్యగలది వారాణసీపురి)

మాత్స్యే– శ్లో॥ ద్వియోజనమథార్ధం చ పూర్వపశ్చిమతః స్థితమ్।
అర్ధయోజనవిస్తీర్ణం దక్షిణోత్తరతః స్థితమ్॥

భా॥ తూర్పు పడమరలుగ రెండున్నర యోజనముల పొడవు గల్గి దక్షిణోత్తరములుగ అర్ధయోజనము విస్తీర్ణముగలది వారాణసి

శ్లో॥ *వరణానదీచ యావచ్ఛుష్కనదీ తథా*
*ఏషక్షేత్రస్యవిస్తారః ప్రోక్తో దేవేన ధీమతా॥*

భా॥ వరణానది నుండి శుష్కనదియగు అస్సీవరకు ఈ క్షేత్రము యొక్క విస్తారమని ధీశాలియగు దేవునిచే చెప్పబడినది

వచనము  శుష్కనదీ అసీ। అత్ర ప్రథమార్ధే కాశ్యా ఏవ విస్తార ఉక్తో, నతువారాణస్యాః॥ తస్యాం పూర్వతో జాహ్నవతి పాద్మే జాహ్నవ్యాః పూర్వావధికరణాత్। క్షేత్రస్య సందర్భచ పూర్వవేలాం స్పృష్ట్వైన గంగా ప్రవహత్య జస్రమ్ ఇతి సనత్కుమార సంహితోక్తేశ్చ।

అతో దశక్రోశపరిమితే కాశీక్షేత్రే గంగయామధ్యే వ్యవచ్ఛిన్నే పూర్వార్ధం పరిత్యజ్యపశ్చిమార్ధే గంగాసీదేహలీ వినాయక వరణా రూపైశ్చతుర్భి గవధిభిరవచ్ఛిన్నోదేశో వారాణసీతి సిధ్యతి।

తథామాత్స్యేయేవ -

భా॥ శుష్కనదియనగా అస్సీ. ఇచ్చట పైశ్లోక ప్రథమార్ధమున కాశీ విస్తారము చెప్పబడినది గాని వారాణసీ విస్తారముగాదు వారాణసికి పూర్వమందు (తూర్పు) జాహ్నవియున్నదని పద్మపురాణమున జాహ్నవి యొక్క తూర్పు హద్దుగ చెప్పబడినది క్షేత్రము యొక్క తూర్పు దిక్కు అంచు వెంబడి గంగ ఎల్లప్పుడు ప్రవహించుచున్నదని సనత్కుమార సంహితయందు గూడ చెప్పబడినది అందుచేత దశక్రోశపరిమితమగు కాశీక్షేత్రమందు గంగమధ్యమునుండి తూర్పువైపున గల సగభాగమును వదలి

పశ్చిమార్థాన గల గంగ అస్సీ దేహలీ వినాయకుడు వరణానది ఇట్లు నాలుగు హద్దుల మధ్యనున్నట్టి క్షేత్రమువారాణసియని సిద్ధించుచున్నది అట్లే మత్స్య పురాణమున గూడ

శ్లో॥ ద్వియోజనం తు విస్తీర్ణం పూర్వపశ్చిమతః స్మృతమ్।
అర్ధయోజనవిస్తీర్ణం తత్ క్షేత్రం దక్షిణోత్తరమ్॥

శ్లో॥ వరణాచ నదీ యావద్యావచ్ఛుష్క నదీతు వై।
భీమచండం సమారభ్య పర్వతేశ్వర మన్తికే॥

భా తూర్పుపడమరలుగ రెండు యోజనములు గలది ఉత్తర దక్షిణములుగ అర్ధయోజన విస్తీర్ణము గలదియే వారాణసీ క్షేత్రమని చెప్పబడినది వరణానదినుండి శుష్కనదివరకు భీమచండినుండి పర్వతేశ్వరుని వరకు యున్నట్టి స్థలమని భావము

వచనము ఇదమపి పూర్వేణ వ్యాఖ్యాతమ్। అత్రచ ద్వియోజన మిత్యదూర వ్యవధానేన స్థూల పరిమాణాభిప్రాయేణ వా సార్ధద్వియోజన పరమేవ। పాద్మే సృష్టిఖండే

భా ఈ విషయము పూర్వమే వ్యాఖ్యానించబడినది ఇచ్చట రెండు యోజనములని దూర వ్యవధానము లేకుండ చెప్పుట యోజనములనియే భావముగ గ్రహించవలెను పద్మ పురాణమున సృష్టి ఖండమందిట్లు చెప్పబడినది

శ్లో॥ వరణాచాప్యసిశ్చైవ ద్వే నద్యౌ సురనిర్మితే।
అంతరాలే తయోః క్షేత్రం వధ్యా న విశతే క్వచిత్॥

భా వరణా అస్సీ అను రెండు నదులు దేవ నిర్మితములు ఆ రెండు నదుల మధ్యనున్న ప్రదేశమందు బ్రహ్మహత్యాది పాపములు ప్రవేశింపజాలవు

వచనము అత్ర సర్వత్ర శాస్త్రోక్తా సంగమేశ్వర ప్రదేశస్థైవాసీ గృహ్యతే క్షేత్రమధ్యాదితి వచనః కాశీపరతయా వారాణసీ పరత్వాభావస్యోక్తత్వాత్" ( ఈ వచన పూర్తి పాఠమును "త్రిస్థలీసేతు కాశీప్రకరణమ్ పేజి 102 లో చూడవగును)

సారాంశము ఇచ్చట శాస్త్ర సమ్మతమగునట్లు మధ్యమేశ్వర ప్రదేశము లగాయతు గంగ వరకు ప్రవహించుచున్న అస్సీనే అస్సీగా గ్రహించవలెను పంచక్రోశ యాత్రయందును ఈ మధ్య ప్రదేశమే వారాణసీ క్షేత్రముగ ప్రదక్షిణము చేయబడుచున్నది తూర్పున గంగానది పడమర దేహలివినాయకుడు అవధిగా గల క్షేత్రమే పంచక్రోశపరిమిత మగుటచే పడమటి తీరమును వదలి యాత్ర చేయవలెను అనునట్టి వారి అభిప్రాయము సరిగాదు కాశీ వారాణసి పరిధులలో వ్యత్యాసముండుటచే ఆ రెండింటి మధ్య వివేచనగ్రహణార్థమట్లు చెప్పబడినది క్షేత్ర మధ్యమునుండి అనువచనము కాశీ పరముగా ప్రయుక్తమైనపుడు కాశీ మధ్యమునుండి యను అర్థమును ఇచ్చును గాని వారాణసీ మధ్యము నుండి యను అర్థమును ఇచ్చుటలేదు సరిహద్దులు మణికర్ణికేశ్వర గంగా కేశవాది క్రమమున పేర్కొనబడుట చేతను వారాణసీ ప్రదక్షిణమునకు విప్రతిపత్తి లేదు

అవిముక్త ప్రమాణంతు లింగ పురాణే

శ్లో॥ *కృత్తివాస సమారభ్య క్రోశం క్రోశం చతుర్దిశమ్॥*
*యోజనం చైవ తత్క్షేత్రం రుద్రైరుద్రైశ్చ సంవృతమ్॥*

భా- కృత్తివాసేశ్వర లింగమునుండి నలువైపుల నాలుగు దిక్కులయందును క్రోశము క్రోశము చొప్పున పరిగణించగా ఏర్పడునట్టి యోజనము పరిధిలోని ఆ క్షేత్రము రుద్రగణావృతమై యుండును

శ్లో॥ *క్షేత్రమధ్యే యదా లింగం భూమిం భిత్త్వా సముత్థితమ్॥*
*మధ్యమేశ్వర సంజ్ఞం తు ఖ్యాతం సర్వ సురాసురైః॥*

భా ఈ క్షేత్రమందు భూమిని భేదించుకొని యావిర్భవించిన లింగమే మధ్యమేశ్వర సంజ్ఞతో సురాసురులందరిచేతను పేర్కొనబడుచున్నది.

శ్లో॥ *అస్మాదారభ్య లింగాత్తు క్రోశం క్రోశం చతుర్దిశి॥*
*యోజనం విద్ధి తత్ క్షేత్రం మృత్యుకాలేఽమృతప్రదమ్॥*

భా ఆ లింగమునుండి నాలుగుదిక్కుల క్రోశము క్రోశము చొప్పున యోజన పరిమితమగు క్షేత్రము మృత్యుకాలమందు అమృత ప్రదమగుచున్నది.

శ్లో॥ *ఏష క్షేత్రస్య విస్తారః పురాణే పరికీర్తితః॥*
*అస్మాత్తు పరతో దేవి! విహారో నైవ విద్యతే॥*

భా ఓ దేవి! ఈ క్షేత్రముయొక్క విస్తారము పురాణ వాఙ్మయమున కీర్తించబడినది. దీనికంటె వెలుపల నా విహారము లేదు (సదా ఈ క్షేత్రములోనే సదాశివుడు విహరించునని తాత్పర్యము)

స్కాందే శ్లో॥ *చతుష్క్రోశం చతుర్దిక్షు క్షేత్రమేతత్ప్రకీర్తితమ్॥*
*యోజనం విద్ధి చార్వంగి మృత్యుకాలే ఽమృతప్రదమ్॥*

భా ఓ సుందరీ! నాలుగు దిక్కులందు కలిసి నాలుగు క్రోసుల పరిమాణము గలదిగా ఈ క్షేత్రము కీర్తింపబడినది. యోజన పరిమితిగల ఈ క్షేత్రము మృత్యుకాలమందు అమృత ప్రదము.

తథా- శ్లో॥ *ముక్తిక్షేత్ర ప్రమాణంచ క్రోశం క్రోశం చ సర్వతః॥*
*ఆరభ్య లింగాదస్మాచ్చ పుణ్యాదామ్మధ్యమేశ్వరాత్॥*

భా అట్లే ఈ లింగము నుండి లేక మధ్యమేశ్వర లింగమునుండి నాల్గు దిక్కులందు క్రోశ క్రోశ పరిమాణముగల క్షేత్రమే ముక్తిక్షేత్ర మగుచున్నది. అది మిక్కిలి పుణ్యప్రదము

వచనము అత్ర లైంగ స్కాందాలోచనయా కృత్తివాస మధ్యమేశ్వరయో శ్చతుర్దిక్షు యోజనమిత మవిముక్తం। సాధ్యేతు విశ్వేశ్వరా త్పూర్వతో ధనుఃశతద్వయమితమ్॥ తథా చాత్ర పరిమాణ వికల్పః॥ యోజనమిత్యేతత్తు వచనత్రయేఽపి ప్రథమార్థోక్తా ఽవిముక్త క్రోశవ వహ యోజనస్య పంచక్రోశాత్మకత్వా త్కాశీపరిమాణ పరిమితి, న కాచిదనుపపత్తిః కృత్తివాసస్య చ మధ్యమేశ్వర సామీప్యాదల్పాన్తరతా న దోషాయ॥

భా॥ ఇచటలింగ స్కాంద పురాణముల తీరును పరిశీలించగా కృత్తివా స మధ్యమేశ్వర లింగముల నుండి నలుదిక్కుల యోజన పరిమిత మగు క్షేత్రము అవిముక్తమని తెలియుచున్నది పద్మపురాణమున విశ్వేశ్వర స్థానమునుండి అన్నివైపులకు 200 ధనువుల (ధనుః ప్రమాణము ఎనిమిది అడుగులు) దూరము వరకు గల ప్రదేశము అవిముక్తమని చెప్పబడగా ఇట్లు క్షేత్ర పరిమాణములో వికల్పమేర్పడుచున్నది యోజనమనునది ఈ మూడు సందర్భములందును మొదట చెప్పబడినది యగుటచే అవిముక్త క్షేత్రసూచకమగు క్రోశముతో కలిపి యోజనము లెక్కించినప్పుడు పంచక్రోశాత్మకమునే కాశీ పరిమాణమని భావించుటలో యేమియు అనుపపత్తి లేదు కృత్తివాస మధ్యమేశ్వర స్థానములు పరస్పరము మిక్కిలి సమీపముగ నుండుటచే బహుస్వల్పమగునని వాని యంతరము పరిగణనలోనికి తీసికొనకుండుట దోషముగాదు అంతర్ గృహపరిచ్ఛేదశ్చ కాశీఖండే

శ్లో॥ పూర్వతో మణికర్ణీశో బ్రహ్మేశో దక్షిణే స్థితః
పశ్చిమే చైవ గోకర్ణో భారభూత స్తథోత్తరే॥
ఇత్యేతదుత్తమం క్షేత్ర మవిముక్తే మహాఫలమ్॥

భా॥ తూర్పున మణికర్ణికేశ్వరుడు ఉత్తరమున భారభూతేశ్వరుడు దక్షిణమున బ్రహ్మేశ్వరుడు పశ్చిమమున గోకర్ణేశ్వరుడు గలిగిన ఉత్తమ క్షేత్రమే మహాఫలప్రదమగు అంతర్గృహము

వచనము అవిముక్తే తన్మధ్యే అత్రపూర్వతో మణికర్ణికేశ్వరస్యావధిత్వోక్త్యాప పాద్మైకవాక్యత యాఽగంగామధ్యమేవ తేనోపలక్ష్యతే। తేన గంగార్ధజలమృతస్య క్షేత్రచతుష్టయమరణసిద్ధిః వికల్పాయ వేత్యవ్యే। తదయం సంక్షేపః॥

భా॥ అవిముక్తమధ్యమందు అని చెప్పుచూ ఉత్తర మణికర్ణికేశ్వరుడు అవధిగాగలది అని చెప్పినప్పటికిని పద్మపురాణ వాక్యమును బట్టి గంగామధ్యమే గ్రహింపవలసి యున్నది. దానిచే గంగార్ధ భాగమున మరణించిన వానికి గూడ ఈ క్షేత్ర చతుష్టయమందు మరణించిన వానికి వలెనే సిద్ధి గలుగుచున్నది ఇది వికల్పమని కొందరు చెప్పుదురు ఇది సంగ్రహముగ అంతర్ గృహ వృత్తాంతము

శ్లో॥ సీమావినాయకశ్చర్ళ్వ బహిః కాశ్యాః ప్రమాణతః
యావత్ క్షేత్రం విజానీయా ద్ధ్వావధనుః శతత్రయమ్॥

భా॥ సీమా వినాయకుని నుండి వెలుపల కాశీయొక్క పరిమాణము ఆ క్షేత్రము 300 ధనువుల పరిమాణము గలిగినదిగా తెలియవగును

వచనము ఇతి వచనాత్ పశ్చిమే భీమచండ్యాః పరతో ధనుః శతత్రయమిత దేశేన సహ పూర్వతో గంగాపారేణచ సార్ధం వర్తులం కాశీక్షేత్రం। గంగాతు తన్మధ్యే వహతి క్షేత్ర మధ్యాద్యదాగంగేతి వచనాత్। గంగాసీ భీమచండీ పాశపాణి వరణాంతర్గతం క్షేత్రంవారాణసీ పంచక్రోశయాత్రాయాంచ

క్షేత్ర బహిస్థ స్యాపి పృథ్వీశ్వర యూపసరో వృషభధ్వజాదే ర్గమనంవచన బలాద్భవతి। స్కాందలైంగవశా న్మధ్యమేశ్వర కృత్తివాస సమన్తాత్క్రోశమిత మవిముక్తమ్। అంతర్ గృహంతు పూర్వాదిషు గంగామధ్య బ్రహ్మేశ్వర గోకర్ణేశ్వర భారభూతేశ్వరావధికమ్। ఏవం చతుర్విధే క్షేత్రే మరణే ముక్తి తారతమ్యం వక్ష్యామః। కాశీక్షేత్రాద్బహిః సమన్తాద్యోజనం దేవభూమి స్తత్రమృతాః స్వర్గభాజః॥

భా॥ ఈ వచనముల వలన భీమచండినుండి బయటకు 300 ధనువుల దూరము వరకు గల ప్రదేశము నుండి తూర్పున గంగా ప్రవాహములో సగము వరకును వృత్తాకారముగాగల భాగమును కాశీక్షేత్రమని తెలియవలెను గంగా యను వచనమును బట్టి గంగ కాశీ మధ్యనుండి ప్రవహించుచున్నది. అట్లే గంగ అస్సీ భీమచండి పాశపాణి వరణల మధ్యనున్న క్షేత్రము వారాణసియగును. పంచక్రోశయాత్రయందు క్షేత్రమునకు బయట ఉన్నప్పటికిని పృథ్వీశ్వర, మయూపసరోవర వృషభధ్వజాదులవరకు వెళ్లుట పైవచన బలముచే విశదమగుచున్నది స్కందపురాణము లింగపురాణము లను బట్టి మధ్యమేశ్వర లేక కృత్తివాసేశ్వర లింగములచుట్టును క్రోశపరిమితమగు క్షేత్రము అవిముక్త క్షేత్రమగుచున్నది. పద్మ పురాణమున మాత్రము అవిముక్త క్షేత్రము విశ్వేశ్వరుని నుండి అన్నివైపుల 200 ధనుస్సుల పరిమితి గలదియని చెప్పబడినది. అంతర్ గృహమైతే పైవానిలోపల గంగామధ్యము నుండి బ్రహ్మేశ్వర గోకర్ణేశ్వర, భారభూతేశ్వర లింగములు అవధిగా గలది యని చెప్పబడినది. ఈ విధమైన చతుర్విధ క్షేత్రములయందు మరణము సంభవించినచో గలుగు ముక్తి యందుగల తారతమ్యమును చెప్పుచున్నాము కాశీ క్షేత్రమునకు బయట అన్నివైపుల ఒక యోజనము వరకు దేవ(స్వర్గ) భూమి అచట మరణించిన వారు స్వర్గమును పొందుదురు దీనికి తార్కాణముగ బ్రహ్మవైవర్త పురాణవచనమిట్లు గలదు

శ్లో॥ *కాశ్యాశ్చతుర్దిశం దేవి యోజనం స్వర్గభూమికా*
*మృతాస్తత్ర హి గచ్ఛన్తి స్వర్గం సుకృతినాం పదమ్॥*

(ఇతి బ్రహ్మవైవర్త వచనాత్। వామన పురాణేతు హరిణా మహేశ్వరం ప్రతి క్షేత్రాంతర ముక్తమ్)

భా॥ ఓ దేవీ। కాశీనుండి నలువైపుల యోజనము మేర స్వర్గభూమి యని బడును అచట మృతి పొందినవారు పుణ్యవంతులకు భోగస్థానమగు స్వర్గమును పొందుదురు వామన పురాణమందు విష్ణువు ఈశ్వరునితో క్షేత్రాంతరమును గూడ ఇట్లు చెప్పెను

శ్లో॥ *యో ఽసౌ ప్రాఙ్మండలే పుణ్యే మదంశప్రభవో ఽవ్యయః*
*ప్రయాగేన సతే విఖ్యం యోగశాయీతి విశ్రుతః*
*పాద్మేతు విశ్వేశ్వరతః సమన్తాద్ధనుశ్శతద్వయమితమ్॥*

భా॥ పుణ్యప్రదమగు ప్రాఙ్మండలమున నాయంశగా ప్రభవించినట్టి అవ్యయుడు యోగశాయి అను పేరుతో విఖ్యము ప్రయాగయందు ప్రసిద్ధి పొందియున్నాడు

శ్లో॥ వరణాద్దక్షిణాత్తస్య వినిర్యాతా సరిద్వరా
విశ్రుతా వరణేత్యేవ సర్వపాపహరా శుభా॥

భా॥ ఆయన యొక్క కుడిపాదమునుండి బహిర్గతమై, నదులలో శ్రేష్ఠమైనది సర్వ పాపములను హరించునట్టిది, శుభదాయిని యని ప్రసిద్ధి గాంచిన వరణానది ప్రవహించుచున్నది.

శ్లో॥ సవ్యాదస్యా ద్వితీయాచ అసిరిత్యేవ విశ్రుతా
తే ఉభే సరితాం శ్రేష్ఠే లోకపూజ్యే బభూవతుః॥

భా॥ ఆ యోగశాయి యొక్క ఎడమ పాదమునుండి అసియనెడి నది బహిర్గతమైనది. ఈ రెండు నదులును శ్రేష్ఠములై లోక పూజ్యత నందినవి

శ్లో॥ తయో ర్మధ్యేతు యా దేవ్యత్ క్షేత్రం యోగశాయినః
త్రైలోక్యప్రవరం తీర్థం సర్వపాప ప్రమోచనమ్॥

భా॥ ఆ రెంటికిని మధ్యమున్నట్టి ప్రదేశము యోగదాయకమై మూడు లోకముల యందును శ్రేష్ఠమైనదియై సర్వపాపముల నుండి సంరక్షించునట్టి క్షేత్రమయినది.

శ్లో॥ న తాదృశోఽస్తి గగనే భూమ్యాం న చ రసాతలే
తత్రాస్తి నగరీపుణ్యా ఖ్యాతా వారాణసీ శుభా॥

భా॥ స్వర్గ, మర్త్య, పాతాళములందెక్కడను దీనితో సమానమైన క్షేత్రము లేదు. ఆ క్షేత్రమందే శుభకరమైన పుణ్యనగరము, వారాణసి యున్నది. అచట నివసించు పుణ్యాత్ములు భవభయరహితు లగుదురు.

13) అథ కియత్కాలం కాశీవాసఫలమ్:-

(కాశీవాస ఫలమెంతకాలముండును?)

స్కాందే – శ్లో॥ తీర్థాంతరే గవాంకోటిం విధివద్యః ప్రయచ్ఛతి
ఏకాహం యో వసేత్కాశ్యాం కాశీవాసీ తయోర్వరః॥

భా॥ తదితర క్షేత్రములందు విధివిధానముగ కోట్ల కొలది గోవులను దానము చేసిన పుణ్యవంతుని కంటె, కాశీయందు ఒక్కదినము నివసించిన వాడు అధికుడు తథా-

శ్లో॥ అహోరాత్రః స్థిత్వా భవతి సుకృతీ పాపరహిత,
త్రిరాత్రం యస్తిష్ఠే త్సభవతి సుఖ మోక్షనిలయః
నివాసం యే కుర్యుర్నితత మధికారామగణితం,
న తే భూయోభూయః పునరపి భవక్లాంతిమ వాపుః

భా॥ ఇచ్చట అహోరాత్రము కాశీవాసము చేసిన సుకృతి పాప రహితుడగును దిన త్రయము కాశీయందున్నవాడు శాశ్వత సుఖ మోక్షమునకు అర్హుడగును అంతకంటె విస్తరించి కాశీవాసము చేయువాడు పునర్ భవ భయరహితులగుదురు

శ్లో॥ త్రిరాత్రమపి యే కాశ్యాం వసన్తి నియతేన్ద్రియాః॥
తేషాం పునన్తి నియతం స్పృష్టా శ్చరణరేణవః॥

భా॥ కనీసము మూడు రాత్రులైనను జితేంద్రియుడై కాశియందు నివసించిన వాని పాదధూళిని స్పృశించిన వారు సైతము నియతముగ (నిశ్చయముగ) పుణ్యవంతులగుదురు

తథా॥ శ్లో॥ యత్పుణ్యమశ్వమేధేన యత్పుణ్యం రాజసూయతః॥
కాశ్యాం తత్పుణ్య మాప్నోతి త్రిరాత్ర వసనాద్యమీ॥

భా॥ అశ్వమేధమును చేసినవాడు రాజసూయము చేసినవాడు పొందునట్టి ఫలితమును కాశీయందు నియమపాలనము చేయుచు మూడు రాత్రులు నివసించిన వాడు సునాయాసముగ పొందును

మాత్స్యే శ్లో॥ మాసమేకం వసేద్యస్తు లఘ్వాహారో జితేన్ద్రియః॥
సమ్యక్తేన వ్రతం చీర్ణం దివ్యం పాశుపతం మహత్॥
జన్మమృత్యుభయం తీర్త్వా స యాతి పరమాంగతిమ్॥

భా॥ ఒక్కమాసము కాలము కాశిలో ఎవడు స్వల్పాహారియై జితేంద్రియుడై విధివిధానముగ మహత్పూర్ణమగు దివ్యమైన పాశుపతవ్రతమునాచరించుచు నివసించునో ఆవ్రత ఫలితముగ అతడు జన్మమృత్యు భయమునుండి తరించినవాడై పరమగతిని పొందును

వచనము ఇదం చాన్యత్ర మృతస్యాం కాశీవాస మాత్రస్య ముక్తిబీజతయా జన్మాంతరాభిప్రాయేణ పరంపరయా పరమగతిరూప మోక్షప్రాప్తిః ఫలం జ్ఞేయం। అత ఏవోక్తమ్।

భా॥ కొంతకాలము కాశీవాసము జేసి అన్యత్ర మృతి చెందినవానికి ఆ కాశీవాస ఫలము ముక్తి బీజమై జన్మాంతరమందు పరంపరగా పరమగతిరూపమైన మోక్షప్రాప్తియే ఫలమగుచున్నది యని చెప్పుటయే పై శ్లోకముయొక్క సారభూతమైన విషయము అదియే మరల ఇట్లు చెప్పబడినది

శ్లో॥ బహుకాల ముషిత్వాపి నియతేన్ద్రియ మానసః॥
యద్యన్యత్ర విపద్యేత దైవయోగాన్మృదిస్మితే॥
సోఽపి స్వర్గసుఖం భుక్త్వా విశ్వేన్ని। శ్రేయసం పరమ్॥ ఇతి ॥

భా॥ ఓ దేవీ! కాశీయందు బహుకాలము జితేంద్రియుడై ధృఢచిత్తముతో నివసించియు దైవ యోగమున అన్యత్ర మృతినొందినవాడు సైతము స్వర్గసుఖముల ననుభవించి అంతమున భూపతిగ జన్మించి పున కాశీవాసమును పొంది తుదకు నిశ్రేయసపదవిని చూరగొనును

తథా॥ శ్లో॥ ఏకాహారస్తు యస్తిష్ఠేన్మాసం తత్ర వరాననే॥
యావజ్జీవకృతం పాపం మాసేనైకేన శుద్ధ్యతి॥

భా॥ కాశియందు ఏకాహార నియమముతో ఒక్కమాసము నివసించినట్టివాడు తన యావజ్జీవ కృతపాపము నశించగా శుద్ధుడగును

వచనము   ఇదం కాశ్యాం మాస ముషిత్వా ఽన్యత్ర మృతస్య। అమోక్ష రూపత్వాద్యా వజ్జీవమితి। అంతర్గృహ యాత్రాద్యసమర్థస్య సమర్థస్యాపి వా తదకుర్వాణ స్యైకాహారత్వాది ధర్మవిశిష్ట మాసవాసా ద్యావజ్జీవకృతం మానసాది క్షుద్రపాపం నశ్యతీత్యర్థః। తేన నాన్యత్ర కృతస్య పాపస్య నాశస్తస్య కాశీప్రవేశాన్నాశాత్ నాప్యత్రైవ కృతమహాపాతకస్య తస్యైతావన్మాత్రేణ నాశాసంభవాత్ న క్షుద్రపాపస్య అంతర్గృహ యాత్రాదినా నాశాదిత్యాది వికల్పాః పరిహృతా భవన్తి। యద్వా యావజ్జీవ కృతపాపవాసనా నశ్యతీత్యర్థః॥

భా॥ కాశీయందు ఒక్క మాసమునివసించి అన్యత్రమృతి చెందినవానికి మోక్షములభించదు గనుక యావజ్జీవమని ఇది చెప్పబడినది అంతర్ గృహయాత్రాదులు చేయుట యందు అసమర్థుడైనను సమర్థుడై యుండిచేయకున్నను ఏకాహారాది ధర్మవిశిష్టుడై మాసవాసవిశిష్టుడైన వానికి యావజ్జీవము చేసిన మానస వాచిక కాయికాది క్షుద్ర పాపములన్నియు నశించునని యర్థము అన్యత్ర చేయబడినట్టి వాని పాపములు ఇతర ప్రదేశములందు నశింపక కాశిని ప్రవేశించినంతనే నశించును కాని కాశీయందుండి మహాపాతకములు చేసినవానికి కాశీయందు మాసనివాస మాత్రముచే అట్టి పాపములు నశించుట యసంభవము ఏమనగా అంతర్ గృహయాత్రాదులచే క్షుద్రపాపములే నశించును అను వికల్పములు దీనివలన పరిహరింపబడుచున్నవి లేక యావజ్జీవము చేసిన పాపవాసన గూడ నశించునని గ్రహింపవలెను

స్కాందే  శ్లో॥ నిమేషమాత్రమపి యో హ్యవిముక్తేఽతి భక్తిమాన్।
బ్రహ్మచర్య సమాయుక్త స్తేన తప్తం మహత్తపః॥

భా॥ అవిముక్త క్షేత్రమగు కాశీయందు నిమేష కాలమైనను మిక్కిలి భక్తితో బ్రహ్మచర్యమును పాటించుచు నివసించు నట్టివాడు గొప్పతప మాచరించిన యతడు పొందునట్టి ఫలమును పొందును (మానస వాచిక కాయికములని పాపములు త్రివిధములు )

శ్లో॥ పరద్రవ్యేష్వభిధ్యానం మనసా ఽనిష్ట చింతనమ్।
వితథా ఽభినివేశశ్చ త్రివిధం కర్మ మానసమ్॥

భా॥ పరద్రవ్యమును కోరుట బ్రహ్మహత్యాదులను చేయగోరుట దేహమే ఆత్మయని దానియందభిమానముంచుట ఈ మూడును మానసిక పాపములు

శ్లో॥ పారుష్య మనృతంచైవ పైశున్యం చాపి సర్వశః।
అసంబద్ధ ప్రలాపశ్చ వాఙ్మయం స్యాచ్చతుర్విధమ్॥

భా॥ అప్రియములు పల్కుట అసత్యమును చెప్పుట దోషారోపణము చేయుట వ్యర్థ ప్రసంగము చేయుట ఈ నాల్గును వాచికపాపములు

శ్లో॥ అదత్తానా ముపాదానం హింసాచై వావిధానతః।
పరదారోపసేవాచ శారీరం త్రివిధం స్మృతమ్॥

భా॥ పరులద్రవ్యమును అన్యాయముగ తీసికొనుట విధి విధాన రహితమైన జీవహింస చేయుట పరదారగమనము చేయుట ఇవి మూడును కాయికపాపములు ఇట్టి త్రివిధ పాపముల నుండి విముక్తుడగుటకు కాశీవాసము అంతర్ గృహయాత్రాదులే శరణ్యము

శ్లో॥ సంవత్సరం వసంస్తత్ర జితక్రోధో జితేంద్రియః॥
అపరస్య విపుష్టాంగః పరాన్న పరివర్జకః॥
పరాపవాద రహితః కించిద్దాన పరాయణః॥
సమా సహస్రమన్యత్ర తేన తప్తం మహత్తపః॥

భా॥ కాశీయందు ఒక్క సంవత్సరకాలము జితక్రోధుడుగను జితేంద్రియుడుగను పరధనముచే పోషింపబడని శరీరము గలవాడుగను పరాన్నభుక్‌గా కుండగను నుండి పరనిందారహితుడై స్వల్పముగానైనను దానపరాయణుడుగ నుండునట్టి వాడు వేల కొలది సంవత్సరములు అన్యత్ర మహాతపము చేసినట్టి వానికి లభించునంతటి పుణ్యఫలితమును పొందును

బ్రహ్మవైవర్తే -

శ్లో॥ అహోరాత్రం స్థితం యే తు పుణ్యసంభార సంతతిః॥
తేషాం ప్రవర్ధతే నిత్యం మాస సంవత్సర క్రమైః॥

భా॥ ఒక్క అహోరాత్రము కాశీయందు నివసించిన వానికి ఎట్టి పుణ్యరాశి సమకూరునో అట్టిది మాస సంవత్సర క్రమమున నివసించిన వారికి అదే క్రమమున బహుగుణితమగు చుండును

14) అథ క్షేత్ర సంన్యాసః బ్రహ్మవైవర్తే

శ్లో॥ ఆనందాఖ్యే కాననే యే వసన్తి క్షేత్రన్యాసం సంవిధాయాత్ర పుత్ర॥
తై ర్వస్తవ్యం రుద్ర రూపైర్హి యత్నాద్యతో రుద్రో ధర్మపాలః ప్రసిద్ధః॥

భా॥ ఓ పుత్రా! ఆనందకాననమగు కాశీయందు క్షేత్ర సంన్యాసమును విధించుకొని అచట నివసించుటకు నిశ్చయించుకొనినవారు ప్రయత్న పూర్వకముగ ప్రసిద్ధుడైన రుద్రపాలరూపముతో నివసింపవలెను

తథా- శ్లో॥ అనేక జన్మను సత్సాధనై ర్జ్ఞాన ముత్తమమ్॥
ప్రాప్నువంతి తదేకేన జన్మనా సాధువాసినః॥

భా॥ అన్యత్ర అనేక జన్మలయందలి తీవ్ర సాధనలచే ఎట్టి ఉత్తమ జ్ఞానమును పొందుదురో అట్టి జ్ఞానము కాశీయందు సాధువాసముచేసినచో ఒక్క జన్మయందే పొందుదురు

శ్లో॥ అవిముక్తం సమాసాద్య న త్యజే న్మోక్ష కాముకః॥
క్షేత్రన్యాసం దృఢం కృత్వా వసేద్ధర్మ పరః సదా॥

అవిముక్త క్షేత్రమును ప్రవేశించిన మోక్షార్థిక్షేత్రన్యాసమును త్యజించగూడదు దృఢచిత్తముతో క్షేత్రన్యాసమును విధించుకొని సదాధర్మ పరాయణుడై నివసించవలెను

శ్లో॥ యథా పతివ్రతా నారీ భర్తార మనుగచ్ఛతి॥
తథాఽస్య హస్తమాలంబ్య కాశీమనుగతో భవేత్॥

భా  పతివ్రత యగు నారి భర్తను అనుసరించినట్లే అట్టి వాని హస్తము కాలంఎనముగ జేసికొని కాశిని చేరి అచట నివసించవలెను

తథా  శ్లో॥ వారాణసీం సమాసాద్య యో బహిర్గన్తు మిచ్ఛతి।
తదన్నం వర్జయేద్ధీమాం శ్చాండాలస్యాన్నవత్సదా॥

భా  ఎవడు కాశియందు వ్యాసమును విధించుకొనియు బహిరమునము చేయుగోరునో అట్టివాని యన్నమును చండాలుని యన్నమువలె ధీమంతులు వర్జించవలెను

శ్లో॥  మోహేనాఽపి బహిర్గన్తు మనుజ్ఞాం యః ప్రయచ్ఛతి।
రౌరవాదిషు ఘోరేషు నరకేషు పతత్యథ॥

భా  క్షేత్ర సంన్యాసము (సమ్యక్ + న్యాసము) చేసియు మోహభ్రాంతుండై ఎవడు తన్నుతాను బహిర్గమనమునకు అనుమతించుకొనునో అట్టివాడు తదనంతరము రౌరవాది ఘోర నరకములందుపడి దుఃఖించును

తథా  శ్లో॥ యస్యాః ప్రసాదాదన్యాస్తు పుర్యో మోక్షం వితన్వతే।
తాం కాశీం కో న సేవేత మోక్షార్థీ సర్వథా శుభామ్॥

భా  ఏ కాశి యనుగ్రహము వలన ఇతర పురములు గూడ పరంపరయా మోక్షము నీయగలుచున్నవో అట్టి శుభప్రదమగు కాశి క్షేత్రమును మోక్షార్థి యగు పురుషుడు ఎల సెవించకుండును?

తథా  శ్లో॥ న స్తి పాపా న హి  కాశికాయాం వసన్తి యేద్యత్ర స్మృతిర్నజాయతే।
స్మృతిశ్చవేచ్చేన్నహి యాతనాక్షయః క్షయే భవేన్మోక్ష సుఖేతు ధిక్కృతః॥

భా  కాశియందు నివసించు వారికి పాపములుండవు పాపములున్నచో కాశీ స్మృతి ఉండదు అట్టి వానికి స్మృతి గలిగినను యాతనాక్షయము గాదు యాతనా క్షయమైనను మోక్షసుఖము ధిక్కరించబడును అనగా కాశీనివాసము చే పాపములుండవు పాపములు నివారణయైనప్పుడే కాశీ స్మృతి గల్గును కాశీ స్మృతి చేతనే యాతనాక్షయమగును యాతనాక్షయము చేతనే మోక్షసుఖము చేకూరునని భావము

తథా- శ్లో॥ తీర్థాని కృత్వా కాశ్యాంతు వసేన్నిర్వ్యాకులః సదా।
న తు కాశ్యాః ప్రగన్తవ్యమ్ తీర్థాన్యత్ర వసన్తి యత్॥

భా  ఇతర తీర్థములు సేవించి పిదప వ్యాకుల రహితుడై సదా కాశీవాసము చేయవలెను ఎందుచేతననగా కాశియందు కొంతకాలముండి తరువాత కాశిని వదలి తీర్థములకు వెళ్లరాదు అట్లు వెళ్లుట నిష్ప్రయోజనమని భావము

సేతు. సూతసంహితాయాం -

వసేషు వర్షేషు కలావపాయ స్త్వాసాద్య కాశీం శివరాజధానీమ్।
లింగం ప్రతిష్ఠాప్య వరం స్వనామ్నా వసేత్సదా విష్ణుశైర్ఘ కోఽపి॥

భా॥ కలియుగమందు మోక్షసాధనములన్నియు నష్టమైనను శివరాజధానియగు కాశిని పొంది అచ్చట స్వనామాంకితముగ లింగమును ప్రతిష్ఠించి యెన్ని విఘ్నములు వచ్చినను అచ్చటనే నివసించవలెను

*కాశీఖండే – శ్లో॥ జ్ఞాత్వా క్షేత్రస్య మాహాత్మ్యం యో వసేత్కృతనిశ్చయః॥*

*తం తారయతి విశ్వేశో జీవన్తం త్యక్తవాన్మృతమ్॥*

భా॥ కాశీక్షేత్ర మాహాత్మ్యమును బాగుగా తెలిసికొని ఎవడు కృత నిశ్చయముతో అచట నివసించునో అట్టివానిని విశ్వేశ్వరుడు జీవన్ముక్తునిగా గాని మృతినొందిన పిదపగాని తరింపచేయును

*తథా శ్లో॥ జన్మాంతర సహస్రైస్తు యత్పుణ్యం సముపార్జితమ్।*

*తత్పుణ్యపరివర్తేన కాశ్యాం వాసోఽత్ర లభ్యతే॥*

భా॥ పూర్వజన్మ సహస్రములందు సముపార్జించబడిన పుణ్యఫలితముగా కాశీవాసము లభించును

*తథా– శ్లో॥ కాశీ ద్విజాశీర్భిరహో యదాప్తా కష్టం ముముక్షుర్యదివాఽముముక్షుః॥*

*గ్రాసం కరస్థం సంవిసృజ్య హృద్యం క్వకూర్పరం లేఢి విమూఢచేతాః॥*

భా॥ బ్రాహ్మణాశీర్వాద ఫలితంగా కాశీవాసము పొందగలిగిన మోక్షార్థియగు నట్టివాడు అట్టి మోక్షమును విరసించి కాశిని వదలి వెళ్లగోరరాదు అట్టి వివేకహీనుడు తన అఱచేతియందున్న హృద్యమగు గ్రాసమును (తిండిని) విడిచిపెట్టి మూర్ఖుడై తన మోచేతిని నాకికొనునట్టివాడే సుమా!

ఇత్యాదిపంచమేఽధ్యాయే

*తథా శ్లో॥ సా సదం సంపదం జ్ఞాత్వా సాపాయం కాయముచ్చకైః॥*

*చపలాచపలం చాఽఽయుర్మత్వా కాశీసమాశ్రయేత్॥*

భా॥ సంపదలు అపస్కరములనియు శరీరము అధికమైన అపాయమునకు ఆకరమనియు ఆయుష్యము మెఱుపుతీగవలె చపలమైనదనియు గ్రహించి కాశిని సమాశ్రయించవలెను

*తథా– శ్లో॥ య స్తత్ర నివసేద్విప్ర! సంయతాత్మా సమాహితః॥*

*త్రికాలమపి భుంజానో వాయుభక్షసమో భవేత్॥*

భా॥ ఓ విప్రా! నియతాత్ములై సమాహిత చిత్తులై ఎవరు కాశియందు నివసింతురో అట్టివారు త్రికాలములందును భుజించువారైనను వాయు భక్షణము దీక్షగా గల వారితో సమానులగుదురు

*శ్లో॥ అద్య ప్రాతః పరశ్వోవా మరణం ప్రాప్యమేవచ।*

*యావత్కాల విలంబోఽస్తు తావత్కాశీం సమాశ్రయేత్॥*

భా॥ అట్లే ఇచ్చట కాశియందు నేటి ప్రాతః కాలమందైనను మరునాడైనను మరణము సంభవించుట కెంతకాలము విలంబమగునో అంతపర్యంతము కాశీవాసము చేయవలెను

*కౌర్మే శ్లో॥ మోక్షం సుదుర్లభం మత్వా సంసారంచాతి భీషణమ్।*

*అశ్మనా చరణౌ హత్వా వారాణస్యాం వసేన్నరః॥*

భా॥ మోక్షము మిక్కిలి దుర్లభమైనదనియు సంసారము అతిభీషణమైనదనియు గ్రహించి రాతిచే పాదములను చితుక కొట్టుకొని యైనను(ఇతర చోట్లకు పోకుండ తన గమనశక్తిని క్షీణింపచేసికొని) కాశీయందే నివసించవలెను

తథా- శ్లో॥ కృత్వా వై నైష్ఠికం దీక్షా మవిముక్తే వసన్తి యే।
తేషాం తత్పరం దానం దదామ్యన్తే పరంపదమ్॥

భా॥ అట్టి యావజ్జీవము కాశీ విడిచి వెళ్లనని దీక్షవహించి ఎవరు కాశీయందు ఆమరణాంతము నివసింతురో అట్టివారికి దానములలో అతిశ్రేష్ఠమైన పరమపదమును నేను ఇచ్చెదనని శివుని ప్రతిజ్ఞ.

కాశీఖండే - శ్లో॥ వరం వారాణసీవాసీ జటీ ముండీ దిగంబరః।
నాన్యత్రచ్ఛత్ర సంఛన్న సమథామండలేశ్వరః॥

భా॥ అన్యత్ర ఏకచ్ఛత్రాధిపతియగు మహారాజుగ నుండుటకంటె కాశీయందు జటాధారిగ గాని ముండిత శిరస్కుడుగగాని లేదా దిగంబరుడగు అవధూతగగాని నివసించుట శ్రేష్ఠము

శ్లో॥ వరం వారాణసీభిక్షా న లక్షాధిపతా ఽన్యతః।
లక్షాధీశో పునర్గర్భం తద్భిక్షాశీ న గర్భభాక్॥

భా॥ అన్యత్ర లక్షాధికారిగ నుండుటకంటె కాశీనగరమందు భిక్షాటనము చేయుచు నివసించుట మేలు ఆ లక్షాధికారి తిరిగి గర్భవాస దుఃఖమునమభవించును కాని కాశీవాసియగు భిక్షుకునకు తిరిగి గర్భవాస దుఃఖము కలుగదు

తథా- శ్లో॥ రుద్రావాసే వసేన్నిత్యం నరో నియత మానసః।
నివసా మప సంభారం కృత్వా కాలాద్విముచ్యతే॥

భా॥ రుద్రావాసమగు కాశీయందు ధృఢచిత్తుడై నివసించువాడు యెంత పాపభారము మోయువాడైనను యముని బారినుండి తప్పించుకొని ముక్తిని పొందును

శ్లో॥ విధాయ క్షేత్ర సంన్యాసం యే వసంతీహ మానవాః।
జీవన్ముక్తాస్తు తే దేవి! తేషాం విఘ్నం హరామ్యహమ్॥

భా॥ ఓ దేవి! క్షేత్ర సంన్యాసమును విధించుకొని ఎవరు కాశీయందు నివసింతురో అట్టివారు జీవన్ముక్తులు వారి యొక్క మోక్షపథమున గల్గు యన్ని విఘ్నములను నేను హరింతును

తథా- శ్లో॥ స సర్వతీర్థసుస్నాతః స సర్వక్రతు దీక్షితః।
స దత్త సర్వదానస్తు కాశీ యేన నిషేవితా॥

భా॥ కాశీయందు నివసించు వానికి సర్వతీర్థముల యందు స్నానము చేసిన ఫలితమును సర్వ విధమైన యజ్ఞములు చేసిన ఫలితమును సమస్త దానములు చేసిన సుకృతమును ప్రాప్తించును

శ్లో॥ కలిః కాలః కృతంకర్మ త్రికంటకమిలితమ్।
ఏతత్త్రయం న ప్రభవే దానందవనవాసినామ్॥

భా॥ కలి దోషము యమదండనము సంచితకర్మ ఈ మూడును త్రికంటకములనబడును ఆనంద కాననమున నివసించు వారికి ఈ మూడు కంటకములు బాధింపనేరవు (త్రికంటక విరాజితే అని కాశీ సంకల్పము)

వచనము వనాంతర వదానందవనే కంటకవత్ దుఃఖదాయీదం త్రయం నాస్తీత్యర్థః॥

భా॥ క్షేత్రాంతరముల యందు కంటకముల వలె దుఃఖదాయకమగు ఈ త్రయము ఆనందవనమున ఉండనేరదని యర్థము

శ్లో॥ *కః ప్రాప్య కాశీం దుర్మేధాః పునస్త్యక్తు మిహేహతే।*
*అనేక జన్మజనిత కర్మనిర్మూలన క్షమామ్ ॥ఇత్యాదిః*

భా॥ అనేక జన్మలయందు గలిగిన కర్మలను (సంచితము) నిర్మూలనము చేయుట యందు సమర్థమైన కాశిని ఒక్క పర్యాయము చేరిన పిదప తిరిగి దానిని వదలిపెట్టగోరెడు మూర్ఖుడెవడును ఉండడు

మాత్స్యే — శ్లో॥ *ఆదేహపతనాద్యావత్తత్ క్షేత్రం యో న ముంచతి।*
*బ్రహ్మచర్యవ్రతః సమ్యక్సమ్యగిష్టం మఖైర్భవేత్॥*

భా॥ కాశిని చేరి దేహపతనమువరకు బ్రహ్మచర్య వ్రతమును పాటించుచు ఎవరు కాశిని విడువకుండ యుందురో అట్టి వారికి అనేక యజ్ఞములు చేసిన ఫలితము గల్గును

శ్లో॥ *సదా యజతి యజ్ఞేన సదాదానం ప్రయచ్ఛతి।*
*సదా తపస్వీ భవతి హ్యవిముక్తే స్థితో నరః॥*

భా॥ అవిముక్త క్షేత్రమును స్థిరముగ నివసించు మనుష్యుడు సదాయజ్ఞములు చేసిన వాడును సదా దానధర్మములు చేసినవాడును నిరంతరముగ తపస్సు చేసినవాడును అగును

బ్రహ్మవైవర్తే — శ్లో॥ *యస్తు కాశ్యాం వసేజ్జన్తుః సర్వవ్యాపారకృన్నరః।*
*తస్యాపి యా గతిః ప్రోక్తా న సా యజ్ఞైర్న చాన్యతః॥*

భా॥ కాశీయందు నివసించుచు సర్వవ్యాపారములు చేసి కొనుచున్నను అట్టివాడు పొందు సద్గతి యజ్ఞములచే గాని ఇతరోపాయములచే గాని కాశీకి బయటనున్నవారికి గలుగదు

పాద్మే — శ్లో॥ *సన్త్యనేకాని తీర్థాని పృథివ్యాం మునిసత్తమ।*
*తథాపి జన్తునా కాశీ సేవ్యా సర్వప్రయత్నతః॥*

భా॥ ఓ మునిసత్తమా! ఈ పృథివియందు అనేకానేక తీర్థములున్నవి. అట్లైనను సర్వప్రాణులకు సర్వ ప్రయత్నములచేతను కాశీసేవ్యమైనది.

లైంగే — శ్లో॥ *అవిముక్తం నిషేవేత సంసార భయ మోచనమ్।*
*భోగమోక్షప్రదం దివ్యం జన్మ పాప వినాశనమ్॥*

భా॥ సంసారభయమును పోగొట్టునట్టిది భోగమోక్షప్రదమైనట్టిది జన్మపాప వినాశకరమైనట్టిదియునగు అవిముక్త క్షేత్రమును సేవించవలెను.

శ్లో॥ విఘ్నై రాలోడ్యమానో௨పి యో௨విముక్తం న ముంచతి।
న ముంచతి జరాం మృత్యుం జన్మచైతదశాశ్వతమ్॥

భా॥ అనేక విఘ్నములు సంభవించినను ఎవరు అవిముక్త క్షేత్రమును విడువకుందురో అటువంటి వారికి జరామృత్యు భయము పునర్జన్మ భయము ఉండవు.

శ్లో॥ న సా గతిః కురుక్షేత్రే గంగాద్వారే న పుష్కరే।
యాగతిర్విహితా పుంసా మవిముక్త నివాసినామ్॥

భా॥ అవిముక్తక్షేత్రమున నివసించు వారికి కలుగునట్టి సద్గతి కురుక్షేత్రమందు గాని గంగా ద్వారమందుగాని పుష్కర క్షేత్రమందుగాని నివసించు వారికి లభించదు

శ్లో॥ అవిముక్తే స్థితా నిత్యం పాంసుభి ర్వాయునేరితైః।
స్పృష్టా దుష్కృతకర్మాణో యాన్త్యపి పరమాం గతిమ్
అవిముక్తే వసేద్యస్తు మనుతుల్యో భవేన్నరః॥

భా॥ అనేక దుష్కర్మలు చేసిన వారైనను కాశీయందు నివసించుచున్నను లేక కాశీనుండి వాయువుచే ఎగురగొట్టబడగా వచ్చిపడిన ధూళిచే స్పృశించబడినను పరమగతిని పొందుదురు అవిముక్త క్షేత్రమందు నివసించువాడు మనువుతో సమానుడగును

తథా— శ్లో॥ కాశ్యాం యోగో న దుష్ప్రాపః కాశ్యాం ముక్తిర్నదుర్లభా
తతో௨నిశం నిషేవేత కాశీం మోక్షార్థయే నరః॥

భా॥ కాశీయందు యోగము సిద్ధించుట దుర్లభము గాదు కాశీయందు ముక్తి దుర్లభము గాదు అందుచేత మోక్షార్థి సదాకాశిని సేవించవలెను

మాత్స్యే— శ్లో॥ ఆదేహపతనాద్యావత్ క్షేత్రం యో న విముంచతి।
న కేవలం బ్రహ్మహత్యా ప్రాకృతశ్చ నివర్తతే॥ (ప్రాకృతః=సంసారః)

భా॥ దేహపతనము జరుగువరకు ఎవరు కాశిని విడువకుండ యుందురో అట్టివారికి కేవలము బ్రహ్మ హత్యాది పాపములు నశించుటే గాక సంసార భయము (జనన మరణ పరంపర) ను నశించును

శ్లో॥ అవిముక్తం న సేవంతే మూఢా యే తామసా నరాః॥
విణ్మూత్రరేతసాం మధ్యే తే వసన్తి పునః పునః॥

భా॥ ఎవరు మూఢమతులై తామసబుద్ధితో అవిముక్తమగు కాశీక్షేత్రనివాసము చేయరో అట్టివారు చిరకాలము మూత్రపురీష రేతస్సులయందు మగ్నులైయుందురు అనగా మాటిమాటికి గర్భవాస దుఃఖము ననుభవింతురని భావము (పురాకర్మవశాత్ మూత్రపురీష మధ్యేవసంతి అని శ్రీశంకరులు)

శ్లో॥ అదౌ కర్మప్రసంగాత్ కలయతి కలుషం మాతృకుక్షౌ స్థితం మాం
విణ్మూత్రామేధ్యమధ్యే క్వథయతి నితరాం జాఠరో జాతవేదాః,

యద్యన్మే తత్ర దుఃఖం వ్యథయతి నితరాం శక్యతే కేన వక్తుమ్
క్షంతవ్యో మే ఽపరాధశ్శివశివ శివ భో శ్రీమహాదేవ శంభో॥

భా॥ తొలుత కర్మవశమున తల్లిగర్భమున నున్నప్పుడే నన్ను పాపములంటుకొన్నవి ఎదప విణ్మూత్రామేధ్యముల నడుమ జఠరమునందలి అగ్ని నన్ను తపింప జేసెను ఆయాసమయములలో ఎట్టి దుఃఖము ఎంతగా బాధించెనో చెప్పుటకు సాధ్యము గాదు శ్రీమహాదేవా! శంభూ! శివశివా! నాయీ అపరాధమును క్షమింపుము (శివాపరాధ క్షమాపణ స్తోత్రమ్))

శ్లో॥ అవిముక్తం యదా గచ్ఛే త్కదాచిత్కాల పర్యయాత్।
అశ్మనా చరణౌ హత్వా తత్రైవ నిధనం వ్రజేత్॥

భా॥ కాలము అనుకూలించినప్పుడు అవిముక్త క్షేత్రమును చేరి నివసించువారు కాలవిపర్యయము సంభవించినను కాశిని విడిచిపోరాదు రాతిచే కాళ్లను విరుగగొట్టుకొనియైనను అచటనే నివసించి చివరకు కాశీమరణమును సంప్రాప్తించుకొనవలెను

శ్లో॥ అవిముక్తం ప్రవిష్టస్తు యది గచ్ఛేత్తతః పునః
తదా హసన్తి భూతాని అన్యోన్య కరతాడనైః॥

భా॥ కాశిని చేరి అచట స్థిరనివాసము చేయక బయటకు పోవు వానిని జూచి భూతములు అన్యోన్యము చప్పట్లు చఱచుచు పరిహసించును

తథా శ్లో॥ కామక్రోధేన లోభేన గ్రస్తా యే భువి మానవాః
నిష్క్రామంతే నరా దేవి! దండనాయక మోహితాః॥

భా॥ ఓ దేవీ! దండనాయకుని మాయచే మోహితులై నరులు కామ క్రోధ లోభములచే ప్రభావితులై కాశిని విడిచిపోవుదురు (సంభ్రమ విభ్రమములు దండపాణి పరివర్తనులు)

లైంగే- శ్లో॥ విదిత్వా భంగురం లోకం య ఽస్మి న్వత్స్యన్తిమత్పురే।
అంతకాలేఽపి వత్స్యన్తి తేషాం భవతి మోక్షదమ్॥

భా॥ ఎవరు ఈ లోకమును అశాశ్వతమని తెలిసికొని నా పురియగు కాశీయందు నివసింతురో అట్టివారు ప్రళయ కాలమందును ఉన్నట్టివారు అగుదురు వారికి కాశీవాసము మోక్షప్రదమగుచు

శ్లో॥ శ్రుత్వా కలియుగం ఘోరమల్పాయుష మధార్మికమ్।
సిద్ధక్షేత్రం న సేవన్తే జాయన్తే చ మ్రియన్తి చ॥

భా॥ కలియుగము ఘోరమని అల్పాయుష్షును కల్గించునట్టిది యని అధార్మికమని తెలిసికొనక సిద్ధ క్షేత్రమగు కాశిని ఎవరు సేవింపరో అట్టివారు మరల మరల పుట్టి చనిపోవుచుందురు

మాత్స్యే - శ్లో॥ అనన్యమానసో భూత్వా యోఽవిముక్తం న ముంచతి।
తస్య దేవః సదా తుష్టః సర్వాన్కామాన్ప్రయచ్ఛతి॥

భా॥ ధృఢచిత్తముతో అవిముక్త క్షేత్రమును విడువక సేవించువారి పట్ల మహాదేవుడు తుష్టినొందినవాడై వారికోరికల నన్నింటిని నెఱవేర్చును

బ్రహ్మపురాణే  శ్లో॥ ఆదేహపతనాద్యే తు క్షేత్రం సేవన్తి మానవాః॥
తే మృతా హంసయానేన దివ్యం యాన్త్యకుతోభయాః॥

(దివ్యం దేవస్థానం। అత్ర క్షేత్రపదోపాదానాత్ క్షేత్రమాత్ర మృత విషయమేత న్మోక్షఫలా శ్రవణాత్)

భా॥ దేహపతనము వరకు కాశీ క్షేత్రమును సేవించినట్టి మానవులచటనే మృతినొంది ఎదవ హంసయానమున దివ్యలోకములకు భయరహితులై పోవుదురు (దివ్యమనగా దేవస్థానము క్షేత్రమనుటచే క్షేత్రమందు మృతినొందిన వారికి మోక్షఫలము సిద్ధించునని భావము)

పాద్మే  శ్లో॥ కాశ్యాం తిష్ఠన్తి యే తేవిత్రాన్పశ్యంతి సురోత్తమాః॥
చతుర్భుజాం స్త్రినయనా న్గంగోద్భాసిత మూర్ధజాన్॥

(మరణానంతరం సారూప్యప్రాప్త్యా జీవద్దశాయామేవ వా క్షేత్ర మాహాత్మ్యా దేవం పశ్యన్తి త్యర్థః)

భా॥ కాశీయందు స్థిరముగ నివసించు వారిని దేవతలందరు చతుర్భుజులగు విష్ణురూపులుగను జటాధారి త్రినేత్రుడునగు శివరూపులుగను చూచెదరు (అట్టివారు మరణానంతరము ప్రాప్తించు సారూప్య ముక్తి దృష్ట్యా జీవద్దశయందే క్షేత్ర మాహాత్మ్యము వలన అట్టి రూపముతో కన్పింతురని అర్థము)

శ్లో॥  అవిముక్తే తు యస్తిష్ఠే దాకళేబర పాతనాత్।
తం విశ్వేశో ఽత్ర జీవన్తం మృతంచ పరిరక్షతి॥

భా॥ అవిముక్త క్షేత్రమున స్థిరవాసము గలిగిన వారిని దేహపతనము వరకును అనగా వారు జీవించి యున్నంత కాలము మరియు మృతులైన ఎమ్మటను గూడ విశ్వేశ్వరుడు పరిరక్షించును

లైంగే  శ్లో॥ అవిముక్తం సమాసాద్య నాన్యంగచ్ఛే త్తపోవనమ్।
సర్వాత్మనా తవః సత్యం ప్రాణినాం నాత్ర సంశయః॥

భా॥ అవిముక్త క్షేత్రమును పొందినట్టివాడు ఇతర తపోవనమును గూర్చి వెళ్లరాదు ఇచ్చటి ప్రాణులయొక్క తపస్సు సత్యముగా సంపూర్ణము ఫలించును ఇందుకు సంశయము లేదు

తథా  శ్లో॥ అష్టౌ మాసాన్విహారః స్యాద్యతీనాం సంయతాత్మనామ్।
ఏకత్ర చతురోమాసా నబ్దం వా న వసేత్పునః॥
అవిముక్తే ప్రవిష్టస్య విహారస్తు న విద్యతే।
న దోషోఽపి భవేత్తస్య దృష్టం శాస్త్రే పురాతనే॥

భా॥ అట్లే సంయుతాత్ములగు యతులకు ఎనిమిది నెలలు వివిధ ప్రదేశములందు విహారము లుండును ఒకేచోట నాలుగు మాసములుగాని పూర్తిగ ఒక సంవత్సరము గాని నివసించరాదు కాని అవిముక్త క్షేత్రమును ప్రవేశించిన యతికి విహారము విధింపబడలేదు అది పురాతన శాస్త్ర సమ్మతమగుటచే అట్టివానికి దోషము లేదు

(కాశీయందు నివసించువారు శరీర నిర్వహణాది చింతలయందు నిమగ్నులు గారాదు యను విషయము కాశీఖండమందిట్లు చెప్పబడినది)

*కాశీఖండే*

*శ్లో॥ సర్వార్థానామత్ర దాత్రీ భవానీ సర్వాన్కామాన్పూరయే ద్యత్రఢుంఢిః॥*
*సర్వాన్తంతూ న్మోచయే దన్తకాలే విశ్వేశో ఽత్ర శ్రోత్ర మన్త్రోపదేశాత్॥*

భా॥ కాశీయందు భవాని సర్వార్థములను నెరవేర్చునట్టిది. ఇచ్చట ఢుంఢిగణపతి సర్వకామములను పూరించువాడు ఇచ్చట నివసించు ప్రాణులందరను విశ్వేశ్వరుడు మరణ కాలమున కుడిచెవియందు తారకమంత్రోపదేశము చేసి ముక్తి నొందించును

లైంగే *శ్లో॥ కేవలా జాహ్నవీ విప్రా! జ్ఞాతాఽ భవాపునః॥*
*అపవర్గం వితరతి స్వతో యే త్యక్త దేహినః॥*
*యస్యాకస్యాపి జన్తోర్భాగీరథ్యాం గతాయుషః*
*న దుర్లభో బ్రహ్మభావ స్తత్పంగ క్షపితాంహసః॥*

భా॥ ఓ మునులారా! కాశీయందునివసించు వారై తెలిసిగాని తెలియకగాని ఇచటనే శరీర త్యాగము చేయువారిని గంగానదియే ముక్తి పొందునట్లు చేయును గంగానదియందు మరణము పొందునట్టి వారు ఎట్టివారైనను గంగానది స్పర్శచే అట్టివారి పాపములన్నియు నశించి బ్రహ్మ భావమును పొందుట సుసాధ్యము

*శ్లో॥ చిదానందమయం బ్రహ్మ గంగా భావముపాగతమ్।*
*బ్రవీమి సత్యమేవైతన్మా ఽత్ర వః సంశయో భవేత్॥*

భా॥ చిదానందమయమగు బ్రహ్మయే గంగాభావము పొందినది యనుట సత్యమని చెప్పుచున్నాను ఈ విషయములో మీరు సంశయింపవలసిన పని లేదు

*శ్లో॥ ఏవం ప్రభావా నిర్వాణ శేయరాశివహా నదీ।*
*భాగీరథీ విలసతి క్షేత్రే శంభో ర్విముక్తిదే॥*

భా॥ ముక్తి ప్రదమగునట్టి ఈ ఈశ్వరం క్షేత్రమున గంగానది ఇటువంటి ప్రభావము గలదియై మోక్షసముద్రమును వహించునట్టిదియై విలసిల్లుచున్నది

*శ్లో॥ ఏకైక మపి విప్రేన్ద్రాః సాక్షాద్బ్రహ్మాప్తిసాధనమ్।*
*న చిత్రమత్ర ద్వితయం యన్నిర్వాణాయ కల్పతే॥*

భా॥ ఓ విప్రశ్రేష్ఠులారా! సాక్షాత్ బ్రహ్మానందప్రాప్తి సాధనము ఒక్కటియున్నను శ్రేష్ఠమే కాని ఇచ్చట కాశీక్షేత్రము గంగానది యను నీ రెండును మోక్షప్రదములై యుండుటలో చిత్రమేమియు లేదు

*శ్లో॥ శిశవేఽపి ప్రథితస్య పాపకర్మ రతస్యవః*
*యద్యస్థిఖండం గంగాయాం నిపతే ద్దైవ యోగతః॥*

*తదా సంక్షీణపాపః సన్ దివ్యభోగ సమన్వితః॥*
*షష్టిర్వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే॥*

భా॥ జనవివాస యోగ్యముగాని ప్రదేశమందు నివసించుచు భయభీతుడగు వాని యొక్క గాని పాపకర్మాసక్తుడగునట్టి వాని యొక్కగాని ఒక్క ఎముక ముక్కయైనను దైవ యోగముచే గంగయందు నిమజ్జనమై యున్నచో అట్టివాడు తత్క్షణమే పాపము నశించిన వాడై దివ్యభోగములననుభవించుచు అరువదివేల సంవత్సరములు స్వర్గలోకమందు నివసించును

శ్లో॥ *ఈదృశీ స్వర్గనదీ యత్ర సర్వతీర్థ సమన్వితా*
*తాం కాశీం కో న సేవేత భీమ సంసారముక్తయే॥*

భా॥ ఇటువంటి దేవనదియగు గంగ సర్వతీర్థములతోను గూడుకొనినదియై ప్రవహించుచుండగా అట్టి కాశిని ఘోరసంసార సాగరమును తరించుటకై ఎవరు సేవింపకుందురు?

కౌర్మే - శ్లో॥ *తస్మా న్ముముక్షు ర్నియతో వసే దామరణాన్తికమ్॥*
*వారాణస్యాం మహాదేవాత్ జ్ఞానం లబ్ధ్వా విముచ్యతే॥*

భా॥ అకారణము చేత ముముక్షువైన వాడు మరణ పర్యంతము కాశీయందు నియతముగ నివసించి యుండవలెను అంతమున మహాదేవుని వలన జ్ఞానమును పొంది ముక్తి నొందగల్గును

శ్లో॥ *వసే దామరణా ద్విప్రో వారాణస్యాం సమాహితః॥*
*సోఽపీశ్వర ప్రసాదేన యాతి తత్పరమం పదమ్॥*

భా॥ దేహపతనము వరకు జ్ఞానియైన వాడు వారాణసి యందు నియమముతో నుండవలెను అట్లున్నవాడు ఈశ్వరానుగ్రహముచే పరమపదమును పొందును

శ్లో॥ *సంప్రాప్య కాశీం శివరాజధానీం కిం యాసి రే మూఢ దిగన్తరాణి।*
*విధానకుంభం చరణేన హత్వా చాండాలసేవాం ప్రకరోషి నిత్యమ్॥*

భా॥ మూఢుడైనవాడు శివరాజధానియగు కాశిని చేరియు దిగంతరములకు పోవుటకు సమకట్టును అట్టివాడు నిక్షేపముగల కుండను కాలదన్ని, నిత్యము చండాల సేవ చేయుటకు యత్నించినట్టి వాడే సుమా!

*శివపురాణే:*

శ్లో॥ *దేవోదేవీ నదీగంగా మృష్టమన్నం శుభాగతిః॥*
*వారాణస్యాం విశాలాక్షి వాసః కస్య న రోచతే॥*

భా॥ మహాదేవుడు విశ్వేశ్వరుడు దేవియగు అన్నపూర్ణ పుణ్యనదియగు గంగ యుండి నిత్యము శుభకరమైన మృష్టాన్నము లభించునట్టి విశాలాక్షి నివాసమగు కాశీవాసమును ఎవరు కోరకుందురు?

వచనము యదిస్వయం కాశీవాసం కర్తుం న శక్నోతి తదా బ్రాహ్మణం వాసయేత్ తదుక్తం పాద్మే

భా॥ ఒకవేళ తాను కాశీవాసము చేయలేకపోయినచో తన పక్షమున ఒక బ్రాహ్మణుని పంపి కాశీవాసము చేయించవచ్చును ఇదే విషయము పద్మపురాణమున నిట్లు చెప్పబడినది

శ్లో॥ కాశీవాసం కర్తుకామో యది స్యాద్దూరతోఽపి బ్రాహ్మణం ధర్మనిష్ఠమ్।
తదా వాసవస్త్ర భోజ్యాది దత్వా శ్రద్ధాయుక్తః సర్వదా వాసయీత॥
వారాణస్యాం వాసయన్బ్రాహ్మణాగ్ర్యం ద్వయోశ్ఛిత్వా ఛిన్నసంసారబంధమ్।
తస్మాత్తత్ర స్థాపనీయాః ప్రయత్నాద్విప్రా రాజన్ దూరగేణాపి ముక్త్యై॥

భా॥ ఓరాజా! కాశీవాసము చేయగోరి మిక్కిలి దూరమందున్నవాడగుటచే అసమర్థుడగునట్టివాడు ధర్మనిష్ఠుడగు బ్రాహ్మణుని వస్త్ర భోజ్యాది సంభారము లిచ్చి, శ్రద్ధాయుక్తుడై నిత్యము కాశీవాసము చేయించ వలెను అట్లు పూజ్యుడైన బ్రాహ్మణుని కాశీయందు కాశీవాసము చేయించినచో వారిద్దరును (కాశీవాసము చేయించిన వారు కాశీ వాసము చేసినవారు) సంసార బంధమును త్రెంచుకొని ముక్తులగుదురు అందుచేత కాశికి సుదూరమందున్న వారైనను కాశీవాస ఫలమగు ముక్తిని గోరినచో ప్రయత్న పూర్వకముగ విప్రులను కాశీయందు నివసింప జేయవలెను

కాశీఖండే శ్లో॥ స్వయం వస్తుమశక్తోఽపి వాసయే త్తీర్థవాసినమ్।
అప్యేక మపి మూల్యేన న వస్తుః ఫలభాగ్ ధ్రువమ్॥

భా॥ తాను స్వయముగా కాశికి వెళ్లలేకున్నను తీర్థవాసులను కాశికి పంపి నివసింప జేయవలెను దానిచే ఒకే వెలకు రెండు వస్తువులు లభించినట్లుగ అతడును నిశ్చయముగ కాశీవాస ఫలమును పొందిన వాడగుచున్నాడు

బ్రహ్మవైవర్తే

శ్లో॥ పరం సాహసమాస్థాయ కాశ్యాం స్థేయం ముముక్షుభిః।
సాహసాత్సిద్ధి మాప్నోతి నరో వికల మానసః॥
యైర్యైస్తు రుద్యేజితో జంతుస్త్యజేత్కాశీం సుదుఃఖితః।
తే తే నరకజాలేషు పచ్యన్తే పితృభిః సహ॥

భా॥ సాహసముతో బహు ప్రయత్నము చేసి ముముక్షువులగు వారు కాశీయందుండవలెను ఎవరిచే నైనను బాధింపబడిన నరుడు గాని ప్రాణిగాని మిక్కిలి దుఃఖించుచు కాశిని వదలునో అట్టివారిని బాధలకు గురిచేసిన వారు తమ పితృవర్గముతో గూడ నరకమున బడి బాధల నొందుదురు

(౧౮) అథ కాశీ వాసినో విహిత నిషిద్ధాని –

పాద్మే పాతాళఖండే భృగురువాచ –

శ్లో॥ య త్పృష్టోఽహం మునిశ్రేష్ఠా కథం సేవ్యేత సా పురీ।
వదామి తదహం తత్త్వం శ్రూయతా మవధానతః॥

భా॥ ఓ మునిశ్రేష్ఠులారా! కాశీపురిని యెట్లు సేవించవలెనని మీరు అడిగితిరి గదా! దాని తత్త్వమును నేను చెప్పుచున్నాను శ్రద్ధగా వినవలసినది

శ్లో॥ విహాయ కామమర్థంచ దమ్భం మాత్సర్య మేవచ।
ధర్మమోక్షౌ పురస్కృత్య నిషేవేత విభోః పురీమ్॥

భా॥ ఎవరైనను అర్థకామములయందు లోభమును దంభమును మాత్సర్యమును వదలి కేవలము ధర్మ, మోక్షములయందే ఆసక్తి గలిగి కాశీనగరమును సేవించవలెను

శ్లో॥ ప్రతిగ్రహా దుపావృత్తః శాన్తి దాన్తి సమన్వితః।
శంకర ధ్యాన నిరతో నిషేవేత విభోః పురీమ్॥

భా॥ ప్రతి గ్రహమును వర్జించి శాంతి దాంతి సమన్వితుడై నిరంతరము శంకర ధ్యానముతో కాశీ నగరమును సేవించవలెను

శ్లో॥ అకుర్వ న్నలువం కర్మ సమలోష్టాశ్మ కాంచనః।
పంచాక్షరపరో నిత్యం నిషేవేత విభోః పురీమ్॥

భా॥ పాప కార్యమగు కర్మను ఏమియు చేయకుండ మట్టిగడ్డ బంగారము ఈరెండింటి యందును సమబుద్ధి గలిగిన వాడై నిరంతరము పంచాక్షరీ జపతత్పరుడై కాశిని సేవించవలెను

శ్లో॥ గృహీచే ద్ధర్మనిరతో బహిరర్జిత విత్తభుక్।
వ్యవహారేన యోగ్యేన గృహ్ణన్నా నిమలం వసు॥

భా॥ గృహస్థుడైనచో ధర్మనిరతుడై బయటివారి (ఇతరుల) ధనమును గోరక నిత్యజీవనమునకు వలయునంత మాత్రమే న్యాయమైన ధనమును గ్రహించుచు కాశిని సేవించవలెను

శ్లో॥ ప్రియాతిథిః పార్థవరో నిషేవేత విభోః పురీమ్।
స్వాధ్యాయాధ్యయనే యుక్తో గురు శుశ్రూషణే రతః॥

భా॥ అగ్ని అతిథి అభ్యాగతుల సేవయందు ధనమును వెచ్చించుచు నుండవలెను స్వాధ్యాయమునందు గురుశుశ్రూష యందు నిరతుడై యుండవలెను (స్వశాఖాధ్యయనమును స్వాధ్యాయ మందురు) బ్రహ్మచారి ధర్మపరాయణుడై యుండవలెను (బ్రహ్మణి వేదమునందు చరతీతి బ్రహ్మచారి)

గురుశుశ్రూష చతుర్విధములు 1) ఆప్త శుశ్రూష గురువునందు అనుకూలవృత్తి, 2) అంగశుశ్రూష గురువుయొక్క పాదప్రక్షాళనము మొదలగునవి 3) స్థానశుశ్రూష గురువుయొక్క గృహక్షేత్రారామములను పరిరక్షించుట 4) పద్భావశుశ్రూష గురువే సాక్షాత్పర మేశ్వరుడనెడి విశ్వాసము

శ్లో॥ బ్రహ్మచారీ ధర్మరతో నిషేవేత విభోః పురీమ్।
కైః సేవ్యేతి చ యత్ప్రోక్తం తదహం ప్రబ్రవీమి తే॥

భా॥ బ్రహ్మచారి ధర్మపరాయణుడై కాశిని సేవించవలెను ఇంకను ఎవరెవరిచే కాశీ సేవించబడదగినదో యదిగూడ చెప్పెదను వినుము

శ్లో॥ స్వస్వ జాత్యనుసారేణ యో ధర్మో యస్య కల్పితః।
తత్తద్ధర్మ యుతైరేవ సేవ్యా వారాణసీ పురీ॥

భా॥ ఏయే జాతివారికి ఏయే ధర్మములు గల్పింపబడినవో అట్టిధర్మములను పాటించు వారందరు కాశిని సేవింపదగినవారు

శ్లో॥ అన్యైః సంసేవ్యమానా సా కీకటా న్నాతిరిచ్యతే।
అతో ధర్మపరైరేవ రాగద్వేష వివర్జితైః॥

భా॥ ఇతరులు కాశిని సేవించినచో నరక బాధనుండి దూరులగుదురు అందుచే ధర్మపరులైన వారు రాగ ద్వేషములను వీడి కాశిని సేవించవలెను

శ్లో॥ నిర్వాణమేవ కాంక్షద్భిః శంకరోపాస్తి తత్పరైః।
శ్రయణీయా మునిశ్రేష్ఠా స్తేషాం సాక్షాద్విముక్తిదా॥

భా॥ ఓ మునిశ్రేష్ఠులారా! కేవల ముక్తినే కోరినట్టివారు శంకరోపాసన పరాయణులై సాక్షాత్‌ముక్తి దాయకమగు కాశిని సేవింపవలెను

శ్లో॥ ద్వైపాయనోఽపి దేవేన శంకరేణ ద్విజోత్తమాః।
ద్వేషాకులతయా కాశ్యా బహిరేవ పురా కృతః॥

భా॥ ఓ ద్విజోత్తములారా! సాక్షాత్ ద్వైపాయన మహర్షిగూడ ద్వేషపూరిత చిత్తుడగుట చేతనే భగవానుడగు శంకరునిచే కాశినుండి వెడలగొట్టబడినాడు

బ్రహ్మవైవర్తే -

శ్లో॥ పరాన్నం పరివాదశ్చ పరదారాస్తథా ధనమ్।
అదానాచార విద్వేషా భక్ష్యా లస్యానుదైన్యతా॥
దశదోషా మహాదేవి వర్జ్యాః కాశీనివాసిభిః॥

భా॥ ఓ మహాదేవి! కాశినివాసులచే పరాన్నము పరనింద పరదారా గమనము పరధన పహరణము దానము చేయకుండుట అనాచారము విద్వేషము అభక్ష్య భక్షణము ఆలస్యము దీనత్వము అను ఈ పదిదోషములు త్యజింపబడవలెను

తథా శ్లో॥ యః కాశ్యాం కురుతే పాపం జనో మోహమదాన్వితః।
ఉభయోః కాలరాజస్య దండపాణే ర్గణేశితుః॥
అపరాధీ దురాచారః కథం సిద్ధి మవాప్నుయాత్॥

భా॥ అట్లే ఎవడు కాశియందు మోహ వివశుడై, మదపూరితుడై పాపము చేయునో అట్టివాడు మన ఉభయులకును ప్రభువగు కాలభైరవుడు లేక దండపాణి యొక్క దండనకు లోబడును అపరాధియు దురాచారియునగు నట్టివాడు సిద్ధిని ఎట్లు పొందును?

శ్లో॥ మయాఽపి యత్ర సతతం కాలరాజాద్ధి బిభ్యతా।
స్థీయతే సావధానేన కాశ్యాం మానస భోగినా॥

భా॥ ఆనందాను భవముగల నేను పైతము కాలరాజ భయమునచే ఈ కాశీయందు ఎల్లప్పుడు సావధానముతో నుందును

శ్లో॥ స్థానానురూపా వృత్తిర్హి శోభతే పురుషస్య చ।
న హ్యగ్నిహోత్రశాలాయాం క్రియతే మలమోచనమ్॥

భా॥ ఎట్టి పురుషునకైనను తానున్న ప్రదేశమునకు అనురూపమైన ప్రవర్తనయే శోభించును ఎవడును అగ్నిహోత్రగృహమున మలవిసర్జనము జేయడు గదా!

కాశీఖండే శ్లో॥ కాశ్యాం పాపం న కుర్వీత దారుణా రుద్రయాతనా
అహో రుద్రపిశాచత్వం నరకేభ్యోఽపి దుఃసహమ్॥

భా॥ కాశీయందు ఏ విధమైన పాపము చేయరాదు రుద్రయాతన మిక్కిలి దారుణమైనది రుద్ర పిశాచత్వము నరకము కంటె మిక్కిలి దుస్సహమైనది.

శ్లో॥ అభిలష్యన్తి యే విత్తం ధనం నానా ప్రతిగ్రహైః।
పరస్వం కపటై ర్వాపి కాశీ సేవ్యా న తైర్నరైః॥

భా॥ విత్తము నానా విధములగు ప్రతిగ్రహముల చేతను లేక అపహరణము చేగాని లేదా కపటము చేతను ఎవరు విత్తము ధనమును సంపాదించ గోరుదురో అట్టివారు కాశీయందు ఉండరాదు

శ్లో॥ ఆత్మరక్షాఽత్ర కర్తవ్యా మహా శ్రేయోభివృద్ధయే।
అత్రాఽఽత్మ త్యజనోపాయం మనసాఽపి న చిన్తయేత్॥

భా॥ అట్టి కాశీయందు మహాశ్రేయస్సు కోరువానిచే ఆత్మరక్షణకై ప్రయత్నము చేయవలెనది ఇచ్చట ఆత్మవృద్ధికి వ్యతిరిక్తమగు కార్యము మనస్సుచేత గూడ తలంచరాదు

శ్లో॥ ఏకస్మిన్నపి యద్యాహ్ని కాశ్యాం శ్రేయోఽధి లభ్యతే
న తువర్షశతేనాపి తదన్యత్రాఽఽప్యతే క్వచిత్॥

భా॥ ఎవరైనను ఒక దినమైనప్పటికిని కాశీయందుండి ఎట్టిశ్రేయో లాభమును పొందుదురో అట్టిది అన్యత్ర వర్షశతములకును పొందరు

తత్ర - శ్లో॥ వాసః కాశ్యాం సజ్జనానాం ప్రసంగో గంగాస్నానం పాప కర్మారుచిశ్చ।
పుణ్యాసక్తిః స్వేచ్ఛయా లాభతుష్టిర్దానం శక్త్యా నప్రతి గ్రాహ్యమష్టౌ॥

భా॥ కాశీయందు నివాసము సజ్జన సాంగత్యము గంగా స్నానము పాప కర్మాచరణమందు భీతి పుణ్యము చేయుట యందు ఆసక్తి, యదృచ్ఛాలాభసంతుష్టి యథాశక్తి దానము ప్రతి గ్రహము చేయకుండుట ఈ ఎనిమిది ఎచ్చట యుండునో అదియే గొప్ప యోగము కాశీయందు పై లక్షణయుక్తునకు యోగాభ్యాసముతో పని ఏమియున్నది?

శ్లో॥ అవశ్యంగా ప్రత్యక్షం పాపరాశి ర్విపచ్యతే సజ్జనై పంక్తిభోజి।
తస్మాద్భక్తః సావధానేన సేవ్యా నచ్చి ల్లాసై ర్దుఃఖభారం జహాతి॥

భా॥ దుర్జన సాంగత్యము వలన దినదినము పాపరాశిపెరుగుచున్నది సజ్జన సాంగత్యము వలన అట్టి పాపరాశి క్షయము నొందును అందుచే సజ్జనులు కాశిని సావధానముగ సేవింపవలెను సజ్జనుల చేతను వివిధ దానముల చేతను దుఃఖభారము తగ్గిపోవును

శ్లో॥ నారాయణపరః కాశ్యాం మహాదేవపరోఽథవా।
భూత్వా సదాచార రతస్తిష్ఠే దత్ర న చాన్యథా॥

భా॥ కాశియందు నారాయణ భక్తుడుగ గాని లేదా పరమేశ్వర భక్తుడుగ గాని యుండి సదాచార రతుడై యుండవలెనే గాని మరియొక విధముగ నుండగూడదు

శ్లో॥ యాత్రా పూజా నామసంకీర్తనాది స్నానం తీర్థేష్వేవ తత్తద్దినేషు।
సత్సంగే ఽన్యైర్నైవ సంభాషణాది కుర్యాదేవం దేవదేవో దిదేశ॥

భా॥ యాత్ర పూజ నామ సంకీర్తనము పర్వములందు తీర్థస్నానము సత్సంగము గల్గి ఇతరులతో సంభాషణము చేయకుండుట మొదలగు లక్షణములను దేవదేవుడు ఆదేశించెను

శ్లో॥ స్నాతవ్యం జాహ్నవీ తోయే ద్రష్టవ్యః పార్వతీపతిః।
స్మర్తవ్యః కమలాకాన్తో వస్తవ్యం కాశికా స్థలే॥

భా॥ గంగాజలమందు స్నానము విశ్వేశ్వర దర్శనము విష్ణు స్మరణ కాశికాపురియందు నివాసము ఇవి సజ్జనుల యొక్క ముఖ్యాచర్యలుగా గ్రహించవలెను

శ్లో॥ దాతవ్యమితి కాశ్యాం నో వక్తవ్యం మనుజైః క్వచిత్।
అహోరాత్ర మతిక్రమ్య తద్దానం ద్విగుణం భవేత్॥

భా॥ కాశియందుండి ఎన్నడును దీనిని దానము చేయుదును యని సంకల్పించి ఊరకుండరాదు అనగా వాటా పలుకరాదు అట్లు సంకల్పించిన పిదప ఒక అహోరాత్రము గతించినచో ఆ చేయవలసిన దానము ద్విగుణముగ చేయవలసియుండును అనగా సంకల్పించిన తత్క్షణమే దానము చేయవలెనని భావము

శ్లో॥ దశోత్తరం పర్వసుచ శతం చంద్రగ్రహే భవేత్।
సూర్యగ్రహే సహస్రంతు మరణేఽనన్తకం స్మృతమ్॥

భా॥ పర్వములయందు దానము చేయసంకల్పించి వెంటనే అదానము చేయఁనచో పిదప దానికి దశగుణకముగను చంద్రగ్రహణ సమయమందు శతగుణకముగను సూర్యగ్రహణ సమయమున సహస్ర గుణకముగను అదే మరణ సమయమందైనచో అనంతగుణకముగను దానము చేయవలసి యుండును దానము చేయుటలో కాల విలంబనమైనచో పర్వములందు చంద్రగ్రహణ మందు సూర్యగ్రహణమందు మరణ సమయమందు క్రమముగ దశ శత సహస్ర అనంత గుణకములుగ తద్దానము చేయవలసి యుండునని సారాంశము

శ్లో॥ తస్మాద్దాతవ్యమిత్యుక్తమ్ దేయమేవ న చాన్యథా।
బుద్ధైస్తదేవ వక్తవ్యం దాతుం శక్యం యదేవ హి॥

భా అందుచేత దానము చేయుటకు సంకల్పించిన వెంటనే ఆ దానము చేయవలెను మరియొక విధముగ జేయరాదు ఏది ఇచ్చుటకు తనకు శక్యమగునో దానినే దానము చేయుదునని బుద్ధిమంతుడు సంకల్పించుకొనవలెను

తథా శ్లో॥ దత్త్వా న దీయతే యద్ధి యాతనావహమేవ తత్।
దానమేవ కలౌ నౄణాం ప్రాయశ్చిత్తం న చేతరత్॥

భా దానము చేయుదునని మాటయిచ్చి దానిని ఇవ్వలేకున్నచో అది యాతనావహమగును కలియుగమున దానమే మానవులకు ప్రాయశ్చిత్త రూపమైనట్టి సాధనము ఇతర సాధనముల వలన అట్టి ప్రాయశ్చిత్తము జరుగనేరదు

శ్లో॥ కాశ్యామపి కృతాదోషా నశ్యన్తి హి సదానతః।
కాశీస్థ నిందన పరాన్పరమాదరేణ।
కాశ్యాం మృతానపి హి యాతయతే మహాత్మా
శ్రీకాలరాజ ఇతి యః ప్రథితః పరేశః॥

భా కాశీలో చేసిన పాపములు సైతము సత్పాత్రదానముచే నశించును ఇతి యందుండియు నిత్యము ఆసక్తితోను సంతోషముగను పరనిందా సక్తుడగువానిని ఒకవేళ కాశీయందు మృతి చెందినను మహాత్ముడైన కాలరాజు అనుయముడు యాతనలకు గురిచేయును

శ్లో॥ సో ఽ స్యాప మర్త్య సుకృతం పరిశిక్షయచ్చ, తస్మాత్కాశ్యాం సర్వ సత్త్వైస్సు బుద్ధిః
కర్తవ్యా తే రుద్రరూపా సదా ఽ ఽ దౌ
సత్పాదన్య ధర్మజాతం స్వశక్త్యా కర్తవ్యం తే పుత్రక త్రాణ హేతోః॥

భా కాలరాజు అట్టివారి యొక్క దుర్బుద్ధిని పాపమును పురస్కరించు శిక్ష జేయును ఆ కారణము చేత కాశీయందలి సర్వ ప్రాణులు రుద్ర రూపులను సద్బుద్ధిని ప్రథమముగ అందరు కలిగి యుండవలెను అటు పిమ్మట శక్తికొలది తనకు విహితమగు ధర్మ కార్యములను నిర్వహించుట తన కర్తవ్యముగ భావించవలెను కాశిలో నట్టి జీవన విధానము తన ద్వారా పుత్రుల యొక్క రక్షణ హేతువని భావించవలెను

తథా శ్లో॥ ఆత్మానం సద్గుణం మత్వా శాస్త్రాచరణ సంమతమ్।
తతో ఽ న్యస్య కరోత్యశ్లో నిందాం నిందిత ఏవ సః॥

భా అట్లే తనకు తాను సద్గుణవంతుడననుకొని శాస్త్ర రీతిని నడుచుకొను వానిని భావించి పరనింద జేయువాడు తానే నిందార్హుడగును

శ్లో॥ అతేన త యా వత్స! నిందా కస్యాపి దేహినః
న శ్రోతవ్యా న కర్తవ్యా న స్థేయం తత్ర యత్ర సా॥

భా ఓ వత్సా! అందుచే ఇతరులను నిందించుట ఎప్పుడును కూడదు వినరాదు అట్టి నింద జరుగుచోట తాను ఉండరాదు

తథా-

శ్లో॥ ఆదౌ కాశ్యాం ధర్మమార్గేణ వాసః పాపత్యాగః కాశీమాహాత్మ్యదృష్టిః।
దేహం గేహం పుత్రమిత్రాది యన్య సర్వం తుచ్ఛం సోఽధికారీ మహాత్మా॥

భా॥ మొదట కాశీయందు ధర్మ మార్గమున నడుచుచు నివసించుట వెంటనే పాపత్యాగము పిమ్మట కాశీ మాహాత్మ్యమును గ్రహించుట అటు పిమ్మట దేహమునందు పుత్ర మిత్రాది పోష్యవర్గమునందు గృహము నందును ఇవి యన్నియు తుచ్ఛమైనవియను దృష్టిని గలిగి సావధానముగ మసగడ సాగించువట్టి మహాత్ముడు మోక్షమునకు అర్హుడగును

కౌర్మే శ్లో॥ వర్ణాశ్రమ విధిం కృత్స్నం కుర్వాణో మత్పరాయణః।
తేనైవ జన్మనా జ్ఞానం లబ్ధ్వా యాతి పరంపదమ్॥

భా॥ నాయందు శ్రద్ధ గలిగి తనకు విహితమైన వర్ణాశ్రమ విధులను సమగ్రముగ జేయువాడు సహజముగనే జ్ఞానమును పొంది పరమ పదమును చూరగొనును

మాత్స్యే - శ్లో॥ సంహృత్య శక్తితః కామాన్విషయేభ్యో ...
ధర్మశీలా జితక్రోధా నిర్మమా నియతేన్ద్రియాః।
ధ్యానయోగపరాః సిద్ధిం గచ్ఛన్తి పరమం పదమ్॥

భా॥ శక్తికొలది బాహ్య విషయముల నుండి కోరికలను ఉపసంహరించుకొని ధర్మ పరాయణులు క్రోధమును జయించినవారు మమత్వమును వదలినవారు ఇంద్రియ నిగ్రహము గలవారు ధ్యాన యోగపరులును అయినట్టివారు పరమ పదసిద్ధిని పొందుదురు

పాద్మే శ్లో॥ కాశ్యాం కృతస్య పాపస్య భోగో రుద్రపిశాచతా।
ఏకైకస్య చ పాపస్య సమా మయుతత్రయమ్॥

భా॥ కాశీయందుండి బుద్ధిపూర్వకముగ పాపముచేసినచో దాని వలన గలుగు ఫలితము రుద్ర పిశాచత్వమును పొందుటయే అదియును ఒక్కొక్క పాపమునకు ముప్పదివేల సంవత్సరముల పరిమితి చొప్పున యనుభవింపవలెను గావున విశ్వేశ్వరుని పురమగు ఈ కాశీయందు ఏ మాత్రము పాపమును జేయరాదు

తథా- శ్లో॥ అత్రత్య పాప భోగస్తు దారుణో దానవేశ్వర।
ఏతత్కృతాఘ సంఘాతో ఘోరాం భుక్త్వాతు యాతనామ్।

శ్లో॥ పైశాచ్యం సముపాప్నోతి వర్షాణా మయుత త్రయమ్।

(ఆదౌ నరకభోగః పశ్చాద్రుద్రపిశాచతేత్యర్థః తథా చ పాద్మఏవ ఋషయ ఊచుః)

భా॥ అట్లే ఓ దానవేశ్వరా! కాశీయందు చేసిన పాపఫలితము మిక్కిలి దారుణముగ నుండును ఇచ్చట చేసిన పాప సమూహము వలన ఘోర యాతన ననుభవించవలెను అటు పిమ్మట ముప్పదివేల సంవత్సరములు పిశాచత్వము ననుభవించవలెను (మొదట నరకయాతనలు ఆపై రుద్ర పిశాచత్వమని గ్రహింపవలెను

యాతనా ఽభూదితి బ్రహ్మవైవర్తే పంచావింశో ఽధ్యాయే కథాతథా తత్రైవ॥

భా॥ ధర్మాత్ముడు ద్విజభక్తుడు దయావంతుడు ఇత్యాదిగ చెప్పబడిన విశేషణములతో గూడుకొని నిత్యనైమిత్తిక కార్యముష్ఠాన నిరతుడు ధార్మికుడునైనట్టి క్రమేలకుడు అనువతడు కాశీయందుండి తన ఇంటికి ఆకలితో వచ్చిన భిక్షుక బ్రాహ్మణుని భయపెట్టి కొట్టి, తిరస్కరించి నంత మాత్రమున, కాలాంతర మందాతడు మణికర్ణికలో జలమగ్నుడై చనిపోయినను, అతి దుర్భరమైన భైరవ యాతన ననుభవింపవలసి వచ్చెను. అందుచే కాశీయందు స్వల్పమైనను ఎట్టి పాపములు చేయరాదు అట్లే ధర్మేశ్వర సమీపమందుండి, అనేక పాపములు చేసి కాశిలో చనిపోయినప్పటికిని హిరణ్య గర్భుడను పేరుగల పాశుపత దీక్షితునకు ముప్పది మూడువేల సంవత్సరములు కాలభైరవ యాతన గలిగెనని బ్రహ్మవైవర్త పురాణమున ఇరువది ఐదవ అధ్యాయమందలి గాథ. అట్లె ఆ పురాణమందే ఇట్లున్నది.

శ్లో॥ సూత కాశ్యామృణం కృత్వా కాశ్యామేవ ప్రమీయతే యః
కాగతిస్తస్య కథయ ఋణవాన్నైవ ముచ్యతే॥

భా॥ ఓ సూతుడా! కాశీయందు ఋణము చేసి (తీర్చకుండ) కాశీయందే చనిపోయినట్టి వానికి కలుగుగతి ఏమి? మాకు చెప్పుము. అట్టిఋణము చేసి తీర్చనట్టివాడు ముక్తుడగునా?

సూత– శ్లో॥ ధార్మిక స్త్వృణ భీతో యో మ్రియేతాత్ర ప్రమాదతః
న సద్యోముక్తి మాప్నోతి ఋణీ తస్య న శంకరః

భా॥ సూతుడిట్లు చెప్పెను ధార్మికుడై, ఋణభీతి గలిగియుండి ఎవరు ప్రమాద వశమున కాశీయందే మరణించునో అట్టివాడు సద్యోముక్తిని పొంది తరించును శంకరుడే అతనికి ఋణియై యుండును

శ్లో॥ ఋణం సహాగుణం తస్మై దదాతి భగవాన్హరః
స్వయమంగీకృత్య ఋణం తారకం ప్రదిశత్యలమ్॥

భా॥ ఋణ భారమును శంకరుడు వహించి సహాంగుణితముగా ఆ ఋణమును తీర్చును తాను ఋణమును అంగీకరించినవాడై బదులుగ తారకమంత్రము నుపదేశించును.

శ్లో॥ కుటుంబ భోగకీర్త్యర్థ మృణం కృత్వా నిముఞ్చతి
న పాపాత్మా ఽ శుద్ధ తను ర్యాతనాం ప్రతిపద్యతే॥

భా॥ కుటుంబమునకు భోగముగల్గించుటకో లేక కీర్తి కొరకో ఋణము చేసి మరచి తీర్చజాలనట్టి పాపాత్ముడు, పాప శరీరము గలవాడై యాతనను పొందును.

శ్లో॥ అతః సర్వై రుపాయైర్హి ఋణశుద్ధిః సమీహితా
భా॥ అందుచేత సర్వోపాయముల చేతను ఋణశుద్ధి కోరదగినది.

తథా– శ్లో॥ వక్తా పరమవాక్యానాం ముక్తస్స్యా పరాగతః

సందేహో న మునిశ్రేష్ఠా ఘనభైరవ్యాం యాతి యాతనామ్॥

పరాపవాదీ పాపాత్మా సర్వపాపకృదప్యసౌ॥

పచ్యతే నరకే సోఽపి మహాపాతకిభిః సహ॥

భా॥ పరుష వాక్యములు పలుకువట్టివాడు నరకమునకు పోవునని తెలియవలెను. ఇందుకు సందేహము లేదు. అటు పిమ్మట వీతడు ఘోరమైన భైరవ యాతనగూడ పొందును. పరులపై అపవాదమును వేయునట్టి పాపాత్ముడు సర్వ పాపములను చేసినట్టివాడు నిశ్చయముగా మహాపాతకములు చేసిన ఇతరులతో కలిసి నరకమందు పడి తపించును

తథా- శ్లో॥ ధనాద్యర్థం తు యో మూఢో మిథ్యావాదం కరోతి చ

తస్యాఽఽశు సుకృతం యాతి నరకం చ ప్రపద్యతే॥

భా॥ అట్లే, ధనాదులను గోరి మిథ్యావాదము చేయు మూర్ఖుడు వెంటనే తన పుణ్యమును పోగొట్టుకొని నరకమును పొందును.

శ్లో॥ అనృతం న వదేత్ ప్రాజ్ఞః ప్రాణైః కంఠగతైరపి

కౌతుకేనాపి హి మహాన్ స్వైరహాస్యేష్వపి క్వచిత్॥

భా॥ అందుచేత ప్రాజ్ఞుడైన వాడు ప్రాణములను విడువవలసివచ్చినను తనకుతూహలము కొరకు గాని ఇష్టపూర్తిగ గాని హాస్యము కొరకుగాని అనృతము చెప్పరాదు

శ్లో॥ అనృతం సర్వపాపానాం మూలం తస్మాద్ధి సంచితః

పాపరాశిస్తు మహతాం జాయతే వర్ధతేఽపి చ॥

భా॥ అసత్యము అన్ని పాపములకు మూలము దానివలననే సంచిత పాపరాశి ఎంతగానో యేర్పడి వృద్ధి నొందును.

శ్లో॥ ఇహావాఽత్ర కిముక్తేన పాపరాశి రనన్తకః॥

దుఃఖప్రదోఽతి భవతి నాస్త్యనృతాత్పాతకం పరమ్॥

భా॥ అందుచేత ఇచ్చట అట్లు మృతి పొందిన వాని పాపరాశి అనంతమగును అది మిక్కిలి దుఃఖప్రదమగుచున్నది. గావున అసత్యము కంటె గొప్పదైన పాతకము మరియొకటి లేదు.

శ్లో॥ పురాణేషు ప్రతిష్ఠితం నానాఖ్యానై ర్ధనేశః

అనృతం నైవ వక్తవ్య మనృతాత్సుకృతం క్షరేత్॥

భా॥ పురాణములయందు అనేక కథల ద్వారా అనేక విధములుగ అనృత మాడరాదనియు అట్లు అసత్యమాడినచో సుకృతము క్షీణించుననియు చెప్పబడినది

మాత్స్యే- శ్లో॥ కామః క్రోధోఽతి లోభశ్చ దంభ స్తంభోఽతిమత్సరః॥

నిద్రా తన్ద్రా తథాఽఽలస్యం పైశున్యమితి తే దశ

అవిముక్తే స్థితా విఘ్నాః క్షేత్రే విహితాః స్వయమ్,

*వినాయకోవసర్గశ్చ సతతం మూర్ధ్ని తిష్ఠతి*

*పుణ్యమేతద్భవే త్సర్వం భక్తానా మనుకంపయా॥*

(స్తంభో గర్వః తథా కాశ్యాం భిక్షార్థం పర్యటతా వ్యాసేన భిక్షాయా మలబ్ధాయామ్)

భా॥ కామము క్రోధము మిక్కిలి దురాశ, దంభము (లేని గొప్పలు చెప్పుట), గర్వము అతిమాత్సర్యము అతినిద్ర కార్య సమయమున కునికిపాట్లు పడుచుండుట అలసత్వము (దీని ఫలితమే ఆలస్యము) పిసినిగొట్టు తనము లేక దాడీలు చెప్పుట -ఈ పదియును అవిముక్త క్షేత్రమున విఘ్నకారులుగ ఇంద్రునిచే ఏర్పాటు చేయబడినవి గాని విఘ్న నాయకుడు వీనియన్నింటికిని అధిపతియై పైన యుండుటచే, ఈశ్వరానుగ్రహమున ఇచట సర్వము పుణ్యమే యగుచున్నది. భక్తుల ననుగ్రహించుట కొరకే ఇట్లు జరుగుచున్నది

అట్లే కాశీయందు భిక్షార్థము పర్యటించు వ్యాసుడు తనకు, శిష్యులకు భిక్ష లభించక పోయినంతనే

శ్లో॥ *మా౽స్తు త్రిపురుషీ విద్యా మా౽స్తు త్రిపురుషం ధనమ్*

*మా౽స్తు త్రిపురుషం సఖ్యం, వ్యాసో వారాణసీం శపత్॥*

(ఇత్యేవం శాపే దత్తే విశ్వేశ్వరేణ భవాన్యా భిక్షా దాపయిత్వోక్తమ్‌ "ఇహ క్షేత్రే న వస్తవ్యం క్రోధనస్త్వం మహామునే"

భా॥ "కాశీయందున్న వారికి మూడు తరములవరకు విద్యయుండగూడదు, మూడు తరముల వరకు ధనము లభింపరాదు మూడు తరముల వరకు స్నేహానురాగములుండగూడదు" అని వ్యాసుడు కాశిని శపించబోవుచుండగా - ఇట్లు శపించనున్న వ్యాసుని జూచి ఈశ్వరుడు మారు వేషమును ధరించిన భవానిచే వారి యందరకును భిక్ష నిప్పించి అనంతరము వ్యాసుని ఇట్లు ఆజ్ఞాపించెను. "నీవు మహాముని వైనను క్రోధనుడవు అందుచే నీవు ఈ క్షేత్రమున ఉండదగవు."

తథా శ్లో॥ *ద్వైపాయన బహిర్యాహి నాత్ర స్థేయం మహాగసి।*

*రాగద్వేషాత్తచిత్తానాం నివాసాయ న మే పురీ॥*

భా॥ ఓ ద్వైపాయన మహర్షీ! నీవు ఏ మాత్రము ఈ క్షేత్రమున ఉండరాదు. రాగ ద్వేషములతో నిండిన మనస్సు గల వారికి నా ఈ కాశీపురియందు నివాసము లభించదు గనుక నీవు కాశికి బయటనే ఉండిపొమ్ము

శ్లో॥ *అవైమి త్వాం మహాబుద్ధే మదేక శరణం మునే।*

*అతో బ్రవీమి మత్ క్షేత్రా న్నాతిదూరే వ్యవస్థితః॥*

శ్లో॥ *మా మరాధయ నిష్కామః సతతం మత్పరాయణః*

*తతో రాగాదిభి ర్ముక్తో మత్పురే స్థాస్యసి ధ్రువమ్॥*

భా॥ నీవు నాయందే బుద్ధిని లగ్నముచేసి నన్నే శరణు జొచ్చి తపస్సు చేయువాడవని ఎరుగుదును గనుక నీవు నా క్షేత్రమునకు మిక్కిలి సమీపమందే యుండి నిష్కాముడవై సతతము మత్పరాయణుడవై నన్నే ఆరాధించు చుండుము. రాగాదులనుండి ముక్తి పొందగనే నా పురియందు నీకు మరల స్థానము లభించగలదు.

శ్లో॥ ఏవముక్తో భగవతా వ్యాసో ఽన్తేవాసిభిః సహ
పాలయన్నంతర స్యా ఽ ఽజ్ఞాం బహిరేవా ఽవతిష్ఠతే
తస్మాద్రాగాది హీనైః సా సేవ్యా ముఖ్యాధికారిభిః

భా- ఇట్లు విశ్వేశ్వరునిచే ఆజ్ఞాపించబడిన వాడై, వ్యాసుడు శిష్య సమేతముగా కాశీకి బయటనే నివాసమేర్పరచుకొని యున్నాడు. గనుక రాగాది దోషములను త్యజించిన ముముక్షువులే కాశిని సేవించుటకు ముఖ్యాధికారులని గ్రహించవలెను

పాద్మే జనకం ప్రతి యాజ్ఞవల్క్యః -

శ్లో॥ ఏవం యదా మహేశేన ప్రజాసంరక్షణార్థినా
స్వయంభువా నేదితేన నియమాః పరికల్పితాః

భా- ప్రజలను సంరక్షించుటకై ఈ విధముగ స్వయంభువుయగు ఈశ్వరునిచే నియమములు గల్పించబడినవి.

శ్లో॥ తథైవ రాజన్సర్వేషాం మునీనా మపి బుద్ధయః
రాగద్వేషభయోద్వేగ ప్రమాదాలస్య కామితాః

శ్లో॥ ప్రాదురాసన్సమాత్సర్యా స్తత్త్వజ్ఞాన విరోధినః
తతః కేచిద్భయోద్విగ్నా వృథా భీతాశ్చ కేచన

భా- ఓ రాజా! అప్పుడే సమస్తమునుల యొక్క బుద్ధులయందు రాగద్వేషములు భయోద్వేగములు ఏమరుపాటు, అలసత్వము కోరికలు ప్రబలినవి వారు మాత్సర్యగ్రస్తులై తత్త్వ జ్ఞానమునకు దూరులైరి. కొందరు భయోద్వేగములచే వృథాగా భీతులైరి.

శ్లో॥ తత్యజుః కాశికాం విప్రాః కేచిత్సహ మథా ఽ పరమ్
అన్యే స్వ మాత్సర్యయుతాః కలిప్రోత్సుక బుద్ధయః

శ్లో॥ బభూవు ర్వ్యసనయుః కేచిచ్చ కామనయా ఽ భవన్
ఇత్థం వ్యాకులితాః సర్వే సంహత్యయుః పరస్పరమ్

భా- అట్టి విప్రులు కొందరు ద్రోహ బుద్ధి గలిగినవారును, పరస్పరము మాత్సర్యము గలిగిన వారున్నై, కలి ప్రభావమున పక్షించిన బుద్ధులు గలిగినవారై కాశిని విడిచిపోయిరి. కొందరు కామపరాయణులై వ్యాకులపాటు నొందిరి అట్టి స్థితిలో అనుమలందరు పరస్పరము ఇట్లు సంప్రదించుకొనిరి.

శ్లో॥ త్యజామః కాశికాం శీఘ్రం విఘ్నా నః సంభవంతి హి
యద్యపీహ సులభ్యం తన్నిర్వాణం మునిసత్తమాః

భా- కాశీయందు మనకు పెక్కు విఘ్నములు గలుగుచుండుటచే, నిర్వాణము సులభతరముగ లభించునట్టి క్షేత్రమైనను కాశిని మనము వదలిపెట్టుదము.

శ్లో॥ తథాఽపి రాగద్వేషాది ర్బాధతే మానసాని నః॥
రాగాదిమవ జాతేమ పాపమేవ నమేధతే॥

భా॰ అట్లైనను మన మనస్సులను రాగద్వేషములు మిక్కిలి బాధించుచున్నవి వాని ప్రాబల్యమున మనకు పాపమే పెరుగుచున్నది

శ్లో॥ అస్మిన్ క్షేత్రేకృతం పాపం స్వల్పం వాపి మహద్భవేత్।
తస్మాదన్యత్ర కర్మాణి కరిష్యామో యథావిధి
అంతః కరణ శుద్ధ్యర్థం తతస్తత్త్వం స్ఫురిష్యతి॥

భా॰ ఈ కాశియందు చేసిన పాపము కొంచెమైనను గొప్పదియగును అందుచే పాపకారుల మగు మనము అన్యత్ర కర్మలను యథావిధిగ చేయుదము దానిచే అంతః కరణశుద్ధి కలిగి తత్త్వము స్ఫురించును

శ్లో॥ విచార్యైవం గతాః సర్వేమునయః సంశితవ్రతాః॥
వారాణసీం విహాయైవ నానాతీర్థాని సంశ్రితాః॥

భా॰ ఈ విధముగ ఆ మునులందరు ఆలోచించిన వారై నియమశీలురై కాశిని విడిచి అన్యత్ర తీర్థములను సేవింపసాగిరి

పాద్మే శ్లో॥ కాశ్యాం యో నిజధర్మేణ ముముక్షు స్తిష్ఠతి ద్విజః॥
అనాయాసావిలంబాభ్యాం స ఏవ లభతే ఫలమ్॥

భా॰ ఎవడు కాశియందుండి ముముక్షువై నిజధర్మము నాచరించు చుండునో అట్టి ద్విజుడు అనాయాసముగను శీఘ్రముగను ఫలమును పొందును

బ్రహ్మవైవర్తే

శ్లో॥ కాశ్యాం స్థిత్వా హీన్ద్రియాణాం వ్యయంనో కుర్యా ద్యత్నాత్సత్కృతం రక్షణీయమ్।
అంతర్యామీ ప్రేరకః కారణానాం, సోఽయం ద్విష్యాదింద్రియై ర్నాశితైర్హి॥

భా॰ కాశియందుండు మనకు ప్రయత్న పూర్వకముగ ఇంద్రియనిగ్రహము కలిగియుండుట సత్కృతము (పుణ్యము) ను రక్షించుకొనుట అవశ్యకము అంతర్యామియై సకల కారణములకు ప్రేరకుడగు చున్నాడు ఇంద్రియోప సంహారము చేత అతడు తెలియదగినవాడు

శ్లో॥ అత్ర స్వేచ్ఛాచారదోషప్రణష్టా లోకాః కామాద్భ్రాన్తిభాజో భవన్తి।
తస్మాత్సద్భి ర్నాత్ర సన్థా విరుద్ధతః, సేవ్యః సేవ్యో వేదమూలో హి ధర్మః॥

భా॰ స్వేచ్ఛాచార దోషముచే నష్టము పొందిన లోకులు కామవశమున భ్రాంతి పొందిన వారగుచున్నారు అందుచే ఇచ్చట సజ్జనులచే విరుద్ధ మార్గము సేవింపదగదు వేద విహిత ధర్మమే సేవ్యమైనది

*తథా- శ్లో॥ యే మ్యః కాశ్యాం మహాభాగాః సత్యధర్మ పరాయణాః।*
*దానైర్వ్రతైశ్చ నియమైః స్వాధ్యాయైశ్చైవ సంయుతాః॥*
*తేషాం కలి ర్నప్రభవే ద్విద్యమానోఽపి సర్వతః॥*

భా॥ కాశియందుండి ఏ మహానుభావుడు సత్యధర్మ పరాయణుడై దానముల చేతను వ్రతాది నియమములచేతను స్వాధ్యాయము చేతను గూడుకొనినవాడై యుండునో అట్టి వానిని సర్వత్ర తన ప్రతాపమును జూపునట్టి కలిగూడ యేమియు చేయజాలదు

*తథా- శ్లో॥ పుత్రో భ్రాతా పితావాఽపి యః కాశ్యాం పాపమాచరేత్।*
*త్యాజ్య యేవ స పాపాత్మా భవే త్సంసర్గబాధ్యయాత్॥*

భా॥ కాశియందు పాపమాచరించినవాడు తనకు పుత్రుడైనను తండ్రియైనను సోదరుడైనను దూరముగ త్యజింపదగినవాడే అట్టివారి సంసర్గము భయకారణమగుచున్నది

*తథా- శ్లో॥ గురుద్రోహపరో యస్తు విప్రద్రోహ రతస్తథా।*
*న తస్యకాశీ సిధ్యేత బహుభిః సాధనైర్యుతా॥*

భా॥ గురుద్రోహపరాయణులు విప్రద్రోహము చేసినవారును పలు సాధనములు గలిగియున్నను అట్టివారికి కాశీవాసము సిద్ధించదు

*తథా - శ్లో॥ వారాణస్యాం వసేద్యస్తు వృత్తిం యాయావరీం చరేత్।*
*అన్యం న ప్రతిగృహ్ణీయాత్ప్రాణైః కంఠగతైరపి॥*

భా॥ కాశియందుండి యాయావరవృత్తిచే జీవించువాడైనను ప్రాణసంకట సమయమందు గూడ పరాన్నము గ్రహించరాదు

*తథా- శ్లో॥ కాశ్యాం వసేద్ధర్మపరో మహాత్మా న విత్త కామాదిపరః కదాచిత్।*
*విత్తం పురా దైవకృతం తు యావత్తావద్భవత్యేవ న చాత్ర వాదః॥*

భా॥ కాశియందుండి ధర్మపరాయణుడై జీవించుమహాత్ముడు ఒకప్పుడును అర్థకామ పరాయణుడై యుండగూడదు పూర్వమె దైవనిర్ణయమైన విత్తము కోరకుండగనే అతనికి లభించుచుండును ఇందు వివాదమునకు తావులేదు

*తథా-*

*శ్లో॥ అహర్నిశం విత్త చింతాతురాణాం కళత్రపుత్రాప్తగృహాది భాజామ్।*
*విజృంభతే న పరం కాశిసౌఖ్యం యదర్థమాస్తే సహరిర్గిరీశః॥*
*(సహరిః = హరిసహితః)*

భా॥ కాశియందుండి అహర్నిశము ధన చింతాపరాయణులుగను భార్యాపుత్ర మిత్ర గృహచింతగల వారుగను ఉండునట్టి వారికి దేనికొరకై విష్ణువుతో గూడి గిరీశుడు కాశియందు స్థిరముగ నివసించుచున్నాడో అట్టి పరమైన కాశీవాస సౌఖ్యములభింపదు

*తథా - శ్లో॥ గంగాస్నానం విశ్వనాథానువృత్తి స్తత్తత్తీర్థ స్నాన దేవార్చనాని।*

*దానం శక్త్యా సత్కథా సత్ప్రసంగః పాపత్రాసః కీర్తనం శంభునామ్నామ్॥*

భా॥ గంగాస్నానము విశ్వనాథ ధ్యాన పరత్వము ఆయాతీర్థముల యందు స్నానము దేవతార్చనము శక్తి కొలది దానము సజ్జనులతో ధర్మ ప్రసంగము సత్కథాశ్రవణము శంభు నామ సంకీర్తనము ఇవియన్నియు పాపక్షయ కారకములు

*తథా - శ్లో॥ కుర్యాదేవం క్షేత్రమధ్యస్థితో నా నో చే త్తీవ్రా యాతనా భైరవీస్యాత్।*

*కృతే కాశ్యాం జ్ఞాన నిష్ఠా వసన్తి త్రేతాయాం తే యజ్ఞదాన ప్రధానాః*

*పూజాదానం ద్వాపరేతు ప్రకుర్వన్ తిష్యే దానం కేవలం మోక్షహేతుః॥*

భా॥ ఇట్లు కాశీ క్షేత్రమధ్యమందుండి సద్ధర్మముల నాచరింపవలెను లేనిచో తీవ్రమైన భైరవ యాతన సంభవించును కాశీయందుండు వారు కృతయుగమున జ్ఞాననిష్ఠులై యుండెడివారు త్రేతాయుగమున యజ్ఞదాన పరాయణులై యుండెడివారు ద్వాపరమందు పూజా దానములను చేయువారుగను కలియుగమందు కేవలము దానపరాయణులుగను ఉందురు ఆయాయుగము లందవి మోక్షహేతువులు

*తథా- శ్లో॥ కలౌ న కాశీవసతిః స్థిరాభవే త్పాపాత్మనాం దండపాణి ప్రభావాత్।*

*మమాజ్ఞయా దండపాణిః శుభాత్మా హ్యుద్వాసయి త్యత్యథ పాపకర్మాన్॥*

భా॥ కలియుగమందు దండపాణి ప్రభావముచేత ప్రజలకు (పాపులకు) కాశీయందు స్థిర నివాసము గలుగదు నాయాజ్ఞచేత శుభాత్ముడగు దండపాణి పాపకర్ములకు కాశీనుండి ఉద్వాసన గల్గించును

*తథా -శ్లో॥ కాశీస్థాశ్చ జనాః సర్వే శివవిష్ణుస్వరూపిణః।*

*తస్మాత్కాశీజనా న్నైవ దూషయే దపి పాపినః॥*

భా॥ కాశీయందున్నట్టి జనులందరును శివ విష్ణు స్వరూపులే అందుచేత ఇచ్చట పాపులుగ కన్పించునట్టి వారిని సైతము ఎంత మాత్రము దూషించరాదు

*శ్లో॥ న ధర్మః కాశీజనతాసేవనా త్శుభగః పరః*

*న పాపం కాశీలోకానా మపరాధా దతః పరమ్॥*

భా॥ కాశీవాసులను సేవించుటకంటె శుభప్రదమైన ధర్మము మరియొకటి లేదు కాశీవాసుల యెడ అపరాధము జేయుటకంటె మించినట్టి పాపము మరియొక్కటి లేదు

*శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాంచ సదాశివ!*

*అపరాధాః పృథక్ప్రోక్తాః సర్వేషాంచ విశేషతః॥*

భా॥ ఓ సదాశివా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకందరికిని చెప్పబడిన అపరాధములు వేర్వేరుగనున్నవి

శ్లో॥ ప్రతిగ్రహో బ్రాహ్మణానా మనాచారస్తథా పరః॥
తథా ఽన్యధర్మాచరణం శూద్రాన్నం శూద్రసేవనమ్॥

భా॥ బ్రాహ్మణులకు ప్రతి గ్రహము అనాచారము పరధర్మమును ఆచరించుట శూద్రాన్న గ్రహణము శూద్రసేవ అపచారములు

శ్లో॥ క్షత్రియాణాం ప్రజాద్రోహ ఋణాశేష ర్నపాపభీః॥
యథేష్టం వ్యవసాయాతిమానకూటం తథా విశామ్॥

భా॥ క్షత్రియులకు ప్రజాద్రోహము ఋణశేషముంచుకొనుట పాపభీతి లేకుండుట ఇవి అపరాధములు వైశ్యులకు యథేష్టముగ (నియమరహితముగ) వ్యవసాయము చేయుట తప్పుడు కొల్తలు తప్పుడు తూకములు ఇవి అపరాధములు

శ్లో॥ అపరాధా భవన్త్యేవం శూద్రాణాం శృణు శంకర!
ద్విజాసేవా వేదవాద. ప్రతిగ్రహ రుచిస్తథా।
మద్యమాంసాది వ్యసనం మాయయా లోకవంచనమ్
పూజ్యబుద్ధి రసేవాచ వర్ణానాం వేషధారణమ్॥

భా॥ ఓ శంకరా! అట్లే శూద్రులకు ద్విజులను (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను) సేవింపకుండుట ప్రతి గ్రహమందాసక్తి మద్యమంసాదులందు అతి మాత్రమగు వ్యసనము మాయచే లోకమును వంచించుట మొదలగునవి యపరాధములు అట్లేనేను పూజ్యుడను అను అహంకారబుద్ధి సేవకావృత్తి రాహిత్యము ఇతరవర్ణముల వారిని ఉద్దేశించి నిర్ణయించబడిన వేషమును ధరించుట మొదలగునవి

శ్లో॥ బ్రాహ్మణాద్యైః కాశికాయామే తద్వర్జ్యం పృథక్ ।

భా॥ బ్రాహ్మణాది సకలజాతుల వారికివి కాశీలో వర్జింపదగినవి

శ్లో॥ నిందకానాం సుఖం ధర్మస్తప సత్యం దయాఽభయమ్।
తీవ్రవ్రత తపోదాన విద్యాదిచ నిరర్థకమ్॥
(కాశ్యాం వసతాం గంగోదకేన శౌచాద్యశుచి కర్మ కరణేఽపి నదోష. ।
తత్క్షేత్రమాసాద్య మహావిముక్తం గంగోదకే నాత్ర సమస్తకార్యే॥
ఇతి సనత్కుమార సంహితాయాం కాశీఖండేచ)

భా॥ అట్లే కాశీయందుండి పరనిందజేయువారికి సుఖము ధర్మము తపస్సు.సత్యము దయ అభయము తీవ్రమైన వ్రతములు తపోదానాదులు విద్యయు నిరర్థకమగును. (కాశీయందుండి గంగోదకముచే శౌచాదికము ఇతరములగు అశుచికర్మలు చేసినను దోషములేదు నాయొక్క అవిముక్త క్షేత్రమును చేరినవారు సమస్తకార్యములను గంగోదకముచె నిర్వహించుకొనవచ్చును అని సనత్కుమార సంహితయందును కాశీఖండమందును గలదు )

శ్లో॥ *సర్వాణి యేషాం గాంగేయై స్తోయైః కృత్యాని దేహినామ్॥*
*భూమిష్ఠా అపి తే మర్త్యా, అమర్త్యా ఏవనై హరే॥*

భా॥ ఓహరీ! కాశీయందుండి ఏదేహధారులు తమసర్వకార్యములు గంగాతోయముచే నిర్వహించుకొందురో వారు భూమియందున్న మర్త్యులైనను అమరులేయగుదురు.

వచనము 'సమస్త పదే సంకోచే ప్రమాణాభావాత్। యదా తు న కరోతి తదాసమ్యక్ సంకల్పజ కామస్యాపి ధర్మమూల త్వాత్ఫలాతిశయః। తథా సనత్కుమార సంహితాయాం।

భా॥ సమస్త పదము నందు సంకోచము ప్రమాణ రాహిత్యమని భావించి కార్యములు చేయకున్నచో సమ్యక్ సంకల్పము వలన పుట్టిన కామముల నిర్వహణము ధర్మమూలమగుటచే ఫలాతిశయము గల్గును. అని సనత్కుమార సంహితవచనము.

శ్లో॥ *వారాణసీం సమాసాద్య యే కుర్వన్త్యర్థ సంచయమ్।*
*తేషాం నాస్త్యేవ సంసిద్ధి ర్యా కాశ్యాం ప్రాప్యతే శివాత్॥*

భా॥ వారాణసిని పొంది ఎవరు అర్థ సంచయనరాయణులైయుందురో అట్టి వారు శివానుగ్రహవలన సంసిద్ధిని పొందజాలరు.

వ్యాస ఉవాచ-

శ్లో॥ *గృహస్థానాం ముముక్షూణాం భక్తానాం కాశివాసినామ్॥*
*వినా౽ర్థసంచయం బ్రహ్మన్యాత్రానామకథం భవేత్॥*

భా॥ కాశీవాసులగుచు ముముక్షువులును భక్తులునగు గృహస్థులకు అర్థసంచయము లేకుండ జీవయాత్ర ఎట్లు జరుగునో చెప్పుమని వ్యాసుడు సనత్కుమారుని ప్రశ్నించెను.

సనత్కుమార ఉవాచ -

శ్లో॥ *ఏకాకినో గృహస్థా యే ససత్నీకా స్తథా౽పరే॥*
*కుటుంబ భరణాయ౽న్యే కుర్వ్యా తే సంచయం బహిః॥*

భా॥-ఏకాకిగనున్నను గృహస్థుడై భార్యతో గూడియున్నను, కాశికి బయట కుటుంబ భరణము కొరకు ధనసంచయము చేయుదురు.

శ్లో॥ *మధ్యే వసేయు ర్యద్యపి స్వల్పస్వాంశం ధనం త్యజేత్।*
*ఏకాహ మాత్ర మప్యన్నం సంచిన్వానో నదుష్యతి॥*

భా॥ అట్టివారు కాశీయందు నివసించు చున్నచో నిర్లిప్తులై బ్రాహ్మణుల కొరకు కొంత భాగము ధనమును వెచ్చించుచునుండవలెను. చివరగా ఒకరోజుకు సరిపోవు సంభారములను కూడబెట్టుకొనిన యెడల వానికి దోషము లేదు.

శ్లో॥ *ఏకాకీ యో౽గృహీ భక్తో భిక్షాం నా౽ర్థ స్యసంచయమ్।*
*కిం పునర్యే కుటుంబార్థే సర్వదాపి౽పి సంచయాః॥*

భా గృహస్థులు గాని భిక్షులుగాని ఏకాకులుగ నున్నచో అట్టివారు నిస్సంశయముగ భిక్షాటనమునకు అర్హులు ఇంక కుటుంబ భరణము జరుపుకొనవలసినవారు సర్వదానములచే గూడ సంచయము గలిగి యుండవచ్చును

శ్లో॥ లబ్ధ్వా ఽత్ర ధనం దద్యాత్ చతుర్భాగం తతోఽపరమ్
తేషాం తత్ర క్షితానూనాం సిద్ధిః సా పరమాం ధ్రువా ॥

భా కాశీయందు ద్రవ్యమును పొందినచో అందునాల్గవ భాగము పరులకై దానధర్మాదుల ద్వారా వెచ్చించి మిగిలినది యనుభవించవలెను అట్టివారు మరణించినప్పుడు పరమమైన సిద్ధిని నిశ్చయముగా పొందుదురు

శ్లో॥ లబ్ధ్వాచ మధ్యే ద్విగుణందత్త్వాఽపి పునరుద్ధతాః
తేషాం జన్మ సహస్రేఽపి దోషో నశ్యతి ॥

భా కాశీమధ్యమందు ధన సంచయము చేసి దానికి రెట్టింపు దానము చేసియు మరల ధన సంచయము చేసినచో అట్టి దోషము సహస్ర జన్మలకును నశించనిదగుచున్నది

శ్లో॥ ప్రతిగృహ్య బహిఃకోటి ముగ్రాదపి మహామునే ।
కృతాన్తరాలయః కాశ్యాం భుంజానో ఽప్యనఘఃకృతీ ॥

ఓ మహామునీ! కాశీకి బయట ఉగ్రస్వభావము గలవారి నుండి గూడ దానములు గ్రహించినను అటువంటివారు కాశీయందు నివాసమేర్పరచుకొని ఆధనమును అనుభవించుచున్నట్టి వారైనను అంతమున పాపరహితులును సుకృతులును అగుదురు

శ్లో॥ వారాణసీం సమాసాద్య యోవా కోవాపివాఽఽశ్రమీ ।
పక్వాన్నం పరమా దద్యాన్నైకాహార్థ దధాపివా ।
సాక్షాద్యోగీ స విజ్ఞేయః కాశీవిజ్ఞాన తత్పరః॥

భా ఏ ఆశ్రమస్థుడైనను కాశిచేరి అచ్చట ఒక్కరోజైనను శ్రేష్ఠమైన ఆహారమును దానము చేసిన యెడల అట్టివాడు కాశీ విజ్ఞాన తత్పరుడు యోగవిశిష్టుడునని తెలియదగును

కాశీఖండే

శ్లో॥ పాపమేవహి కర్తవ్యం మతిరస్తి యదీదృశీ ।
సుఖేనాన్యత్ర కర్తవ్యం మహాస్త్రి మహీయసీ ॥

భా ఇట్లుపాపమే చేయవలెననెడి తలంపేయున్నచో అట్టిపాపము కాశినందాచరించకూడదు (ఏమనగా కాశీయందు చేసిన పాపము బహుగుణితమగును ) పాపము చేయుటకు ఈకాశీకంటె ఇతర స్థలము ఈ విశాలమైన భూభాగమందు ఎంతైనా గలదు

శ్లో॥ అపి కామాతురో జన్తు రేకాం రక్షతి మాతరమ్
~ పాపకృతా కాశీ రక్ష్యా మోక్షార్థిభిః

భా॥ కామాతురత నొందినట్టి ప్రాణియైనను తన తల్లిని వదలియే చరించును అట్లే ఎట్టి పాపాత్ముడైనను మోక్షార్థి యైనచో ఒకే ఒక తల్లివంటి కాశిని సేవింపవలెను కాశీయందు అట్టి పాపము చేయరాదని భావము

శ్లో॥ *త్యక్త్వాం వైశ్వేశ్వరీం భక్తి యే ఽన్యదేవపరాయణాః*
*సర్వథా నై ర్నివస్తవ్యా రాజధానీ పినాకినః*

భా॥ అట్లే విశ్వేశ్వరుని యందు భక్తిని విడి ఇతర దేవతలను సేవించువారు ఈశ్వరుని రాజధానియైన కాశీయందు ఏ విధముగ నైనను ఉండజాలరు

శ్లో॥ *శివనిందాపరా యే చ వేదనిందాపరాశ్చ యే*
*వేదాచార ప్రతీపా యే సేవ్యా వారాణసీ న తైః*

భా॥ శివనిందాపరులు వేదనిందాపరులు వేదాచారమునకు వ్యతిరేకముగ నడుచుకొను వారు కాశిని సేవింపజాలరు.

శ్లో॥ *పరద్రోహరతా యే చ పరేర్ష్యాకారిణశ్చ యే*
*పరోపతాపినో యే వై తేషాం కాశీ న సిద్ధయే॥*

భా॥ పరులకు ద్రోహము తలపెట్టువారు ఇతరులను జూచి ఈర్ష్య పడువారు ఇతరులకు తాపము గల్గించువారు అయినచో అట్టివారికి కాశిని సేవించుట సిద్ధించదు.

కాశ్యాం- శ్లో॥ *కింతు విఘ్నా భవిష్యన్తి కాశ్యాం నివసతాం సతామ్‌*
*తతో నైవాఽఽచరే త్పాపం కాయేన మనసా గిరా॥*

భా॥ కాశీయందు నివసించు సజ్జనులకు అనేక విఘ్నములు గలుగుచుండును అందుచేత త్రికరణముల చేతను పాపము చేయరాదు

లైంగే శ్లో॥ *మోక్షప్రదాయకం లింగం త్యక్త్వా యే ఽర్థస్య లిప్సయా*
*రాజప్రతిగ్రహాసక్తాః కృతకామ్యార్చయన్తి యే*
*తే రుద్రపాశ నిర్దగ్ధాః పతన్తి నరకే ధ్రువమ్‌॥*

భా॥ మోక్షప్రదాయకమగు విశ్వేశ్వర లింగమును వదలి ఎవరు అర్థమందలి లోభముతో రాజునుండి ప్రతి గ్రహము వాంఛించు బుద్ధిగలవారై ఇతర దేవతలను పూజింతురో అట్టివారు రుద్రపాశముచే దగ్ధులై నరకమునకు పోవుదురనుట నిశ్చయము

శ్లో॥ *యే పునః సిద్ధ లింగానాం ప్రాసాదానాం స్వశక్తితః*
*కుర్వన్తి పూజా సత్కారం తే ముక్తా నాత్ర సంశయః॥*

భా॥ అట్లుగాక సిద్ధలింగములున్న ఆలయములలో ఎవరు యథాశక్తిగా ఆ లింగములను పూజించి అలంకరింతురో అట్టివారు నిస్సంశయముగ ముక్తులగుదురు

తత్రైవ- శ్లో॥ *స్త్రీ శూద్రో నాభిభాషేత శూద్రాన్నం వర్జయే త్సదా*
*శూద్రాన్నరస పుష్టస్య నిష్కృతి ర్నస్య కీదృశీ॥*

భా- స్త్రీలతోను, శూద్రులతోను ఆసక్తితో భాషించరాదు శూద్రాన్నమును సదా వర్జించవలెను. శూద్రాన్నముచే దేహము పోషించుకొనిన వానికి ఎట్టి నిష్కృతియు లేదు

శ్లో॥ అమృతం బ్రాహ్మణస్యాన్నం, క్షత్రియాన్నం పయః స్మృతమ్।
వైశ్యాన్న మన్నమిత్యాహుః, శూద్రాన్నం రుధిరం స్మృతమ్॥

భా- బ్రాహ్మణాన్నమును అమృతమనియు క్షత్రియాన్నమును పయస్సు (పాలు) అనియు, వైశ్యాన్నమును కేవలము అన్నమనియు చెప్పుదురు కాని శూద్రాన్నం కేవలము రక్తమేయని చెప్పబడినది.

శ్లో॥ తస్మాదత్ర సదా దేవి! యదీచ్ఛే న్మామకం పదమ్।
శ్మశానవాసీ ధర్మాత్మా యథాలబ్ధేన వర్తయేత్॥

భా- ఓ దేవీ! అందుచేత నా యొక్క సాన్నిధ్యమును కోరినట్టి వాడు మహాశ్మశాన (కాశీ) వాసియై ధర్మాత్ముడై, యదృచ్ఛాలాభ సంతుష్టుడై యుండవలెను.

శ్లో॥ లభేత రుద్ర సాయుజ్యం సదా రుద్ర మనుస్మరన్।
షణ్మాసా ల్లభతే జ్ఞాన మస్మిన్ క్షేత్రే నిషేవితః॥

భా- అట్టివాడు సదా శివ నామ స్మరణము చేయుచు రుద్ర సాయుజ్యమును పొందును. అట్టివాడు కాశీ క్షేత్రమును సేవించి ఆరు మాసములలో జ్ఞానమును పొంది ముక్తి యోగ్యుడగును.

కాశీఖండే

శ్లో॥ అత్రోపేత్యాపి శ భక్తా స్వయుద్ధి తవః కుధీః
పర్త్యే ధృష్యాతి నా మూఢ స్తస్యాప్యత్రాత్ర నో గతిః॥

భా- కాశీయందుండియు కుత్సిత బుద్ధిగలవాడై ఈశ్వర భక్తుల తపస్సునకు ఆటంకము గల్గించుచు పరద్రోహ చింతన గల్గి యున్నచో ఇచ్చటను మరెచ్చటను గూడ వానికి సద్గతియుండదు.

తథా- శ్లో॥ మనసాఽపి హి విశ్వేశం విద్విష్టిహ మేఽధమః
అధ్యాసతే ఽన్ధ తామిస్రం మృతాస్తే ఽప్యత్ర సంతతమ్॥

భా- అట్లే కాశీపతియగు విశ్వేశ్వరుని కాశీలోనే యుండుటాగూడ మనస్పూర్వకమైనను ద్వేషించునట్టి అధముడు అక్కడ మరణించినవాడై అంధతామిస్రమను నరకములో బడి చిరకాలము దుఃఖించును.

శ్లో॥ శివనిందాపరా యే చ యే పాశుపతనిందకాః
విద్విషో మమ తే జ్ఞేయాః పతన్తే నరకే ఽచిరాత్॥

భా- శివుని ఎవరు నిందింతురో పాశుపత దీక్షను ఎవరు నిందింతురో అట్టివారు నాకు ద్వేషింపదగిన వారగుదురని తెలియవలెను అట్టివారు నరకమున పడుదురని విష్ణువు చెప్పెను.

శ్లో॥ అష్టావింశతి కోటీషు నరకేషు క్రమేణహి
కల్పం కల్పం వసేయు స్తే యే విశ్వేశ్వరనిందకాః (మను విష్ణు)

భా విశ్వేశ్వర నిందకులగు వారు ఇరువది ఎనిమిది విధములగు నరకములయందు క్రమముగ ఒక్కొక్క కల్పకాలము పడియుండి బాధలకు గురియగుదురు

*తథా శ్లో॥ యైశ్చ కాశీస్థితే జన్తు రల్పకేఽపి విరోధితః॥*

*తై స్తై ర్విశ్వంభరా సర్వా మయాసహ విరోధితా॥*

భా ఎవరికి కాశిస్థితమగు అల్పప్రాణియెడలను విరోధభావము గల్గునో అట్టివారిపట్ల నాతో సహా సమస్త భువనములు విరోధ భావమునే వహించును అని శివుడు పల్కెను

*తథా శ్లో॥ నివసన్తి మమ క్షేత్రే మమ భక్తిం ప్రకుర్వతే*

*మమ లింగధరా యే తు తానేవోపదిశా మ్యహమ్॥*

భా అట్లే కాశిలో నివసించుచు నాయందు ఏకాంత భక్తిని గలిగియుండి నా ప్రతీకమగు లింగమును ధరించి యుందురో అట్టి వారికి నేను తారకముపదేశింతును

*శ్లో॥ నివసన్తి మమ క్షేత్రే మమభక్తిం న కుర్వతే।*

*మమ లింగధరా యే నో న తానుపదిశామ్యహమ్॥*

భా నా క్షేత్రమగు కాశియందు నివసించుచు నాయందు భక్తి లేకుండ నా ప్రతీకమగు లింగమును ధరింపని వారికి నేను తారక మంత్రమును ఉపదేశింపను

*తథా శ్లో॥ సేవ్యోత్తరవహా నిత్యం లింగమర్చ్యం ప్రయత్నతః॥*

*దమో దానం దయానిత్యం కర్తవ్యం ముక్తికాంక్షిభిః॥*

భా ఇచ్చట ముముక్షువులచే ఉత్తర వాహినియగు గంగ నిత్యము సేవింపదగినది విశ్వేశ్వర లింగము దీక్షగ అర్చింపదగినది ఇచ్చటి వారలకు శమము దమము దానము భూతదయ నిత్య కర్తవ్యములు

శమము *శ్లో॥ఏక వృత్త్యైవ మనసః స్వలక్ష్యే నియత స్థితిః*

*శమ ఇత్యుచ్యతే సద్భిః శమలక్షణ వేదిభిః॥*

భా మనస్సు ఏకాగ్రవృత్తిచే లక్ష్యమునందు స్థిరముగ నిల్పుటయే శమము శమః మనోనిగ్రహః (శమమనగా మనస్సును నిగ్రహించుట అనగా అంతరింద్రియనిగ్రహము) (శ్రీశంకరాచార్య కృత తత్త్వబోధ)

*దమము - శ్లో॥ బ్రహ్మచర్యాదిభిర్ ధర్మై ర్బుద్ధేర్దోష నివృత్తయే*

*దండనం దమ ఇత్యాహుః మనసశ్శాన్తి సాధనమ్॥*

భా బుద్ధిగత దోషముల నివృత్తి కొరకు బ్రహ్మ చర్యాది ధర్మములచే బుద్ధిని దాపించుటయే దమము ఈ దమమే మనస్సు యొక్క శాంతస్థితికి కారణమగుచున్నది దమః చక్షురాది బాహ్యేంద్రియ నిగ్రహః (దమమనగా నేత్రము మొదలగు బాహ్యేంద్రియములను నిగ్రహించుట) (తత్త్వబోధ)

శ్లో॥ ఇదమేవ రహస్యంచ కథితం క్షేత్రవాసినామ్॥
సతిః పరహితే కార్యా వాచ్యం నోద్వేగకృ ద్వచః॥

భా॥ ఈ క్షేత్ర వాసులకు ఈ రహస్యముపదేశించబడినది అది ఏమనగా పరహిత బుద్ధి గలిగియుండవలెను ఉద్వేగకరమగు మాటలను ఏమియు పలుకరాదు

శ్లో॥ మనసాఽపి న కర్తవ్య మేనోఽత్ర విజిగీషుణా
అక్షయ్య మక్షయం యస్మాత్సుకృతం సుకృతేతరత్॥

భా॥ కాశీవాసులై ముక్తిజయమును కోరువారు మనస్సునందైనను పాపమును తలపెట్టరాదు ఏమనగా ఇచ్చట తలపెట్టిన సుకృతము గాని దుష్కృతము గాని అక్షయమగును

శ్లో॥ మరణం నాభికాంక్షేత, కాంక్షే మోక్షోఽపి నో పునః
శరీర పోషణోపాయః కర్తవ్యం సుధియాఽత్ర హి॥

భా॥ కాశీవాసులు కావలెనని మరణమును కోరుకొనగూడదు అలాగని మోక్షమును గూడ కోరరాదు ఇచ్చట సుజనులచేత శరీర పోషణోపాయము తప్పక చేయదగినది

శ్లో॥ శరీర సౌష్ఠవం కాంక్ష్యం వ్రతస్నానాది సిద్ధయే॥
ఆయుర్ బహ్వత్రవై చిన్త్యం మహాబలసమృద్ధయే॥

భా॥ ఇచ్చట వ్రత స్నానాదుల సిద్ధికొరకు శరీర సౌష్ఠవము (ఆరోగ్య కరమయిన శరీరము) కాంక్షింపదగినది మోక్షసాధన నిర్వహణకై అవసరమగు బల సమృద్ధి కొరకు దీర్ఘాయుష్షు గూడ కోరదగినదే

తథా- శ్లో॥ కృచ్ఛ్రచాంద్రాయణాదీని కర్తవ్యాని ప్రయత్నతః॥
యథేన్ద్రియ వికారాశ్చ న బాధన్తేఽత్ర కర్హి చిత్॥

భా॥ ఈ కాశీనగరమున ఎవరినైనను ఇంద్రియవికారములు బాధించవంతవరకు కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు ప్రయత్న పూర్వకముగ చేయవలెను

శ్లో॥ యదీన్ద్రియాణి కుర్వన్తి విక్రియామిహ దేహినామ్॥
తదా ఽత్ర వాసనంసిద్ధి ర్విఘ్నైర్యో నైవలభ్యతే॥

భా॥ ఇచ్చట దేహధారుల ఇంద్రియములు విక్రియత్వమును పొంది నప్పుడు అట్టి విఘ్నముల వలన కాశీవాసులకు క్షేత్ర వాసనంసిద్ధి పూర్ణముగ లభించదు

తథా- శ్లో॥ యథాశక్తి చ దేయాని దానాన్యత్ర సుగుప్తవత్॥
అన్యాన్యపిచ దేయాని విఘ్నా న్పరిజిహీర్షుణా॥

భా॥ ఇచ్చట విఘ్నములను దూరముగ నుంచుటకై యథాశక్తి దానాదులను చేయవలెను అదియును గుప్త దానము చేయుట శ్రేష్ఠము ఇతర విధములైన దానములను గూడ వీలైనంత వరకు చేయవలెను

శ్లో॥ పరోపకరణం చాత్ర కర్తవ్యం సుధియా సదా
పర్వస్వపి విశేషేణ స్నానదానాదికాః క్రియాః॥ ౪౬

భా॥ కాశియందు సుబుద్ధిగల వారిచే ఎల్లప్పుడు పరోపకారము చేయుటకు ప్రయత్నించబడు చుండవలెను విశేషించి పర్వములయందు స్నానదానాది క్రియలను పాటించవలెను

శ్లో॥ విశేషపూజా కర్తవ్యా సుమహోత్సవ పూర్వకమ్।
కార్యా స్తథాఽధికా యాత్రాః సమర్చ్యాః క్షేత్రదేవతాః॥

భా॥ మహోత్సవ పూర్వకముగ విశేష పూజలను చేయవలెను అధికముగ ఈ క్షేత్రములోనే యాత్రలు చేయుచు క్షేత్ర దేవతలను చక్కగ అర్చించవలెను

శ్లో॥ అత్ర మర్మ న వక్తవ్యం సుధియా కస్యచిత్ క్వచిత్।
పరదార పరద్రవ్య పరాపకరణం త్యజేత్॥

భా॥ ఇచ్చట వ్యంగ్యముగను మర్మగర్భముగను ఎవరితోను ఎప్పుడును మాట్లాడగూడదు పరదార పరద్రవ్య పరాపకారముల జోలికి పోరాదు

శ్లో॥ పరాపవాదో నో వాచ్యః పరేర్ష్యాం న చ కారయేత్।
అసత్యం నైవ వక్తవ్యం ప్రాణైః కంఠగతైరపి॥

భా॥ ఇచ్చట పరాపవాదము పలుకరాదు ఇతరులను గూర్చి ఈర్ష్య పడరాదు ప్రాణము కంఠగతమైనను అసత్యము చెప్పరాదు

శ్లో॥ అత్రత్య జన్తురక్షార్థ మసత్యమపి భాషయేత్।
యేనకేన ప్రకారేణ శుభేనా ప్యశుభేన వా॥

భా॥ కాశిలో నున్నట్టి ఎట్టిప్రాణినైనను రక్షింపవలసి వచ్చినచో అసత్యమైనను పలుకవచ్చును శుభ మార్గమునగాని అశుభ మార్గమున గాని ఏవిధముగనైనను ఆ ప్రాణి రక్షణ చేయవలెను

శ్లో॥ అత్రత్యః ప్రాణిమాత్రోఽపి రక్షణీయః ప్రయత్నతః।
ఏకస్మిన్ రక్షితే జన్తావత్ర కాశ్యాం ప్రయత్నతః॥
త్రైలోక్య రక్షణాత్పుణ్యం యత్స్యాత్తత్స్యా న్నసంశయః॥

భా॥ ఇక్కడనున్నట్టి సామాన్య జంతువునైనను ప్రయత్న పూర్వకముగా రక్షింపవలెను ప్రయత్నించి ఇచ్చట ఏ ఒక్క జంతువునైనను రక్షింపబడినచో దానిచే ముల్లోకములను రక్షించినంతటి పుణ్యము గలుగుననుటలో సందేహమావంతయు లేదు

శ్లో॥ యే వసన్తి సదా కాశ్యాం క్షేత్ర సంన్యాసకారిణః।
తఏవ రుద్రా మన్తవ్యా జీవన్ముక్తా న సంశయః॥

భా॥ ఎవరు క్షేత్ర సంన్యాసము చేసి (అనగా ఇతర క్షేత్రములకు వెళ్లను అనుదీక్ష) కాశిక్షేత్రమందే నివాసము చేయుచుందురో అట్టివారిని జీవన్ముక్తులైన రుద్రులుగ భావింపవలెననుటలో ఎంతమాత్రము సంశయము లేదు

శ్లో॥ *తే పూజ్యా స్తే నమస్కార్యా స్తే సంతోష్యాః ప్రయత్నతః*

*తేషు వై పరితుష్టేషు తుష్టో విశ్వేశ్వరః స్వయమ్॥*

భా॥ అటువంటి వారు పూజ్యులు వారు నమస్కార యోగ్యులు అట్టి వారిని ప్రయత్న పూర్వకముగ సంతోష పెట్టవలెను అట్టివారు పరితుష్టి నొందినచో స్వయముగ విశ్వేశ్వరుడు తుష్టి నొందును

తథా శ్లో॥ *ప్రసరస్త్వింద్రి యాణాం చ నివార్యో ఽత్ర నివాసిభిః*

*మనసో ఽపిహ చాంచల్య మిహ వార్యం ప్రయత్నతః॥*

భా॥ బాహ్య విషయముల వైపు పరుగులెత్తు ఇంద్రియ చాపల్యము కాశీవాసులచే నివారింపదగినది దృఢ ప్రయత్నముచేత మనశ్చాంచల్యమును అరికట్టవలెను

తథా- శ్లో॥ *అతః కాశ్యాం ప్రయత్నేన స్నానం దానం తపో జపః*

*వ్రతం పురాణశ్రవణం స్మృత్యుక్తార్థనిషేవణమ్॥*

భా॥ అందుచే కాశీయందు గట్టి ప్రయత్నముతో స్నాన దానములు తపోజపములు పురాణ శ్రవణము మొదలగునవియు స్మృతి విహితములగు మాటలను వినుట ఇత్యాది సత్కర్మలు చేయవలెను

శ్లో॥ *ప్రతిదినం ప్రతిక్షణం విశ్వేశ పదచింతనమ్।*

*లింగార్చనం త్రికాలంచ లింగస్యాపి ప్రతిష్ఠితిః॥*

భా॥ కాశీయందు ప్రతిదినము ప్రతిక్షణము విశ్వేశ పదచింతనముతోను లింగ సన్నిధిని త్రికాలములయందును లింగార్చనముతోడను లింగ ప్రతిష్ఠతోను కాలము గడుపవలెను

శ్లో॥ *సాధుభిః సహ సంవాసో జల్పః శివశివేతిచ।*

*అతిథేశ్చాపి సత్కారో మైత్రీ తీర్థ నివాసిభిః॥*

భా॥ సాధుజనులతోను సాంగత్యము శివశివయను నామస్మరణము అతిథి సత్కారము తీర్థనివాసులతో సన్మైత్రి పాటించవలెను

శ్లో॥ *అస్తిక్యబుద్ధి ర్వినయో మానావమాన సమామతిః।*

*అకామితాత్వ నౌద్ధత్య మరాగిత్వ మహింసనమ్॥*

భా॥ ఇంకను ఆస్తిక్య బుద్ధి, వినయము గల్గి యుండవలెను మానావమానముల యందు సమానబుద్ధి అకామత్వము (ఏమియు కోరకుండుట) ఔద్ధత్యము లేకుండుటయు రాగద్వేషములను వీడుటయు అహింసను పాటించుటయు చేయవలెను

శ్లో॥ *అప్రతిగ్రహ వృత్తిత్వ మతిశ్చానుగ్రహాత్మికా।*

*అదంభితా మాత్సర్య మప్రార్థిత ధనాగమః॥*

భా॥ అప్రతిగ్రహముతో వర్తించుట అందరియందును అనుగ్రహ బుద్ధిని గలిగి యుండుట

గర్వము లేకుండుట మాత్సర్యము లేకుండుట కోరిధన సంపాదనము చేయకుండుట ఈనియమములు పాటించవలెను

శ్లో॥ అలోభిత్వమనాలస్య మపారుష్యమదీనతా
ఇత్యాది సమ్యగ్వృత్తిశ్చ కర్తవ్యా క్షేత్రవాసినా॥

భా॥ లోభత్వము లేకుండుట అలసత్వము లేకుండుట పరుషత్వము లేకుండుట దీన భావమును వదలుట ఈ మొదలగు లక్షణములతో గూడిన సమ్యగ్వర్తనము క్షేత్ర వాసులందరికిని కర్తవ్యము

వచనము "ఇతి వ్యాసోపదేశ ఇత్యలంబహునా తత్సిద్ధం స్మృతి నిషిద్ధస్య కాశ్యాం పునర్నిషేధే తదనుష్ఠానే స్మార్త వైశేషిక ప్రాయశ్చిత్తయోః సముచ్చయ ఇతి॥"

(ఈ వచనము యొక్క పూర్తి పాఠమును "త్రిస్థలీసేతు,కాశీప్రకరణము పేజీలు 123 125 లలో చూడనగును)

సారాంశము వ్యాసోపదేశమున స్మృతి విహితమైన విధులే కర్తవ్యములని చెప్పి స్మృతి విహితము గానివి నిషేధించబడినవి విశ్వేశ్వర పూజావాదులు విహితములు కాగా గంగా స్నానము చేయకుండ భోజనము మొదలైనవి నిషిద్ధము లైనవి కాశీయందు కొన్ని విధింపబడి కొన్ని నిషేధింపబడుచున్నవి సత్య వచనాదులు విహితములుకాగా ద్వేషాదులు నిషిద్ధములు వానిలో విహితమైనవి అతిక్రమింపబడినచో అంతర్గృహయాత్రాదులు ప్రాయశ్చిత్తము విశేష విహితము లగుచున్నవి కామ రహితులైన వారికి విహితమైనవి కామయుతులైన వారికి ద్విగుణముగ విహితమగుచున్నవి అట్టి విధి నిషేధములకు ప్రత్యవాయముగలిగినప్పుడు పాపము బలమైనచో ఎక్కువగను లఘు పాపమునకు లఘువుగను ప్రాయశ్చిత్తము జేసికొనవలెను అను గౌతమ మాత్రము గ్రాహ్యమగుచున్నది. తీర్థాంతరములందు చేసిన పాతకముల కంటె కాశీయందు చేసిన పాతకము అతిశయమగునని అగమప్రమాణముచే కాశీయందు ప్రాయశ్చిత్తము గూడ అధికముగ చేసికొనవలసి యుండును గురుతరమైన దురితమును నశింపజేయుటలో వైశేషిక విధికే అతిశయమైన శక్తిగల దనుటయే న్యాయము స్మృతి విరుద్ధమైనవి కాశీయందు తిరిగి నిషేధింపబడుటచే, వాని అనుష్ఠానమున స్మార్తవైశేషిక ప్రాయశ్చిత్తములు కలిపి యుండుననుట సిద్ధమగుచున్నది

(१८) అథ క్షేత్రసంన్యాస విధిరూప పురాణే - (క్షేత్ర సంన్యాస విధి)

శ్లో॥ మాఘశుక్ల చతుర్దశ్యా ముపోష్యాహ పూర్వేఽహని।
బ్రాహ్మణాన్భోజయే ద్భక్త్యాదేకం వాఽపి సదక్షిణమ్॥

భా - మాఘ శుక్ల త్రయోదశి నాడు ఉపవసించి మరునాడు అనగా చతుర్దశి రోజున బ్రాహ్మణ సమారాధన చేయవలెను అశక్తుడైనచో ఒక్క బ్రాహ్మణున కైనను భోజనము పెట్టి దక్షిణ నీయవలెను

శ్లో॥ గత్వా మౌనేన స్నానం జ్ఞానవాప్యాం సమాచరేత్
శుక్లాంబరధరో భూత్వా నత్వా ఢుంఢి వినాయకమ్॥

మౌనముగ వెళ్లి జ్ఞానవాపి యందు స్నాన మాచరింపవలెను శుభ్రమగు తెల్లని వస్త్రములు ధరించి ఢుంఢిగణపతికి నమస్కరించవలెను

శ్లో॥ *దండపాణిం తతో నత్వా దృష్ట్వా విశ్వేశ్వరం చ మామ్।*
*శ్రీముక్తిమండపం గత్వా కుర్యాత్సంకల్పమాత్మనా॥*

భా॥ పిదప దండపాణికి నమస్కరించి నన్ను (విశ్వేశ్వరుని) దర్శించి శుభప్రదమైన ముక్తి మండపమునకు వెళ్లి తన కొరకై తానే సంకల్పము చేయవలెను

శ్లో॥ *ప్రాణాయామ త్రయం కృత్వా జపేత్పంచాక్షరం మనుమ్।*
*కరిష్యే క్షేత్ర సంన్యాస మితి సంచింతయేద్బుధః॥*

భా॥ అంతట మూడు పర్యాయములు ప్రాణాయామము చేసి పంచాక్షరీ మంత్రమును జపించవలెను పిదప ఆ పణ్డితుడు "నేను క్షేత్ర సంన్యాసము చేయుదును అని సంకల్పించవలెను

శ్లో॥ *పంచక్రోశాద్బహిః క్షేత్రా న్నగచ్ఛామ్యంబికా పతే।*
*ఇమం మన్త్రం పఠేదుచ్చైర్ద్విస్త్రిః పంచ చ సప్త వా॥*

భా॥ "ఓ అంబికాపతీ! ఈ క్షేత్ర పరిమితియగు పంచక్రోశములను అతిక్రమించి పోను" అను మంత్రమును రెండు మూడు ఐదు లేక ఏడు పర్యాయములైనను బిగ్గరగ పఠించవలెను

శ్లో॥ *నమస్కృత్య మహాదేవం దండపాణిం తతో వ్రజేత్।*
*సాక్షీకృత్య మహాత్మానం దండపాణిం వినాయకమ్॥*

శ్లో॥ *శ్రీకాలభైరవం చైవ సాక్షీ కుర్యాత్ప్రయత్నతః।*
*ఏవం కృత్వా విధానేన పశ్చాత్కుర్యాత్తు భోజనమ్॥*

భా॥ మహాదేవునకు నమస్కరించి అంతట దండపాణి వద్దకు పోయి ఆయనను వినాయకుని సాక్షులుగ చేసుకొని ప్రయత్న పూర్వకముగ కాలభైరవుని గూడ సాక్షిగ చేసికొనవలెను ఈ విధానమంతయు పూర్తియైన పిదప భోజనము చేయవలెను.

శ్లో॥ *పూర్వసంచిత విత్తాది దద్యాత్సర్వం మమా ఽఽజ్ఞయా।*
*య ఏవం కురుతే న్యాసం క్షేత్రే దేవి విధానతః॥*
*సర్వపాప వినిర్ముక్తో ముచ్యతే నాత్ర సంశయః॥*

భా॥- ఇట్లు నా యాజ్ఞను శిరసావహించి పూర్వసంచితమైన విత్తమును సర్వమును విధాన పూర్వకముగ దానము చేయవలెను

ఈ క్షేత్రమున ఈ విధిగ న్యాసము చేసిన వాడు సర్వపాపముల నుండి విముక్తుడగునను టలో ఎట్టి సందేహమును లేదు

వచనము మాఘేత్యాది త్రయోదశ్యాముపోష్య చతుర్దశ్యాం బ్రాహ్మణభోజన జ్ఞానవాపీ స్నానాది క్రమేణ కుర్యాదిత్యర్థః। అత్ర గృహస్థానా మప్యధికారః॥

భా॥ "మాఘేత్యాది యనుటలో త్రయోదశినాడు ఉపవసించి చతుర్దశినాడు బ్రాహ్మణ

భోజనము జ్ఞానవాపీ స్నానాదులు క్రమముగచేయవలెనని అర్థము దీనికి గృహస్థులకును అధికారము గలదు

*శ్లో॥ తతః ప్రభృతి చార్వంగి యేఽపి క్షేత్రనివాసినః*
*గృహిణో లింగినోవాఽపి మద్భక్తా మత్పరాయణాః*
*మత్ప్రసాదా ద్భమిష్యన్తి మోక్షం పరమ దుర్లభమ్॥*

భా ఓ దేవీ! ఇంతటనుండి ఈ క్షేత్ర నివాసులైనవారు గృహస్థులు గాని యతులుగాని నా భక్తులై నన్నే అనన్యగతిగ తలంచువారు నాయనుగ్రహము వలన పరమదుర్లభమైన మోక్షమును పొందుదురు

వచనము ఇతి శివపురాణాత్। అత్రచ బ్రాహ్మణస్యైవాధికారః సర్వస్వదానస్యవిధానాత్। క్షత్రియాదీనాంచ తద్దానే సతి ప్రతిగ్రహనాధికారా దజీవనాపత్తే। అత ఏవ కౌర్మే

వసేదా మరణాద్విప్రో వారాణస్యాం సమాహితః । ఇతి విప్రగ్రహణం కృతమ్। అన్యేతు క్షేత్ర సంన్యాసాంగ భూత సర్వస్వదానే ఒపి కరణేఽపి న దోష స్తేన సర్వేషాధికారః విప్రగ్రహణంతు తత్ప్రాప్త్యర్థం నత్వితర నివృత్త్యర్థం త్రిదోష పరిసంఖ్యా పాతాదిత్యాహుః అయంచ క్షేత్ర సంన్యాసో వారాణసీ క్షేత్ర విషయో న తు కాశీవిషయః మధ్యే ప్రదక్షిణం కుర్యాదసీ వరణయోః కృతీ ఇతి క్షేత్రసంన్యాసి పంచక్రోశ యాత్రాయాముక్తే।

భా అని శివపురాణమునుండి తెలియుచున్నది సర్వస్వదానమును విధించుటచే ఇచ్చట బ్రాహ్మణునకే అధికారము గలదు క్షత్రియాదులకు సర్వస్వదానముచేయుటచే మరల ప్రతి గ్రహమునకు అధికారము లేకపోవుటచే వారి జీవన నిర్వహణమునకు ఆటంకమేర్పడును అందుచేతనే కూర్మ పురాణమున విప్రుడు వారాణసియందు ఆ మరణాంతము నివసించవలెను అని విప్రశబ్దమే గ్రహించబడినది. మిగిలినవారి విషయమున క్షేత్ర సంన్యాసమునకు అంగభూతమైన సర్వస్వదానము చేయబడినప్పటికిని క్షత్రియాదులచే ధర్మముగా తమ జీవన నిర్వహణము మాత్రమే జరుపుకొనుటకు గాను వ్యవసాయాదులు చేయుట దోషము గాదు అందుచేత అందరికిని క్షేత్ర సంన్యాసము చేయుటకు అధికారముగలదని తెలియుచున్నది. విప్ర గ్రహణము విప్రులకు విధాయకమని చెప్పుటకే గాని ఇతరులను నివృత్తి చేయుటకు గాదు ఇచట త్రిదోష పరిసంఖ్యా విధిని బట్టి గ్రహించవలెను ఈ క్షేత్ర సంన్యాసము అనునది వారాణసీ యందే నివసించవలెను అనువట్టి వారికి గాని కాశీ విషయకము గాదు క్షేత్ర సంన్యాసి అసీ వరణలకు మధ్యనే ప్రదక్షిణము చేయవలెను అని పంచక్రోశ యాత్రా సందర్భమున చెప్పుట చేత

**(17) అథ నానాకామ్యకర్మాణి - (నానావిధ కామ్యకర్మలు)**

*బ్రాహ్మే మాత్స్యేచ కాశీం ప్రకృత్య - (కాశీని గురించి)*

*శ్లో॥ తత్రదీప ప్రదానేన జ్ఞానచక్షు రతీన్ద్రియమ్।*
*ప్రాప్నోతి ధూపదానేన స్థానం రుద్రనిషేవితమ్॥*

భా॥ పది అశ్వమేధ యాగములు చేసిన ఫలము ఇచ్చట స్నానము చేయుట వలన గల్గును

శ్లో॥ స్వల్పమప్యత్ర యోదద్యాద్బ్రాహ్మణేవేదపారగే।
శుభాంగతిమవాప్నోతి అగ్నివజ్జ్వన దీప్యతే॥

భా॥ ఇచ్చట వేదపారంగతుడగు బ్రాహ్మణునకు ఎంత స్వల్పముగ దానము చేసినను అగ్ని కణము ప్రజ్వలించి దీపముగ వెలిగినట్లు గొప్పదైన గతిని పొందుదురు

శ్లో॥ ఉపవాసంతుయః కృత్వా విప్రానసంతర్పయేద్ద్విజః।
సౌత్రామణి యజ్ఞస్యఫలం ప్రాప్నోతి నిశ్చితమ్॥

భా॥ ఎవడు ఉపవాసముండి బ్రాహ్మణులకు సంతర్పణము చేసి తృప్తిగల్గించునో అట్టివాడు సౌత్రామణియను యజ్ఞఫలమును నిశ్చయముగ పొందును

వచనము - వచనము "విప్రా"నితి బహువచనాద్ర యధికాన్యత్వా భోజయేత్ శక్తి పదోపేత వాక్యస్థర సమానార్థత్వా దపూర్వాంతర కల్పనానాపత్తేశ్చ కశ్చిత్తు కపింజల న్యాయేన త్రి నిత్యాహ

భా॥ విప్రులు అని బహువచనము చెప్పుటచే ముగ్గురు గాని అంతకంటె ఎక్కువ మంది బ్రాహ్మణులకు గాని శక్తి కొలది భోజనము పెట్టవలెను శక్తి కొలది యను పదము నుపయోగించుటచే అపూర్వాంతర కల్పనకు ఆపత్తిలేదు మరికొందరు కపింజల న్యాయముచే ముగ్గురని చెప్పిరి (అధికస్య అధికంఫలమ్)



భా॥ కాశీయందు దీపదానము చేయుట వలన అతీంద్రియమైన జ్ఞాన చక్షువును పొందుచున్నాడు ధూపదానముచే రుద్రుని ఆవాస స్థానమును పొందగల్గుచున్నాడు

తథా॥ శ్లో॥ అర్చయేద్యశ్చమాందేవి అవిముక్తే వరాననే।
తస్యధర్మం ప్రవక్ష్యామి యావదాప్నోతి మానవః॥

భా॥ ఓ దేవీ! ఎవరు నన్ను అవిముక్త క్షేత్రమున అర్చించెదరో అట్టి మానవుడు పొందు ధర్మమును చెప్పుచున్నాను వినుము

శ్లో॥ దశసౌవర్ణికం పుష్పం యోఽవిముక్తే ప్రయచ్ఛతి।
అగ్నిహోత్రఫలం ధూపే గంధదానేన చ తద్భువః॥

పది సువర్ణములను దానము చేసిన ఫలితమును అవిముక్తమందు ఒక పుష్పమునాకు సమర్పించిన వానికి కల్గును ధూపదానము చేసిన వానికి అగ్నిహోత్రము చేసినచో గల్గునంతటి ఫలము గల్గును

శ్లో॥ భూమిదానేన తత్తుల్యం గంధదానఫలం స్మృతమ్।
సంమార్జనే పంచశతం సహస్రమనులేపనే॥

భా॥ గంధదానము చేసినవానికి భూదానము చేసినంతటి పుణ్యము లభించును అవిముక్త క్షేత్రమున సంమార్జనము (తుడిచి శుభ్రము చేయుట) చేసినవానికి ఐదువందట గోవులను దానము చేసినంతటి ఫలము అనులేపనము (అలికి శుభ్రము చేయుట) చేసినవానికి నూరుగోవులను దానము చేసినంతటి ఫలము గల్గును

శ్లో॥ మాల్యేశతసహస్రంతు అనంతం గీతవాదనే।

భా॥ పుష్పమాలలతో అలంకరించిన ఎ నికి మూడు లక్షల గోవులను దానము చేసినంతటి ఫలము గీత వాద్యములను వినిపించిన వానికి అనంత గోదాన పలము గల్గును

వచనము దీపేతాశియది దశసువర్ణదాన జన్యం ఫలమేకపుష్ప సమర్పణాద్భవతి। ధూపేఽగ్నిహోత్ర జన్యం। గంధేభూమి దాన జన్యం। సంమార్జనే గోపంచ శతీదాన జన్యం। అనులేపనే సహస్ర గోదానజం। మాలాయాం గోలక్షదాన జన్యం। గీతేవాద్యే చానన్త గోదాన జం ఫలంభవతీత్యర్థః॥

భా॥ ఈ వచన భావముపై శ్లోకముల యొక్క భావమే యని గ్రాహ్యము

లైంగే - కాశీ ప్రకరణే-

శ్లో॥ దశానామశ్వమేధానాం యజ్ఞానాం యత్ఫలం స్మృతమ్।
తదవాప్నోతి ధర్మాత్మా స్నాత్వా తత్రనరాధిపే।

తథా  శ్లో॥ ఏకాహారస్తు యస్తిష్ఠే స్నానం తత్ర వరాననే ।
యావజ్జీవకృతం పాపం మాసేనైకేన నశ్యతి॥ (ఏకాహార  ఏకాన్నాహారః)
భా॥ కాశియందు ఏకాహార నియమముతో ఒక నెలయైనను ఎవరు గడుపుదురో వారికి యావజ్జీవకృత పాపము ఆ ఒక్క మాసములోనే నశించును

శ్లో॥ అగ్ని ప్రవేశం యేకుర్యు రవిముక్తే విధానతః
ప్రవిశన్తి ముఖం తే మాం న పునర్భావినో నరాః
భా॥ శాస్త్ర విహితమగు విధానమున కాశిలో అగ్ని ప్రవేశముచేసిన వారు ముకరముగా నన్ను జేరి పునర్జన్మ విముక్తులగుదురు

శ్లో॥ కుర్వన్త్యనశనం యే తు మద్భక్తా కృతనిశ్చయాః
న తేషాం పునరావృత్తిః కల్పకోటి శతైరపి ॥
భా॥ నా భక్తులై కృతనిశ్చయముతో అనశనము(ప్రాయోపవేశము) పాటించినవారు కల్పకోటి శతములకు పిమ్మటనైనను పునరావృత్తి రహితులగుదురు

శ్లో॥ అవిముక్తే మహాదేవ మర్చయన్తి స్తువన్తి యే
సర్వపాప వినిర్ముక్తా స్తే తిష్ఠన్త్యజరామరాః॥
భా॥ అవిముక్త క్షేత్రమున మహాదేవుని పూజించి స్తుతించినవారు సర్వ పాపములనుండి విముక్తులై అజరామరులగుదురు

శ్లో॥ అవిముక్తం సమాసాద్య లింగమర్చయతే తు యః
కల్పకోటి శతైశ్చాపి న తస్యాస్తి పునర్భవః ॥
భా॥ అవిముక్తమును పొంది లింగార్చన చేసినవారు కల్పకోటి శతములకైనను పునర్భవము లేకుందురు

శ్లో॥ అమరోహ్యజరశ్చైవ తిష్ఠేచ్ఛాంభవ సంనిధౌ
యే చ ధ్యానం సమాసాద్య యుక్తాత్మానః సమాహితాః ॥
భా॥ ఆత్మ సంయమనముతో శివధ్యానము చేసినవారు శంభు సన్నిధిని అజరామరులై యుందురు

శ్లో॥ సంనియమ్యేన్ద్రియ గ్రామం కృతార్థాస్తే న సంశయః
అవిముక్తే స్థితా నిత్యం కృతార్థాస్తే న సంశయః ॥
భా॥ ఇంద్రియ సమూహమును నిగ్రహించుకొని శతరుద్రీయమును జపించుచు అవిముక్తమున నుండువారు కృతార్థులనుటలో ఎట్టి సంశయము లేదు

శ్లో॥ ఏకాహం ఉపవాసం యః కరిష్యతి యశస్విని
ఫలం వర్ష శతస్యేహ లభతే మత్పరాయణః ॥
భా॥ ఓ దేవీ ! ఇక్కడ ఏకాహము ఉపవాసము చేసినవారు మత్పరాయణులై గడిపినచో అట్టివారు వర్షశతోపవాసము ఫలమును పొందుదురు(వర్షశతోపవాసస్యేత్యర్థః)

మాత్స్యే - శ్లో॥ సువర్ణశృంగం రౌప్యఖురీం చైలాఢ్యం చ పయస్వినీమ్॥
వారాణస్యాంతు యోదద్యా దాకర్ణాయత లోచనే॥

భా॥ ఓ విశాలాక్షీ! కొమ్ములకు బంగారుతొడుగు గిట్టలకు వెండితొడుగు చేయించి వస్త్రము కప్పిన పాడియావును కాశీలో దానమివ్వవలెను

శ్లో॥ గాం దత్వాతు వరారోహే బ్రాహ్మణే వేదపారగే।
ఆసప్తమం కులంతేన పావితం నాత్ర సంశయః॥

భా॥ ఓ దేవీ! కాశీ యందు వేదపారంగతుడైన సద్బ్రాహ్మణునకు గోదానము చేసినచో ఆ పుణ్య వశమున అతని ఏడు తరములవారు పవిత్రులగుదురనుటలో సందేహము లేదు

శ్లో॥ యో దద్యాద్బ్రాహ్మణే కించిత్తస్మిన్ క్షేత్రే వరాననే।
కనకం రజతం వస్త్రమన్నాద్యం బహువిస్తరమ్॥
అక్షయం చావ్యయం చైవ స్యాత్తత్తస్య సులోచనే॥

భా॥ ఓ దేవీ! ఈ కాశీ క్షేత్రమున బ్రాహ్మణునకు బంగారము వెండి వస్త్రము అన్నము మొదలగునవి యెంత స్వల్పముగానైనను దానము చేసినచో అది అక్షయము అవ్యయము నగును

తథా-శ్లో॥ అన్యత్ర బ్రాహ్మణానాం తు కోటిం సం భోజ్యయత్ఫలమ్।
వారాణస్యాం ముద్దైకేన భోజితేన తదాప్యతే॥

భా॥ అన్యత్ర కోటి బ్రాహ్మణులకు భోజనము పెట్టినంతటి ఫలము కాశీయందు తృప్తిగా ఒక్క బ్రాహ్మణునకు పెట్టినచో లభించును

తథా- శ్లో॥వృషభం తరుణం సౌమ్యం చతుర్వత్సతరీ యుతమ్
యశ్చాంకయిత్వా మోచయతి స యాతి పరమాంగతిమ్॥
పితృభిః సహితో మోక్షమ్ గచ్ఛత్యత్ర న సంశయః॥

(అంకనం దక్షిణ వామ పార్శ్వయో శ్చక్రత్రిశూలాభ్యాం। అత్ర వత్స తరీ చతుష్టయ యుతత్వాంకన రూప సమాన ధర్మోక్త వృషోత్సర్గత్వేన చ తదితికర్తవ్యతా గ్రాహ్యా)

భా॥ తరుణ వయస్సులో నున్న ఒక సాధువగు వృషభమును నాలుగు పెయ్యదూడలతో గూడ కలిపి ఎవరు అచ్చుబోసి వదిలి పెట్టుదురో వారు పరమ గతిని పొందుదురు అట్టివారు నిస్సంశయముగ మోక్షమును పొందుదురు (అంకనము అనగా చురకవేయుట కుడి ఎడమ పార్శ్వముల యందు చక్రము త్రిశూలము యొక్క గుర్తులతో చురకవేయుట ఇచ్చట వత్సతరీ (పెయ్యదూడలు) చతుష్టయము చెప్పుట సమాన ధర్మము కొరకేగాని వృషోత్సర్గమున అది కర్తవ్యముగా గ్రహింపదగినది గాదు)

*తథా- శ్లో॥ కిమత్ర బహునోక్తేన యద్దానం క్రియతే వరైః*

*ధర్మ కామార్థ ముద్దిశ్య తదనన్త ఫలంభవేత్॥*

భా॥ పెక్కు మాటలు చెప్పనేల? ధర్మకామార్థముల నుద్దేశించి కాశిలో ఏదానము చేసినను అది అనంతఫలమును కలుగజేయును

శ్లో॥ *స్వర్గాపవర్గ యోర్థే తుస్తద్ధి తీర్థతమం భువి।*

*స్నానం జప్యం తథా హోమ మనన్త ఫలసాధనమ్॥*

భా॥ స్వర్గాపవర్గములను కోరి ఎవరైనను కాశిలో స్నానము జపము హోమము మొదలైనవి ఏవి చేసినను అవి అనంత ఫల సాధనములగును

శ్లో॥ గత్వా వారాణసీ తీర్థే యస్తు చాన్ద్రాయణం చరేత్।

యస్తత్ర పంచతాం యాతి మోక్షంయాతి న సంశయః॥

భా॥ వారణసీ తీర్థమును చేరి చాంద్రాయణ వ్రతమునాచరించిన వారు మరణానంతరము మోక్షమును పొందుదురమట నిస్సందేహము

*తథా- శ్లో॥ మనుష్యైః పిండదానాది కార్యమత్రా ఽ ఽ గతైః సదా।*

*పిండదానంచ తత్రైవ సుపుత్రైః కార్య మాదరాత్ ॥*

*సుపుత్రాస్తే పితౄణాం తు భవన్తి సుఖదాయకాః ॥*

భా॥ ఈ క్షేత్రమునకు వచ్చిన వారిచే పిండదానాది కార్యములుతప్పక చేయబడవలెను సుపుత్రులైనవారు కాశియందు శ్రద్ధగా పిండదానము చేయవలెను అట్టి సుపుత్రులు పితరులకు సుఖ సంతోష కారకులగుదురు

వచనము తీర్థే పిండదానస్య ప్రధానత్వాత్తదనురోధేన శ్రాద్ధాది సర్వ మంగం కార్యం। ప్రధానం ధీయమానం హి తత్రాంగాన్యపకర్షతి ఇతి న్యాయాత్ శ్రాద్ధాసంభవేతు పిండదానమాత్రమపి కార్య మిత్యుక్తం ప్రాక్॥

భా॥ తీర్థమందు పిండదానము ప్రధానమని విధించుటచే శ్రాద్ధము మొదలగు తదంగ కార్యములన్నియు విధింపబడినట్లగుచున్నది ఇచ్చట ప్రధానము కర్తవ్యము అని చెప్పగా దానియొక్క అంగములన్నిటిని కలిపియే ఆ ప్రధానమును నిర్వహింపవలెను అను న్యాయము వర్తించును ఏమనగా ఇంతకుముందు శ్రాద్ధము నిర్వహించుట సాధ్యము గానిచో కనీసము పిండదానమైనను చేయవలెనని చెప్పుటచేత

*తథా-శ్లో॥ అన్యత్రాపి ప్రమీతానాం శ్రాద్ధం శ్రద్ధానమేధితమ్।*

*అత్రదీయేత తేన స్యాత్తేషాం కైలాస సంగమః॥*

భా॥ ఇతర ప్రదేశములందు చనిపోయిన వారికైనను ఇచ్చట శ్రద్ధగా శ్రాద్ధము జరిగినచో దానిచే వారికి కైలాస ప్రాప్తి గలుగును

తథా- శ్లో॥ సిద్ధ లింగాశ్రయం భగ్నం దృష్ట్వా రాజ్ఞే నివేదయేత్ ।
స్వఖాతం పరఖాతం యే సంస్కుర్వన్తి యథా తథా॥
తే భోగానాం నరాః పాత్ర మన్తే భోగస్య భాగినః॥
(స్వకృతం పరకృతం వా దేవాలయాది త్రుటితం రాజ్ఞే నివేద్య సంస్కర్తవ్య మిత్యర్థః

భా॥ సిద్ధలింగాలయములు శిథిలమైనచో దానిని గమనించినవారు ఆవిషయమును రాజునకు నివేదించవలెను. స్వహస్తముతో నిర్మించబడినట్టిదిగాని లేక ఇతరులచే నిర్మించబడినట్టిదిగాని శిథిలావస్థలో నున్నచో దానిని సంస్కరించి ఎవరు పునరుద్ధరింతురో వారు ఇహలోకమున భోగములకు పాత్రులై అంతమున మోక్ష భాక్కులగుదురు (అనగా తనచే నిర్మించబడినట్టిది గాని ఇతరులచే నిర్మించబడినట్టిది గాని శిథిలమైన దేవాలయాదులను గురించి రాజునకు నివేదించి పునరుద్ధరింపచేయవలెను )

తథా- శ్లో॥ ఖండస్ఫుటిత సంస్కారం తత్ర కుర్వన్తి యే నరాః
తే రుద్ర లోక మాసాద్య మోదన్తే సుఖినః సదా॥

భా॥ శిథిలమై నిర్మాణమునకు వీలులేనట్టి భంగమైన దేవాలయమునెవరు పునరుద్ధరింతురో అట్టివారు రుద్రలోకమున సదా సుఖులై ఉందురు.

శ్లో॥ రాజ ప్రతిగ్రహాసక్తాః కృతకాన్ పూజయన్తి యే
రుద్రశాపవిదగ్ధాః పతన్తి నరకే ధ్రువమ్॥

భా॥ రాజులనుండి ప్రతిగ్రహము వాంఛించునట్టివారు రుద్రశాపదగ్ధులై నరకములో పడుదురనుట నిశ్చయము.

శ్లో॥ యే పునః సిద్ధలింగానాం ప్రాసాదానాం స్వశక్తితః
కుర్వన్తి పూజాం సత్కారం తే ముక్తా నాత్ర సంశయః॥
(సిద్ధలింగానాం పూజా ప్రాసాదానాం చ సత్కారమితి క్రమేణాన్వయః)

భా॥ ఆలయములందలి సిద్ధలింగములను యథాశక్తి పూజించు నట్టివారు ఆలయములకు సత్కారము చేయునట్టివారు ముక్తులగుదురనుటలో సంశయములేదు (ఇచ్చట సిద్ధలింగములకు పూజయనియు ఆలయములకు సత్కారము అనగా అలంకారమనియు యథాక్రమముగా అన్వయించుకొనవలెను.)

శ్లో॥ తత్రపూజా జపోహోమః కృతో భవతి దేహినామ్॥
అనన్తఫలదః సర్వే రుద్రభక్తి సమన్వితః॥

భా॥ శివభక్తి గలిగి అట్టి ఆలయములందు జపము, హోమము మొదలగునవి చేయువారు అనంత ఫలమును పొందుదురు.

కాశీఖండే- శ్లో॥ అవిముక్తం సమాసాద్య యో లింగం స్థాపయేత్సుధీః ।

*కల్పకోటి శతైర్వాఽపి నాస్తి తస్య పునర్భవః॥*

భా॥ అవిముక్త క్షేత్రమును చేరి యచట లింగమును స్థాపించి పూజా పురస్కారములేర్పాటు చేసినవారికి శతకల్పకోటివర్షముల పిదపను (ఎన్నటికిని) పునర్భవ భయముండదు

తథా– శ్లో॥ సమాగత్యేహ కాశ్యాం యః కుర్యాదేకం శివాలయమ్।
తేన త్రైలోక్యమఖిలం సాలయం కృతమేవహి॥

భా॥ కాశికివచ్చి విధివిధానముగా ఒక శివాలయమును స్థాపించినవారికి మూడులోకములందును ఆలయములను స్థాపించినంతటి ఫలము కల్గును

శ్లో॥ *తపాంసి తేన తప్తాని శీర్ణపర్ణాశనాన్యపి।*
*వారాణసీం సమాసాద్య యేనాకారి శివాలయః॥*

భా॥ వారణాసియందు శివాలయమును స్థాపించినవారికి శీర్ణపర్ణాశనులై దీర్ఘకాలము తపస్సు చేసి నట్టి ఫలము గల్గును

శ్లో॥ *అశేషాః సవిశేషాశ్చ క్రతవస్తేన సత్కృతాః*
*ఆనందకాననే యేన దేవదేవాలయః కృతః॥*

భా॥ ఆనందకాననమున దేవాలయము నిర్మించిన వారికి సవిశేషముగ మహాయజ్ఞములను అఖండముగ చేసిన ఫలము గల్గును

*బ్రహ్మవైవర్తే పార్వతీం ప్రతి శివవచః –*

శ్లో॥ *యత్రయత్ర జలం కాశ్యాముద్ధరేత్సుకృతీనరః।*
*తత్ర తత్ర ముదాయుక్తాః పితరః సర్వసానవః॥*

భా॥ కాశీయందు అచ్చటచ్చట ఎవరు జలాశయములను నిర్మింతురో అక్కడక్కడవారికి తమ పితరులను తృప్తి పరచిన ఫలము చేకూరునని శివుడు పార్వతితో చెప్పెను

శ్లో॥ *కాశ్యాం రుద్రమయాః సర్వే జన్తవః శ్రుతివేదితాః।*
*తే పిబన్తి జలం యత్ర తడాగాదౌ తృషార్దితాః॥*

భా॥ కాశీయందు సర్వ జన్తువులు (ప్రాణులు) రుద్రరూపములని వేదములలో చెప్పబడినది. ఆయాజన్తువులు దప్పిగొనినవియై నీరుత్రాగినచో కలిగెడు పుణ్యమును గూర్చి వర్షశతములకైనను వర్ణించలేను

శ్లో॥ *తత్పుణ్యం న మయా వక్తుం శక్యం వర్షశతై రపి.*
*వరంతు పాపధానైః న కర్తవ్యోహి జలాశయః*
*అపరాధో న భవతి మహాపాపకృదక్షయః॥*

భా॥ దప్పిగొనిన ప్రాణులచటు నీరుత్రావినచో గల్గునట్టి ఫలము అనంతమైనదని

భావము అట్లు జలాశయములు నిర్మించుటలో మిక్కిలి సావధానచిత్తులై యుండవలెను నిర్మించునప్పుడు అపరాధము కలుగరాదు గలిగినచో ఆపాపము అక్షయమగును
పార్వత్యువాచ - శ్లో॥ జలాశయే కృతే దేవ! కారితేవా మహాత్మభిః
కో౽ పరాధః పతేదత్ర తన్మమా ఽ౽ చక్ష్వ శంకర ॥
భా॥ ఓదేవా! కాశియందు మహాత్ములచే జలాశయములు నిర్మించబడినచో అందు అపరాధమేమి గల్గునో చెప్పుడని పార్వతి యడిగెను.
మహాదేవ ఉవాచ – శ్లో॥ కాశ్యాం తిలేతిలే లింగం, కాశ్యాం తీర్థ పదేపదే ।
ఖననం కాశీ భూమేస్తు దుర్లటం తేన పార్వతి ॥
భా॥ కాశియందు నువ్వుగింజ యంతటి పరిమాణముగల ప్రదేశమందైనను లింగముండును అడుగడుగునా తీర్థముండును. కనుక కాశియందు భూమిని ఖననము చేయుట చాల దుర్ఘటమని శివుడు చెప్పెను.
శ్లో॥ జీర్ణోద్ధారం చ యే కుర్యు ర్నః సందేహో భవన్తి తే ।
న తత్ర లింగపీడా స్యా న్నతీర్థఖననం భవేత్ ॥
భా॥ అందుచేత జీర్ణోద్ధారము చేయునప్పుడుగాని తీర్థమును త్రవ్వించునప్పుడుగాని లింగపీడ కలుగకుండ జాగ్రత్తపడవలెను
శ్లో॥ అతో జీర్ణోద్ధృతిః కార్యా నిరవద్యా మహాఫలా ।
వ్యయంకృతం యత్ఖాతాది తదనేక ఫలప్రదమ్ ॥
తతోప్యధిక ధర్మాణాం జనకం జీర్ణముద్ధృతమ్ ॥
భా॥ జీర్ణోద్ధారము నిరవద్యమైన మహాఫలమును గల్గించును తాను వ్యయముగా తీర్థాదులను త్రవ్వించుట అతులిత ఫలప్రదము జీర్ణాలయాదులను పునరుద్ధరించుట అంతకంటెను ధర్మప్రదము
శ్లో॥ జీర్ణోద్ధారేణ వై తేషాం తత్ఫలం ద్విగుణం భవేత్ ॥ ఇతి ॥
భా॥ జీర్ణోద్ధారముచే ద్విగుణముగ ఫలము లభించునని పద్మపురాణమునందు చెప్పబడినది.
వచనము అత్రాపూర్వజలాశయ నిందా న నిషేధార్థా కింతు జీర్ణోద్ధృతేః ప్రాశస్త్యాతిశయార్థా। ప్రాతఃప్రాతరనృతం తే వదన్తి పురోదయా జ్జుహ్వతి యే౽ గ్నిహోత్రమ్ ఇత్యుదిత హోమప్రశంసార్థానుదిత హోమనిందావత్ । నహి నిందా నింద్యం నిందితుం ప్రవర్తతే ఽపితు విధేయం స్తోతుమితి న్యాయాత్ । తేన సావధానతయా ఽపూర్వ తడాగాదికరణే౽ఽ న దోషః ॥
భా॥ ఇచ్చట క్రొత్తగా జలాశయమును నిర్మించుట తక్కువదియని నిషేధించుట గాదు గాని జీర్ణోద్ధారము మిక్కిలి ప్రశస్తమని అతిశయార్థము కొరకే చెప్పబడినది ఉదయాత్పూర్వము అగ్నిహోత్రము చేయువారు ఉదయమే అనృతము పలికిన వారగుచున్నారనుట ఉదిత హోమ(సూర్యోదయం పిదప) ప్రశంసకొరకేగాని అనుదిత (సూర్యోదయమునకు పూర్వము) హోమమును నిందించుటగాదు ఏమనగా నింద నిందింప దగినదానిని నిందించుటకు ఉద్దేశింపబడినదిగాదు. గాని విధేయమును

(విధిని స్మృతించుట కొరకు ఉద్దిష్టమైనదియను న్యాయముచొప్పున అందుచే పాపధనముతో క్రొత్త తటాకములను నిర్మించుటలో దోషము లేదని సారాంశము

పాద్మే:- శ్లో॥ మూర్ఖం స్వధర్మవిరతం యో వర్షాశన దానతః ।
స్థాపయేచ్ఛ్రద్ధయా యుక్త స్తస్య పుణ్యఫలం శ్రుణు॥

భా॥ స్వధర్మకర్మవిరతుడగు బ్రాహ్మణునొకనికి ఒక సంవత్సరగ్రాసము దానముచేసి అయనను కాశీయందు శ్రద్ధతో నిల్పినవానికి గల్గు పుణ్యము చెప్పెదను వినుము

శ్లో॥ యావన్త్యః సికతాః సన్తి గంగాయాం మునిసత్తమ ।
తావద్వర్ష సహస్రాణి క్రీడేదింద్రేణ సంగతః ॥

భా॥ ఓ. మునిసత్తమా గంగానదియందెన్ని ఇసుకరేణువులున్నవో అన్ని వర్ష సహస్రములు ఇంద్రునితో గూడి స్వర్గ సుఖముల ననుభవించును.

శ్లో॥ పశ్చాదత్ర మహారాజో జాయతే నిర్మలేకులే ।
దీర్ఘాయుశ్చసహ పుత్రైశ్చ సుఖీ శంకర భక్తిమాన్ ॥

భా॥ పిమ్మట యతడు నిర్మలమైన కులమందు మహారాజుగ జన్మించి దీర్ఘాయుష్షను జనంపుత్రులను పొంది శంకరభక్తిగల్గి సుఖించును

శ్లో॥ అంతేచ లభతే కాశీం తతో నిర్వాణ మాప్నుయాత్ ।

భా॥ అంతమున కాశిని పొంది, అప్పటి మరణమునే నిర్వాణమును పొందును

శ్లో॥ అశ్వత్థం పిచుమన్దం వా సహకారమథో లతామ్ ।
యో రోపయతి యత్నేన తస్యాప్యేతత్ఫలం భవేత్ ॥

భా॥ కాశీయందురావిచెట్టుగాని వేపచెట్టుగాని మామిడిచెట్టుగాని ఏదైనా లతనుగాని ప్రయత్న పూర్వకముగ కాశీయందు నాటిన వానికి, పైన చెప్పిన పుణ్యాత్మునికి గల్గినట్టి ఫలమే లభించును.

శ్లో॥ న్యాయార్జిత ధనం కాశ్యాం స్వల్పమప్యర్థినే ఽర్పితమ్ ।
భవేదనన్త ఫలదం నిత్యం తత్ క్షేత్రవాసినే ॥

భా॥ కాశీయందు తాను న్యాయముగ సార్జించిన ధనమునందు ఏ స్వల్పమైనను బ్రాహ్మణునకు దానము చేసినచో అటువంటి క్షేత్రవాసికి అనంత ఫలము గల్గును

తథా :- బ్రహ్మవైవర్తే :-

శ్లో॥ శివాలయ శతం కృత్వా యత్ఫలం ప్రాప్యతే నృభిః ।
ద్విజాలయేన నైకేన తత్ఫలం త్వక్షయం భవేత్ ॥

భా॥ ఒక నూరు శివాలయములను నిర్మించినందువలన ఎట్టి పుణ్యము లభించునో అంతటి పుణ్యము ఒక్కబ్రాహ్మణునకు గృహదానము చేయుటచే అక్షయముగ గల్గును.

శ్లో॥ శివాయతన లక్షాణి విష్ణోరాయతనానిచ ।
కృతాని తేన విప్రేన్ద్రా ! స్థాపితో బ్రాహ్మణో యది ॥

భా॥ ఓ విప్రులారా! ఇల్లు కట్టించి ఒక్కసద్విప్రుని అందు నివసింపజేసినచో అట్టి పుణ్యము లక్షలకొలది శివాలయములను విష్ణ్వాలయములను స్థాపించి నంతటి ఫలమునకు సమానము

తథా - శ్లో॥ వర్షాశనంతు యోదద్యాత్కాశ్యాం పేదకుటుంబినే ।
యావన్త్యబ్దాని తావన్తి యుగాని దివి పూజ్యతే ॥

భా॥ కాశీయందు ఒక పేద కుటుంబికునకు వర్షాశనము గలుగజేసినవారు ఎన్ని వర్షములకేర్పాటు చేయుదురో అన్ని యుగముల పర్యంతము దేవలోకమునందు సుఖముల ననుభవించుచు పూజింపబడుదురు

శ్లో॥ వస్తుః కోటిగుణం పుణ్యం కాశ్యాం వాసయితు ర్ధ్రువమ్ ।
ఆత్మానం తారయే ద్వస్తా తౌ ద్వౌ వాసయితా యతః ॥

భా॥ కాశీయందు నివసించినవాని కంటె మరియొకరికి నివాసము గల్పించినవారికి కోటిరెట్ల పుణ్యము లభించును నివాసమున్నవాడు తాను మాత్రమే తరించును కాని నివాసమేర్పరచినవాడు తనను తనవలన నివాసము పొందినవానిని ఇద్దరను తరింపజేయును

శ్లో॥ కాశ్యాం వసన్తి యేవిప్రా దూరస్థైరపి సన్నరైః ।
యోగక్షేమా విధాతవ్యా తేషాం విశ్వేశితు ర్ముదే ॥

భా॥ కాశీయందు నివాసమున్నట్టి విప్రుల యొక్క యోగక్షేమములను దూరమందున్న వారైనను కనిపెట్టివారికి వానిని గల్గించవలెను అది విశ్వేశ్వరునకు సంతోషకారణమగును

తథా శ్లో॥ వారాణస్యాం కృతం కర్మ నీలకంఠాయ చార్పితమ్ ।
మనః శుద్ధిం విధాయాఽఽశు తత్త్వజ్ఞానాయ కల్పతే ॥

భా॥ కాశీయందు శివార్పణముగ జేయబడిన కర్మ మనశ్శుద్ధిని గల్గించి శీఘ్రముగ తత్త్వజ్ఞాన సంపదను గల్గించును

శ్లో॥ తత్ర స్వల్పం హుతం జప్తం దత్తం తప్తం ద్విజోత్తమాః ।
భూయాదనన్త ఫలదం తత్ క్షేత్రస్య ప్రభావతః ॥

భా॥ ఓ భూసురోత్తములారా ! కాశీయందు చేయబడిన హోమము జపము దానము తపస్సు మొదలగునవి యెంత స్వల్పమైనను ఆక్షేత్ర ప్రభావమువలన అవి అనంత ఫలదాయకము లగును

శ్లో॥ యత్కర్మ తత్ర కుర్వీత శుభం వా యదివాఽశుభమ్ ।
అక్షయం తత్ప్రభవతి నాత్ర కార్యా విచారణా ॥

భా॥ కాశీయందు శుభకర్మగాని అశుభకర్మగాని ఏదిచేసినను అది అక్షయమగు నమటలో సందేహములేదు

శ్లో॥ అనేకజన్మసాహస్రైర్యత్తపః ఫలమాప్యతే ।
తతోఽ ప్యధికమేవాత్ర త్రిరాత్రోపోషణాద్భవేత్ ॥

భా॥ అన్యత్ర అనేక జన్మ సహస్రములందు చేసిన తపః ఫలము కంటె అధికమైన ఫలము కాశీయందు త్రిరాత్రములు ఉపవాసముండుటవలన లభించును

తథా శ్లో॥ అన్నదానం తు యః కుర్యాద్యస్యకస్య చిదప్యహో ।
యావన్త్యబ్దాని తావన్తి యుగాని స వసేద్దివి ॥

భా॥ కాశీయందు ఎవరికైనను అన్నదానము చేసినవాడు ఎన్ని సంవత్సరములు చేయునో అన్ని యుగములు దేవలోకమందు నివసించును

శ్లో॥ అన్యత్ర యోగాభ్యాసేన యావజ్జీవం కృతేన చ
వారాణస్యాం ప్రాణరోధాత్ తత్పుణ్యం సమవాప్యతే॥

భా॥ అన్యత్ర యావజ్జీవము యోగాభ్యాసము చేసినచో ఎంత ఫలము గల్గునో అంతటి ఫలము కాశీలో ప్రాణత్యాగముచే గల్గును

శ్లో॥ అస్మిన్ క్షేత్రే మహాదేవి । పుణ్యం పుణ్యేతరత్తువా ।
అనంతకోటి గుణితం భవేత్సర్వం న సంశయః ॥

భా॥ ఓ దేవి ! ఈ క్షేత్రమందు చేసినపుణ్యము గాని పాపముగాని అనంతకోటిగుణితమగును ఇందుకు సందేహములేదు

శ్లో॥ యే ప్రయచ్ఛన్తి మనుజా జీవాదప్యధికం ధనమ్ ।
జీవకోశః శ్లథస్తేషాం పుణ్యరాశిః పదేపదే ॥

భా॥ కాశీయందు ఎవరు విశేషముగ ధనమును దానము చేయుదురో అట్టివారి జీవకోశము శిథిలమై పదేపదే పుణ్యరాశి పెరుగుచుండును

శ్లో॥ స్నానేన దానేన పరిక్రమేణ శివార్చనేనాపి సతోఽ ర్చనేన ।
దినేదినే చ సుకృతస్య వృద్ధిర్యయా జనః కృతకృత్యః సదాస్యాత్ ॥

భా॥ కాశీయందు దినదినము స్నానదానములచేతను దేవాలయ ప్రదక్షిణములచేతను ఎవరు గడుపుదురో వారి సుకృతము పెరిగి అట్టివారు సదా కృతకృత్యులగుదురు

శ్లో॥ మనాగపి విచారేణ మనసో నిగ్రహో యది ।
అవిముక్తే భవేద్యేషాం తే ముక్తా భవబంధనాత్ ॥

భా॥ కాశీయందు ఏకొంచెము సమయమైనను మనస్సును నిగ్రహించుకొని గడుపుదురో అట్టివారు భవబంధవిముక్తులగుదురు

సనత్కుమారసంహితాయాం

శ్లో॥ బ్రాహ్మణం క్షత్రియంవాఽపి వైశ్యం శూద్రమథాపివా ।
యంవా కం వాఽ పి వాఽబ్రహ్మాన్ శివభక్తి పరాయణమ్ ॥

*యోగక్షేమాపదేశాద్వై ర్వాసయేదపి యత్నతః ।*
*యావత్సు వసతే తత్ర తావత్తత్ఫలమశ్నుతే ॥*

భా॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులలో శివభక్తి పరాయణుడగు ఏ ఒక్కరినైనను కాశీయందు ప్రయత్న పూర్వకముగ నివసింపజేసి అతని యోగక్షేమములను విచారించునట్టివారికి అతని నివాసము కాశిలో స్థిరముగ నున్నంతకాలము అట్టివాని నివాస సుకృత ఫలము నివాసము గల్పించిన కర్తకును లభించును

శ్లో॥ *యః కాశ్యాం వాసయేదేకం స్థావరం వాపి జంగమమ్ ।*
*యావత్సు కాలం వసతి తావల్లక్షగుణాధికమ్*
*శివలోకే వసేత్కాలమితి శాస్త్రవినిశ్చయః ॥*

భా॥ కాశీయందు స్థావర ప్రాణినిగాని లేక జంగమప్రాణిని గాని నివసింపజేసినవారికి ఆ ప్రాణి యచట నివసించియుండు కాలమునకు లక్షరెట్ల కాలపరిమితిగ శివలోకమందు స్థానమేర్పడు ననుట శాస్త్రనిర్ణయము

శ్లో॥ *యం కంచిదపి వా కాశ్యామేకాహమపి వాసయేత్ ।*
*వర్షకోటి శతం బ్రహ్మన్ రుద్రలోకే మహీయతే ॥*
*జన్మాంతరే పునఃకాశ్యాం శివజ్ఞానమవాప్నుతి ॥*

భా॥ కాశీయందు ఎవరినైనను ఒక్కరోజు అయినను నివసింప చేయగలిగినచో అట్టివారికి వర్షకోటి శతములు రుద్రలోకమందు సాన్నిధ్యము లభించును తదనంతరము వారు కాశీయందు జన్మించి శివజ్ఞానము గల్గియుందురు

శ్లో॥ *త్రయోధర్మాః సర్వధర్మా దధికాస్త్వక్షయాః సదా ।*

భా॥ వేదవిహిత ధర్మములు ఇతర సర్వ ధర్మములకంటె అధికమైనవియై అక్షయము లగుచున్నవి

శ్లో॥ *పిశాచమోచనేతీర్థే లోష్టద్రోణం సముద్ధరేత్ ।*
*న పీడ్యతే పరేలోకే న్వల్పయా ఽపి పిపాసయా ॥*
*(ద్రోణ పరిమితాం మృదమిత్యర్థః )*

భా॥ పిశాచమోచన తీర్థము నందలి దోసెడు మట్టి పిశాచత్వమును పోగొట్టుటయందు సమర్థమగుచున్నది. అట్టి వారిఁ పరలోకమందు పిపాస కొంచమైనను బాధించదు (లోష్ట ద్రోణమనగా దోసెడు పరిమాణముగల మట్టి యని భావము )

శ్లో॥ *కులస్తంభమూలేఽన్నం దద్యాదామలకప్రభమ్ ।*
*పరలోకేప్యశేషేను క్షుధయానైవ పీడ్యతే ॥*

భా ॥ కులస్తంభమూలమున ఉసిరికాయయంతటి పరిమాణమగు అన్నము దానము చేసిన వానిని పరలోకమందు క్షుద్బాధ పీడించదు

శ్లో॥ ఏకం వాసయేత్కాశ్యాం వృక్షగుల్మలతాస్వపి ।
ఏకాహమపివా ధాత ! యమలోకం నపశ్యతి ॥

భా॥ ఓ బ్రహ్మదేవా ! కాశీయందు వృక్షము పొద తీగ మొదలగు వానిలో ఎ..క్క దానినైనను ఏర్పరచి ఒక్కదినమైనను పోషించినట్టివానికి యమలోకము జూచునట్టి అగత్యము గలుగదు

శ్లో॥ క్షేత్రవాసం వినోపాయైః క్షేత్రవాస ఫలం లభేత్ ।
యః కాశ్యాం సర్వదుర్వేషు యాత్రా కుర్యాద్యథోదితామ్ ॥

భా॥ కాశీయందు ఎవరుసర్వపర్వముల యందు మరుగుపడిన స్థలములకు చె.ప్పబడిన రీతిలో యాత్రలు చేయుదురో అట్టివారికి క్షేత్ర నివాసోపాయములు పాటించకుండగనే ఆ ఫలితము గలుగును

శ్లో॥ యమ్తూష్ణీం వాసయత్యేకం వసనాశన పోషణైః ।
ఏకాహమపి తస్యైవ సిద్ధిః కోటిగుణాధికా ॥

భా॥ ఎవరు కాశీయందు తూష్ణీం భావముతో అనగా గొప్పలు చెప్పుకొనకుండ గుప్తదానముతో ఏఒక్కరినైనను ఒక్కరోజైనను నివసింపజేసి భోజనమును గల్పింతురో ఒట్టివారికి కోటి గుణములుగా సిద్ధి లభించును

శ్లో॥ దద్యాద్యాऽ ప్యుపదేశం న యస్త్వసంచయవాన్నవేత్ ।
యేనాసౌ వుపదేశేన కాశీం క్వచిత్ఽపి నోఽజతి ॥

భా॥ అధికముగ ధన సంచయము చేయని స్వభావము కలవాడు అగుపట్లు ఉ..దేశము చేయవలెను ఆ ఉపదేశ ఫలితముగ కాశీనివాసము గల్పింపబడినవాడు ఎ..ప్పటికిని కాశీని విడిచి వెళ్ళడు అనగా కాశీవాసమందే ఆసక్తి గలిగియుండును

కాశీఖండే శ్లో॥ నియుతం యత్రతిష్ఠాప్య లింగాని ఫలమాప్యతే ।
అన్యత్ర తదిహైకేన లింగేన పరిలభ్యతే ॥

భా॥ అన్యప్రదేశమున లక్షలింగములను స్థాపించిన గల్గునంతటిఫలము కా.య..దు ఒక్కలింగమును స్థాపించినంత మాత్రముననే సిద్ధించును

శ్లో॥ కాలేన భంగమాసన్నం జీర్ణోద్ధారం కరోతి యః ।
ఇహ తస్య ఫలస్యాన్తః ప్రలయే ఽపి న జాయతే ॥

భా॥ కాలవశమున శిథిలమైనట్టి ఆలయమును పునరుద్ధరించినవాడు ఈ లోకమున ఆపుణ్యఫలమునననుభవించుటయే గాక ప్రళయాంతమందు గూడ ఆ ఫలమతనికి నిలిచియుండును

శ్లో॥ విత్తశాఠ్యం పరిత్యజ్య ప్రాసాదం యోఽత్ర కారయేత్ ।
తేన దత్తో భవేత్సర్వో మేరుర్నియుతయోజనః ॥

భా॥ ధనలోభమును విసర్జించి ఎవరు కాశీయందు జీర్ణమైన ఆలయమును ..ద్ధరింతురో అట్టివారికి లక్ష పరిమాణము గల మేరుపర్వతమును దానము ..టి సుకృతము లభించును

శ్లో॥ కూపవాపీతడాగాని శక్త్యాయో౽త్ర తు కారయేత్ ।
అన్యత్ర కరణాత్తస్య పుణ్యం కోటి గుణాధికమ్ ॥

భా॥ ఇతరత్ర శక్తికొలది వాపీకూప తటాకాదులను నిర్మించిన ఫలితము కంటె కోటిరెట్ల ఫలితమును కాశియందు వానిని నిర్మించిన వానికి గలును

శ్లో॥ ఇజ్యార్థమత్ర యః కుర్యాత్పుణ్యాం పుష్పవాటికామ్ ।
పుష్పే పుష్పే ఫలం తస్య సువర్ణ కుసుమాధికమ్ ॥ (ఇజ్యార్థం పూజార్థం)

భా॥ దేవతా పూజ కొరకు కాశియందు పూలతోటను అందముగ ఎవరు పెంచెదరో వారికి ఒక్కొక్క పుష్పమునకు ఒక్కొక్క బంగారు పుష్పముతో పూజచేసిన ఫలము లభించును

శ్లో॥ అత్ర బ్రహ్మపురీం కృత్వా యో విప్రేభ్యః ప్రయచ్ఛతి।
వర్షాశనేన సంయుక్తాం తస్య పుణ్యఫలం శృణు ॥

భా॥ ఇచ్చట బ్రాహ్మణ అగ్రహారమును (బ్రాహ్మణులకు దానముగ నివ్వబడు భూములు ) ఏర్పాటుచేసి దానినివిప్రులకు దానము చేసి వారికి వర్షాశనమును గల్పించినచో గలుపుణ్య ఫలమును చెప్పెదను, వినుము.

శ్లో॥ క్షీయన్తే సలిలాన్యబ్ధేర్ భౌమాశ్చ త్రసరేణవ
క్షీయో న తస్య పుణ్యస్య శివలోకే సమాసతః ॥ (శివత ఐశ్వర్యః)

భా॥ సముద్రమందలి నీటిబిందువులన్నియు క్షీణింపవచ్చును. అట్లే భూమి త్రసరేణువులుగ మారి నశింపవచ్చును కాని పైన చెప్పినట్లుగ బ్రాహ్మణ అగ్రహారము నేర్పరచిన వాని పుణ్యము అక్షయమగుటచే అతనికి శాశ్వత శివలోక ప్రాప్తి గలును.

(త్రసరేణువనగా మూడు అణువులు కలిసిన ముద్ద)

శ్లో॥ మఠానపి తపస్విభ్యః కారయిత్వా౽త్రయో౽పృథక్ ।
జీవనోపాయ సంయుక్తాన్సో౽పి సర్వ ఫలాశ్రయః ॥

భా॥ కాశియందు యతులకొరకు జీవనోపాయములతో గూడిన మఠములను నిర్మించి దానముచేసినవారును సర్వఫలమును పొందుదురు

శ్లో॥ కృత్వా మహాన్తి పుణ్యానియో౽త్ర విశ్వేశ్వరే౽ర్పయేత్ ।
న తస్య పునరావృత్తి ర్ఘోరే సంసారసాగరే ॥

భా॥ కాశియందు విశ్వేశ్వరార్పణముగ గొప్పగొప్పపుణ్యకార్యములు చేసినవారికి ఈఘోరసంసారమందు పునరావృత్తియుండదు.

తథా- శ్లో॥ చతుర్ణామపి వేదానాం పుణ్య మధ్యయనాచ్చ యత్ ।
తత్పుణ్యం జాయతాం కాశ్యాం గాయత్రీ లక్షజాపతః

భా॥ కాశియందు లక్షగాయత్రిజపమును చేసినవానికి, నాలుగు వేదములను సక్రమముగ అధ్యయనము చేసినంతటి పుణ్యము గల్గును

ధ్యానము అధ్యయనము పొందిన ఆధ్యాత్మిక జ్ఞానము మొదలగునవి యన్నియు అక్షయమగును

*వాయవీయే.-శ్లో॥ వారాణస్యాం నగర్యాంతు దేయం శ్రాద్ధం ప్రయత్నతః॥*
*తస్యాం యోగేశ్వరో నిత్యం తస్యాం దత్తమథాఽక్షయమ్॥*

భా॥ కాశీయందు యోగేశ్వరుడు నిత్య నివాసముగయుండును గనుక అచ్చట విధివిధానముగ చేయబడిన శ్రాద్ధము అక్షయఫలితము నిచ్చును

*కాశీఖండే శ్లో॥ సంనిహత్యాం కురుక్షేత్రే రాహుగ్రస్తే దివాకరే।*
*తులాపురుష దానేన కాశ్యాం భిక్షా సమాభవేత్॥*

భా॥ రాహుగ్రస్త సూర్యగ్రహణ పుణ్యకాలమందు కురుక్షేత్రమున తులాపురుషదానము చేయుటచే గల్గునట్టి ఫలము కాశీయందు భిక్షనిచ్చుటతో సమానమగును

*తథా-శ్లో॥ భిక్షాఽపి యత్ర భిక్షుభ్యో దత్తా ఽ ఽమలక సంమితా।*
*సుమేరుణాఽపి తులితా వారాణస్యాం గురుర్భవేత్॥*

భా॥ కాశీయందు భిక్షువుల కొరకు ఆమలక(ఉసిరిక) ప్రమాణము గల భిక్షనిచ్చినను అది సుమేరుపర్వతముకంటె అధికభారము గలదియగును

*శ్లో॥ వారాణస్యాం వర్షభోజ్యం యో దద్యాన్నిరపాయినే।*
*న కదాచిత్ తృట్క్షుధా నో దుఃఖం భుంక్తే నరర్షభః॥*

భా॥ కాశీయందు నిరాధారుడైన వానికొకనికి వర్షాశనమును ఏర్పాటు చేసినట్టి ఉత్తమపురుషునకు ఎప్పుడును ఆకలి దప్పిక బాధలుగాని ఎటువంటి దుఃఖముగాని సంభవించదు

*శ్లో॥ వారాణస్యాం నివసతాం యత్పుణ్య ముపజాయతే।*
*తదేవ సంవాసయితుః ఫలం త్వవికలం భవేత్॥*

భా॥ కాశీయందు నియమముగ నివసించినచో గల్గునట్టి పుణ్యము కాశీయందొకరికి నివాసము గల్పించినను తప్పక లభించును

*తథా-శ్లో॥ నియమేన తు విశ్వేశే పత్రం పుష్పం ఫలం జలమ్।*
*యద్దత్తం సుమహోప్యత్ర మహాదానం తదత్ర నైః॥ (సుమహోప్యత్ర నిష్కామతయా)*

భా॥ నియమముగ విశ్వేశ్వరునకు పత్రము పుష్పము ఫలము అభిషేకము మొదలగునవి నిశ్చల చిత్తముతో నిష్కామముగ ఏది సమర్పించినను అది మహాదానమగును

*శ్లో॥ ముక్తిమండపికాయాంచ క్షణం యత్ స్థిరమాస్యతే।*
*స్నాత్వా గంగామృతే శుద్ధే తప ఏతదిహోత్తమమ్॥*

భా॥ ముక్తి మండపమందు ఒక్క క్షణమైనను మనస్సును లగ్నము చేసియుండుట అమృతతుల్యమగు గంగా స్నానము చేసి శుద్ధుడగుట యు ఎచ్చటి ఇచ్చట మహోత్తమ తపములుగ పరిగణింప బడుచున్నవి

శ్లో॥ సత్కృత్య భిక్షవే భిక్షా యత్కాశ్యాం సందీయతే
తులాపురుష ఏతస్యాః కలాం నార్హతి షోడశీమ్॥

భా॥ కాశీయందు ఆదరముతో ఒక్క భిక్షువునకు భిక్షనిచ్చినచో దానియొక్క పదునారవ వంతునకు గూడ తులాపురుషదానము సరితూగదు

శ్లో॥ హృది సంచిన్త్య విశ్వేశం క్షణం యద్విమీల్యతే
దేవస్య దక్షిణే భాగే మహాయోగో ఽయముత్తమః॥

భా॥ కాశీయందు విశ్వేశ్వరునకు దక్షిణ భాగమందుండి నిందు హృదయముతో ఒక్క క్షణమైనను ధ్యానించినచో అది మహాయోగమగును.

శ్లో॥ ఇదమేవ తపో ఽత్యుగ్రం యదిన్ద్రియ విలోలతామ్।
నిషిద్ధ స్థీయతే కాశ్యాం క్షుత్పిపాసాద్యసమన్వయః॥

భా॥ అదియే జితేన్ద్రియుడై క్షుత్పిపాసలను లోబరచుకొని చేసినచో ఉగ్రతపమగును

శ్లో॥ మాసి మాసి యదస్యేత్కృత్వా చాంద్రాయణాత్ఫలమ్।
అన్యత్ర తదిహాఽఽప్యేత భూతాయాం నక్త భోజనాత్॥

భా॥ కాశీయందు నక్త భోజనము యొక్క ఫలము అన్యత్ర ప్రతిమాసమందు చాంద్రాయణ వ్రతమును చేసిన దానితో సమానమగును

శ్లో॥ మాసోపవాసాదన్యత్ర యత్ఫలం సముపార్జ్యతే।
శ్రద్ధయైకోపవాసేన తత్కాశ్యాం స్యాదసంశయమ్॥

భా॥ అన్యత్ర మాసోపవాసముచే లభించుఫలము కాశీయందు ఒక్క దినము శ్రద్ధతో ఉపవాసము చేయుటతోడనే లభించునమటలో ఎట్టి సందేహములేదు

శ్లో॥ చాతుర్మాస్య వ్రతాత్ప్రోక్తం యదన్యత్ర మహాఫలమ్।
ఏకాదశ్యుపవాసేన తత్కాశ్యాం స్యాదసంశయమ్॥

భా॥ అన్యత్ర చాతుర్మాస్యవ్రతముచే యే మహాఫలము చెప్పబడినదో ఆఫలము కాశీయందు ఏకాదశి ఉపవాసముచే నిస్సందేహముగ గల్గును

శ్లో॥ షణ్మాసాన్న పరిత్యాగాద్య దన్యత్ర ఫలం భవేత్।
శివరాత్ర్యుపవాసేన తత్కాశ్యాం జాయతే ధ్రువమ్॥

భా॥ అన్యత్ర ఆరునెలలు అన్న త్యాగము చేసి గడిపిన ఫలము కాశీయందు శివరాత్రి నాటి ఉపవాసముచే ధ్రువముగ గల్గును.

శ్లో॥ వర్షం కృత్వోపవాసాని లభేదన్యత్ర యద్వ్రతీ।
తత్ఫలం స్యాత్త్రిరాత్రేణ కాశ్యామవికలం మునే॥

భా॥ ఓ మునీ! అన్యత్ర సంవత్సర పర్యంతము నియమముగ ఉపవాసము చేసిన ఫలము కాశీయందు మూడు రాత్రులు ఉపవాసము చేసినచో ఆఫలము ఆ దీక్షాపరునకు గల్గును

శ్లో॥ మాసిమాసి కుశాగ్రాంబుపానా దన్యత్ర యత్ఫలమ్।
కాశ్యాముత్తర వాహిన్యామేకేన చులుకేన తత్॥

భా॥ అన్యత్ర ప్రతి నెలయందు కుశాగ్రముల నుండి జారిన జలమును త్రావినచో గల్గునట్టి ఫలము కాశీ యందు ఉత్తర వాహినియగు గంగయందు ఒక పుడిసెడు జలము త్రాగినచో లభించును

తథా- శ్లో॥ లింగం సమర్చితం దృష్ట్వా యః కుర్యాత్ప్రణతిం సకృత్।
సందేహో జాయతే తస్య పునర్దేహ నిబంధనే॥

భా॥ కాశీయందు దృష్టినిగిడించుచు విశ్వేశ్వర లింగమును అర్చించి ప్రణతులర్పించిన వానికి మరల సంసారబంధము గలుగదు

శ్లో॥ లింగం యః స్థాపయే ద్భక్త్యా సప్త జన్మ కృతాదఘాత్।
ముచ్యతే నాత్రసందేహో విశుద్ధః స్వర్గభాగ్భవేత్॥

భా॥ భక్తితో లింగమును స్థాపించినవాడు తాను ఏడుజన్మల నుండి చేసిన పాపములకు దూరుడై పరిశుద్ధుడై నిస్సందేహముగ స్వర్గవాసియగును

శ్లో॥ ఏకం ప్రతిష్ఠితం యేన లింగమ్త్రేశ భక్తితః॥
తేనా ఒ ఒ త్మనా సమం విశ్వం జగదేతత్ప్రతిష్ఠితమ్॥

భా॥ కాశీయందు ఈశ్వరభక్తితో ఒక్క లింగమును ప్రతిష్ఠించినవానికి విశ్వాత్మభావము గల్గును లోకము దానిపై నాధారపడియుండును

శ్లో॥ రత్నాకరే రత్న సంఖ్యా సంఖ్యావద్భిరపీష్యతే।
లింగప్రతిష్ఠా పుణ్యస్య న తు సంఖ్యేహవిద్యతే॥

భా॥ సముద్రమందలి రత్నముల సంఖ్యను గణకులు లెక్కింపగలరేమోగాని లింగప్రతిష్ఠవలన గల్గు పుణ్యమును లెక్కించుట అసాధ్యము

తథా- శ్లో॥ మహాదానేన చాన్యత్ర యత్ఫలం లభ్యతే నరైః।
అవిముక్తేతు దత్తాయాం కాకిన్యాం తదవాప్యతే॥

భా॥ అన్యత్ర మహాదానము చేసిన గల్గునంతటి ఫలము కాశీలో శ్రద్ధతో ఒక్కపైస దానము చేసినను లభించును (కాకినీ=గవ్వ వరాటకము)

తథా- శ్లో॥ అత్ర యత్క్రియతే క్షేత్రే శుభంవా ఒ శుభమేవవా
సంవర్తేపి న తస్యాత్ర క్షస్మాచ్ఛ్రేయః సమాచరేత్॥

భా॥ కాశీయందు చేయబడిన శుభముగాని అశుభముగాని కల్పాంతమునకైనను క్షయము పొందదు గాన కాశీలో శ్రేయమునే చేయవలెను

తథా- శ్లో॥ అన్యత్ర యోగాభ్యాసనా ద్వావజ్జన్మ యదర్జ్యతే।
వారాణస్యాం తదేకేన ప్రాణాయామేన లభ్యతే॥

భా॥ అన్యత్ర యోగాభ్యాసము జపనాదులను జీవితాంతము

అభ్యసించుటవలన ఎట్టి ఫలము గల్గునో అట్టి ఫలము కాశియందు ఒక్క పర్యాయము ప్రాణాయామము చేసినచో లభించును

శ్లో॥ సర్వతీర్థావగాహాచ్చ యావజ్జన్మ యదర్జ్యతే।
తదానందవనే ప్రాప్యం మణికర్ణ్యేకమజ్జనాత్॥

భా॥ సర్వతీర్థములయందు ఆజన్మాంతము స్నానము చేసిన గల్గుఫలము ఆనందవనమున మణికర్ణిక యందు ఒక్కసారి స్నానము చేసినచో లభించును

తథా॥ శ్లో॥ యత్షోడశమహాదానైః పుణ్యం ప్రోక్తం మహర్షిభిః॥
తత్పుణ్యం జాయతే పుంసాం విశ్వేశే పుష్పదానతః॥

భా॥ షోడశమహాదానములచే ఎట్టి మహాపుణ్యముగల్గునని మహర్షులు వక్కాణించిరో అట్టి పుణ్యము విశ్వేశ్వరునకు పుష్పములు సమర్పించినవానికి గల్గును

శ్లో॥ అశ్వమేధాదిభి ర్యజ్ఞైర్యత్ఫలం ప్రాప్యతే ఉభిశై॥
పంచామృతానాం స్నపనాద్విశ్వేశే తదవాప్యతే॥

భా॥ అశ్వమేధాది యజ్ఞములు చేయుటవలన ఏఫలము లభించునో అట్టి ఫలము విశ్వేశ్వరునకు పంచామృతములతో అభిషేకము చేయుటవలన లభించును

శ్లో॥ వాజపేయ సహస్రేణ సమ్యగిష్టేన యత్ఫలమ్।
సకృచ్ మహార్ఘై ర్నై వేద్యైర్విశ్వేశే తచ్ఛతాధికమ్॥

భా॥ వేలకొలది వాజపేయ యాగములు సక్రమముగ ఆచరించుటచే గల్గు ఫలమునకు నూరు రెట్ల ఫలము విశ్వేశ్వరునకు ఒక్కసారి ఘనమైన మహానివేదనము చేసినచో గల్గును

శ్లో॥ ధ్వజాతపత్ర చమరం విశ్వేశే యః సమర్పయేత్।
ఏకచ్ఛత్రం స వై రాజ్యం ప్రాప్నుయాద్వసుధాతలే॥

భా॥ విశ్వేశ్వరునకు ధ్వజము గొడుగు చామరములు భక్తితో సమర్పించినవానికి భూమియందు ఏకచ్ఛత్రాధిపత్యము లభించును

శ్లో॥ మహాపూజోపకరణం యో ఉర్పయేద్విశ్వభర్తరి।
న తం సంపత్తి సంభారా విముంచన్తీహ కుత్రచిత్॥

భా॥ విశ్వేశ్వరునకు భక్తితో మహాపూజకు కావలసిన ఉపకరణములను సమర్పించినవానికి ఎన్నటికిని ఎచ్చటను సంపదలకు లోటుండదు

శ్లో॥ సర్వర్తుకుసుమాఢ్యాంచ యః కుర్యాత్పుష్పవాటికామ్।
తదంగణే కల్పవృక్షచ్ఛాయాం కుర్వన్తి శీతలామ్॥

భా॥ ఈశ్వరార్చనకై అన్ని ఋతువులయందు పూచెడి పుష్పములతో గూడిన పూలతోటను పెంచినవాని అంగణమును కల్పవృక్షము ఘనచ్ఛాయంతో చల్లగయుండునట్లు చేయును.

శ్లో॥ యః క్షీరస్నపనార్థంవై విశ్వేశే ధేనుమర్పయేత్।
క్షీరార్ణవతటే తస్య నివసేయుః పితామహాః॥

భా॥ విశ్వేశ్వరునకు క్షీరాభిషేకమునకై పాడియావును సమర్పించినవాని పితృపితామహాదులు సదా క్షీరసాగరతీరమున నివసింతురు

శ్లో॥ విశ్వేశరాజసదనే యః సుధాం చిత్రమేవవా।
కారయేత్తస్య భవనం కైలాసే చిత్రితం భవేత్॥

భా॥ విశ్వేశ్వరాలయమునకు వెల్లవేయించినను గోడలపై చిత్రములు వ్రాయించినను అట్టివారికి కైలాసమందు చిత్రములు లిఖించిన భవనము లభించును

శ్లో॥ బ్రాహ్మణాన్యతినోవా ఉపి తథైవ శివయోగినః॥
భోజయేద్యో ఉత్రవై కాశ్యామేకైక గణనా క్రమాత్।
కోటి భోజ్యఫలం తస్య శ్రద్ధయా నాత్రసంశయః॥

భా॥ కాశియందు బ్రహ్మణులను గాని యతులనుగాని శివయోగులనుగాని భోజనములచే తృప్తి పొందించిన వారికి శ్రద్ధగా కోటిమందికి భోజనములు పెట్టిన ఫలము ఆ క్రమములో లభించును ఇందు సందేహములేదు

శ్లో॥ తపస్త్వత్ర ప్రకర్తవ్యం దానమత్ర ప్రదాపయేత్।
విశ్వేశస్తోషణీయో ఉత్ర స్నానహోమ జపాదిభిః॥

భా॥ కాశియందు తపస్సుచేయుట యథాశక్తిగ దానమిచ్చుట ముఖ్యకర్తవ్యములు కాశియందలి స్నాన హోమ జపాదులచే విశ్వేశ్వరుని సంతోషింపజేయుట నిత్యకర్తవ్యముగ నుండవలెను

శ్లో॥ అన్యత్రకోటి జప్యేన యత్ఫలం ప్రాప్యతే నరైః॥
అష్టోత్తర శతం జప్త్వా తదత్ర సముపాప్యతే॥

భా॥ అన్యత్ర కోటిజపముచే గల్గు ఫలితము కాశీయందు అష్టోత్తర శతసంఖ్య గల జపముచేతనే లభించును

శ్లో॥ కోటిహోమేన యత్ప్రోక్తం ఫలమన్యత్ర సూరిభిః॥
అష్టోత్తరాహుతి శతాత్తద్వలా ఉ ఉ నందకాననే॥

భా॥ అన్యత్ర కోటిసంఖ్యగ హోమము చేయుటవలన గలుగు ఫలితము ఆనందకానన మందు అష్టోత్తర శతహోమము చేతనే గల్గును

శ్లో॥ యో జపేద్రుద్రసూక్తాని కాశ్యాం విశ్వేశ సంనిధౌ।
పారాయణేన వేదానాం సర్వేషాం ఫలమాప్నుతే॥
తస్య పుణ్యం న జానామి చిన్తితే చాక్షరే సరే॥

భా॥ కాశీయందు విశ్వేశ్వర సన్నిధియందు రుద్రసూక్తములను పఠించినవారికి

సర్వవేదములను పారాయణచేసినట్టి ఫలము లభించును అచ్చట అక్షరసంఖ్యలో ధ్యానము చేసినవాని పుణ్యము ఇంత యంతయని చెప్పలేము

*తథా-శ్లో॥ అవశ్యం దివసం కుర్యాత్స్నానదాన జపాదిభిః।*
*యతః కాశ్యాం కృతం కర్మ మహత్త్వాయ ప్రకల్పతే॥*

భా॥ కాశీయందు నిత్యము స్నాన దాన జపాదులచే తప్ప ఇతరత్రా దినములను వృథాగాకుండ జాగ్రత్త వహించవలెను ఏమనగా కాశీయందు చేసినకర్మ మహత్తరమైనది యగును

*తథా శ్లో॥ అస్మిన్ వైశ్వేశ్వరక్షేత్రే సంభోజ్య శివయోగినః।*
*కోటిభోజ్యఫలం సమ్యగేకైక పరిసంఖ్యయా॥*

భా॥ ఈ విశ్వేశ్వరక్షేత్రమందు శివయోగులకు భోజనము పెట్టినచో ఒక్కొక్కరికి కోటిమంది చొప్పున భోజనము పెట్టినట్టి ఫలము లభించును

*మాత్స్యే- శ్లో॥ అవిముక్తే పరాసిద్ధి రవిముక్తే పరాగతిః।*
*జప్తం దత్తం హుతం చేష్టం తపస్తప్తం కృతంచ యత్।*
*ధ్యానమధ్యయనం దానం సర్వం భవతి చాక్షయమ్॥*

భా॥ అవిముక్తక్షేత్రమున పరమైన సిద్ధిగలుగును అచ్చట పరమగతి లభించును అచ్చట చేసిన జపము దానము హోమము యజ్ఞము తపస్సు ధ్యానము అధ్యయనము ఏది చేసినను అక్షయమగును

*పాద్మే శ్లో॥ తత్ర త్వసిహ యద్దానం భక్త్యా రుద్రాయ కల్ప్యతే।*
*ఖండ స్ఫుటిత సంస్కారం తత్ర కుర్వన్తి యే నరాః।*
*తే రుద్రలోక మాసాద్య మోదన్తే సుఖినః సదా॥*

భా॥ కాశీయందు భక్తితో చేసిన ఏదానమైనను రుద్రుని సంతోషింపజేయును కాశీయందు జీర్ణాలయమునుద్ధరింప జేసినవారు రుద్రలోకమును పొంది సుఖింతురు

*శ్లో॥ తత్ర పూజా జపో హోమః సర్వం భవతి దేహినామ్।*
*అనన్తఫలదం సర్వం రుద్ర భక్తిరతాత్మనామ్॥*

భా॥ కాశీయందు రుద్రభక్తి పరాయణులై చేసిన పూజ జపము హోమము సర్వము అనంతఫలదాయకమగును

*శ్లో॥ తత్రదీప ప్రదానేన జ్ఞానశక్తి రతీన్ద్రియా।*
*అథ కిం బహునోక్తేన యత్తత్ర క్రియతే నరైః।*

భా॥ అచ్చట దీపదానము చేసిన వారికి అతీంద్రియమైన జ్ఞానశక్తి లభించును ఇంకను ఎక్కువగ చెప్పవలసిన పనిఏమియున్నది?

*శ్లో॥ కర్మ ధర్మార్థముద్దిశ్య తదనన్తఫలం భవేత్।*
*స్వర్గాపవర్గదం క్షేత్రం తద్ధి తీర్థతమం భువి॥*

భా॥ కాశీయందు ధర్మమునుద్దేశించి చేసిన ఏకర్మమైనను అనంత ఫలము

నిచ్చునట్టిదియగును స్వర్గాపవర్గములను ఇచ్చునట్టి ఈ క్షేత్రము ఉవృధ్వి యందు అన్నిటికంటె ఉత్తమోత్తమ తీర్థమని గ్రాహ్యము

శ్లో॥ స్నానాజ్జప్యాత్తథా హోమా దనన్తఫల సాధనమ్
గత్వా వారాణసీ తీర్థం వ్రతం చాంద్రాయణం చరేత్॥

భా॥ స్నాన జప హోమాదుల వలన ఇచట లభించు ఫలము అనంతమగును కాశికి వెళ్లి చాంద్రాయణ వ్రతమాచరించవలెను

తథా శ్లో॥ పిండదానంచ తత్రైవ సుపుత్రైఃకార్యమాదరాత్
పుత్రాస్తేతు పితౄణాం వై భవన్తి సుఖదాః సదా॥ ఇతి॥

భావము సుపుత్రలచేత అచట పితరులకు పిండ ప్రదానము శ్రద్ధగచేయబడవలెను దానిచే ఎతృదేవతలు సదా సుఖింతురు

మాత్స్యే శ్లో॥ యావత్కృతే పుణ్యమిహావిముక్తే త్రేతాయుగే కోటిగుణంతతో ఽపి।
స్యాద్వాపరే సుందరి! తత్పరార్థమనన్తకమ్ తద్భవతీహ తిష్యే॥
(తిష్యే ః కలావిత్యాది। కాశ్యన్తర్గత తత్త తీర్థావచ్ఛేదేన
కామ్యానుష్ఠానఫలంతు యథాస్థానం వక్ష్యామః)

భా॥ ఓదేవీ! కాశియందు చేసినట్టి పుణ్యము చేత కృతయుగమందు ఎంతటి పుణ్యము లభించునో అదే పుణ్యము త్రేతాయుగమున కోటి గుణితముగను ద్వాపరయుగమున పరార్థ ఫలమును కలియుగమునందు అనంత ఫలము నిచ్చునట్టిది యగును ఇంక మీదట కాశీ అంతర్గతమగు వివిధ తీర్థములను సేవించినచో గలుగు కామ్యానుష్ఠాన ఫలము గూడ చెప్పబడనున్నది

(18) అథకాలవిశేషే ఽనేక తీర్థాగమనం - లింగపురాణే -

శ్లో॥ అష్టమ్యాంచ చతుర్దశ్యాం పక్షయోరుభయోరపి।
శశిభానూపరాగేషు కార్తిక్యాంచ విశేషతః॥

శ్లో॥ సర్వపర్వసు పుణ్యేషు విషువేష్వయనేషుచ।
పృథివ్యాఃసర్వతీర్థాని వారాణస్యాంతు జాహ్నవీమ్॥

శ్లో॥ ఉత్తర ప్రవహం పుణ్యాం మమ మౌళివినిర్గతామ్॥
పితుస్తే గిరిరాజస్య సుతాం హిమవతఃశుభామ్॥

భా -ఓదేవీ! ఉభయపక్షములందలి అష్టమి చతుర్దశి తిథులందును చంద్ర సూర్యగ్రహణ సమయములందును విశేషించి కార్తీక మాసమునను సర్వపర్వములందును పుణ్యతిథులయందును విషువత్తులందును అయనములందును - పృథ్వియందు గల సమస్త తీర్థములు వారణాసి యందు ఉత్తరవాహిని యగుచు నా జటాజూటము నుండి వెలువడినట్టిదియు నీ తండ్రియగు పర్వతరాజు హిమవంతుని పుత్రికయునగు గంగానదిని చేరి ఆమెను సేవింపును

శ్లో॥ తదహం సర్వతో ఒ.ప్యేత్య తాన్ శృణుష్వ వరాననే।
వంవిహాత్యా కురుక్షేత్రం పార్థం తీర్థశతైస్తథా॥

భావము ఈ విషయమును విశదముగ చెప్పెదను వినుము కురుక్షేత్ర మాదిగ మాట ఏఅంది పుణ్యతీర్థములును

శ్లో॥ నైమిషం పుష్కరం చైవ ప్రయాగం చ పృథూదకమ్।
నద్యఃసప్తర్షయశ్చైవ సర్వానద్యఃసరాంసి చ॥

శ్లో॥ సముద్రాఃసప్త చైవాత్ర దేవతీర్థాని కృత్స్నశః
భాగీరథీం సమేష్యన్తి సర్వపర్వసు కాశికామ్॥

భా॥ నైమిషము పుష్కరము ప్రయాగ పృథూదకము ఉభయసంధ్యలు సప్తర్షులు సర్వనదులు సరస్సులు సప్తసముద్రములు అన్నియును పూర్ణరూపముతో సర్వపర్వములందు కాశియందలి భాగీరథిని వచ్చిచేరును

(దేవ ఖాతములు: సరస్సులు నరఖాతములు: చెఱువులు నరఖాతములంటు గట్లు పోయబడినవి: తటాకములు)

శ్లో॥ అవిముక్తేశ్వరం చైవ కాశీష్వమచలాత్మకః
పృథివ్యాం యాని తీర్థాని గుహ్యాన్యాయతనాని చ॥

భా॥ అట్లే పృథివిలో గల రహస్యమైన బహిరంగమైన సమస్తతీర్థములు సర్వ పర్వములయందును సమూహముగ వచ్చి పుణ్యనది యగు గంగయందు వచ్చిచేరును

శ్లో॥ కేదారేచైవ యల్లింగం యల్లింగం చ మహాలయే।
మధ్యమేశ్వరసంజ్ఞంచ తథా పశుపతీశ్వరమ్।
శంకుకర్ణేశ్వరం చైవ గోకర్ణే తథా త్రిశా
ధృమిచండీశ్వరం చైవ భద్రేశ్వరమథైవచ।
స్థానేశ్వరమథైకామ్రం కాలేశ్వరమజేశ్వరమ్।
భైరవేశ్వరమీశానం తథా కారోహణస్థితమ్।
యాని చాన్యాని పుణ్యాని స్థానాని మమ భూతలే।
తాని సర్వాణ్యశేషాని కాశీపుర్యాం విశన్తి మామ్।
సర్వ పర్వసు పుణ్యేషు గుహ్యం చైతదుదాహృతమ్॥

భా॥ కేదారము మహాలయము మధ్యమేశ్వరము పశుపతీశ్వరము శంకుకర్ణేశ్వరము, గోకర్ణేశ్వరము, ధృమిచండేశ్వరము ఈశానము రోహణేశము మొదలగు నా స్వరూపములగు ఏయే పుణ్యస్థలములు భూమియందు అంతట గలవో అవియన్నియును సర్వపర్వములందును కాశికి వచ్చి నన్ను ( శివుని ) చేరును ఇది రహస్యమైనను మీకు చెప్పితిని.

( సప్త పుర్యాదిస్థితిస్తు సార్వదికీ తదుక్తం బ్రహ్మవైవర్తే )

(సప్తపురములయొక్క స్థితి సర్వదిక్సంబంధియని బ్రహ్మవైవర్త మందు ఇట్లు చెప్ప బడినది)

శ్లో॥ కాశ్యాం సదా ఖరా సప్తపుర్యఃసన్తి సమాగతాః॥

*నవారణ్యాని చ తథా నగాశ్చ సుకృతప్రదాః*

*తథా సర్వాణి తీర్థాని సప్తపుర్యశ్చ మానదే*

*వసన్తి కాశీమాశ్రిత్య స్వసామర్థ్య వివృద్ధయే॥*

భా   ఓ మానవతీ! మోక్షపురులుఏడును సూక్ష్మరూపముతో ఎప్పు కాశియందుండును అట్లే నవారణ్యములు సుకృతప్రదములగు పర్వతములు సర్వతీర్థములు సప్తపురులు కాశికి వచ్చి తమ తమ సామర్థ్యమును వృద్ధిచేసుకొనుటకై కాశిని సేవించును

శ్లో॥   *తీర్థాని సర్వాణి పురీశ్చ సర్వా ప్తగా శివస్యా ఉ ఉ యతనాని షష్టిః*

*నద్యః సదానసరః సాగరాశ్చదేవాః సమేతా మునయశ్చ సర్వే॥*

*( వసన్తి కాశ్యాం సతతమిత్యాది   కాశీఖండే )*

భావము   సర్వతీర్థములు సర్వపురములు ప్రసిద్ధమైన అరువది శివాయతనములు నదీనదములు సరస్సులు సాగరములు మునులు మొదలగు వారు అందరు వచ్చి కాశిని సేవింతురు   అనగా కాశియందు సూక్ష్మరూపమున స నా ని ంచుచుందురని భావము   కాశీఖం మందిది ఇట్లు చెప్పబడినది )

శ్లో॥   *యథా ప్రభృతి విశ్వేశో మన్దరా దాగతో ఉ భవత్*

*తస్మిన్నానందగహనే తదా ప్రభృ తి వత్తమ॥*

*సర్వాణ్యాయతనాన్యాశు సార్ధ్వ ( భూ ) వి నగిరిణ్యాపి*

*సనదీని సతీర్థాని సద్వీపాని యయు స్తతః॥*

భా   మందర పర్వతమునుండి వచ్చి ఆకాశియందు విశ్వేశ్వరుడు అవిర్భవించినది మొదలు సర్వాయతనములు సర్వగిరులు సర్వనదులు సర్వతీర్థములు సర్వద్వీపములు వచ్చి ఇందు నివసింపసాగినవి

మత్స్యే - శ్లో॥ *యాని స్థానాని శ్రూయన్తే త్రిషులోకేషు సువ్రతే।*

*అవిముక్తస్య పాదేషు నిత్యం సంనిహితాని వై॥ ఇత్యాది ॥ ( పాదాః ప్రదేశాః )*

భా   ఓ పుణ్యాత్మురాలా! మూడు లోకములందును ఏ యే పుణ్యక్షేత్రములు గలవని చెప్పబడుచున్నవో అవియన్నియు వచ్చి అవిముక్త క్షేత్ర ప్రదేశమందు సన్నిహితమైయున్నవి

శ్లో॥ *తీర్థాని యాని లోకే ఉ స్మిన్ జంతూనా మఘహన్త్యహో*

*తాని సర్వాణి శుద్ధ్యర్థం కాశీమాయాన్తి నిత్యశః॥*

భా   భూమి యందుండి సర్వప్రాణుల పాపములను పోగొట్ట గలిగిన తీర్థములన్నియు ఆత్మశుద్ధి కొరకు నిత్యము కాశికి వచ్చుచుండును

**(౧౦) అథ యాత్రోపదేశయోః - కాశీఖండే -**

వచనము   కైలాసాద్రేః సమాయాతా సప్తకోటిమితా గణా   ఇతి ప్రక్రమ్య॥

(కైలాసము నుండి బయలు దేరిన సప్తకోటి పరిమితి గల గణములు   ని

ప్రారంభించి )

శ్లో॥   *తతః శైలం మహాదుర్గం శైలాశీపరితః కృతమ్।*

పరిఖాఽపి కృతారమ్యా మత్స్యోదర్యా జలావిలా

భా కాశీ ప్రాంతమున గల మహా దుర్గమగు పర్వతము చేరి మత్స్యోదరి యను పేరు గల జలపూర్ణమగు కందకమును అగణములు త్రవ్విరి

శ్లో॥ మత్స్యోదరీ ద్విధా జాతా బహిరన్తర్గిరా పునః

తచ్చ తీర్థం మహాత్ ఖ్యాతం మిలితం గాంగవారిభిః

భ బహిరంగము అంతరంగము అని మత్స్యోదరి రెండుగ ఎర్పడినది ఇటి గంగాజలముతో మిళితమైనటు వంటిది అది గొప్పమహత్తు గల తీర్థమైనది

శ్లో॥ యదా సంహారమార్గేణ గంగామ్భః ప్రవిశేదిహా

తదా మత్స్యోదరీతీర్థం లభతే పుణ్యగౌరవాత్॥

భా ఇచ్చట గంగ వరద నీరు ఉపసంహరించుకొనినప్పుడు ఆజలము మత్స్యోదరిని ప్రవేశించును అప్పటి యాతీర్థము మిక్కిలి విశిష్టమైన పుణ్యపురుషులకు మాత్రమే ప్రాప్తించును

శ్లో॥ సూర్యా చంద్ర మసోపర్వ తదా కోటి గుణంకతమ్॥

సర్వపర్వాణి తత్రైవ సర్వతీర్థాని తత్ర నై॥

భా చంద్ర, సూర్య గ్రహణ సమయములందు సర్వ పర్వములు సర్వ తీర్థములు ఉండును గనుక అప్పటి మత్స్యోదరీ తీర్థస్నానము అన్నిటి కంటె శతకోటి ఎటు గొప్పదియగుచున్నది.

శ్లో॥ తత్రైవ సర్వలింగాని గంగా మత్స్యోదరీ యతః ।

మత్స్యోదర్యాం హి యే స్నాతా యత్ర కుత్రాపి మానవాః ॥

శ్లో॥ కృతపిండప్రదానాస్తే న మాతురుదరేశయాః ।

భా గంగాజలముతో మత్స్యోదరి యేర్పడినచోట సర్వలింగములు సంనిహితములై యుండును అట్టి పవిత్ర మత్స్యోదరియందు సుస్నాతులై తమ పితరులనుద్దేశించి పిండప్రదానము చేసినట్టి పుణ్యపురుషులు తిరిగి మాతృగర్భములు ప్రవేశించరు

శ్లో॥ అవిముక్తమిదంక్షేత్రం మత్స్యాకారత్వమాప్నుయాత్ ।

పరితః స్వర్ధునీ వారి సంపూరి పరిప్లుతే,

మత్స్యోదర్యాం కృతస్నానా యే నరా స్తే నరోత్తమాః ॥

భా ఈవిధంగా ఏర్పడిన అవిముక్తక్షేత్రము మత్స్యాకారమును పొందినది దాని యుండంతట స్వర్గంగాజలము నిండియున్నది అట్టి మత్స్యోదరీ జలములందు స్నానము చేసిన నరులు నరోత్తములే

శ్లో॥ కృత్వాఽపి బహుపాపాని నేక్షన్తే భాస్కరేః పురీమ్ ।

కిం స్నాత్వా బహుతీర్థేషు కిం తప్త్వా దుష్కరం తపః ॥

భా అనేకపాపములు చేసినట్టివారును మత్స్యోదరీస్నానము చేసి సచ యుమ(భాస్కరుని) పురమునకు వెళ్లరు అనేక తీర్థములందు స్నానము చేసినను దుష్కరమగు తపస్సు చేసినందు వలనఁగల్గు అధికఫలమేమి యుండును? ( ఇచ్చట తీర్థ స్నానములను తపస్సును నిందించుటగాదు. మత్స్యోదరీని ప్రశంసించుటయే దీని తాత్పర్యము)

శ్లో॥ *యది మత్స్యోదరీస్నాతా దుతో గర్భభయం తతః ।*
*యత్ర యత్ర హి తీర్థాని నృ దేవర్షి కృతాన్యపి ॥*

భా మత్స్యోదరీ సుస్నాతులకు గర్భవాస భయముండదు మానవుల చేతను దేవతలచేతను ఋషుల చేతను నిర్మింపబడిన తీర్థములెన్ని యున్నను మత్స్యోదరి యందు స్నానము చేసినవారు మోక్షభాజనులగుదురు

శ్లో॥ *సంతి తీర్థాన్యనేకాని భూర్భువః స్వర్గతాన్యపి ।*
*న సమాని పరం తాని కోట్యంశేనాపి నిశ్చితమ్ ॥*

భా భూలోక భువర్లోక స్వర్గలోకములందనేక తీర్థములున్నప్పటికిని అవి కోట్యంశము చేతనైనను మత్స్యోదరితో సమానముగావు

వచనము సంహారమార్గేణ ప్రతిలోమవర్త్మనా ఇహ మత్స్యోదరీ తీర్థే। మత్స్యోదరీ తీర్థం జలయుక్తాయాం పరిఖాయాం గణైః కృతాయాం మత్స్యోదరీ తీర్థమేవాన్తః వ్యస్థావే బహిశ్చపరిఖాయాం గమనా ద్వివిధమభూత్తత్ర చ పరిఖా ద్వారేణ యదా ప్రతికూలమార్గేణ వర్షాసు వృద్ధ్యతిశయేన గంగాజలం ప్రసరతి తదాఽ తి ప్రాశస్త్యమిత్యర్థః మత్స్యాకారాం కాశీముదరే యస్యా ఇతివ్యుత్పత్త్యా గంగైవ మత్స్యోదరీ సంజ్ఞా యతో యత్ర యత్ర తీర్థం ప్రవిశతి తత్ర తత్రైవ సర్వతీర్థానీతి సర్వ సర్వాణీత్యాదేరర్థః । భాస్కరేర్యమన్వ । యత్ర యత్ర లింగాని తదుపలక్షితాని తీర్థాని తత్ర తత్ర మత్స్యోదరీం గంగాం మిలితాః ప్రాప్యేతి యత్ర యత్రేతి పద్యార్థః ।

భా సంహార మార్గమనగా ప్రతిలోమమార్గము ఇచ్చట యనగా మత్స్యోదరీ తీర్థమని యర్థము గణములచే పరిఖగ త్రవ్వబడిన మత్స్యోదరీ తీర్థమే జలముతో నిండి అంతరంగమందును బహిరంగమందును పరిఖా ద్వారమున రెండు విధములగుచున్నది ప్రతికూలమార్గమున వర్షాకాలమందు వరదవచ్చినప్పుడు గంగాజలము పరిఖ ద్వారా ఎప్పుడు ప్రవహించునో అప్పుడది మిక్కిలి ప్రశస్తమైన ఫలమునిచ్చును మత్స్యాకారముగల కాశీక్షేత్రమును ఉదరమందు గలది. అనువ్యుత్పత్తిచే గంగయేమత్స్యోదరీ సంజ్ఞగలది యగుచున్నది. ఇచ్చట భాస్కరేః యనగా భాస్కరుని సంతానము అనగాయముడని అర్థము యత్ర యత్ర లింగాని యనుచోట అక్కడక్కడ గల తీర్థములని లక్షణచే గ్రహింపబడి గంగతో కలిసిన మత్స్యోదరీని పొంది యను భావమును గ్రహించవలెను

శ్లో॥ *మత్స్యోదరీ యదా గంగా కపిలేశ్వరసంనిధౌ ।*
*తదా తత్ర నరః స్నాత్వా బ్రహ్మహత్యాం వ్యపోహతి ॥*

భా మాత్స్యోదరి కపిలేశ్వర సంనిధియందు గంగతో కలిసినప్పుడు అచ్చట అప్పుడు స్నానముచేసిన వానికి బ్రహ్మహత్యా పాతకమైనను తొలగిపోవును

శ్లో॥ *వరణాప్రిక్త పానీయే ద్యువతీ తోయమిశ్రితే ।*

*స్నాత్వా వాదేశ్వరం దృష్ట్వా పూత శివమనోభవః ॥ (వాదేశ్వర మోంకారం )*

భా వరణానది యందు ఎగరప్పిన నీరు గంగానదితో కలిసిన చోట స్నానము చేసి వాదేశ్వరుడు అనగా ఓంకారేశ్వరుని దర్శించిన వాడు పవిత్రుడగును వానికెట్టి దుఃఖమును ఉండదు

తథా శ్లో॥ *ప్రణవేశ సమీపేతు యదా గంగా సమేష్యతి ।*

*తదా పుణ్యతమః కాలో దేవర్షి పితృవల్లభః ॥*

భా ప్రణవేశ్వరుని (ఓంకారేశ్వరుని) సమీపమునకు గంగ ప్రవహించినప్పుడు, అది మిక్కిలి పుణ్యతమమైన కాలము ఆ సమయము దేవతలకు ఋషులకు పితృదేవతలకు మిక్కలి ఇష్టమగు కాలము

శ్లో॥ *తత్ర స్నానం జపో దానం హవనం దేవతార్చనమ్ ।*

*మత్స్యోదర్యామక్షయం స్యాదోంకారేశ్వర సంనిధౌ ॥ (తథోంకారం ప్రకృత్య)*

భా అచ్చట గల మత్స్యోదరి యందు చేసిన స్నానము దానము దేవతార్చనము హోమము మున్నగునవి ఓంకారేశ్వర సంనిధి యందు చేయుటచే అక్షయమగును

(పిదప ఓంకారేశ్వరుని గురించి చెప్పుచు)

శ్లో॥ *కదాచిత్తస్య దేవస్య దర్శనే ఒఖ్యేతి జాహ్నవీ ।*

*మత్స్యోదరీ సా కథితా స్నానే పుణ్య తరావ్యతే ॥*

భా అప్పుడప్పుడు ఓంకారేశ్వరుని దర్శించుటకు జాహ్నవి అంత వరకు వచ్చును అదియే మత్స్యోదరీయని చెప్పబడును అప్పుడు అందలి స్నానముచే మిక్కిలి పుణ్యము చేకూరును

శ్లో॥ *మత్స్యోదరీ యదా గంగా పశ్చిమే కపిలేశ్వరమ్,*

*సమాయాతి మహాదేవి తదా యోగః సుదుర్లభః॥ (పశ్చిమే కపిలేశ్వరమితి అలుప్తమాహ)*

భా ఓ దేవీ! మత్స్యదరి యగు గంగ కపిలేశ్వరుని వరకు ప్రవహించి వచ్చుడు అట్టి యోగము మిక్కలి దుర్లభమైనది

*లింగపురాణే* - శ్లో॥ *మత్స్యదరీ జలే గంగా ఓంకారేశ్వర సంనిధౌ*

*తదా తస్మిన్ జలే స్నాత్వా బ్రహ్మహత్యాం వ్యపోహతి॥*

భా మత్స్యోదరీ గంగ ఓం కారేశ్వర సంనిధిని ప్రవహించువప్పుడు ఆ జలమందు స్నానము చేసినవాడు బ్రహ్మహత్యా పాతకమునుండి విముక్తుడగును

శ్లో॥ *తస్మిన్ స్థానే యదా గంగా ఆగమిష్యతి భామిని*

*తదా పుణ్యతమః కాలో దేవానామపి దుర్లభఃఇత్యాది॥*

భా ఓ దేవీ! గంగ ఆ స్థానమునకు వచ్చినప్పుడు అట్టి పుణ్యతమమైన కాలము

దేవతలకును మిక్కిలి దుర్లభము

**౫౦) అథ ప్రసంగాత్ కాశ్యముత్తర గంగామహిమా భిధీయతే**

(కాశీప్రాంతమున ప్రవహించు గంగ మహిమ)

శ్లో॥ త్రైలోక్యే యాని తీర్థాని మోక్షదాని చ కృత్స్నశః॥
సేవన్తే సతతం గంగాం కాశ్యాముత్తరవాహినీమ్॥

భా॥ మూడు లోకములందును మోక్షదాయకములగు తీర్థము లేవిగలవో అవియన్నియు నిత్యము కాశీకి వచ్చి అచ్చట ఉత్తర వాహినియగు గంగను సేవించును

శ్లో॥ గంగా హి సర్వతః పుణ్యా బ్రహ్మహత్యాపహారిణీ।
వారాణస్యాం విశేషేణ యత్రచోత్తర వాహినీ॥

భా॥ గంగ సర్వత్ర పుణ్యప్రదమైనది బ్రహ్మహత్యా పాతకమును పోగొట్టునది విశేషించి కాశీయందు ఉత్తరవాహిని యగు గంగ అధికము ప్రశస్తమైనది

శ్లో॥ వరణాయాస్తథాఽస్యాశ్చ జాహ్నవ్యాః సంగమే నరః॥
స్నానమాత్రేణ సర్వేభ్యః పాతకేభ్యః ప్రముచ్యతే॥

భా॥ వరణానది అసీనది గంగయందు సంగమమును పొందు స్థానమున స్నానము చేసినంత మాత్రమున ఎట్టివారైనను సర్వపాపముల నుండి విముక్తుడగును

శ్లో॥ కాశ్యా ముత్తరవాహిన్యాం గంగాయాం కార్తికే తథా।
స్నాత్వా విముచ్యతే మాఘే మహాపాతకిపాతకైః॥

భా॥ కాశీయందు ఉత్తర వాహినియగు గంగయందు కార్తిక మాసమున మాఘ మాసమున స్నానము చేసినవారు మహాపాప అతి పాతకముల నుండి విముక్తులగుదురు

శ్లో॥ సర్వలోకేషు తీర్థాని యాని ఖ్యాతాని తానిచ
సర్వాణ్యేతాన్యశేషేణ వారాణస్యాం తు జాహ్నవీమ్॥

శ్లో॥ ఉత్తరాభిముఖీం పుణ్యామాగచ్ఛన్తి దినేదినే।
నిత్యం సర్వాసు పర్వసు పుణ్యై రాయతనైః సహ॥

భా॥ సర్వలోకములందు ప్రఖ్యాతి పొందిన తీర్థములన్నియు వారాణసి యందు ఉత్తరవాహినియు పుణ్యనదియునగు గంగను ప్రతిదినము వచ్చి సేవించుచుండును విశేషించి పర్వదినములలో పుణ్య తీర్థములతో కలిసి వచ్చి సేవించుచుండును

శ్లో॥ మహాపాతకదోషాది దుష్టానాం స్పర్శనంభవమ్॥
వ్యపోహితుం స్వపాపం చ జలపాపసముత్థయోః॥

భా॥ మహాపాతకములు చేసిన దుష్టులను స్పృశించుట వలన గల్గిన పాపమును స్వయంకృత పాపమును పోగొట్టుకొనుటకు ఆ తీర్థములు కాశిని వచ్చి చేయుచుండును

శ్లో॥ జన్మాంతర శతేనాపి సత్కర్మ విరతస్యచ॥
అన్యత్ర సుధియశ్చాపి మోక్షో లభ్యేత వానవా

*ఏకేన జన్మనా చాత్ర గంగాయాం మరణేన చ*
*మోక్షస్తు లభ్యతే కాశ్యాం నరేణాచలితాత్మనా॥*

భా॥ అన్యత్ర శతజన్మల యందు చేసినట్టి సత్కర్మానుష్ఠానముచే మోక్షము లభించునో లేదో గాని నిశ్చలాత్ములైనట్టి సజ్జనులకు ఒక్క జన్మయందే కాశీవాసము గంగాజలము లందలి మరణము చేత నిశ్చయముగ మోక్షము లభించును

శ్లో॥ *కురుక్షేత్ర సమాగంగా యత్ర యత్రావగాహితా*
*కురుక్షేత్రాచ్ఛతగుణా యత్ర విన్ధ్యేన సంగతా*
*విన్ధ్యాచ్ఛతగుణాప్రోక్తా కాశీపుర్యాంతు జాహ్నవీ॥*

భా॥ అన్యత్ర గల తీర్థములందు చేయబడిన స్నానములు కురుక్షేత్ర తీర్థ స్నానముతో సమానమగును వింధ్యవాసిని వద్దగల గంగా సంగమమందలి స్నానము కురుక్షేత్ర తీర్థస్నాన ఫలమునకు నూరురెట్లు ఫలముతో సమానమగును కాశీయందలి గంగాస్నాన ఫలము వింధ్యవాసిని వద్దగల గంగా సగము స్నాన ఫలమునకు నూరురెట్లు సత్ఫలితమునిచ్చును

స్కాందే - శ్లో॥ *యథా ఽవిముక్తం సర్వేషాం స్థానానాం స్థానముత్తమమ్।*
*వారాణస్యాం తథా గంగా దుర్లభా సాఽకృతాత్మభిః॥*

భా॥ సర్వస్థానముల యందును అవిముక్త క్షేత్రము ఉత్తమమైనట్లే కాశీయందు ప్రవహించు గంగ ఉత్తమోత్తమమైనది అట్టి గంగాస్నానము పాపాత్ములకు లభ్యము గాదు

నారదీయే - శ్లో॥ *విష్ణు పాదోద్భవా దేవీ విశ్వేశ్వర సమీపగా*
*సంసేవ్యా మునిభి ర్దేవైః కాశ్యాం వై మోక్షకాంక్షిభిః॥*

భా॥ విష్ణుపాదోద్భవయై విశ్వేశ్వరుని సమీపమున కాశీయందు ప్రవహించు గంగానది మోక్షమును కాంక్షించునట్టివారికి మునులకు దేవతలకు సేవింపదగినది

శ్లో॥ *అథ కాశ్యా తీర్థానాం దేవతానాం చ లేశతః*
*నానాపురాణ సంమత్యా మహిమేహ మయోచ్యతే॥*
*(తత్ర తావత్సకల తీర్థ వరిష్ఠాయాః శ్రీమన్మణికర్ణికాయా మహిమా - కాశీఖండే)*

భా॥ పిదప బహుపురాణ సంమితమై కాశీయందున్న తీర్థముల దేవతల మహిమ సంగ్రహముగ చెప్పబడుచున్నది (కాశీఖండమందు కాశీగత సకల తీర్థములందును శ్రేష్ఠతమ మగు మణికర్ణికామహిమ ఇట్లు చెప్పబడినది)

**81) కాశీయందలి తీర్థములు, దేవతల యొక్క మహిమ**

శ్రీమణికర్ణికామహిమా కాశీఖండే

శ్లో॥ *అబ్రహ్మస్తంబ పర్యన్తం యత్కించి జ్జన్తుసంజ్ఞితమ్।*

చతుర్ధ భూత గ్రామేషు కాశ్యాం తన్ముక్తి మాప్నుతిః

భా॥ బ్రహ్మ మొదలుకొని స్తంబపర్యంతము (గడ్డిమొక్కలోని నడిమి దవ్వవరకు చతుర్విధ ప్రాణులలో (జంగమ స్థావరములు అనగా జరాయుజ అండజ స్వేదజ ఉద్భిజ్జములు) వీనిలో ఎదియైనను ఉపాధిర్త్యాగముచే కాశిలో ముక్తిని పొందును

శ్లో॥ అస్మిన్ తీర్థవరె శంభో ర్మణి శ్రవణభూషణే।

సంధ్యాం స్నానం జపం హోమం వేదాధ్యయన ముత్తమమ్

తర్పణం పిండదానం చ దేవతానాం చ పూజనమ్॥

(ఇత్యాద్యుక్త్వా) అక్షయా ముక్తి రేకాఽస్త్త విపాక స్త్వస్య కర్మణః (ఇత్యుక్తమ్) తథ

భా॥ ఈశ్వరుని కర్ణభూషణమందలి మణిపడినట్టి ఈ ఘట్టమందు చేయబడి స్నానము సంధ్య జపము హోమము వేదాధ్యయనము మొదలగునవియును మరియు తర్పణము పిండ ప్రదానము దేవతా పూజనములును ఉత్తము లైనవి యగును ఇ ప్రారంభించి కర్మ పరిపక్వమై (ఏక ప్రాధాన్యే) ప్రధానమైన అక్షయమగు ముక్తిం గలుగును అని చెప్పబడినది

తథా శ్లో॥ ముక్తి క్షేత్రాణి సర్వాణి యత్సంసేవ్యోదితం ఫలమ్।

పంచరాత్రా త్తదత్రాస్తు నిషేవ్య మణికర్ణికామ్॥

భా॥ ముక్తిక్షేత్రములన్నిటిని సమగ్రముముగ సేవించిన ఎట్టి ఫలము గల్గు అంతటి ఫలము మణికర్ణికను పాంచరాత్ర దీక్షతో సేవించినంతనే గల్గును

తథా- శ్లో॥ త్రయాణా మపి లోకానాం హితాయ మహతే నృప।

సమానైపి త్రశీ గంగా యత్రాఽఽసీ న్మణికర్ణికా॥

భా॥ హితము మహత్తుకొరకు మణి కర్ణికాయుతమగు గంగను మిం మూడులోకముల యందును కోరదగినట్టిది మరియొకటి లేదు

శ్లో॥ ప్రాగేవ హి మునేఽనర్ఘం జాత్యం జాంబూనదం స్వయమ్।

పున ర్మారి తరే జాసి హీరేణ యది సంగతమ్॥

భా॥ ఓ ముని! మొదటనే బంగారము అమూల్యము అను లక్షణముతోపాటు అనర్ఘదాయకమను లక్షణముతోను గలిసిపుట్టినది అట్టి బంగారము వీటినుండి పుట్టినట్టి మణితోను కూడుకొని యున్నచో ఇంక చెప్పెడిదేమి యుండును?

శ్లో॥ చక్ర పుష్కరిణీ తీర్థం ప్రాగేవ శ్రేయసాం పదమ్।

తతః శ్రేష్ఠతరం శంభో ర్మణిశ్రవణ భూషణాత్॥

భా॥ చక్ర పుష్కరిణీ తీర్థము సహజముగనే శ్రేయోదాయకమైనది. శివుని శ్రవణ భూషణము నుండి మణి జారి పడినందున సార్థక నామధేయము పొంది మణికర్ణిక శ్రేష్ఠతరమైనది

తథా- శ్లో॥ ఆనందకానన మిదం సుఖదం పురైవ తత్రాపి చక్ర సరసీ మణికర్ణికాఽథ

స్వబంధు సంగతి రతో సమాస్పదం చ, విశ్వేశితుః కిమహ తన్నవిముక్తయే యత్॥

భా॥ ఆనందకాననమగు ఈ కాశీపురి సుఖప్రదమైనది. అందలి చక్ర పుష్కరిణి మణికర్ణిక చిహ్నమైనది స్వర్గమునుండి సముద్రము వరకు ప్రవహించిన గంగ విశ్వేశ్వరునకు మిక్కిలి ప్రీతిపాత్రమైనది. అది ముక్తిదాయకముగాకుండ ఎట్లుండును? పాద్మే వ్యాసం ప్రతి భృగుః (వ్యాసునితో భృగువు ఇట్లు చెప్పెను)

శ్లో॥ చక్ర పుష్కరిణీ తీర్థే జాహ్నవీ జలసంప్లుతే
స్నాత్వా నారాధ్యతే కింతు శివదేవః సనాతనః
ద్వైపాయనేదం భవతో ధర్మ బాధన చేష్టితమ్॥

భా॥ ఓ వ్యాసమహర్షి గంగా జలమందు ఏర్పడిన చక్ర పుష్కరిణి యందు స్నానము చేసి సనాతనుడగు విశ్వేశ్వరుడు నీచేత సేవించబడలేదు. ఇది నీ యొక్క ధర్మమును బాధించు చేష్టితమై యున్నది.

తథా - శ్లో॥ దృష్ట్వా సర్వతీర్థాని స్వస్వధిష్ణ్యగతాన్యహో
కేవలం జలమాసాద్య మమహ వ్యాతికర్ణికమ్॥
లబ్ధ స్వైరాంగులిం తస్యం శ్రేష్ఠా మణికర్ణికా॥

భా॥ మణికర్ణికను సేవించి సర్వ తీర్థములు తమ పాపములను పోగొట్టుకొని బలమును పొందినవియై గర్వించుచున్నవి. గనుకనే మణికర్ణిక ఒక్కటియే శ్రేష్ఠమైనదియని చేతి నెత్తి వక్కాణించెదము

తథా- శ్లో॥ విశ్వేశో విశ్వయా సార్థం సదాసమణికర్ణికమ్॥
మధ్యస్థినం సమాసాద్య సంస్నాతి ప్రతివాసరమ్॥

భా॥ విశ్వేశ్వరుడు పార్వతితో గూడ రెండు ఝాముల సమయమున ప్రతిరోజు మణి కర్ణికయందు స్నానము చేయును

శ్లో॥ వైకుంఠా దహ్యహం నిత్యం మధ్యాహ్నే మణికర్ణికామ్
విగాహే పద్మయా సార్థం ముదా పరమయా మునే॥

భా॥ నేను గూడ (విష్ణువు) వైకుంఠము నుండి లక్ష్మీదేవితో గలిసి ప్రతి మధ్యాహ్నము మిక్కిలి సంతోషముతో మణికర్ణికలో స్నానము చేయుదును.

శ్లో॥ సత్యలోకా త్ప్రతిదినం హంసయానః పితామహః
మాధ్యాహ్నిక విధానాయ సమాయాస్యతి కర్ణికామ్॥

భా॥ అట్లే ప్రతిదినము బ్రహ్మ హంస వాహనముపై విచ్చేసి ఇచ్చట మాధ్యాహ్నిక [illegible]ంపు నిర్వర్తించుకొనును

శ్లో॥ ఇంద్రాద్యా దేవతాః సర్వా మరీచ్యాద్యా మహర్షయః

చరాచరమ సర్వము యావచ్ఛక్త్యా సమేతవాః

భా॥ ఇంద్రుడు మొదలగు దేవతలందరు మరీచి మొదలగు మహర్షులందరు ఇంతయు చరాచర జీవరాశిలో చైతన్యము గల్గినవన్నియును మధ్యాహ్నమణికర్ణికా స్నానమునకు వచ్చి చేరును.

శ్లో॥ తే సర్వే స్నాతుమాయాన్తి మధ్యాహ్నే మణికర్ణికామ్
త్రికాలం యే జపన్తీహ మానవా మణికర్ణికామ్॥
జపామి తానహం నిత్య త్రికాలం పుణ్యకర్మణః,
ఇష్టం తేన మహాయజ్ఞైః సహస్రశతదక్షిణైః
పంచాక్షరీ మహావిద్యా యేనోక్తా మణికర్ణికా జలేః

భా॥ అవి యన్నియును మధ్యాహ్నమందు స్నానము చేయుటకై మణికర్ణికను చేరును త్రికాలముల యందును ఏ మణికర్ణికను గూర్చి మానవులు జపించుచుందురో అట్టి పుణ్య కర్ములను గూర్చి నేను జపించుచుందును మణి కర్ణికయందు పంచాక్షరీ జపము చేసిన వానికి భూరి దక్షిణలతో యజ్ఞములు చేసిన ఫలము లభించును.

బ్రహ్మవైవర్తే- శ్లో॥ సర్వతీర్థావగాహస్య యత్పుణ్యం స్నానపుణ్యామిహ
తత్పుణ్యం కోటి గుణితం మణికర్ణీకమజ్జనాత్॥

భా॥ మణి కర్ణికయందు ఒక్కసారి స్నానము చేసిన వారికి సర్వతీర్థములందు స్నానము చేసినట్టి ఫలము లభించును

సనత్కుమార సంహితాయాం.-

శ్లో॥ మర్త్యః స్నాత్వాం మణి కర్ణికాయాం విశ్వేశ్వరం యః స్మరతీష్టవర్గాన్
స తారయత్యాశు వసర్వపాపాత్ కిమద్భుతం తస్య కృతార్థతాయామ్॥

భా॥ "మణి కర్ణికయందు స్నానము చేయుచు విశ్వేశ్వరుడనైన నన్ను స్మరించుచు తన ఇష్ట బాంధవులను స్మరించినచో వారి నందరిని నేను సర్వపాపముల నుండి తరింపజేయుదును అనుచుండగా అట్లు స్నానము చేసిన వానిని కృతార్థుని చేయుటలో ఆశ్చర్యమేమి యున్నది?

కాశీఖండే - శ్లో॥ స్నాత్వాతు మణికర్ణిక్యాం ప్రీణితా బ్రాహ్మణా ధనైః
త ఏతే సర్వభోగాఢ్యాః కల్పం స్థాస్యన్తి మత్పురే॥

భా॥ మణికర్ణికయందు స్నానము చేసి దానములచే బ్రాహ్మణులను సంతోష పెట్టినవారు సకల భోగభాగ్యములతో ఒక బ్రహ్మ కల్పము నాస్థానమున నివసింతురు

తథా- శ్లో॥ ముక్తిక్షేత్రాణి సర్వాణి యత్ఫలం సేవ్యేదితం ఫలమ్
వంచరాత్రా త్తదత్రాప్తు నిషేవ్య మణికర్ణికామ్॥

భా॥ సమస్త ముక్తి క్షేత్రములను సేవించుట వలన ఎట్టి ఫలము గల్గునో అట్టి ఫలము మణి కర్ణికను పంచదినములు సేవించినచో గల్గును

శ్లో॥ సర్వతీర్థేషు యత్పుణ్యం సర్వదానేషు యత్ఫలమ్।
మణికర్ణ్యాం విధిస్నాతః శ్రద్ధయా తదవాప్నుయాత్ ॥

భా॥ సర్వతీర్థములను సేవించుటవలన ఎట్టిపుణ్యము గలుగునో సర్వవిధదానములు చేయుటచే ఎట్టిఫలము గలుగునో అట్టిఫలము మణి కర్ణికయందు శ్రద్ధతో యథావిధిగ స్నానము చేసినంతనే కలుగును

శ్లో॥ శ్రద్ధయా విధివత్స్నాత్వా కృత్వా దేవాది తర్పణమ్।
తిలదర్భ యవైః సమ్యక్సర్వ యజ్ఞఫలం లభేత్ ॥

భా॥ మణికర్ణికయందు శ్రద్ధతో విధివిధానమున స్నానము చేసి దేవతలకు పితృదేవతలకు తిలలు దర్భలు యవలు మున్నగువానితో తర్పణము చేసినచో సర్వయజ్ఞములు చేసిన ఫలము గల్గును

శ్లో॥ శ్రద్ధధానో విధిస్నాతః కృత సర్వోదక క్రియః।
జపన్దేవా న్సమభ్యర్చ్య సర్వమన్త్ర ఫలం లభేత్ ॥

భా॥ శ్రద్ధతో విధివత్ మణికర్ణికయందు స్నానము చేసి సర్వమైన ఉదకక్రియలు నిర్వహించి జపము చేసికొని దేవతలను పూజించినచో సర్వమంత్రములను జపించిన ఫలము కలుగును

శ్లో॥ జ్ఞాత్వా ప్రభావమతులం మణికర్ణికాయామ్ యః పుద్గలం త్యజతి వాశుచి పూయగంధిః
స్నాత్వా ఉ వ బోధమహసా సహసా మిలిత్వా కల్పాంతరేష్వపి న నైవ పృథక్త్వ మేతి ॥

భా॥ మణికర్ణిక యొక్క ప్రభావము తెలిసినవాడై దుర్గంధ భూయిష్ఠమగు దేహమును మణికర్ణికా స్నానముచే తొలగించుకొనిన వాడు జ్ఞానమును వర్చస్సును పొందినవాడై కల్పాంతరమందును అట్టి జ్ఞానమును వర్చస్సును గూడియుండును

తథా॥ శ్లో॥ మరణం మంగళం యత్ర సఫలం యత్ర జీవితమ్।
స్వర్గస్తృణాయతే యత్ర సైషా శ్రీ మణికర్ణికా ॥

భా॥ ఎచ్చట మరణము గూడ మంగళప్రదమగునో ఎచ్చట జీవనము సఫలమగునో దేనిని సేవించినచో స్వర్గము గూడ తృణప్రాయముగా భాసించునో అట్టిది మణికర్ణికయే.

తథా॥ శ్లో॥ హుత్వాऽగ్ని హోత్రమపిచ యావజ్జీవం ద్విజోత్తమాః
అన్వేషయన్తే ముక్త్యై యాం సేయం శ్రీ మణికర్ణికా॥

భా॥ యావజ్జీవము ద్విజోత్తములు అగ్నిహోత్రమున హుతమొనర్చియు ముక్తికొరకై దేనినాశ్రయింతురు అదియే మణికర్ణిక.

వచనము ఇత్యాదినా వర్ణాశ్రమ చతుష్టయా స్త్రీతిర్యగాదీనా ముప్యత్ర మృతో ముక్తిరితి

దర్శితం చతుస్త్రింశేధ్యాయే॥

భా॥ ఇత్యాది వర్ణనచే చాతుర్వర్ణ్యములవారు స్త్రీ తిర్యగాదులు గూడ మణికర్ణికయందు మృతినొందినచో ముక్తిని పొందుదురని ఇందలి (కాశీఖండము )34వ అధ్యాయమున చెప్పబడినది

(22) *అథ మణికర్ణికా ప్రమాణమ్   కాశీఖండే*

శ్లో॥ *స్థానాదముష్మాన్మమ రాజసౌధ ప్రాచ్యాం మహాగీశ సమాశ్రితాయామ్ ।*
*సవ్యేఽపసవ్యే చ కరాః క్రమేణ శతత్రయీ చాపి శతద్వయీచ॥*

శ్లో॥ *హస్తాః శతం పంచ సురాపగాయా ముదీచ్య వాచ్యోర్మణికర్ణికేయమ్ ।*
*పారా త్రిలోక్యాః పరికీర్త భూమి, ర్యైః సేవితా తే మమ హృచ్ఛయా హి ॥*

భా॥ కాశీఖండమందు వర్ణించిన రీతిని బట్టి మణికర్ణికా ప్రమాణమిట్లున్నది విశ్వేశ్వరాలయము నుండి తూర్పుదిశగా వెళ్ళి, అచ్చటినుండి ఎడమవైపునకు ఈశాన్యముగా మూడువందల బాహువులు కుడివైపున ఆగ్నేయముగా రెండువందల బాహువుల దూరమును గంగయందు ఐదువందల బాహువుల దూరము వరకు గల మధ్య ప్రదేశము మణికర్ణికయగును దీనిని సేవించినవారు నా హృదయమందు నివసించువారే అగుదురు

వచనము అయమర్థ మమ రాజ సౌధాద్రాజగృహాత్ మోక్ష స్వర్గద్వారయో ర్మధ్యే బుధా రాజగృహం విదుః । ఇతి వచనాత్ స్వర్గద్వార స్థితా దారభ్య ప్రాచ్యాం మహాశ్మశానదిశ సమాశ్రితాయా మీశాన కోణాశ్రితాయామ్ । కించిదాగ్నేయ కోణాశ్రితాయాము। చేత్యపి జ్ఞేయం ఏవం భూతాయాం ప్రాచ్యాం వామపార్శ్వే కరాణాం శతత్రయం హరిశ్చంద్రమండపసీమకం తస్మాద్దేవ సౌధా దారభ్య దక్షిణాశ్రిత భాగే కరాణాం శతద్వయం గంగా కేశవావధికం ఉదీచ్య వాచ్యో రుత్తర దక్షిణ యో ర్ది ... సురాపగాయాం గంగాయాం పంచశతం హస్తాస్తావన్మితో దశః సేయం మణికర్ణికా।ఉదీచ్యాం హరిశ్చంద్రమండపా త్కరశత త్రయావధి భూతాత్వం ముఖే గంగాయాం పంచశతం హస్తా ఇత్యర్థఏవం చ హరిశ్చంద్ర మండప గంగాకేశవయోః సర్వస్మాదపి మధ్యవర్తినః ప్రదేశాత్పంముఖే పంచశతం హస్తా ఇత్యర్థా ల్లక్ష్యతే తథా చ దీర్ఘపంచకోణాకారైవ మణికర్ణికా భవతీత్యర్థః॥ ఏందేవావధి ప్రదర్శనద్వారా ప్రకటీకృతం తత్రైవ

శ్లో॥ *ఆగంగాకేశవా చ్చైవ ఆహరిశ్చంద్ర మండపాత్*
*ఆమధ్యాద్దేవ సరితః స్వర్ద్వారాన్మణికర్ణికా ॥ ఇతి॥ అత్రేయ*

శ్లో॥ తిర్యగ్యవోదరాణ్యష్టౌ ఊర్ధ్వావా వ్రీహయస్త్రయః
ప్రమాణమంగుళస్యోక్తం వితస్తిర్ద్వా దశాంగులః

వచనము హస్తో వితస్తి ద్వితయం ఇత్యేతదేవ కరపరిమాణం గ్రాహ్యం పరిమాణాన్తర గ్రహణే మణికర్ణికా ప్రమాణానియమ ప్రసంగాత్॥

భావము దీనియర్థమేమనగా నా ఆలయమునుండి మోక్ష స్వర్గ్ద్వారముల మధ్యనున్నది రాజగృహమని పండితులు చెప్పుదురు యను వచనము చేత స్వర్గ్ద్వారము నుండి ప్రారంభించి తూర్పుగ యనగా కొంచెము ఈశాన్యముగా ఎడమవైపునకు కొంచెము ఆగ్నేయదిశగా కుడివైపునకు అని గ్రహించవలెను ఇట్లుండగా తూర్పున ఎడమవైపునకు హరిశ్చన్ద్రమండప సీమవరకు మూడువందల బాహువులు అదే స్వర్గ్ద్వారమునుండి ఆగ్నేయదిశగా గంగాకేశవ అవధిగా కుడివైపునకు రెండువందల బాహువులు ఉత్తరదక్షిణములుగా గంగయందు ఐదువందల బాహువుల పరిమితి వరకుగల ప్రదేశము మణికర్ణిక యగుచున్నది ఉత్తరమున హరిశ్చంద్ర మండపమును మూడువందల బాహువులు వరకును ఎదురుగా గంగ యందు ఐదువందల బాహువుల వరకును యని అర్థము అనగా హరిశ్చన్ద్ర మండపము గంగా కేశవ స్థానమునకు మధ్యమున్న ప్రదేశము నుండి ఎదురుగా అయిదు వందల బాహువుల వరకును అను అర్థము ఏర్పడుచున్నది దాని వలన దీర్ఘచతురస్రాకారముగనున్న ప్రదేశమే మణికర్ణికప్రమాణమగునని భావము ఈ హద్దుల ప్రదర్శన ద్వారా అచ్చటనే ఇట్లు చెప్పబడినది గంగా కేశవ స్థానమునుండి హరిశ్చన్ద్రమండపము నుండి ఆ రెంటింటి మధ్య స్వర్గ్ద్వారమునుండి గంగానది మధ్యవరకు మణికర్ణిక. ఇచ్చట అడ్డముగా ఎనిమిది యవలు ఊర్ధ్వముగా మూడుగోధుమగింజలు ప్రమాణము కలది అంగుళమనియు పండ్రెండు అంగుళముల దూరము వితస్తి యనియు రెండు వితస్తుల దూరము ఒక హస్తము లేక బాహువు యనియు అదియ కరపరిమాణమనియు గ్రహించవలెను పరిమాణాంతరమును (మరియొక కొలత)గ్రహించినచో మణికర్ణిక ప్రమాణము నిర్ణయింపబడనేరదని యర్థము.

(కాశీఖండములో చెప్పబడినట్లుగ మణికర్ణిక లేక చక్రపుష్కరిణి తీర్థము చాల ప్రాచీనమైనదనియు భగీరథుడు గంగను ఇచ్చటకు తెచ్చుటకు పూర్వమే కాశీలో యుండెననియు మూలములో సాంప్రదాయానుసారముగ ఈ చక్రపుష్కరిణి ఒక గొప్ప సరస్సు యనియు ఇది ఉత్తరముననున్న సంకటాఘాట్ సమీపమునగల హరిశ్చన్ద్ర మండపమునుండి దక్షిణమున లలితాఘాట్ పైగల గంగాకేశవస్థానము వరకును

పశ్చిమమున పట్టణములోని బ్రహ్మనాళమునందులో గల స్వర్గద్వారేశ్వరమునుండి తూర్పున గంగామధ్యము వరకు వ్యాపించియుండెనని చెప్పబడినది ఈ పుష్కరిణీతీర్థమునకు ఉత్తరతీరమున హరిశ్చన్ద్రుడు కాటికాపరిగ యుండెననియు గంగానదీయవతరణముచే ఈ విశాలమైన తీర్థము గంగలో కలిసిపోగా పేరు కన్పించునట్టి చిన్న కుండముగా మిగిలిపోయినదని చెప్పబడినది )

(23) అథ మణికర్ణికోత్పత్తిః

వచనము కదాచిద్భవానీశంకరయో రిచ్ఛా ఉ.భూత్కశ్చిత్ద్వితీయ ఆవాభ్యాముత్పాద్యో యస్మిన్సర్వం భారం నిధాయ సుఖేన స్థీయతే।

భా॥ ఒకానొకప్పుడు పార్వతీశంకరులకు తమవంటివారిని ఇరువురను ఇరువురనుండి అవిర్భవింపజేసి వారికి సృష్టిపాలనా భారమునంతయు నప్పగించి సుఖముగానుండవలెనని కోరిక గల్గెను

శ్లో॥ సంప్రధార్యేతి స విభుః సర్వజ్ఞ శ్చిత్స్వరూపయా।
తయా సహ జగద్ధాత్ర్యా జగద్ధాతా ఉ.థ ధూర్జటిః॥
సవ్యే వ్యాపారయాం చక్రే దశమంగే సుధాముచమ్।
తతః పుమాన్ విరాసీ రేకస్త్రైలోక్యసుందరః॥

భా॥ అంతట సర్వజ్ఞుడైన శంకరుడు చిత్స్వరూపిణియు జగద్ధాత్రియునగు పార్వతికి తనయంగీకారము తెల్పి జగత్పాలనకై తన ఎడమభాగమునుండి ఉత్పత్తిని సంకల్పించెను. దాని నుండి అమృతధారవంటి త్రైలోక్య సుందరుడగు పురుషుడొక్కరు అవిర్భవించెను.

వచనము. తం మహాదేవో వీక్ష్య సర్వం త్వమేవ విష్ణు ర్భూత్వా కుర్వితి నియుజ్య స్వయం శివయా సహిత ఆనందకాననం ప్రవిష్టః

భా॥ అతనిని చూచి ఈశ్వరుడు నీవు విష్ణువవై సర్వమును నిర్వహించుమని నియోగించి తాను పార్వతీసహితుడై ఆనందకాననమును ప్రవేశించెను

శ్లో॥ తతః సభగవాన్ విష్ణుశ్శైవాజ్ఞాం విధాయచ।
క్షణం ధ్యానపరో భూత్వా తప ఏవ మనోదధే॥

భా॥ అంతట ఆమహాత్ముడగు విష్ణువు శివాజ్ఞను శిరసావహించి ఒక్కక్షణం ధ్యానపరుడై తపస్సు చేయుటకై మనమున నిశ్చయించుకొనెను

శ్లో॥ ఖనిత్వా తత్ర చక్రేణ రమ్యాం పుష్కరిణీం హరిః

కర్ణాభరణ విశేషము విష్ణువిట్లు పలికెను )

శ్లో॥ ముక్తా కుండల పాతేన తవాద్రి తనయా ప్రియ।
తీర్థానం పరమం తీర్థం ముక్తి క్షేత్రమిహాస్త్వితి॥

(ఇత్యేవం కాశీఖండే షడ్వింశే ఽ ధ్యాయే కథాఇతి మణికర్ణికోత్పత్తి ః)

భా॥ ఓ పార్వతీప్రియా! ముత్యముతోనున్న ఏ కర్ణాభరణము ఇచ్చట పడుటచే ఇది మణికర్ణికయను పేర పరమతీర్థమై ముక్తి క్షేత్రమగును (ఇట్లు కాశీఖండములో 26 అధ్యాయములో మణికర్ణికోత్పత్తి కథావిధానము)

(24) అథ మణికర్ణికా ధ్యానమంత్రాది కాశీఖండే అగ్నిబిందు ప్రతి విష్ణుః
(మణికర్ణికా ధ్యానయంత్రములు కాశీఖండమందు అగ్నిబిందువు నుద్దేశించి శ్రీ మహావిష్ణువు వచనము)

శ్లో॥ చక్ర పుష్కరిణీ చైవ ఖ్యాతా ఽ భూన్మణి కర్ణికా ।
ద్రవరూపం పరిత్యజ్య లలనారూపధారిణీ॥

భా॥ చక్రపుష్కరిణియని ప్రసిద్ధినొందిన ఈ క్షేత్రమిప్పుడు మణికర్ణికయైనది. జలరూపమును విడిచి స్త్రీరూపమును ధరించినది

శ్లో॥ ప్రత్యక్షరూపిణీ తత్ర మయైక్షి మణికర్ణికా ।
తస్యారూపం ప్రవక్ష్యామి భక్తానాం తు శుభప్రదమ్ ॥

భా॥ ప్రత్యక్షముగా నాచేత మణికర్ణిక చూడబడినది భక్తులకొఱకు శుభప్రదమైన ఆమె రూపమును చెప్పుచున్నాను వినుడు

శ్లో॥ యద్రూపధ్యానతః పుంభి రాషణ్మాసం త్రిసంధ్యతః
ప్రత్యక్షరూపిణీ దేవి దృశ్యతే మణికర్ణికా॥

భా॥ ఆరునెలలు త్రిసంధ్యలయందు ఆ రూపమును శ్రద్ధగా ధ్యానించినచో ఆ మణికర్ణికా దేవత ప్రత్యక్షమగును

శ్లో॥ చతుర్భుజా విశాలాక్షీ స్ఫురదుత్పల విలోచనా ।
పశ్చిమాభిముఖీ నిత్యం ప్రబద్ధకరసంపుటా ॥
ఇందీవరమయీం మాలాం దధానా దక్షిణేకరే।
వరోద్యతే కరే సవ్యే మాతులుంగఫలం శుభమ్ ॥
కుమారరూపిణీ నిత్యం నిత్యం ద్వాదశవార్షికీ।
శుద్ధస్ఫటిక కాంతిశ్చ సునీల స్నిగ్ధమూర్ధజా ॥

భా॥ ఆమె నాలుగు భుజములు గలది. విశాలాక్షి ప్రకాశించుచున్నట్టి సుదురు నేత్రములు గలది, పశ్చిమాభిముఖముగనుండి నిత్యము అంజలి ఘటించి

పుంభిర్ముక్తి మభీప్సుభి ఇతిప్రకారాన్తరం వా-
తారస్తార తృతీయో బిన్దువ్నో మణిపదం తతః
(కర్ణికే ప్రణవాత్మ పదంకే నమః ఇతి మను సంఖ్యావర్ణమనుః । తారః ప్రణవస్తారస్య తృతీయాక్షరం మకారో బిన్దుః సానుస్వారః తథాచైవం మన్త్రః " ఓం మం మణికర్ణికే ప్రణవాత్మికే నమః ఇతి అయం మన్త్రో... నిశం జప్యః పుంభి ర్ముక్తిమభీప్సుభి )

శ్లో॥ అత్ర పుంభి రిత్యుక్తేః స్త్రీణా మనధికార ఇతికశ్చిత్ ।
హోమో దశాంశతః కార్యః శ్రద్ధా బద్ధాదరై ర్నృభిః ॥

(ఐం1),హ్రీం 2),శ్రీం 3) క్లీం 4) ఓం 5) ప్రణవానంతరమ్ మకారం 6) సానుస్వారం 7) నమః శబ్ద యుతః ప్రణవాఖ్యాం స్ఫుటితః(9)11)

భా ॥ మంత్రములు 1) వాగ్భవ2)మాయ 3)లక్ష్మి 4)మదన 5) ప్రణవాస్వదే ర్వ్యాద్యం 6)ఖాన్తం 7)బిందూపేతం మణిపద మథ మణికర్ణికే 8)సుప్వాత్మనా 9) నవుటః సురద్రుమ నమః నమస్త సుఖ వంతతి ప్రదో జప్యః తిథిభిః పరిమితి వర్ణః సూక్ష్మబుద్ధులకు పరమపదము పొసంగునట్టి దియై యున్నది ) ఆ మంత్రము ఇది " ఓం ఐం హ్రీం శ్రీం క్లీం ఓం మం మణికర్ణికే నమః ఓం॥ ఇతి ॥ అన్యత్ర మరియొక విధముగా కూడ ఇవ్వబడినది అదియిది ఈ పదునైదు అక్షరములతో గూడిన మంత్రమును ముక్తిని గోరు మానవులెల్లరు నిత్యము జపించవలెను మరియొక విధానమున ప్రణవమగు ఓంకారమందలి తృతీయాక్షరమగు మ కారము పూర్ణబిందువుతో గూడి (అనగా మం)దానికి మణిపదమును చేర్చి మంత్రముగా జపించవలెను 'కర్ణికే యను ప్రణవాత్మ పదమునకు 'నమ చేర్చి గ్రహించవలెను అనగా మంత్రమిట్లుండును " ఓం మం మణికర్ణికే ప్రణవాత్మికేనమః" ఈ మంత్రము ముక్తినికోరు వట్టి మానవులచే నిత్యము ఉపాసింపతగినది (ఇచ్చట పుంభిః యను వివరణము విచ్చుటచే స్త్రీపురుషులను ఇరువురును కలిపిచెప్పు 'ఏకశేష యగుటచే పురుషులకే అధికారము అను ఆక్షేపణ సరికాదు జపమందు దశాంశము శ్రద్ధాదరములతో హోమము చేయవలెను

శ్లో॥ పరిష్కృతైః పుండరీకై ర్ఘృతేన హవిషా మృతైః
సశర్కరేణ మేధావీ స క్షౌద్రేణ సదాశుచిః ॥

భా॥ తెల్ల తామరలతో పూజించి హవిస్సుచేతను చక్కెరచేతను తేనెతోను సదాశుచియై హోమము చెయవలెను

శ్లో॥ త్రిలక్షమన్త్రజాప్యేన మృతోదేశాన్తరే వ్యపి ।
అవశ్యం ముక్తి మాప్నోతి మన్త్రస్యాస్య ప్రభావతః ॥

భా॥ మూడు లక్షల సంఖ్యమంత్రమును జపించు హోమము చేసిన నరుడు విధి వశమున దేశాంతరమందు మృతినొందినను ,మంత్ర జప ప్రభావము వలన అవశ్యము ముక్తిని పొందును

శ్లో॥ సౌవర్ణం ప్రతిమా కార్యా నవరత్న సమన్వితా ।
పూర్వోక్త రూపసంపన్నా సంపూజ్యా సా ప్రయత్నతః ॥

భా॥ నవరత్న ఖచితమైన సువర్ణ ప్రతిమను పైన వర్ణించిన మణి కర్ణికా రూపమును చేయించి దీక్షగా పూజించవలెను

శ్లో॥ సంపూజ్యాసా సదాగేహే నరై ర్మోక్షైక కాంక్షిభిః ।
మణికర్ణ్యామథోక్షేత్రే సమభ్యర్చ్య ప్రయత్నతః ॥

భా॥ మోక్షకాంక్షులగువారిచే ఇంటియందుగాని మణికర్ణికయందుగాని ప్రయత్నపూర్వకముగా అర్చించబడవలెను

శ్లో॥ సంసార భీరుభిః పుంభిః శ్రద్ధాబద్ధాదరై రిహ
ఉపాయః సమనుష్ఠేయో హ్యపి దూరనివాసిభిః ॥

భా॥ సంసారభయభీతులగు మానవులచే శ్రద్ధగ దీక్షతో అర్చించబడవలెను కాశీక్షేత్రమునకు దూరమునయున్నవారును ఈ ఉపాయమును అనుష్ఠించవలెను

శ్లో॥ మణికర్ణీశ్వరం లింగం పురా సంస్థాపితం మయా ।
ప్రాగ్ద్వారే -ఽన్తర్గృహస్యాత్ర సమర్చ్యం మోక్షకాంక్షిభిః ॥
(మణికర్ణికా శబ్ద వ్యుత్పత్తిర్వ్ కాశీఖండే ప్రకారద్వయేన )

భా॥ మోక్షకాంక్షులగువారు నాచే పూర్వము అంతర్ గృహము యొక్క ప్రాగ్ద్వారమందు స్థాపించబడిన మణికర్ణీశ్వరలింగమును అవశ్యము పూజించవలెను (కాశీఖండమందు రెండువిధములుగ చెప్పబడిన మణికర్ణికాశబ్దవ్యుత్పత్తి ఇట్లున్నది )

శ్లో॥ సంసారి చింతామణి రత్రయస్మాత్తం తారకం సజ్జన కర్ణికాయామ్ ।
శివో ఽభిధత్తే సహసాఽన్తకాలే తద్గీయతే ఽసౌ మణికర్ణికేతి ॥

భా॥ ముముక్షువులగు సంసారులకు చింతామణి యగు ఈశ్వరుడు మరణాసన్నులగు సజ్జనుల చెవియందు తారకమును ఉపదేశించుటచే ఇది మణికర్ణికయని ప్రశంసించబడుచున్నది.

శ్లో॥ ముక్తి లక్ష్మీ మహాపీఠమణి స్తచ్చరణాబ్జయోః
కర్ణికేయం తతః ప్రాహుర్యాం జనామణికర్ణికామ్ ॥

భా॥ ముక్తి లక్ష్మి చరణకమలములయొక్క పీఠమణికి కర్ణిక వంటిది యగుటచే దీనిని జనులు మణికర్ణికయని వ్యవహరింతురు

వచనము ( సంసారీతి శివవిశేషణం । ముక్తిలక్ష్మి మహాపీఠేషు ముక్తి స్థానేషు మధ్యే మణిః శ్రేష్ఠా తస్యా మోక్షలక్ష్మ్యాశ్చరణ కమలయోశ్చకర్ణికా యతస్తేన మణిశ్చాసౌకర్ణికా చేతి వ్యుత్పత్త్యా మణికర్ణికేతి ద్వితీయపద్యార్థః)

భా॥ సంసారియనునది శివుని విశేషణము ముక్తిలక్ష్మినొసగువట్టి ముక్తి స్థానములగు మహాపీఠములలో మణి శ్రేష్ఠమైనది అట్టి మోక్షలక్ష్మి చరణకమలములకు ఇది కర్ణిక (పాదపీఠమువంటిది)అందుచే మణియైన కర్ణిక (మణిశ్చ అసౌ కర్ణికాచ ) అనువ్యుత్పత్తి చే మణికర్ణిక యని పైరెండవ శ్లోకమునకు అర్థము గ్రహించవలెను

(26) అథ జ్ఞానవాపీ స్కాందే

శ్లో॥ స్కంద జ్ఞానోద తీర్థస్య మాహాత్మ్యం వదసాంప్రతమ్ ।
జ్ఞానవాపీం ప్రశంసన్తి యతః స్వర్గౌకసోఽ_న్వహమ్ ॥

భా॥ ఓ స్కందా! ఇప్పుడు దేవతలు సైతము అనిశము పొగడుచుండెడి జ్ఞానవాపియొక్క మహాత్మ్యను మాకు చెప్పుడు

స్కంద ఉవాచ - (కదాచిత్ కాశీం ప్రత్యాగతే నేశానేన విశ్వేశ్వర లింగేదృష్టే)

(స్కందుడిట్లు చెప్పుచున్నాడు ఒకప్పుడు ఈశాన్యదిక్కుకు అధిపతియగు ఈశానుడు వచ్చి విశ్వేశ్వరలింగమును దర్శించెను

శ్లో॥ తస్యేశానస్యతల్లింగం దృష్ట్వే చ్ఛేత్య భవత్తదా
స్నాపయామి మహాలింగం కలశై శీతలైర్జలైః ॥

భా॥ అట్లు దర్శించినంతనే ఈ మహాలింగమును శీతల జలముచే అభిషేకింపవలెనని ఈశానునకు ఇచ్ఛగలిగెను

శ్లో॥ చఖాన చ త్రిశూలేన దక్షిణాశావకంరతః ।
కుండం ప్రచండం వేగేన రుద్రోరుద్రవపుర్ధరః ॥

భా॥ వెంటనే ఈశానుడు తన త్రిశూలముచే దక్షిణ దిక్కున కుండమును త్రవ్వగా ప్రచండవేగముతో పృథివి ఆవరణ మందలి జలము వెలువడెను

శ్లో॥ పృథివ్యా వరణాంభాంసి నిష్క్రాంతాని తదా మునే ।
తతస్తైః స్నపయాం చక్రే త్వస్పృష్టై రన్యదేహిభిః ॥
(తతో విశ్వేశే వరదానాయోద్యత ఈశాన ఉవాచ)

భా॥ అట్లు వెలువడిన జలముతో దేవుని అభిషేకించెను అప్పుడు విశ్వేశ్వరుడు

వరము కోరుకొమని యనగా ఈశానుడిట్లు పలికెను

శ్లో॥  యది ప్రసన్నో దేవేశ వరయోగ్యో ఽప్యహం యది ।
తదైత దతులం తీర్థం తవ నామ్నా ఽస్తు శంకర॥

భా॥ ఓ దేవదేవా! నేను వర దానమునకు యోగ్యుడనైనచో సాటిలేని మహిమగల ఈ తీర్థము నీ పేరుతో సిద్ధిపొందుగావుత యనెను

విశ్వేశ్వర ఉవాచ — శ్లో॥ త్రిలోక్యాం యాని తీర్థాని భూర్భువః స్వః స్థితాన్యపి।
తేభ్యో ఽఖిలేభ్య స్తీర్థేభ్య ః శివతీర్థ మిదం పరమ్ ॥

భా॥ అంతట విశ్వేశ్వరుడిట్లు చెప్పెను త్రిలోకములందును భూర్భువస్సువర్లోకములందును ఏయే పుణ్యతీర్థములు గలవో వాని యన్నిటికంటెను శివతీర్థమగు ఇది ఉత్తమమైనదియగును

శ్లో॥  శివ జ్ఞాన మితి ప్రాహుః శివ శబ్దార్థ చిన్తకాః ।
తచ్చ జ్ఞానం ద్రవీభూతమిహ మే మహిమోదయాత్ ॥

భా॥ శబ్దార్థము తెలిసినవారు శివ యనగా జ్ఞానము అని చెప్పుదురు అట్టి జ్ఞానమిచట నా మహిమచే ద్రవీ భూతమైనది

శ్లో॥  అతో జ్ఞానోదనామైతత్తీర్థం త్రైలోక్య విశ్రుతమ్ ।
అస్యదర్శన మాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే ॥

భా ॥ అందుచేత త్రిలోకములందు ఈ తీర్థముజ్ఞానోదమని ప్రసిద్ధిగాంచును దీనిని దర్శించినంత మాత్రముననే సర్వ పాపములు తొలగిపోవును

శ్లో॥  జ్ఞానోద తీర్థ సంస్పర్శాదశ్వమేధఫలం లభేత్।
స్పర్శనాచమనాభ్యాం చ రాజసూయాశ్వమేధయోః ॥

భా ॥ జ్ఞానవాపి తీర్థస్పర్శచే అశ్వమేధ ఫలము లభించును స్పృశించి ఆచమనము చేయుటచే రాజసూయ అశ్వమేధయాగముల రెండింటి ఫలము లభించును

తథా శ్లో॥  యత్ఫలం సమవాప్నోతి పితౄన్సంతర్ప్య పుష్కరే ।
తత్ఫలం కోటిగుణితం జ్ఞానతీర్థే తిలోదకైః ॥

భా॥ జ్ఞానవాపి తీర్థముతో పితరులకు తిలతర్పణమిచ్చినచో అది పుష్కర సమయమునిచ్చిన తర్పణమునకు కోటి గుణితమగును.

శ్లో॥  సంనిహత్యాం కురుక్షేత్రే రాహుగ్రస్తే దివాకరే ।

యత్ఫలం పిండదానేన తత్ జ్ఞానోదే దినేదినే ॥

భా॥ సూర్యగ్రహణ సమయమున కురుక్షేత్రమందు పిండప్రదానము చేసిన గల్గుఫలము జ్ఞానవాపీతీర్థముచే ఏ దినమందిచ్చినను గల్గును

తథా శ్లో॥ ఉపాస్య సంధ్యాం జ్ఞానోదే యత్పాపం కాలలోపజమ్।

క్షణేన తదపాకృత్య జ్ఞానవాన్ జాయతే ద్విజః ॥

భా॥ జ్ఞానవాపి ఉదకముతో సంధ్యావందనము చేసినచో చిరకాల సంచితమైన పాపము ఒక్క క్షణములో పోగొట్టుకొని అట్టి ద్విజుడు జ్ఞానవంతుడగును

తథా :- డాకిన్యాదీన్ప్రకృత్య (డాకిన్యాదులను గురించి )

శ్లో॥ సర్వే తే ప్రశమం యాన్తి శివతీర్థ జలోక్షణాత్।

జ్ఞానోదతీర్థ పానీయై ర్లింగం యః స్నాపయే త్సుధీః॥

భా జ్ఞానవాపీతీర్థముచే లింగమునకు అభిషేకము చేసి ఆ శివతీర్థజలమును ప్రోక్షించినచో డాకిన్యాదులన్నియు ఉపశమించును

శ్లో॥ సర్వతీర్థదశై స్నేన ధ్రువం సంస్నాపితం భవేత్ ।

జ్ఞానరూపో ఽ హమేవాత్ర ద్రవమూర్తిం విధాయచ॥

భా॥ జ్ఞానరూపుడనైననేను ద్రవరూపమును ధరించి ఇచట యుంటిని దీనిని ప్రోక్షించుకొనినచో సర్వతీర్థములయందు స్నానము చేసిన ఫలము లభించును

శ్లో॥ జాడ్య విధ్వంసనం కుర్యాం కుర్యాం జ్ఞానోపదేశనమ్ ।

యో ఽ ష్టమూర్తి ర్మహాదేవః పురాణే పరిపఠ్యతే ॥

తస్యైషా ఽ మ్బుమయీమూర్తిర్ జ్ఞానదా జ్ఞానవాపికా ॥

భా॥ ఈ జలరూపమున జాడ్యమును పోగొట్టి జ్ఞానోపదేశము చేయుదును అష్టమూర్తియు మహాదేవుడనునైన నేను యీ జ్ఞానవాపీ రూపమున జ్ఞానదాయినై ఉందును

తథా:- శ్లో॥ జలక్రీడాం సదా కుర్యాం జ్ఞానవాప్యాం సహోమయా ।

యదంబుపాన మాత్రేణ జ్ఞానం జాయేత నిర్మలం ॥

నేను జ్ఞానవాపియందు ఉమాసహితుడనై జలక్రీడ చేయుచుందును అందుచే ఈ జలమును పానము చేసినంతనే నిర్మలమైన జ్ఞానము గల్గును

శ్లో॥ తజ్జల క్రీడన స్థానం మమ ప్రీతికరం మహత్ ।

అముష్మిన్ రాజసదనే జాడ్యధ్వాన్తజలపూరితమ్ ॥

భా॥ నా రాజగృహమందలి ఈ జలక్రీడన స్థానము నాకు మిక్కిలి ప్రీతికరమైనది అట్టి ఈ జ్ఞానవాపి జాడ్యమును పోగొట్టునట్టి జలముతో నిండియున్నది

శివపురాణే - వాపీజలం తు తత్రస్థం దేవదేవస్య సంనిధౌ ।
దర్శనాత్స్పర్శనాత్స్నానాత్తత్ర ధర్మస్యసంభవః ॥

భా॥ దేవదేవుని సన్నిధియందుగల జ్ఞానవాపిని దర్శించినను ఆ జలమును స్పృశించినను దానితో స్నానముచేసినను ధర్మము గల్గును

పాద్మే  శ్లో॥ వాపీ తత్రాస్తి నైదేహదిన్మయీ దేవదక్షిణే ।
తదపాం సేవనా దేవ లభతే బ్రహ్మకేవలమ్ ॥

భా॥ దేవాలయమునకు దక్షిణమున ఒకవాపి గలదు ఆ జలమును త్రాగినవారు బ్రహ్మస్వరూపులగుదురు

వచనము  దేవదేవా ద్దక్షిణఇతి దేవశబ్దో దేవాలయ పరస్తేన దేవాలయా ద్దక్షిణ దిశీతి వా దేవస్య పశ్చిమాభిముఖతయా యథా శ్రుతేః బాధాత్ ॥

భా॥ ఇచ్చట దేవదేవుడు పశ్చిమాభిముఖుడై యుండుటచే దేవునకు దక్షిణమనగా దేవాలయమునకు దక్షిణమున జ్ఞానవాపి గలదని గ్రహించవలెను

లైంగే  శ్లో॥ దేవస్య దక్షిణే భాగే వాపీ తిష్ఠతి శోభనా ।
తస్యా స్తథోదకం పీత్వా పునర్జన్మ నవిద్యతే॥

భా॥ దేవాలయమునకు దక్షిణభాగమందు శోభాకరమగు జ్ఞానవాపియున్నది ఆ జలము గ్రోలిన వారికి పునర్జన్మ భయముండదు

శ్లో॥  పీతమాత్రేణ తేనైవ ఉదకేన యశస్విని ।
త్రీణి లింగాని వర్ధన్తే హృదయే పురుషస్యతు ॥

భా॥ ఓ కీర్తి రూపిణీ! ఆ జలమును త్రాగినంతనే అట్టి నరుని హృదయమందు మూడు లింగములు వృద్ధినొందును

శ్లో॥  దండపాణిస్తు తత్రస్థో రక్షతే తజ్జలం సదా ।
పశ్చిమం తీర మాసాద్య దేవదేవస్య శాసనాత్ ॥

భా॥ జ్ఞానవాపి సమీపమున దండపాణి దేవదేవుని యాజ్ఞచే పశ్చిమతీరమందుండి ఈ జలమును రక్షించుచుండును

శ్లో॥  పూర్వేణ తారకో దేవ జలం రక్షతి సర్వదా
నన్దీశ శ్చోత్తరే చైవ మహాకాలస్తు దక్షిణే
రక్షతే తజ్జలం నిత్య ముఖాక్షానాం తు మోహనమ్ ॥

భా॥ తూర్పువైపున తారకేశ్వరుడు రక్షించుచుండును ఉత్తరమున నందికేశ్వరుడు దక్షిణమున మహాకాలేశ్వరుడును యుండి ఆ జలమును నిత్యము రక్షించుచుందురు భక్తిహీనులను మోహింప జేయుచుందురు

విష్ణురువాచ - శ్లో॥ మమాపి సా పరాదేవీ తను రాపోమయీ శుభా
అప్రాప్యా దుర్లభా దేవైర్మానవై రకృతాత్మభిః ॥

భా॥ ఆ పరాదేవి నా యొక్కయు జలరూపమై శుభప్రదమై యున్నది. కృతాత్ములు గాని దేవతలకు మానవులకును అది అప్రాప్యము

శ్లో॥ యైస్తు తత్ర జలం పీతం కృతార్థాస్తేతు మానవాః ।
తేషాం తు తారకం జ్ఞానముత్పత్స్యతి న సంశయః ॥

భా॥ అచ్చట జలమును త్రాగగల్గిన మానవులకు తారకజ్ఞానము లభించుననుటలో సందేహము లేదు

శ్లో॥ వాపీ జలే నరః స్నాత్వా దృష్ట్వా వై దండనాయకమ్ ।
అవిముక్తం తతో దృష్ట్వా కైవల్యం లభతే క్షణాత్ ॥
(దేవస్య దక్షిణ ఇతి పూర్వవత్ వ్యాఖ్యేయమ్)

భా॥ జ్ఞానవాపి జలమందు ఏ నరుడైనను స్నానము చేసి దండపాణిని దర్శించి, పిమ్మట అవిముక్తేశ్వరుని చూచినవారికి కైవల్యము క్షణములో లభించును. (పూర్వము వలెనే దేవస్య దక్షిణ మనగా దేవాలయమునకు దక్షిణ దిశగా గ్రహించవలెను. )

(26) అథ పంచనద బిందు మాధవయోర్మహిమా -
కాశీఖండ ఏకోనషష్టితమే ఽధ్యాయే పంచనదోత్పత్తిః జ్ఞేయా

తథా - శ్లో॥ ఏ తత్పంచనదం తీర్థం పంచబ్రహ్మాత్మక సంజ్ఞకమ్।
యత్ర స్నాతో న గృహ్ణీయాత్ శరీరం పాంచభౌతికమ్ ॥

భా॥ ఈ పంచనద తీర్థము పంచబ్రహ్మాత్మక సంజ్ఞకమని గ్రహించవలెను ఇచ్చట స్నానము చేసిన వారు తిరిగి పాంచభౌతిక శరీరమును పొందరు.

తథా -శ్లో॥ ఆదౌ ధర్మనదః పుణ్యం మిశ్రితో ధూతపాపయా ।
యయా ధూతాని పాపాని సర్వతీర్థ కృతాత్మనా ॥

భా॥ మొదట ధర్మనదము పుణ్యప్రదమై ధూతపాపతో కలియుచున్నది. సర్వతీర్థస్వరూపిణి యగుటచే సర్వపాపములు విధూతమగును

శ్లో॥ తతో ఽపి మిలితా ఽఽ రశ్మి కిరణా రవినైధితా ।

యన్నామ స్మరణాదేవ మహామోహో ఽస్తకే ప్రశేత్॥

భా॥ సూర్యునినుండి వచ్చిన కిరణానదితో అక్కడ కలియుచుండును. ఆ ధూత పాపానామస్మరణము చేతనే మహామోహమంతమగును.

శ్లో॥ తతో భాగీరథీ ప్రాప్తా తేన దైలీపినా సహ।
కిరణా ధూతపాపా చ పుణ్యా తీర్థా సరస్వతీ॥
గంగా చ యమునా చైవ పంచనద్యః ప్రకీర్తితాః॥

భా॥ అంతట దిలీపుని అన్వయమునకు చెందిన భగీరథునిచే తీసికొని రాబడిన గంగతో కలియును. ఇట్లు కిరణ ధూతపాప పుణ్యనదులగు సరస్వతి గంగా యమున ఇవి యన్ని యును కలిసి పంచనదులుగ కీర్తింపబడుచున్నవి.

శ్లో॥ అతః పంచనదం నామ తీర్థం త్రైలోక్య విశ్రుతమ్।
యత్రాఽఽప్లుతో న గృహ్ణీయా ద్దేహం వా పాంచభౌతికమ్॥ (నానుమన్యః)

భా॥ కాశిలో అడుగడుగున అనేక తీర్థములు గలవు కాని అవియన్నియును పంచనదతీర్థము యొక్క కోట్యంశమునకు సరిగావు.

శ్లో॥ ప్రయాగే మాఘమాసే తు సమ్యక్ స్నాతస్య యత్ఫలమ్।
తత్ఫలమ్ స్యాద్దినైకేన కాశ్యాం పంచనదే ధ్రువమ్॥

భా॥ మాఘమాసమంతయు ప్రయాగతీర్థమందు విధివిధానముగ స్నానము చేసిన లభించు ఫలము కాశిలో పంచనదమందు ఒక్కదినము స్నానము చేసినను నిశ్చయముగ లభించును

శ్లో॥ స్నాత్వా పంచనదే తీర్థే కృత్వా చ పితృతర్పణమ్।
బిందుమాధవ మభ్యర్చ్య న భూయో జన్మభాక్ భవేత్॥

భా॥ పంచనదమందు స్నానము చేసి పితృదేవతలకు తర్పణమిచ్చి బిందుమాధవుని దర్శించి పూజించినవారికి తిరిగి జన్మయెత్తుట యుండదు

శ్లో॥ యావత్సంఖ్యా స్తిలా దత్తాః పితృభ్యో జలతర్పణే।
పుణ్యే పంచనదే తీర్థే తృప్తిః స్యాత్తావదాబ్దికీ॥

భా॥ పుణ్యప్రదమగు పంచనద తీర్థమందు ఎన్ని నువ్వుగింజలతో పితరులకు తర్పణమిచ్చి తృప్తిగావించుదురో అన్ని సంవత్సరములవరకు వారికి తర్పణము చేసినట్టి తృప్తి లభించును.

శ్లో॥ శ్రద్ధయా యైః కృతం శ్రాద్ధం తీర్థే పంచనదే శుభే।

తేషాం పితామహా ముక్తా నానా యోనిగతా అపి ॥

భా॥ పంచనద తీర్థమందు పితృదేవతలకు శ్రద్ధతో శ్రాద్ధమువిర్వ హించినచో,నానా యోనులందు జన్మగల్గినను వారి పితరులందరు ముక్తి పొందుదురు.

తథా శ్లో॥ తత్ర పంచనదే తీర్థే యత్కించి ద్దీయతే నను ।
కల్ప క్షయేఽపి న భవేత్తస్య పుణ్యస్య సంక్షయః ॥

భా॥ పంచనద తీర్థమందు ఏ కొంచెము బంగారమును (ద్రవ్యమును )దానము చేసినను దానిచే కల్ప క్షయమందును నశించని పుణ్యరాశి లభించును.

తథా శ్లో॥ జలైః పాంచనదైః పుణ్యైః నానా సంశోధితైః ।
మహాఫల మవాప్నోతి స్నపయిత్వేష్ట దేవతామ్ ॥

భా॥ పుణ్యదాయకమగు పంచనద తీర్థమును వస్త్రముతో వడకట్టి పంచనదీశ్వరునకు (ఇష్ట దేవతకు ) అభిషేకము చేసినచో మహాఫలము లభించును.

తథా :- శ్లో॥ రాజసూయాశ్వమేధౌచ భవేతాం స్వర్గసాధనమ్॥
ఆబ్రహ్మసుతికా ద్వంద్వం ముక్త్యై పాంచనదాప్లుతిః॥
(తృతీయపాదస్యపూర్వార్ధేఽన్వయః)

భా॥ రాజసూయ అశ్వమేధయాగములు స్వర్గసాధనము లైనట్లే పంచనద తీర్థమందు చేసిన స్నానము రెండు బ్రహ్మసుతియల కాలము వరకు నిలుచునట్టి మహాఫలము నిచ్చును

తథా :- శ్లో॥ కృతే ధర్మనదం నామ త్రేతాయాం ధూతపాపకమ్ ।
ద్వాపరే బిందుతీర్థంచ కలౌ పంచనదం స్మృతమ్ ॥

భా॥ కృతయుగమున ధర్మనదమని,త్రేతాయుగమున ధూతపాపయని ద్వాపరమందు బిందు తీర్థమని కలియుగమున పంచనదమని దీనికి ప్రసిద్ధిగల్గినది.(ఇత్యాదిపీకోనషష్ఠితమోఽధ్యాయః)

తథా :-శ్లో॥ శ్రీ బిందు మాధవ స్త్వేష సాక్షాత్ లక్ష్మీపతిః పరః ।
శ్రద్ధయా యం నమస్కృత్య న విశేద్గర్భవేశ్మని ॥

భా॥ పరాత్పరుడు లక్ష్మీపతియైనగు ఇచ్చటి బిందుమాధవునకు భక్తితో నమస్కరించినవారికి మరల గర్భవాసము ఉండదు.

శ్లో॥ న దారిద్ర్య మవాప్నోతి వ్యాధిభి ర్నాభి భూయతే ।
బిందు మాధవ భక్తో యస్తం యమోఽపి నమస్యతి॥

భా॥ బిందుమాధవ భక్తునకు దరిద్రము గలుగదు. ఆధి ,వ్యాధులు బాధించవు. (అధి

= మనోవ్యాధి,వ్యాధి =శారీరక రోగము) అట్టివారికి యముడు కూడా నమస్కరించును.

శ్లో॥ ప్రణవాత్మా య ఏకోఽస్తి నాద బిందు స్వరూపధృత్ ।
అమూర్తం యత్పరం బ్రహ్మ బిందుమాధవ ఏవసః

భా॥ ప్రణవాత్మకమై నాదబిందు స్వరూపమై అమూర్తమగు పరబ్రహ్మమేది గలదో అదియే సాక్షాత్ బిందుమాధవుడు

శ్లో॥ *మానతే మమ నామ్నాఽత్ర తీర్థే పంచనదే శుభే ।*
*అభక్తేభ్యో ఽపి భక్తేభ్యః స్థితో ముక్తిం సదా దిశ ॥*
*(ఇత్యాదిను అగ్నిబిందునా వరేను ప్రార్థితేను విష్ణుః)*

భా॥ ఓ లక్ష్మీపతీ ! నా పేరుతో శుభప్రదమైన ఈ పంచనద తీర్థమందు భక్తులకును అభక్తులకును అనగా స్నానము చేసిన సర్వులకు ముక్తినిమ్ము అని అగ్నిబిందువుచే వరము కోరబడగ విష్ణువిట్లు పలికెను

శ్లో॥ *త్వనామ్నాఽర్ధన మే నామ మయా సహ భవిష్యతి*
*బిందు మాధవ ఇత్యాఖ్యా మమ త్రైలోక్య విశ్రుతా ॥*

భా॥ నీ పేరులో సగము నా పేరుతో గలిసి బిందుమాధవ యని యిచట నామూర్తికి ముల్లోకములందు ప్రసిద్ధికెక్కిన నామమేర్పడును

శ్లో॥ *కాశ్యాం భవిష్యతి మునే! మహాపాతక నాశినీ ।*
*యే మామత్ర నరాః పుణ్యాః పుణ్యే పంచనదే హ్రదే ॥*
సదా సమర్చయిష్యన్తి తేషాం సంసారభీః కుతః ॥ ఇత్యాదిః

భా॥ ఓ మునీ ! పుణ్యమై ఈ పంచనదము మహాపాపసమూహములను గూడ నాశనము చేయునదియై కాశీయందుండును ఇందు స్నానము చేసి నన్ను అర్చించినవారికి ఇక సంసార భయమెక్కడిది ?

శ్లో॥ *బిందుతీర్థ మిదం నామ తవ నామ్నా భవిష్యతి ॥ ఇతి చ॥*
*బిందుమాధవ నామానం యో మామత్ర సమర్చయేత్ ।*
*బిందుతీర్థ కృత స్నానో నిర్వాణం స హి విందతి ॥*

భా॥ నీ పేరుతో గలిసి ఇది బిందుతీర్థమని ప్రసిద్ధిగాంచును బిందుతీర్థమందు స్నానము చేసినవాడై బిందుమాధవుడగు నన్ను పూజించినవాడు నిశ్చయముగ నిర్వాణమును పొందును.

*తథా— శ్లో॥ సర్వదా యత్ర సర్వాణి దశమ్యాది దిన త్రయమ్*
*తిష్ఠన్తి తీర్థసర్వాణి నిజనైర్మల్య హేతవే ॥ (తథా కార్తిక విశేషు)*

భా॥ దశమినుండి మూడురోజులవరకు తాము నిర్మలత్వము పొందుటకై సమస్త పుణ్య

తీర్థములు విశేషముగ కార్తీకమందు వచ్చియుందును

శ్లో॥ అప్యేకం కార్తికస్యాః తత్ర యైః సఫలీకృతమ్।
జపహోమార్చనాదానైః కృతకృత్యా స్త ఏవహి॥

భా॥ కార్తీకమాసమందు ఒక్కరోజైనను ఇచ్చట స్నానము చేసి జపహోమదానార్చనములచే ఎవరు కృతకృత్యులగుదురో వారి జన్మసఫలమగును

తథా॥ శ్లో॥ యై ర్నపంచనదే స్నాతం కార్తికే పాపహారిణి।
తే ఽద్యాపి గర్భే తిష్ఠన్తి పునస్తే గర్భవాసినః॥

భా॥ పాపహారిణి యగు పంచనదమందు కార్తీకమాసమందైనను స్నానము చేయని వారు గర్భవాసులై తిరిగి తిరిగి మాతృగర్భమున ప్రవేశించుచుందురు

తథా – శ్లో॥ శతం సమాః తపస్తప్త్వా కృతే యత్ప్రాప్యతే ఫలమ్।
తత్కార్తికే పంచనదే సకృత్ స్నానేన లభ్యతే॥

భా॥ కృతయుగమందు నూరు సంవత్సరములు కఠిన తపస్సుచేసిన లభించు ఫలము కార్తీకమాసమందు పంచనదతీర్థమందు సకృత్తుగ స్నానము చేసినను లభించును

శ్లో॥ ఇష్టాపూర్తేమ ధర్మేమ యావజ్జన్మ కృతేమ యత్।
అన్యత్ర స్యాత్ ఫలం తత్ స్యాత్ ఊర్జే ధర్మనదాప్లవాత్॥

భా॥ యావజ్జన్మము ఇష్టా పూర్తములు మొదలగు ధర్మములు అన్యత్ర చేసినచో గల్గు ఫలము శక్తిమంతమగు ధర్మనద స్నానముచే గల్గును

శ్లో॥ గో భూ తిల హిరణ్యాశ్వవా సోన్న స్రగ్ విభూషణమ్
యత్కించిత్ బిందు తీర్థే ఽత్ర దత్వా ఽక్షయ్య మవాప్నుయాత్॥

భా॥ బిందు తీర్థమందు గో భూ తిల హిరణ్య అశ్వ వస్త్ర అన్న మాల్యాది విభూషణములను దానము చేసినచో అక్షయ ఫలము లభించును

శ్లో॥ ఏకా మప్యాహుతిం దత్వా సమిద్ధేఽగ్నౌ విధానతః।
ఊర్జే ధర్మనదే తీర్థే కోటి హోమ ఫలం లభేత్॥ఇత్యాది॥

భా॥ ధర్మనద తీర్థమందు ఒక్కసారియైనను అగ్నియందు సమిధలతో హోమము చేసినచో కోటి హోమ ఫలము గల్గును (ఇత్యాది)

శ్లో॥ కార్తికే బిందు తీర్థే యో బ్రహ్మచర్యపరాయణః।
స్నాన్యత్యనుదితే భానౌ భానుజాత్తస్య భీః కుతః॥

భా॥ కార్తీక మాసమందు బ్రహ్మచర్యదీక్షితుడై సూర్యోదయమునకు పూర్వమే స్నానము చేసిన వారికి యముని వలన భయముండదు (కార్తీక వ్రతమును గురించి

అరువదియవాఽధ్యాయ మందు చూడనగును)

*తథా శ్లో॥ యం సంచయతి పాపౌఘ మావర్షం తీర్థనాయకః*

*తమేకమజ్జనాదూర్జే త్యజేత్పంచనదే ధ్రువమ్ ॥*

భా॥ తీర్థ నాయకమగు ప్రయాగకూడ ఒక సంవత్సర కాలములో పాపుల స్నానాదులచే తనకు సంక్రమించిన పాపసమూహమునంతను పంచనదమందొక్కసారి స్నానము చేసినంతనే పోగొట్టుకొనును

వచనము. అత్ర యద్యపి ప్రయాగస్య యథా శ్రుత పాపనాశః కాశీ ప్రవేశాదేవ సంభావ్యతే పాపనాశనా తు ఫలబలకల్ప్యా ప్రయాగస్య పాపప్రవృత్తి రూప ఫలాభావా న్న కల్పయితుం శక్యా । న చ ప్రాణినాం పాపం ప్రయాగే సంక్రమతి కింతు తేన నాశ్యతే న చ తస్య మజ్జన సంభవః ప్రయాగాభిమాని దేవతా యాస్తత్సంభవేఽపి వా న తస్యా మజ్జనా త్పాపనాశ సంభవో మనుష్యాధికారిత్వా చ్ఛాస్త్రస్య। తథాపి శాస్త్రదృష్ట విరోధా త్ప్రజాపతివపోత్ఖననా దివదర్థవాదతయా స్వార్థే తాత్పర్యా భావాన్న కశ్చిద్దోషనేశః ॥

భా॥ ఇచ్చట ప్రయాగకు పాపనాశకమను ప్రసిద్ధి కాశీ ప్రవేశమును బట్టియేయని భావింపబడుచున్నది ఫలబలము వలన పాపనాశన మాత్రము గర్పించుకొనవలసియున్నది పాపప్రవృత్తిరూపఫలాభావము ప్రయాగకు కల్పించుటకు వీలులేదు ప్రయాగయందు ప్రాణుల పాపము సంక్రమించదు గాని దానిచే నశింపజేయబడును ఏమనగా ప్రయాగ స్నానము చేయుట వలన పాపము సంభవించదు ప్రయాగాభిమానియైన దేవతకు ఒక వేళ అది సంభవించినను ఆ దేవతకు సంక్రమించిన పాపము స్వకీయమగు తీర్థస్నానముచే పాపనాశము సంభవించదు అట్టి స్నానమును శాస్త్రము మనుష్యులకు మాత్రమే విధించుటచేత అట్లైనను శాస్త్రదృష్టియందు విరోధము కల్పించినచొ ప్రజాపతివపోత్ఖననము చేసి నట్లుగ అర్థవాదము కొరకు అనగా ప్రచోదనము కొరకు స్వార్థము నందు తాత్పర్యము పర్యవసించకపోవుటచే ఏ మాత్రము దోషము లేదు

*శ్లో॥ ప్రయాగశ్చాపి తీర్థేన్ద్రః సర్వతీర్థార్పితం మలమ్ ॥*

*మహాఘినాం మహాఘంచ హారేత్పంచ నదాప్లుతః(ఇత్యాది వచనేష్వప్యేషైవ గతిః)*

భా॥ తీర్థ రాజమగు ప్రయాగ కూడ సర్వతీర్థములు తన యందు వదిలిన మలమును మహాపాపుల యొక్క మహా పాపములను గూడ పంచనది సేవన బలము వలన హరింపజేసి కొనును (ఇటువంటి వచనముల యందు గూడ పై రీతిగా అన్వయించు కొనవలెను )

*శ్లో॥ వారాణస్యాం పంచనదే త్ర్యహం స్నాతాస్తు కార్తికే ।*

అమీ తే పుణ్యవపుషః పుణ్యభాజో ఽతి నిర్మలాః ॥

భా॥ కార్తీమాసమందు వారణాసి యందలి పంచనద తీర్థమందు మూడుదినములు స్నానము చేసిన వారు పుణ్యదేహులు పుణ్య భాగులు అతి నిర్మలులు అగుదురు

వచనము -ఇత్యాదీని త్ర్యహసరాణ్యపి వచనాని కార్తికస్నాన విధిం మాసకృత్యేషు వక్ష్యామః ఇతి పంచనద మహిమా ।

భా॥ ఇటువంటి మూడురోజులు అనినట్లు చెప్పిన వచనములు కార్తిక స్నాన విధి యందు నెల యంతయు చేయవలసిన విధులలో చెప్పబడును ఇది పంచనద మహిమ

(27) అథ గభస్తీశాదయః లింగపురాణే (గభస్తీశ్వరుడు మొదలైనవారు)

శ్లో॥ నరః పంచనదే స్నాత్వా దృష్ట్వా లింగం గభస్తినః ।

అనన్తఫల మాప్నోతి యత్ర యత్రా భిజాయతే ॥

భా॥ పంచనదమందు స్నానము చేసి గభస్తీశ్వరుని దర్శించిన నరుడు ఎచ్చటెచ్చట జన్మించినను అనంత ఫలమును పొందుచుండును

కాశీఖండే రవిం ప్రతి శివః (కాశీ ఖండమందు సూర్యునకు శివుని వచనము)

శ్లో॥ త్వయా ప్రతిష్ఠితం లింగం గభస్తీశ్వర సంజ్ఞకమ్ ।

సేవితం సర్వ భావేన సర్వసిద్ధి సమర్పకమ్ ॥

భా॥ నీచే ప్రతిష్ఠించబడిన ఈ లింగము గభస్తీశ్వర నామము గలదియై సర్వ భావముతో తనను సేవించు వారికి సర్వ సిద్ధులు గల్గించునట్టిదియగును

శ్లో॥ అర్చయిత్వా గభస్తీశం స్నాత్వా పంచనదే నరః ।

న జాతు జాయతే మాతుర్గర్భే ధూత కల్మషః ॥

భా॥ పంచనదమందు స్నానము చేసి గభస్తీశ్వరుని పూజించిన నరుడు నిర్ధూత కల్మషుడై ఎప్పటికిని మాతృ గర్భమును ప్రవేశించడు

లైంగే – శ్లో॥ అన్యదాయతనం దేవి ! వారాణస్యాం విముక్తిదమ్ ।

గభస్తీశ్వర నామానం లింగం పశ్చాన్ముఖం స్థితమ్ ॥

భా॥ ఓ దేవీ ! వారాణసి యందు మరియొక ఆయతనము గలదు అది ముక్తి ప్రదమై గభస్తీశ్వర నామముతో పశ్చిమాభి ముఖముగనున్నది

శ్లో॥ సూర్యేణ స్థాపితం భద్రే! మమ భక్తి పరేణ వై ।

తం దృష్ట్వా మానవో దేవి ! ఐశానం లోక మాప్నుయాత్ ॥

భా॥ నా యందలి భక్తి పరత్వముచే ఆలింగము సూర్యునిచే స్థాపించబడినది దానిని దర్శించిన మానవుడు ఈశ్వర లోకమును పొందును

తథా మంగళ గౌరింప్రకృత్య - (పిదప మంగళ గౌరినుద్దేశించి )

శ్లో॥ యేవ త్వాం పూజయిష్యన్తి తస్మిన్‌స్థానే స్థితో హ్యహమ్ ।
తేషాం త్వం వివిధాన్లోకా న్సం ప్రదాస్యసి మానదే ॥

భా॥ ఓ మానినీ! ఎవరు నిన్ను పూజించుచుందురో ఆ స్థానమందే నేనును ఉపస్థితుడనై యుందును వారికందరికిని నీవు వివిధ లోకములను ప్రదానము చేయు చుందువు

శ్లో॥ జాగరం యే ప్రకుర్వన్తి తవాగ్రే దీపధారిణః ।
తేషాం త్వమక్షయాన్లోకా న్వితరిష్యసి భామిని ॥

భా॥ నీ యెదుట దీపధారులై ఎవరు జాగరణము చేయుదురో వారికి నీవు అక్షయ లోకములను గల్గించుచుందువు

తథా-శ్లో॥ త్వా ముద్దిశ్య తు యో దేవి బ్రాహ్మణాన్బ్రాహ్మణీం సహ ।
భోజయిష్యతి దేవేశి! తస్య పుణ్య ఫలం శృణు ॥

భా॥ ఓ దేవీ ! నిన్ను ఉద్దేశించి ఎవరు బ్రాహ్మణ దంపతులకు భోజనము పెట్టుదురో దాని యొక్క పుణ్య ఫలము వినుము

శ్లో॥ తవ లోకే వసేత్కల్పా మిహైవాఽఽ గచ్ఛతే పునః ।
నరో వా యదివా నారీ సర్వభోగ సమన్వితా ॥

భా। గౌరి లోకమందు ఒక కల్పము నివసించి ఆ పిదప తిరిగి ఇక్కడనే పుట్టి ఆ నరుడు గాని నారి గాని సర్వ భోగములను గల్గియుందురు

శ్లో॥ ధనధాన్య సమాయుక్తా జాయేతే చ మహాకులే ॥ఇత్యాది॥
బ్రాహ్మణీ సహిత బ్రాహ్మణ భోజనం: దంపతి భోజనమ్ ॥

భా॥ అట్టివారు ధనధాన్య సమృద్ధితో గూడిన ఉత్తమ కులములో జన్మింతురు బ్రాహ్మణీ సహిత భోజనమనగా దంపతీ భోజనము

కాశీఖండే -శ్లో॥ ఏషా ఽపి మంగళా గౌరీ కాశ్యాం పరమ మంగళమ్ ।
యత్ప్రసాదా దవాప్నోతి పరేఽ త్ర చ సర్వతవ ॥
(మంగలాష్టక స్తోత్రం వైకోన పంచాశే ఽధ్యాయే జ్ఞేయమ్ )

భా ॥ కాశీ యందలి ఈ మంగళా గౌరి మిక్కిలి మంగళ ప్రదమైనది ఆమెయనుగ్రహముచే ఇచ్చటను పరలోకమందును నరుడు శుభ పరంపరలను పొందును (దీనికి సంబంధించిన మంగళాష్టక స్తోత్రము 49 వ అధ్యాయమున చూడనగును )

తథా-శ్లో॥ వన్ధ్యా ఽ పి వర్షపర్యన్తం స్నాత్వా పంచనదే హ్రదే ।
సమర్చ్య మంగళాం గౌరీం పుత్రం జనయతి ధ్రువమ్ ॥

భా॥ గొడ్రాలగు స్త్రీయైనను ఒక సంవత్సరము నియమముగ పంచనదహ్రదమందు స్నానము చేసి మంగళా దేవిని అర్చించినచో ఆమెకు పుత్రసంతానము గల్గును

శ్లో॥ తత్ర చైవమంగళా పీఠే సర్వమంగళదాయిని ।
ఉపపంచనదం తీర్థం భక్తాన్ సంతారయామ్యహమ్॥

భా॥ పంచనదతీర్థమునకు సమీపమున మంగళాపీఠమందు సర్వమంగళదాయినినై నేను ఉండగా నేనా భక్తులను తరింపజేతును.

తథా – దక్షం ప్రతి భవః – దక్షుని గూర్చి ఈశ్వర వచనము)

శ్లో॥ యత్త్వయా స్థాపితం లింగ మేతద్దక్షేశ్వరాభిధమ్ ।
అస్య సంసేవనా త్పుంసా మపరాధ సహస్రకమ్ ॥
క్షమిష్యే ఽహం న సందేహస్త్వ త్కృత్యాఖ్యమిదం జనైః ॥

భా॥ దక్ష ప్రజాపతీ! నీచే స్థాపించబడిన ఈ లింగము దక్షేశ్వరము అను పేరుగలదియగును దీనిని సేవించినవారి యొక్క అపరాధసహస్రమైనను నేను క్షమించెదను సందేహము లేదు. గనుక ఈ లింగము జనులందరిచే పూజింపదగినది.

తథా శ్లో॥ అగ్నీశ్వరస్య భక్తానాం న భయం విద్యుదగ్నిజమ్ ।
అగ్నిమాంద్యభయం నైవ నాకాలమరణం క్వచిత్॥

భా॥ అగ్నీశ్వరలింగమును పూజించు భక్తులకు విద్యుత్తులేక అగ్నివలన ఎట్టి భయము ఉండదు. అట్టివారికి అగ్నిమాంద్యము అకాలమరణము ఎప్పటికిని యుండవు.

శ్లో॥ అగ్నీశ్వరం సమభ్యర్చ్య కాశ్యాం సర్వసమృద్ధిదమ్ ।
అన్యత్రాపి మృతో దైవా దగ్నిలోకే మహీయతే॥

భా॥ కాశియందు సర్వ సమృద్ధిప్రదమగు అగ్నీశ్వరలింగమును అర్చించినవారు దైవవశమున అన్యత్ర మరణించినను అట్టివారు అగ్నిలోకమున సమస్త భోగములననుభవింతురు

శ్లో॥ తతః కాశీం సమాసాద్య కల్పాంతే మోక్ష మాప్నుయాత్ ।
వీరేశ్వరస్య పూర్వేణ గంగాయాః పశ్చిమే తటే ॥
అగ్నీశ్వరం సమాసాద్య పితృలోకే వసేన్నరః ॥

భా॥ ఆ తరువాత కల్పాంతమున తిరిగి కాశియందు జన్మించి మోక్షమును పొందును. వీరేశ్వర లింగమునకు తూర్పున, గంగయొక్క పశ్చిమతీరమున గల అగ్నీశ్వరుని సేవించిన నరుడు పితృలోకమున చిరకాలము నివసించును.

అథ వీరేశః :- బ్రహ్మవైవర్తే :- శ్లో॥ వీరేశ్వరం మహాలింగం చతుర్వర్గ ఫలప్రదమ్॥
సర్వసిద్ధిప్రదం నృణామశుభౌఘస్య నాశనమ్ ॥

భా॥ వీరేశ్వర మహాలింగము చతుర్వర్గ ఫలప్రదము. సర్వసిద్ధిప్రదము. తనను సేవించే మానవులకు గలుగు అశుభములను అన్నిటిని నాశనము చేయును.

*కాశీఖండే* – *శ్లో॥ సిద్ధైః సంసేవితం లింగం సర్వ సిద్ధికరం పరమ్॥*

*దర్శనాత్ స్పర్శనాద్యస్య మహా నిర్వృతిభాక్ భవేత్ ॥*

భా॥ సిద్ధులచే సేవించబడి సర్వసిద్ధికరమగు ఈ పరమలింగమును దర్శించినవారికి స్పృశించినవారికిని మహా నిర్వృతిగల్గును

శ్లో॥ *పంచముద్రే మహాపీఠే సిద్ధిదే సర్వజన్తుషు ।*

*యత్ర సా వికటా దేవీ ప్రసిద్ధా సిద్ధరూపిణీ॥*

భా॥ పంచముద్ర మహాపీఠమున సర్వ ప్రాణులకు సిద్ధిని గల్గించు సిద్ధరూపిణియగు వికటాదేవి ప్రసిద్ధి పొందియున్నది

శ్లో॥ *తిలాంతరాఽపి నో కాశ్యాం భూమిర్లింగం వినా క్వచిత్ ।*

*పరం వీరేశ సదృశం న లింగం క్వాఽపి సిద్ధిదమ్ ॥*

భా॥ కాశీయందు నువ్వుగింజయంత ఎడముగల్గిన భూమియైనను లింగము లేకుండ ఎచ్చటను యుండదు గాని శీఘ్రము సిద్ధిదాయకమగు వీరేశలింగసదృశమైనది మరియొకటిలేదు

శ్లో॥ *ధర్మదం మోక్షదం సమ్యక్ కామదం సుఖదం తథా।*

*యథా వీరేశ్వరం లింగం కాశ్యాం నాన్యత్తథా ధ్రువమ్॥*

భా॥ కాశీయందలి వీరేశ్వరలింగము ధర్మప్రదము మరియు మోక్షదాయకమైనది సమ్యక్ రీతిని కోరికలను తీర్చునట్టిది. అట్లే సర్వసుఖప్రదమైనది. దానితో సమానమైనది మరియొకటిలేదు అనుట నిశ్చయము

శ్లో॥ *అసంఖ్యాతా మహాప్రాజ్ఞ సిద్ధాః సిద్ధిమిహాఽఽగతాః ।*

*సిద్ధలింగమిదం ఖ్యాతం తస్మాద్వీరేశ్వరం పరమ్॥*

భా॥ అసంఖ్యాకులగు వేలకొలది సిద్ధులు ఇచ్చటకు వచ్చి సిద్ధిని పొందినారు. అందుచే ఇది సిద్ధలింగమని ప్రఖ్యాతి గాంచినది

*లైంగే:- శ్లో॥ చక్రేశ్వరస్య పూర్వేణ లింగం వీరేశ్వరం శుభమ్॥*

*అభిద్యాధరం లోకం తస్య లింగస్య దర్శనాత్॥*

భా॥ చక్రేశ్వరలింగమునకు తూర్పుగ ఈ వీరేశ్వర శుభలింగమున్నది. ఈ లింగమును దర్శించినవారికి విద్యాధరలోకనివాసము లభించును

*తథా – శ్లో॥ పంచముద్రే మహాపీఠే యే వీరేశ్వరసేవకాః॥*

*తేషాం పరమ నిర్వాణం కాలే నాల్పేన జాయతే ॥*

భా॥ పంచముద్ర మహాపీఠమందున్న ఈ వీరేశ్వరలింగమును భక్తితో సేవించినవారు అనతికాలములోనే పరమ నిర్వాణమును పొందుదురు.

శ్లో॥ వీరతీర్థే వరః స్నాత్వా వీరేశం పరిపూజ్య చ ।
తీర్థేష్వశేషు సర్వేషు స్నాతో భవతి నాన్యథా॥

భా॥ వీరేశ్వర తీర్థమున స్నానము చేసి వీరేశ్వర లింగమును పూజించినవాడు సర్వతీర్థములందును స్నానము చేసినట్టివాడగును.

శ్లో॥ యస్తు వీరేశ్వరం లింగం నక్తమభ్యర్చ్య యచ్ఛతి ।
తేన త్రికోటి సంఖ్యాని లింగానీ హార్చితాని వై ॥

భా॥ వీరేశ్వర లింగమును రాత్రియందు పూజించిన వానికి ఇచట మూడుకోట్ల లింగములను పూజించినట్టి ఫలము గల్గును

శ్లో॥ ఏకాహ్యాహుతిం దత్వా వీరేశ్వర సమీపతః ।
కోటిహోమఫలం సమ్యక్ ప్రాప్నుయాద్విచారణా॥

భా॥ వీరేశ్వర సమీపమున ఒక్కసారియైనను హోమము చేసిన వానికి కోటిహోమఫలము గల్గును ఇందు సంశయము లేదు

శ్లో॥ జప్త్వైకం యో మహారుద్రం జపేద్వీరేశ్వర సంనిధౌ
జాపయేద్వా భవేత్తస్య కోటిరుద్ర ఫలం ధ్రువమ్ ॥

భా॥ వీరేశ్వర సన్నిధిని ఒక్కసారి మహారుద్రమును వినిపించినను మరియొకరిచే జపింపచేసినను కోటిరుద్రజప ఫలము నిశ్చయముగ గల్గును

శ్లో॥ వ్రతోత్సరాది వీరేశే యత్కృతం వ్రతిభిః నృభిః
తత్కోటి గుణ సంఖ్యాకం భవత్యేవ న సంశయః॥(ఇత్యాదికాశీఖండే త్రయశీతితమోఽధ్యాయః)

భా॥ వీరేశ్వర సన్నిధిని వ్రత దీక్ష గల్గినవారిచే వ్రతోద్యాపనము చేయబడినచో అది కోటిగుణముగ ఫలితమునిచ్చును (ఇత్యాదిగ కాశీఖండము 83వ అధ్యాయమున ఉన్నది )

తథా - శ్లో॥ పంచముద్రా మహాపీఠే వికటానామ మాతృకా
యస్యాః సంసేవనాత్ నృణాం నిర్వాణశ్రీ రదూరతః ॥

భా॥ పంచముద్రా మహాపీఠమందలి వికటాదేవియను పేరుగల మాతృకను సేవించిన నరులకు నిర్వాణ శ్రీ సమీపముననే లభించును

శ్లో॥ సర్వత్ర శుభ జన్మిన్యాం కాశ్యాం ముక్తిః పదే పదే ।
తథాఽపి న విశేషం హి తత్పీఠం సర్వ సిద్ధికృత్ ॥

భా॥ శుభజన్ములైనవారికి కాశీయందు అడుగడుగునా (సర్వత్ర) ముక్తి లభించును

అయినను సర్వసిద్ధి ప్రదమగు ఈ పీఠమున లభించు ముక్తి విశిష్టమైనదియగును.

బ్రహ్మపురాణే - శ్లో॥ పంచముద్రే మహాపీఠే వీరేశ్వర సమీపతః ।
వికటాఖ్యా మహాదేవీ పూజనీయా హితేప్సుభిః ॥

భా॥ పంచముద్ర మహాపీఠమందు వీరేశ్వరునకు సమీపమునగల వికటానామము గల వికటాదేవి హితకాంక్షులగు వారికందరకును సేవింపదగినది.

లైంగే - హరిశ్చన్ద్రేశ్వరం ప్రకృత్య -

శ్లో॥ యత్ర సిద్ధో మహాత్మాసౌ హరిశ్చన్ద్రో మహాబలః ।
తం దృష్ట్వా మానవో దేవి । రుద్రస్య పదమాప్నుయాత్॥

భా॥ ఓదేవీ మహాబలవంతుడును మహాత్ముడునగు హరిశ్చంద్రేశ్వరుడు ఎచ్చట స్థితుడై యున్నాడో అచట ఆయనను దర్శించిన మానవుడు రుద్రపదమును పొందును

శ్లో॥ పూర్వాముఖం తు తల్లింగం స్వర్గలోకప్రదాయకమ్ ।
మోక్షేశ్వరం చ తత్రైవ స్వర్గేశ్వర మతః పరమ్॥

భా॥ తూర్పు ముఖముగానున్న ఆ లింగము స్వర్గలోకము నిచ్చునట్టిది. దాని ప్రక్కనే మోక్షేశ్వరము స్వర్గేశ్వరమును ఉన్నవి.

శ్లో॥ ఏతౌ దృష్ట్వా మహేశాని స్వర్గం మోక్షంచ విన్దతి
వామనేశ్వర నామానం తయోరుత్తరతః శుభమ్॥

భా॥ ఓ దేవీ! ఆ ఉభయలింగములను దర్శించినవారు స్వర్గమును మోక్షమును పొందుదురు. శుభకరమగు వామనేశ్వర లింగము వానికి ఉత్తరముగ నున్నది.

స్కాందే - శ్రీచన్ద్రేశ్వరం సమభ్యర్చ్య యద్యన్యత్రాపి సంస్థితః ।
అఘౌఘపటలం భిత్వా సోమలోక మవాప్నుతి ॥

భా॥ ఆ ప్రక్కనే గల చంద్రేశ్వర లింగమును పూజించినవారు పాపపటలమును భేదించుకొని సోమలోకమును పొందును.

శ్లో॥ కలౌ చన్ద్రేశ మహిమా నా భాగ్యై రవగమ్యతే ।
సిద్ధయోగీశ్వరీ పీఠ మేతత్ సాధక సిద్ధిదమ్॥

భా॥ కలియుగమున అభాగ్యులైనవారిచే చంద్రేశ్వర మహిమ భావింపరానిది. ఈ సిద్ధయోగీశ్వరీ పీఠము సాధకులకు సిద్ధిదాయకమైనది.

శ్లో॥ షణ్మాసం నియతాహారో ధ్యాయన్విశ్వేశ్వరీ మిహ ।
చంద్రేశ్వరార్చనాయత్తః సిద్ధాన్పశ్యతి సోఽగ్రతః ॥

భా॥ ఇచ్చట విశ్వేశ్వరీ దేవిని ఆరునెలలు నియతాహారుడై సేవించిన వారు చంద్రేశ్వరార్చన కొరకు వచ్చెడి సిద్ధులను తన ఎదుట దర్శింపగల్గును.

శ్లో॥ సిద్ధ యోగీశ్వరీ సాక్షాద్వరదాతస్య జాయతే।
వంతి పీఠా ద్యాన్యప్యేన ఽఽ శసిద్ధిదమ్ ॥

భా॥ అట్టివానికి సిద్ధేశ్వరి సాక్షాత్కరించి వరదాయిని అగును ఈ భూమియందు సాధకుల సిద్ధి కొరకు అనేక పీఠములున్నప్పటికిని ఇది విశిష్టమైనదియై శీఘ్రసిద్ధికరమై భూలోకమున ప్రసిద్ధిగనినది

శ్లో॥ యత్ర చన్ద్రేశ్వరం లింగం త్వయేదం స్థాపితం శశిన్ ।
ఇదమేవ హి తత్పీర మదృశ్య మకృతాత్మభిః ॥

భా॥ ఓ చన్ద్రా ! నీ చేత స్థాపించబడిన ఈ చన్ద్రేశ్వరలింగము పాపాత్ములకు దర్శనీయముగాదు

బ్రహ్మవైవర్తే - శ్లో॥ చన్ద్రేశ్వరం చన్ద్రకాంతి మణిప్రభ మనామయమ్।
అజ్ఞానధ్వాంత శమనం దృష్టం కాశ్యాం చిదాత్మకమ్॥

భా॥ కాశీయందు చిదాత్మకమై చంద్రకాంతమణివంటి కాంతి గలిగి నదియు ఆరోగ్యదాయకమైనదియు అజ్ఞానమను చీకటిని పోగొట్టునదియునగు చన్ద్రేశ్వరలింగము తప్పక దర్శింపదగినది

తథా - శ్లో॥ బృహస్పతీశ్వరం లింగం మయా గోప్యం కలౌ యుగే।
అస్య సందర్శనాదేవప్రతిభా ప్రతిలభ్యతే॥

భా॥ కలియుగమందలి భక్తుల కొరకు బృహస్పతీశ్వరలింగము నాచే ప్రతిష్ఠించబడినది దీనిని దర్శించినంత మాత్రమున అసామాన్యమగు ప్రతిభ లభించును

శ్లో॥ చన్ద్రేశ్వరా ద్దక్షిణతో వీరేశాన్నైరృతే స్థితమ్ ।
ఆరాధ్య ధిషణేశం వై గురులోకం మహీయతే ॥

భా ॥ చన్ద్రేశ్వరునకు దక్షిణముగను వీరేశ్వరునికు నైఋతిమూలయందును ఉన్నట్టి బృహస్పతీశ్వరుని ఆరాధించిన వారికి గురులోక ప్రాప్తి గల్గును

తథా:- శ్లో॥ చన్ద్రేశ్వరా త్పూర్వభాగే దృష్ట్వాలింగం బుధేశ్వరమ్ ।
న బుద్ధ్యా హీయతే జన్తు రన్త కాలేఽపి జాతుచిత్ ॥

భా॥ చంద్రేశ్వరునకు తూర్పునయున్నట్టి బుధేశ్వరుని దర్శించిన వారికి అంత్య కాలమున సైతము ఎన్నటికిని బుద్ధి క్షీణత గలుగదు

(కుబలాశ్వతరేశ్వరుని ఉత్తరముగ అంగారేశ్వరుని దర్శింపవలెను )

తథా:- శ్లో॥ స్వర్గద్వారే వినాయుర్యే విగాహ్య మణి కర్ణికామ్ ।
తేషాం విధూత పాపానాం క్వాపి స్వర్గో న దూరతః ॥

భా॥ మణికర్ణిక యందు స్నానము చేసి స్వర్గద్వారమును చేరి విధూత కల్మషులైన వారికి స్వర్గమెంత మాత్రమును దూరము గాదు

శ్లో॥ స్వర్గద్వా॥ స్వర్గభూరేషా మోక్ష భూ॥ మణికర్ణికా ।
స్వర్గాపవర్గావత్రైవ నోపరిష్టాన్న చాప్యధః ॥

భా॥ ఈ స్వర్గ ద్వారమే స్వర్గ భూమి మణికర్ణికయే మోక్ష భూమి ఇట్లు స్వర్గాపవర్గములు రెండును ఇక్కడనే యున్నవి ఊర్ధ్వభాగమునగాని అధోభాగమునగాని అవిలేవు

శ్లో॥ దత్త్వా దానాన్యనేకాని విగాహ్య మణికర్ణికామ్।
స్వర్గద్వారం ప్రవిష్టాయే న తే నిరయగామినః॥

భా॥ మణికర్ణికయందు స్నానము చేసి అనేకదానములు చేసి స్వర్గద్వారమును ప్రవేశించినవారు ఎప్పటికిని నరకమునకు పోరు

తథా శ్లో॥ ఏతద్దేవరహస్యం తే వారాణస్యా ఉదీర్యతే।
ఉత్క్షిప్యైకాంగులిం తథ్యం శ్రేష్ఠైకా మణికర్ణికా॥

భా॥ వారాణసియందు ఊర్ధ్వబాహువునై (అనగా నిశ్చయముగ) ఒకరహస్యమును చెప్పుచున్నాను ఇదియే మనగా మణికర్ణికయే పరమశ్రేష్ఠమైనది

తథా శ్లో॥ విశ్రాణిత మహాదానాస్తథైవ నరపుంగవ।
తంమే వయసి ప్రాప్తా స్థిరేషా మణికర్ణికా॥ (ఇత్యాద్యేకషష్టితమేఽధ్యాయే)

భా॥ ఓ నరపుంగవా! వివిధదానములు చేసినవారికి చరమకాలమందు మణికర్ణికయే ఏకైక ఆశ్రయము (అని 61వ అధ్యాయమున చెప్పబడినది)

తథా - శ్లో॥ సకృత్కామపి గాయత్రీం సంజప్య మణికర్ణికామ్।
లభేదయుత గాయత్రీ జపనస్య ఫలం స్ఫుటమ్॥

భా॥ మణికర్ణికను సేవించి ఒక్కసారియైనను శ్రద్ధగ గాయత్రిని జపించినచో అది పదివేల సంఖ్యగల గాయత్రీజపమునకు సమానఫలమునిచ్చును

శ్లో॥ ఏకామప్యాహుతిం ప్రాజ్ఞో దత్త్వైవ మణికర్ణికామ్।
యావజ్జీవాగ్నిహోత్రస్య లభే దవికలం ఫలమ్॥

భా॥ మణికర్ణిక సమీపమున ఒక్కసారియైనను హోమముచేసినవానికి జీవితాంతమగ్నిహోత్రము చేసిన ఫలముగల్గును

తథా శ్లో॥ మనోకర్ణ్యం కృతస్నానో మణికర్ణిక వీక్షణాత్।
జననీ జఠరే నాసే వసతిం న లభేన్నరః॥

భా॥ మణికర్ణికయందు స్నానము చేసి మణికర్ణేశ్వరుని దర్శించినవారికి తిరిగి జననీజఠరశయనముండదు

తథా- శ్లో॥ బ్రహ్మనాళం పరంతీర్థం త్రిషులోకేషు విశ్రుతమ్।
తత్సంగమే నరః స్నాత్వా కోటిజన్మఫలం లభేత్॥

భా॥ ముల్లోకములందును ప్రసిద్ధిచెందిన బ్రహ్మనాళము అను పరమతీర్థము గలదు దాని సంగమమందు స్నానము చేసినవానికి కోటి జన్మలఫలము లభించును

శ్లో॥ బ్రహ్మనాళే పతేద్యేషామపి కీకస మాత్రకమ్।
బ్రహ్మాండమండపాన్త స్తే న విశన్తి కదాచన॥

భా॥ బ్రహ్మనాళమందు తన ఎముక ఒక్కటి యైనను పడియుండినచో అట్టివాడు తిరిగి బ్రహ్మాండమండలమందు (అనగా జనన మరణరూపమగు సంసారచక్రమందు) మరల ప్రవేశింపడు

తథా- శ్లో॥ ప్రభాసతీర్థం విఖ్యాతం తత్రాఽపి శుభదం నృణామ్।
సోమేశ్వరస్య పురతస్తత్ర స్నాతో న గర్భభాక్॥

భా॥- సోమేశ్వరునికి ఎదుటగల ప్రభాసతీర్థము మానవులకు శుభదాయకమని మిక్కిలి ప్రసిద్ధినందినది. అందు స్నానము చేసినవారు తిరిగి గర్భవాసమును పొందరు

శ్లో॥ జరాసంధేశ తీర్థం చ జరాసంధేశ సంనిధౌ
సంసార జ్వరపీడాభిః తత్ర స్నాతో న ముహ్యతి॥

భా॥ జరాసంధేశ్వరుని సంనిధియందు గల జరాసంధేశ్వరతీర్థమందు స్నానము చేసినవారు ఎప్పటికిని సంసారజ్వరపీడితులు గారు

శ్లో॥ విశాల తీర్థం విమలం విశాలఫలదం తతః।
తత్ర స్నాతో విశాలాక్షీం దృష్ట్వా గర్భే న జాయతే॥

భా॥ విమలమైన విశాలతీర్థము మహాఫలమునిచ్చునట్టిది అందు స్నానముచేసి విశాలాక్షి దర్శనము చేసిన మానవుడు తిరిగి మాతృగర్భమును ప్రవేశించడు

తథా- శ్లో॥ వారాణస్యాం విశాలాక్షీ క్షేత్రస్య పరమేష్టదా।
విశాల తీర్థం గంగాయాం కృత్వా పృష్ఠే వ్యవస్థితా॥
స్నాత్వా విశాల తీర్థేవై విశాలాక్షీం ప్రణమ్య చ।
విశాలాం లభతే లక్ష్మీం పరత్రాపి చ శర్మదామ్॥(ఇత్యాది సప్తతితమోఽధ్యాయే)

భా॥ వారాణసి యందు పరమమైన ఇష్టములను గల్గించునట్టి విశాలాక్షీ క్షేత్రమందలి విశాల తీర్థము గంగకు వెనుక భాగమునయేర్పడియున్నది. అందు స్నానము చేసివిశాలాక్షికి

ప్రణతులర్పించినవాడు ఇహ పరలోకములందు సుఖదాయకమగు మహా సంపత్తును పొందును (అని 70వ అధ్యాయమున గలదు)

తథా -శ్లో॥ తతః ఉన్మల్లలితా తీర్థం గంగా కేశవ సంనిధౌ ।
త్వత్రాస్తే లలితా గౌరీ క్షేత్ర రక్షాకరీ పరా ॥

భా॥ గంగా కేశవ సంనిధి యందు లలితా తీర్థ మున్నది అచ్చట క్షేత్ర పాలికగ లలితా గౌరి విరాజిల్లుచున్నది సర్వసంపత్తుల సమృద్ధి కొఱకు ఆమెను దీక్షగా పూజించవలెను. లలితా దేవిని పూజించు వారికి ఎప్పటికిని విఘ్నము గలుగదు

శ్లో॥ అద్యాస్తి కాశ్యాం వారాహీ క్రతు వారాహ సంనిధౌ ।
తాం ప్రణమ్య నరో భక్త్యా విపదబ్ధౌ న మజ్జతి॥

భా॥ కాశీ యందు యజ్ఞ వారాహ స్వామి సంనిధి యందు వారాహీదేవి యున్నది. ఆమెకు భక్తితో ప్రణామము చేసిన వానికి ఎప్పుడును విపత్తులు గలుగవు

శ్లో॥ చిత్రకూపే నరః స్నాత్వా విచిత్ర ఫలదే నృణామ్ ।
చిత్ర గుప్తేశ్వరం వీక్ష్య చిత్రఘంటాం ప్రణమ్యచ
న చిత్రగుప్తే లేఖ్యః స్యాత్ చిత్రమంటార్చకో నరః ॥

భా॥ మానవులకు విచిత్రఫలదాయకమగు చిత్రకూపమునందు స్నానము చేసి చిత్రగుప్తేశ్వరుని దర్శించి చిత్రఘంటా దేవతకు నమస్కరించినవాడు చిత్రగుప్తుని లెక్కలోనికి ఎక్కడు (అనగా నరకమునకు పోడు)

శ్లో॥ సంతి పీఠాన్యనేకాని కాశ్యాం సిద్ధి ప్రదాన్యపి ।
మహాలక్ష్మీ పీఠసమం నాన్యత్ లక్ష్మీకరం పరమ్ ॥
స్నాత్వా శ్రీకుండతీర్థే తు సమర్చ్య జగదంబికా
దత్వా దానాది విధవత్ న లక్ష్మ్యా పరిముచ్యతే ॥

భా॥ కాశిలో సిద్ధిప్రదాయకరములగు పీఠములనేకమున్నను మహాలక్ష్మీ పీఠముతో సమానముగా లక్ష్మీకరమైనది మరియొకటిలేదు శ్రీకుండతీర్థమందు స్నానముచేసి జగదంబికను పూజించి వివిధ దానములను యథావిధిగా జేసినచో వానిని లక్ష్మి ఎన్నటికిని వదిలిపోదు

శ్లో॥ భీమచండీం నరో దృష్ట్వా భీమకుండే కృతోదకః
భీమాకృతి న్నవైపశ్యేత్ యామాన్యాతీన్ క్వచిత్ కృతీ ॥

భా॥ భీమకుండమునందు స్నానము చేసి భీమచండిని దర్శించినవానికి భయంకరాకారము గల యమ దూతల దర్శనము ఎన్నటికిని గలుగదు

తథా- కాశీఖండే -శ్లో॥ ఉదగ్దశాశ్వమేధానాం ప్రయాగాఖ్యం చ మాధవమ్ ।
ప్రయాగ తీర్థేమ స్నాతో దృష్ట్వా పాపైః ప్రముచ్యతే॥

భా॥ దశాశ్వమేధ తీర్థమందు స్నానము చేసి అనంతరము ప్రయాగ తీర్థమందు సుస్నాతుడై ప్రయాగ మాధవుడనుపేరు గల దేవుని దర్శించిన వాడు సర్వ పాపములనుండి విముక్తుడగును

తథా- శ్లో॥ గంగోత్తరవహా యత్ర యమునా పూర్వ వాహినీ ।
తత్సంభేదం నరః ప్రాప్య ముచ్యతే బ్రహ్మహత్యయా ॥
వపనం తత్ర కర్తవ్యం పిండ దానం చ భావతః
దేయాని తత్ర దానాని మహాఫల మ భీప్సునా ॥
ప్రయాగేశం మహాలింగం తత్ర తిష్ఠతి కామదమ్ ।
తత్సాంనిధ్యాచ్చ తత్తీరం కామదం పరికీర్తితమ్ ॥

భా॥ ఎచ్చట గంగ ఉత్తరవాహినిగను యమున పూర్వవాహినిగనుయున్నవో అట్టి సంగమమందు స్నానము చేసిన నరుడు బ్రహ్మహత్యాది పాపముల నుండి ముక్తుడగును మహాఫలమును పొందగోరువాడు అచట క్షురకర్మ చేయించుకొని శ్రద్ధగా పిండ ప్రదానము గావించి యథాశక్తి దానములను ఇవ్వవలెను అచ్చట ప్రతిష్ఠించబడిన ప్రయాగేశ్వర మహాలింగము యొక్క సన్నిధిని చేరి దానిని సేవించినచో అట్టివారు కోరిన కోరికలను తీర్చునట్టిదియగుటచే కామద యని కీర్తింపబడుచున్నది

శ్లో॥ ప్రయాగ తీర్థే సుస్నాతో జనో నిగడ మంజనీమ్ ।
స భాజయిత్వా నో జాతు నిగడైః పరిబాధ్యతే ॥

భా॥ ప్రయాగ తీర్థమందు స్నానము చేసి అచ్చట నున్నట్టి నిగళమును (గొళ్లెము) కన్నుల కద్దుకొని దేవుని అర్చించినవాడు ఎన్నటికిని బంధమును పొందడు

తథా-శ్లో॥ బందీ తీర్థంతు తత్రైవ మహా నిగడ ఖండనమ్ ।
యత్ర స్నాతో విముచ్యేత సర్వస్మా త్కర్మపాశతః ॥

భా॥ అచ్చటనే గల బందీ తీర్థము మహానిగళ ఖండన సమర్థమైనది అందు స్నానము చేసిన వారు సర్వ కర్మపాశముల నుండి విముక్తుడగును

శ్లో॥ క్రోడీ వరాహతీర్థంచ తతోపి శుభదం వరమ్ ।
తత్ర స్నాతో నరో జాతు తిర్యగ్యోనిం న గచ్ఛతి ॥

భా॥ ఆ తరువాత యున్నట్టి క్షోణీవారాహ తీర్థము శుభకరమైనది శ్రేష్ఠమైనది అందు స్నానము చేసిన నరుడు ఎప్పటికిని తిర్యగ్యోనుల యందు జన్మము పొందడు

తథా - శ్లో॥ మునే ! ధరణి వారాహః ప్రయాగేశ్వర సంనిధౌ ।

స్నాత్వా వరాహతీర్థేఽత్ర, దృష్ట్వా మాం కిటిరూపిణమ్ ॥

సంపూజ్య బహుభావేన న విశేద్యోని సంకటమ్ ॥

(కి కొ॥ వరాహ ) (తథా కాశీఖండ ఏవ)

భా॥ ఓ మునీశ్వరా ! ప్రయాగేశ్వర సన్నిధి యందున్న ధరణి వరాహ తీర్థమందు స్నానము చేసి యజ్ఞ వరాహ రూపముననున్నట్టి నన్ను అర్చించినవాడు పునర్జన్మమును పొందడు

(కిటిః యనగా వరాహము అట్లే కాశీఖండమందును వర్ణితము)

శ్లో॥ దశాశ్వమేధికం తీర్థమేతత్ త్రైలోక్య విశ్రుతమ్ ।

యత్రాఽఽహుతి త్రయేణాపి అగ్నిహోత్ర ఫలం లభేత్ ॥

భా॥ అచ్చట గల దశాశ్వమేధ తీర్థము ముల్లోకములయందును ప్రసిద్ధికెక్కినది అచ్చట మూడు ఆహుతులను సమర్పించిన వారికి పూర్ణాగ్నిహోత్ర ఫలము లభించును.

శ్లో॥ ప్రయాగాఖ్య మిదం ప్రోక్తః సర్వ తీర్థోత్తముత్తమమ్ ।

భా॥ ప్రయాగ అను పేరు గల ఈ తీర్థము సర్వ తీర్థములలోను ఉత్తమోత్తమమైనది.

తథా శ్లో॥ అపి వంది మహాదేవి నిత్యం త్రైలోక్య వందితా ।

నిగడ స్థానపి జనాన్నాశా న్మోచయతి స్మృతా ॥

భా॥ అచ్చట గల వంది మహాదేవి ముల్లోకముల వారి చేతను సదా సేవించబడుచుండునట్టిది ఈమెను సేవించిన వారు బంధితులైనను సర్వ విధ పాశముల నుండి ముక్తులగుదురని స్మృతి వక్కాణించుచున్నది.

తథా 'సద్మభూః' యని మొదలు పెట్టి

28 దశాశ్వ మేధ మహిమా -

శ్లో॥ అయాజి దశభిః కాశ్యా మశ్వమేధై ర్యహా మఖైః ।

పురా రుద్ర సరో నామ తత్తీర్థం కలశోద్భవ ॥

భా॥ ఓ అగస్త్య మహర్షి ! పూర్వము కాశిలో రుద్ర సరస్సుయను పేరు గల తీర్థముండెడిది అటు పిమ్మట బ్రహ్మ యచ్చట పది అశ్వమేధయాగములను నిర్వహించుటచే అది దశాశ్వమేధికము అని ప్రసిద్ధి పొందినది.

శ్లో॥ దశాశ్వమేధికం పశ్చాజ్ఞాతం విధి పరిగ్రహాత్ ।
స్వర్ధున్యథ తతః ప్రాప్తా భగీరథ సమాగమాత్ ॥
అతీవ పుణ్యవజ్ఞాత మతస్త త్తీర్థముత్తమమ్ ॥

భా॥ అనంతర కాలమున ఆకాశ గంగ భగీరథునిచే తీసికొని రాబడి అచట ప్రవహించినది అందుచేత అది అన్నిటి కంటె ఉత్తమ తీర్థమని మిక్కిలి పుణ్యప్రదమైనదియని ప్రసిద్ధి గనెను.

తదా- శ్లో॥ దశాశ్వమేధికం ప్రాప్య నరః తీర్థోత్తమోత్తమమ్ ।
యత్కించి త్క్రియతే కర్మ తదక్షయ మిహేరితమ్ ॥

భా॥ ఉత్తమోత్తమమైన దశాశ్వమేధ తీర్థమున ఏ కొంచమైనను శుభ ర్మ చేసినచో అది అక్షయమగును

శ్లో॥ దశాశ్వ మేధికే తీర్థే సకృత్ స్నాత్వా నరోత్తమ
దృష్ట్వా దశాశ్వ మేధేశం సర్వ పాపైః ప్రముచ్యతే॥ ఇత్యాది (ఇ దశాశ్వమేధ మహిమా)

భా॥ దశాశ్వమేధ తీర్థమందు సకృత్తుగనైనను స్నానము చేసి ద శ్వమేధేశ్వరుని దర్శించినవాడు సర్వ పాపముల నుండి విముక్తుడగును (ఇత్యా- దశాశ్వమేధ మహిమ)

29 అథ యోగిన్యుద్దేశః చతుష్షష్టి

శ్లో॥ నామధేయాని వక్ష్యామి యోగినీనాం ఘటోద్భవ ।
యే కర్ణ్య యాని పాపాని క్షయన్తి భవినాం క్షణాత్ ॥

భా॥ ఓ కుంభ సంభవా ! ఇప్పుడు వివిధ యోగినుల నామములను చెప్పుచున్నాను ఆ నామములను వినినట్టి దేహధారుల సర్వ పాపములు నశించును

శ్లో॥ గజాననా సింహముఖీ గృధ్రాస్యా కాకతుండికా ।
ఉష్ట్రగ్రీవా హయగ్రీవా వారాహీ శరభాననా ॥
ఉలూకికా శివారావా మయురా వికటాననా ।
అష్టవక్త్రా కోటరాక్షీ కుబ్జా వికటలోచనా ॥
శుష్కోదరీ లలజ్జిహ్వా శ్వదంష్ట్రా వానరాననా ।
ఋక్షాక్షీ కేకరాక్షీ చ బృహత్తుండా సురాప్రియా ॥
కపాలహస్తా రక్తాక్షీ శుకీ శ్యేనీ కపోతికా ।
పాశహస్తా దండహస్తా ప్రచండా చండవిక్రమా ॥
శిశుఘ్నీ పాపహన్త్రీ చ శివహస్తా అన్త్రమాలినీ ॥

స్థూలకేశీ బృహత్కుక్షిః సర్పాస్యా ప్రేతవాహనా ।
దందశూకకరా క్రౌంచమృగశీర్షా వృషాననా ॥
వ్యాత్తాస్యా ధూమనిశ్వాసా వ్యోమైక చరణోర్ధ్వదృక్
తాపనీ శోషణీదృష్టిః కోటరీ స్థూలనాసికా ॥
విద్యుత్ప్రభా బలాకాస్యా మార్జారీ, కటపూతనా ।
అట్టాట్టహాసా కామాక్షీ మృగాక్షీ మృగలోచనా ॥
నామానీమాని యో మర్త్యః చతుష్షష్టిం దినేదినే ।
జపేత్ త్రిసంధ్యం తస్యేహ దుష్టబాధా ప్రశామ్యతి ॥
(ఇత్యాదిఫలశ్రుతిః పంచచత్వారింశే ఽధ్యాయే)

శ్లో॥ అగ్నే కృత్యా స్థితాః సర్వాః తాః కాశ్యాం మణికర్ణికామ్ ।
తన్నమస్కారమాత్రేణ నరో విఘ్నైర్న బాధ్యతే ॥

భా॥ ఇట్లు ఈ అరువది నాలుగు యోగినుల నామములను ప్రతిదినము త్రిసంధ్యల యందు జపించువారికి సర్వవిధ దుష్ట బాధలు నశించును (ఇత్యాదిగ 45వ అధ్యాయమందుఫలశ్రుతి చెప్పబడినది )

కాశియందు మణికర్ణిక అగ్రభాగమందుండగా తత్సమీపమున ఈ యోగినులన్నియు ఉన్నవి. యోగినులకు నమస్కారము చేసిన మాత్రమున మానవుల విఘ్నములన్నియు తొలగిపోవును

లైంగే అంబరాకేశ్వరం ప్రకృత్య –

శ్లో॥ తస్యైవ దక్షిణే భాగే లోలార్కో నామ విశ్రుతః ।
తస్య దర్శన మాత్రేణ సూర్యలోక మవాప్నుయాత్ ॥

భా॥ దానికి దక్షిణ భాగమున లోలార్కుడు ప్రసిద్ధిగాంచి యున్నాడు ఆయన దర్శన మాత్రము చేత సూర్యలోక వాసము సిద్ధించును

శ్లో॥ లోలార్కా త్పశ్చిమే భాగేదుర్గాదేవీ వ తిష్ఠతి ।
మానవానాం హితార్థాయ కూటే క్షేత్రస్య దక్షిణే ॥

భా॥ లోలార్కునకు పశ్చిమదిశయందు దుర్గాదేవి ప్రతిష్ఠితురాలై యున్నది కూటక్షేత్రము యొక్క దక్షిణమున మానవులకు హితమును గూర్చునదియై ఆమె యున్నది

తథా స్థాణాపీఠం ప్రకృత్య (స్థాణాపీశ్వరుని గురించి)

శ్లో॥ తదగ్రే సంనిహత్యాఖ్యా మహాపుష్కరిణీ శుభా ।
లోలార్క పశ్చిమే భాగే కురుక్షేత్రస్థలీ తు సా॥

భా॥ దానికి ఎదుట శుభకరమైన మహాపుష్కరిణి యున్నది లోలార్కునకు పశ్చిమభాగమునమన్న ఆ తీర్థము కురుక్షేత్ర స్థలియను పేరుగలది

శ్లో॥ తత్ర స్నాతం హుతం జప్తం దత్తం చైవ శుభార్థిభిః
కురుక్షేత్రా చ్చతేత్పత్యం కోటికోటి గుణాధికామ్ ॥

భా॥ శుభమును కాంక్షించువారు అందుస్నానము చేసి హోమము జపము దానము మొదలగునవి నిర్వహించినచో అవి కురుక్షేత్రమందు చేసినవానికంటె కోటికోటి రెట్ల ఫలము నిచ్చును

శ్లో॥ వారాణస్యా దక్షిణతః కుక్కుటో నామ వై ద్విజః ।
తస్య స్మరణ మాత్రేణా శకునః శకునం భవేత్ ॥

భా॥ వారాణసికి దక్షిణముగ కుక్కుటమను పేరుగల ద్విజ (పక్షి) రూపముననున్నది దానిని స్మరించి నంతమాత్రమున దుశ్శకునము శుభ శకునముగ మారును

కాశీఖండే శ్లో॥ సిద్ధకుండే నరః స్నాత్వా దృష్ట్వా సిద్ధేశ్వరం మహత్ ।
సర్వాసామేవ సిద్ధీనాం పారం గచ్ఛతి మానవః ॥

భా॥సిద్ధకుండమందు స్నానముచేసి సిద్ధేశ్వరుని దర్శించిన మానవునకు సర్వసిద్ధులు వశమగును

లైంగే – శ్లో॥ శుక్రేశ్వరా చ్చోత్తరేణ లింగం పశ్చాన్ముఖం స్థితమ్ ।
సిద్ధేశ్వరేతి నామానం సిద్ధస్య చ తటే స్థితమ్ ॥
తత్రకుండే నరః స్నాత్వా దృష్ట్వా సిద్ధేశ్వరం షనై ।
సర్వాసామేవ సిద్ధీనాం పారం గచ్ఛతి మానవః ॥

భా॥ శుక్రేశ్వరునకు ఉత్తరదిశయందు పశ్చిమముఖముగనున్న లింగమే సిద్ధేశ్వర నామము గలది అది సిద్ధ తీర్థము యొక్క తీరమునమన్నది అచ్చట సిద్ధకుండములో స్నానము చేసి సిద్ధేశ్వరుని దర్శించిన మానవులకు సర్వ సిద్ధులయందు పారంగతత్వము చేకూరును

కాశీఖండే – శ్లో॥ దుర్గాకుండే నరః స్నాత్వా సర్వ దుర్గార్తి హారిణీమ్।
దుర్గాం సంపూజ్య విధివత్నవ జన్మాఘముత్ సృజేత్ ॥

శ్లో॥ దుర్గాశక్తిభిః సార్థం కాశీం రక్షతి సర్వతః ।
తా ప్రయత్నేన సంపూజ్యా ః కాళరాత్రి ముఖానరై॥

తా॥ దుర్గాకుండమందు స్నానము చేసి సర్వదుర్గార్తి హారిణియగు దుర్గాదేవిని
యథావిధిగ పూజించినవాడు గత నవ జన్మల పాపములనుండి విముక్తుడగును
[illegible] దుర్గాదేవి ఇతర శక్తులతో గూడి సదా అన్ని విధములుగ కాశిని రక్షించుచుండును
కాళరాత్రి మొదలగు ఆదేవతలందరు నరులచే దీక్షగ పూజనీయులు

శ్లో॥ రక్షన్తి క్షేత్రమేతద్వై తథా అన్యా నవశక్తయః ।
ఉపసర్గ సహస్రేభ్యః తాసై దిగ్దేవతాః క్రమాత్ ॥

తా॥ అట్లే ఇతరమైన నవశక్తులు గూడ ఈ క్షేత్రమును రక్షించుచుండును
[illegible] ఉపద్రవములనుండి రక్షించునట్టి ఆ శక్తులే క్రమముగ కాశికి దిగ్దేవతలు

శ్లో॥ శతనేత్రా సహస్రాస్యా తథా అయుత భుజా అపరా ।
అశ్వారూఢా గజాస్యాచ త్వరితా శవవాహినీ ॥
[illegible] సౌభాగ్యగౌరిచ నృష్టాః ప్రాచ్యాది మధ్యతః ।
ఏతా యత్నేన సంపూజ్యాః క్షేత్ర రక్షణ దేవతాః ॥
(వజ్రపంజర సంజ్ఞం దుర్గాస్తోత్రం ద్వినవతి తమేఽధ్యాయే జ్ఞేయమ్ )

[illegible] శక్తులును తూర్పు మొదలు ఎనిమిది దిక్కులయందును మధ్యమున
[illegible] ఈ క్షేత్ర రక్షణ దేవతలైన తొమ్మిదిమంది శక్తులను శ్రద్ధగ
[illegible] (వజ్రపంజరమను పేరుగల దుర్గా స్తోత్రము 72వ అధ్యాయమందు
[illegible])

[illegible] [illegible] సర్వాణి భూమీవలయ గాన్యపి।
[illegible] సంభేద తీర్థస్య కలాం నార్హన్తి షోడశీమ్ ॥

[illegible] [illegible]యమునందు అనేక తీర్థాంతరములున్నవి గాని యవి అస్సీ గంగా
[illegible] యొక్క పదునారవ భాగమునకు గూడ సరిపోలవు

[illegible] [illegible] మేవ తీర్థానాం స్నానాత్ యల్లభతే ఫలమ్ ।
తత్ఫలం సమ్యగాప్నోతి నరైః గంగాసి సంగమే ॥

[illegible] [illegible] తీర్థముల యందును స్నానము చేయుటవలన మానవుడు
[illegible] పొందునో అట్టి ఫలమును మానవుడు అస్సీ సంగమ మందలి
[illegible] పొందును

[illegible] [illegible] [illegible] వరాణసే స్నాత్వా సర్వం సర్వక్రతు ఫలం లభేత్ ॥

[illegible] [illegible]మున స్నానము చేసిన వానికి సర్వ క్రతువులు షతమముగ

చేసినంతటి ఫలము గల్గును (ఇత్యాదిగ చెప్పబడినది )

(30) అథ కేదారాః - కాశీఖండే

శ్లో॥ తుషారాద్రిం సమారుహ్య కేదారం వీక్ష్య యత్ఫలమ్ ।
తత్ఫలం సప్త గుణితం కాశ్యాం కేదార దర్శనే ॥

భా॥ హిమాలయ పర్వత మధిరోహించి కేదారేశ్వరుని సందర్శించిన గలుగు ఫలమునకు ఏడురెట్ల ఫలము కాశియందు కేదారేశ్వరుని సందర్శించినంతనే గల్గును

శ్లో॥ ఇదం తీర్థం హరం పాపంసప్త జన్మాఘ నాశనమ్ ।
గంగాయాం మిలితం పశ్చా జ్జన్మకోటి కృతాఘహమ్ ॥

భా॥ ఈ కేదార తీర్థము ఏడు జన్మలయందలి పాపమును పోగొట్టునట్టిది కేదారము గంగ కలిసి కోటి జన్మల పాపములను గూడ పోగొట్టగలవు.

వచనము పాపం హరతీతి హరంపాప మితి ఛాందసీ కేదారతీర్థస్య సంజ్ఞా ।

భా॥ పాపము హరించునట్టిది గనుక హరంపాపం అనునది కేదారతీర్థమునకు సంజ్ఞయైన వైదిక ప్రయోగము

శ్లో॥ సరసే మానసే హ్యత్ర పూర్వం తప్తం మహత్తపః ।
అతస్తు మానసం తీర్థం జనే ఖ్యాతి మిదం గతమ్ ॥

భా॥ మానసుడనువాడు పూర్వము ఈ సరస్సు యొక్క తీరమున గొప్ప తపస్సు చేసెను అందుచే దీనిని మానస తీర్థమనియు పిలుతురు

తథా- శ్లో॥ కేదారకుండే యః స్నాత్వా పిండాన్దాస్యతి చాత్వరః ।
ఏకోత్తర శతం వంశ్యాః తస్య తీర్ణా భవాంబుధిమ్ ॥

భా॥ కేదారకుండమందు స్నానము చేసి శ్రద్ధగ పిండప్రదానము చేసినవాని వంశస్థులు నూట ఒక్క తరములవారు భవసాగరమును తరింతురు

శ్లో॥ కేదారం గంతు కామస్య బుద్ధిస్త్యాజ్యా సదైరియమ్ ।
కాశ్యాం స్పృశస్వ కేదారం కృతకృత్యో భవిష్యసి ॥

భా॥ అన్యత్రయుందు మానవులకు హిమాలయకేదారమునకు పోవవలెను అను బుద్ధి విసర్జింపతగినది ఏమనగా కాశియందలి కేదారమును దర్శించినవాడు ఆ కోరిక యందు కృతకృత్యుడగును

శ్లో॥ అసద్మానం త్రికాలం యః కేదారేశం నమస్యతి।
తం నమస్యంతి సతతం లోకపాలా యమాదయః ॥

భా॥ అరువెలలకాలము త్రికాలమందు (త్రి సంధ్యలు) కేదారేశ్వరుని దర్శించి నమస్కరించినవాడు యమాదులకు లోకపాలురకు గూడ నమస్కార యోగ్యుడగును (ఇత్యాది సప్తతి దమేஉధ్యాయే బ్రహ్మ వైవర్తే ) (70 వ అధ్యాయము)

శ్లో॥ కేదారేశం మహాలింగం దేహ కేదార నాశనమ్ ।
కేదారవిత్త పుత్రాద్యా భవన్తి ధ్వాన్త భూమయః ॥

భా॥ కేదారేశ్వర మహాలింగ దర్శనము దేహమనెడి కేదారమును(క్షేత్రమును)నశింపజేయు నట్టిది కేదారము (పొలము) విత్తము పుత్రాదులు ఇవియన్నియును జీవుని మోహమందు పడవేయునట్టివి

కాశీ పారేధ్యారే శివరహస్యే

శ్లో॥ తస్యకేదార నాథస్య శ్రావణే సోమవాసరే ।
పూజా కార్యా విశేషేణ సాధనై వివిధైః శుభైః ॥

భా॥ ఆ కేదారనాథుని పూజ శ్రావణమాసమున సోమవారము నాడు విశేషించి శుభకరమగు వివిధ సాధనములతో చేయదగినది

శ్లో॥ సోమవార వ్రతం కార్యం ప్రయత్నేన యథావిధిః
శక్తేనోపోషణం కార్య మన్యథా నిశి భోజనమ్ ॥

భా॥ ఆ శ్రావణ సోమవార వ్రతము యథావిధిగ ప్రయత్న పూర్వకముగ చేయదగినది శక్తిని గల్గినవాడు ఆరోజు ఉపవాసము చేయవలెను శక్తిహీనుడు నక్తము చేయవలెను

శ్లో॥ తస్యదక్షిణ దిగ్భాగే తిష్ఠ త్యర్క వినాయకః
తస్మిన్నేవ దినే సోஉపి పూజనీయః ప్రయత్నతః ॥

భా॥ ఆ కేదారేశ్వరునకు దక్షిణదిక్కున అర్క వినాయకుడు గలడు అదే రోజున (శ్రావణ సోమవారం) ప్రయత్న పూర్వకముగ అర్కవినాయకుని గూడ పూజించవలెను

శ్లో॥ జ్ఞానవాప్యాం నరః స్నాత్వా తారకేశం విలోక్యచ ।
కృత సంధ్యాది నియమః పరితర్ప్య పితామహాన్ ॥

భా॥ జ్ఞానవాపియందు స్నానము చేసి తారకేశ్వరుని దర్శించి సంధ్యావందనాది కృత్యములను నిర్వహించి పితృదేవతలకు తర్పణము వొసంగవలెను

శ్లో॥ ధృత మౌనవ్రతో ధీమాన్ యావల్లింగ విలోకనమ్ ।
ముచ్యతే సర్వ పాపేభ్యః పుణ్యం ప్రాప్నోతి శాశ్వతమ్ ॥

భా॥ లింగదర్శనము చేయువరకును మౌనవ్రతము పాటించిన వారు సర్వ పాపములనుండి ముక్తులై శాశ్వత పుణ్యమును పొందుదురు

శ్లో॥ ప్రాంతే చ తారకం జ్ఞానం యస్మాత్ జ్ఞానాద్విముచ్యతే ।
మునేఽ న్యచ్చ మహాలింగం కరుణేశ్వర సంజ్ఞితమ్ ॥

భా॥ ఈ ప్రాంతమందు గల తారకేశ్వర జ్ఞానము గల్గినవారు అజ్ఞానమునుండి విముక్తులగుదురు ఇచ్చట నున్నట్టి మరియొక మహాలింగము కరుణేశ్వర నామము గలది

శ్లో॥ మోక్షద్వార సమీపే తు మోక్షద్వారేశ్వరాగ్రతః ।
దర్శనాత్తస్య లింగస్య మహాకారుణికస్యవై ॥

మోక్షద్వార సమీపమునందు మోక్షద్వారేశ్వరునకు ఎదుట కరుణేశ్వర లింగము మిక్కిలి యను గ్రహ ప్రదాయిని ।

శ్లో॥ స క్షేత్రాన్నిర్గమో జాతు బహిర్భవతి కస్యచిత్ ।
అమృతేశ్వర నామేదం లింగమానంద కాననే ॥

భా॥ ఎవరును ఈ క్షేత్రమునుండి ఆయన దయవలన బయటకు పోకుందురు ఆనందకాననమందలి అమృతేశ్వర నామము గల లింగము మిక్కిలి మహిమగలది

శ్లో॥ ఏతల్లింగస్య స్పర్శా దమృతత్వం భవేద్ధ్రువమ్॥

(ఇదం స్వర్గద్వార సమీపే విశ్వకర్మేశ పార్వతీశౌ నవతితమే ఽధ్యాయే గంగేశ్వర నర్మదేశ్వర సతీశ్వరాః క్రమేణ ఏకనవత్యాది త్రిషు అధ్యాయేషు విస్తరేణ ఉక్తాః)

భా॥ అమృతేశ్వర లింగమును స్పృశించినవారికి అమృతత్వము లభించును (ఇది స్వర్గద్వార సమీపమునందు గలదు ఇచ్చటనే విశ్వకర్మ, పార్వతీశ్వరుల ఉనికియవి 90 వ అధ్యాయమున గలదు గంగేశ్వర నర్మదేశ్వర సతీశ్వరులు క్రమముగ 91 వ అధ్యాయము నుండి మూడు అధ్యాయములలో విస్తారముగ చెప్పబడినారు)

శ్లో॥ మోక్షద్వారేశ్వరం చైవ స్వర్గ ద్వారేశ్వరం తథా ।
ఉభౌ కాశ్యాం నరో దృష్ట్వా స్వర్గం మోక్షంచ విందతి ॥

భా॥ కాశీయందు స్వర్గద్వారేశ్వర మోక్షద్వారే శ్వరులను దర్శించిన వాడు క్రమముగ స్వర్గ మోక్షములను పొందును

శ్లో॥ చక్రపుష్కరిణీతీరే జ్యోతీ రూపేశ్వరం పరమ్ ।
సమభ్యర్చ్య ఽఽ పున్యాయాన్మర్త్యే జ్యోతీరూపమ పంశయమ్ ॥
(ఇత్యాది సర్వం చతుర్నవతి తమే ఽధ్యాయే)

భా॥ చక్రపుష్కరిణీ తీరమందుగల జ్యోతీరూపేశ్వరుని అర్చించిన వాడు

విష్కళంకయముగ జ్యోతిరూపమును పొందును ( 94వ అధ్యాయము)

శ్లో॥ చక్రేశ్వర పూర్వేణ లింగం విద్యేశ్వరాభిధమ్ ।
సర్వా విద్యాఃప్రసన్నాః స్యుః తస్య లింగస్య సేవనాత్ ॥

భా॥ చక్రేశ్వరునకు తూర్పున గల లింగము విద్యేశ్వరమను పేరుగలది. దానిని సేవించినవారికి సర్వ విద్యలు కరతలామలకముగును

బ్రహ్మవైవర్తే - శ్లో॥ మణికర్ణీశ్వరం లింగం మోక్షద్వార మపావృతమ్
యస్యదర్శనతః సమ్యక్ మణికర్ణి సమాప్యతే ॥

భా॥ మణికర్ణీశ్వర లింగము మోక్షద్వారమును తెఱచునట్టిది దానిని దర్శించినవారికి మోక్షప్రాప్తి గలుగును.

శ్లో॥ గోకర్ణేశం మహాలింగ మంతర్గేహస్య పశ్చిమే ।
ద్వారేసమర్చ్య వై కాశ్యాం న విఘ్నై రభిభూయతే ॥

భా॥ అంతర్గేహము యొక్క పశ్చిమ ద్వారమందు గల గోకర్ణేశ్వర మహాలింగమును సేవించినవారికి కాశిలో ఎట్టి విఘ్నములు గలుగవు.

శ్లో॥ భారభూతేశ్వరం లింగం భారభూత గణార్చితమ్ ।
అంతర్గేహోత్తరద్వారి ధ్యాత్వా శివపురే వసేత్ ॥

భా॥ భారభూత గణములచే అర్చింపబడుచు అంతర్గేహము యొక్క ఉత్తర ద్వారమందు గల భారభూతేశ్వరుని ధ్యానించిన వారు శివపురియందు నివసింతురు

శ్లో॥ అవిముక్తేశ్వరాత్పశ్చా న్మోక్షేశం వీక్ష్య మానవః ।
న పునర్మానవే లోకే యాతాయాతం కరోతి హి॥

భా॥ అవిముక్తేశ్వరునకు పశ్చిమ దిక్కున గల మోక్షేశ్వరుని దర్శించిన మానవునకు తిరిగి మానవలోకమునకు యాతాయాత యాతన యుండదు (భువికి రాకపోకలనుదుఃఖము)

శ్లో॥ త్రిసంధ్యేశ్వర మాలోక్య కృత సంధ్యా త్రికాలతః ।
త్రివేదావర్తజం పుణ్యం ప్రాప్నుయాత్ శ్రద్ధయా ద్విజః ॥

భా॥ త్రిసంధ్యేశ్వరుని దర్శించి త్రి సంధ్యలయందు సంధ్యావందనము చేసిన ద్విజునకు మూడు వేదముల పారాయణము చేసినట్టి ఫలము గల్గును.

శ్లో॥ గంగాకేశవ సంజ్ఞంత సర్వపాతక నాశనమ్ ।
తత్ర మే శుభదాం మూర్తిం మునే! తత్తీర్థ సంజ్ఞకమ్
సంపూజ్య శ్రద్ధయా ధీమాన్మమ లోకే మహీయతే ॥

భా॥ ఓ మునీశ్వరా ! గంగా కేశవలింగము సర్వపాపహరము అచ్చటి శుభమగు వా మూర్తిని శ్రద్ధగ దర్శించి పూజించిన వారికి వా లోకము లభించును.

శ్లో॥ శుక్రేశ్వరస్య యే భక్తాః శుక్రలోకే వసన్తితే ।
విశ్వేశ్వరా ద్దక్షిణతః శుక్రేశ ఉ_స్తి పరంతప ॥
తస్యదర్శన మాత్రేణ శుక్రలోకే మహీయతే ॥

భా॥ విశ్వేశ్వరునకు దక్షిణదిశయందు శుక్రేశ్వరుడు గలడు ఆయన దర్శనముచే శుక్రలోక ప్రాప్తి గలుగును

తథా శ్లో॥ తవ భక్తా భవిష్యన్తి బహుశ్శ్రాబుహాన్వితాః ।

భా॥ నీ యొక్క భక్తులును మిక్కిలి ధీశక్తి గల్గిన వారును బహు సంతాన పంతులుగను అగుదురు

తథా శ్లో॥ ధ్రువేశ్వరం సమభ్యర్చ్య ధ్రువకుంతే కృతోదకః ।
ధ్రువలోక మవాప్నోతి వరో భోగ సమన్వితః ॥

భా॥ ధ్రువకుండమందు స్నానము చేసి ధ్రువేశ్వరుని పూజించినవారు సర్వభోగ సమన్వితమగు ధ్రువలోకమును పొందుదురు

తథా— అగస్త్యం ప్రతి స్కందః — (స్కందుడు అగస్త్యునితో చెప్పుచున్నాడు )

శ్లో॥ తవ తత్ర తు యత్కుండ మగస్త్రీశ్వర సంవిధా ।
తత్ర స్నాత్వా పీత్వా చ కృత వర్వోదక క్రియః ॥
పితౄన్సింపైః సమభ్యర్చ్య శ్రద్ధా శ్రద్ధ విధానతః ॥
కృతకృత్యో భవేజ్జన్తు ర్వారాణస్యాః ఫలం లభేత్॥

భా॥ అక్కడ నీపేరుతో అగస్త్రీశ్వర కుండమున్నది అచ్చట స్నానము చేసి ఆచమనము చేసి ఉదక క్రియలను నిర్వర్తించి పితృదేవతలకు శ్రద్ధతో యథావిధిగ పిండప్రదానము చేసి అర్చించినవాడు వారాణసియందున్న ఫలమును పొందును.

శ్లో॥ ఈశానేశం సమభ్యర్చ్య కాశ్యాం దేశాంతరేష్వపి ।
విపన్నాప్తేన పుణ్యేన జాయన్తే ఉ_త్ర పురోహితా ॥

భా॥ దేశాంతర ముందుండి గాని కాశియందుండిగాని ఈశానేశ్వరునికి పూజించినవానికి ఆ పుణ్యఫలముచే విపత్తులు గూడ రాబోవు శుభములుగ పరిణమించును

(31) అథ ధర్మేశః కాశీఖండే ధర్మం ప్రతి వరప్రదానే శివః

శ్లో॥ త్వయా చేవ యదేతస్మిన భక్తి భాజా లింగం సమారాధితమత్ర ధర్మ ।

శ్లో॥ ధర్మేశ్వరం య సకృదేవ మర్త్యః విలోకయిష్య త్యవదాతబుద్ధిః ।
స్నాత్వా పురస్తేఽత్ర వ ధర్మతీర్థే న తస్య దూరే పురుషార్థసిద్ధిః ॥

భా॥ నిర్మలమైన బుద్ధితో సకృత్తుగనైనను ధర్మేశ్వరుని యెదుటగల ధర్మతీర్థమందు స్నానము చేసి ధర్మేశ్వరుని అర్చించిన వారికి పురుషార్థ సిద్ధి శీఘ్రముగ గల్గును

*తథా- శ్లో॥ యో ధర్మపీఠం ప్రతిలభ్య కాశ్యాం వ్యశ్రేయసే నో యతతే ఽత్ర మర్త్యః ।*
*కథం న ధర్మత్వ మివాతితేజాః కరిష్యతి స్వం కృతకృత్య మేవ॥*

భా॥ కాశీయందు ధర్మపీఠమును జేరి వ్యశ్రేయమ్ము కొరకు ఎవడు ప్రయత్నించడో వాడు వర్చస్సుగలవాడై కృతకృత్యుడు ఎట్లుగావోవును ?

*తథా- శ్లో॥ యదత్ర దాస్యన్తి హి ధర్మపీఠే వరా ద్ద్యునద్యాం కృతమజ్జనాశ్చ ।*
*తదక్షయం భావి యుగాన్తరేష్వపి కృతప్రణామా స్తవధర్మలింగే॥ ( ఇత్యాద్యష్ట సప్తత్యధ్యాయే)*

భా॥ నీదైన ఈధర్మలింగ సమీపమున ఈదేవనదియగు గంగయందు స్నానము చేసి దానముచేసినవారు నీకు నమస్కరించినవారు భావియుగమందు సైతము అక్షయఫలమును పొందినవారు అగుదురు (ఇత్యాదిగ 78వ అధ్యాయమందు ఉన్నది )

*తథా- శ్లో॥ అనేకానిహ పీఠాని సన్తి కాశ్యాం పదేపదే ।*
*పరం ధర్మస్య పీఠస్య కాచిచ్ఛక్తి రనుత్తమా ॥ (ఇత్యాది ఏకోనాశీత్యధ్యాయేఽ ప)*

భా॥ ఈకాశీయందు అనేకానేక పీఠములున్నవి కాని ఈధర్మేశ పీఠమునందు ఒకానొక ఉత్తమమైన శక్తి యున్నది ( ఇత్యాదిగ 79వ అధ్యాయమునందున్నది )

*బ్రహ్మవైవర్తే- శ్లో॥ ధర్మేశ్వరస్య యే భక్తా ధర్మపూర్ణా భవంతి హి ।*
*కాశ్యాం పాపమతి ప్రాప్య బాధతే ధర్మవత్సలాన్ ॥*

భా॥ ధర్మేశుని భక్తులైనవారు ధర్మపూర్ణులైయుందురు ధర్మతత్పరులగు వారిని కాశీయందెట్టి పాపాత్ములును బాధింపనేరరు

*అథ ధర్మకూప. - ( ధర్మకూపమును గురించి )*

శ్లో॥ *యత్ఫలం తీర్థరాజస్య స్నానేన పరికీర్త్యతే ।*
*సహస్రగుణితం తస్మాద్ధర్మాంబు స్నానమాత్రతః ॥*

భా॥ తీర్థరాజమగు ప్రయాగయందు స్నానముచేయుటచే ఎట్టి ఫలము చెప్పబడినదో దానికి వేయిరెట్ల ఫలము ధర్మకూపస్నానముచే లభించును (ధర్మాంబుః ధర్మకూపఃఇత్యాది) (ధర్మాంబువు అనగా ధర్మకూపమని అర్థము)

శ్లో॥ పిండప్రదానం యైరత్ర విధివత్తు కృతం భవేత్ ।
న గయాగమనే తేషాం ఫలం కించ న విద్యతే ॥

భా॥ ధర్మకూపము వద్ద యథావిధిగ పిండ ప్రదానమెవరు చేయుదురో వారికి గయకు వెళ్లక పోవుట వలన గలుగు ప్రత్యవాయమేమియులేదు

వచనము అత్ర నహి నిందా నిద్యం నిందితు మితి ధర్మకూప ప్రశంసార్థత్వం గయాగమనాశక్త విషయతావా నహి నిందా నింద్యం నిందితుం ప్రవృత్తా అపితు వక్తవ్యార్థస్య స్తుత్యై ( నహినిందాన్యాయమ్ )

భా॥ ఇచ్చట నింద నిందింపదగిన దానిని నిందించుటకు ప్రవృత్తమైనది గాదు అది ధర్మకూప ప్రశంసార్థము లేదా గయాగమనమందు అశక్తుల విషయముగనైనను భావించవచ్చును ఇచ్చట నహినిందా న్యాయము చే నింద నింద్యమైన దానిని నిందించుటకు ప్రవర్తమైనదిగాక వక్తృ వ్యాపారము యొుక్క స్తుతిపరమని గ్రాహ్యము

శ్లో॥ ధర్మకూపే నర స్స్నాత్వా పరితర్ప్య పితామహాన్ ।
గయాం గత్వా కిమధికం కర్తా పితౄ ముదావహామ్ ॥

భా॥ ధర్మకూపమందు స్నానము చేసి పితృతర్పణముచేసినచో అట్టివాడు పితృదేవతల సంతోషము కొరకు గయవెళ్లి అధికముగ సాధించునది ఏమి గలదు ?

శ్లో॥ యథా గయాయాం తృప్తా స్స్యు పిండదానే పితామహాః ।
ధర్మతీర్థే తథైవస్యుః న న్యూనం నైవా ఽధికమ్ ॥

భా॥ గయ యందు పిండ ప్రదానము చేయుటచే పితరులెంతగ తృప్తి నొందుదురో ధర్మతీర్థమందు అట్లే పిండ ప్రదానము చేసినచో న్యూనాతిరిక్తము ( ఎక్కువ తక్కువ ) గానట్టి ఫలమును పొందుదురు

శ్లో॥ తత్కూపే స్వం నిరీక్ష్యాసి శ్రాద్ధదానఫలం లభేత్ ।
తత్రాపి కాకినీ మాత్రం యచ్ఛేత్ పితృముదే నరః ॥

భా॥ ఆకూపసమీపమునందు ఒక గవ్వనైనను పితృదేవతల ప్రీత్యర్థము తన స్వార్జిత ధనమును దానము చేయునట్టి వానికి శ్రాద్ధదాన ఫలము లభించును

శ్లో॥ అక్షయం ఫలమాప్నోతి ధర్మపీఠ ప్రభావతః ।
తత్రయో భోజయేద్విప్రాన్యతినో ఽథ తపస్వినః
సిక్థే సిక్థే లభేత్సో ఽథ వాజపేయ ఫలం స్ఫుటమ్ ॥(ఇత్యాది ఏకాశీతి తమో ఽధ్యాయః)

భా॥ ధర్మపీఠ ప్రభావముచే గవ్వయంతటి దానము గూడ అక్షయ ఫలవంతమగును తత్సమీపమున విప్రులను గాని యతులను గాని తపస్విజనమును

గాని ఎవరు భోజనముచే తృప్తినొందించెదరో అట్టివారికి ఒక్కొక్క దానికి ఒక్కొక్క వాజపేయ యాగఫలము చొప్పున లభించుట నిశ్చయము ( ఇట్లు 81వ అధ్యాయమున చెప్పబడినది )

శ్లో॥ వటః కాంచన శాఖాఢ్యో యస్తపస్విన సంతతిమ్ ।
దూరీ చకార సచ్ఛాయో బహుద్విజ సమాశ్రయః ॥ (ఇతి ప్రసంగాత్ తత్రత్యః అక్షయవటోఽప్యుక్తః)

భా అచ్చట తపస్విజనులకు బంగారు కొమ్మలతో గూడిన వట వృక్షమును ఎవరు దానము చేయుదురో దాని వలన అనేక పక్షికులములకు ఆశ్రయమగు సచ్ఛాయగల వృక్షమును దానము చేసినంతటి ఫలము వారికి గల్గును (అను ప్రసంగముచే అక్కడ గల వటవృక్షమును గురించి గూడ చెప్పినట్లు అయినది)

తథా శ్లో॥ యో న విశ్వభుజాం దేవీం వారాణస్యాం నమేన్నరః ।
కుతో మహోపసర్గేభ్యః తస్య శాంతిర్దురాత్మనః ॥

భా కాశీయందు విశ్వరక్షణియగు దేవిని గూర్చి ఎవరు నమస్కరించరో అట్టి దురాత్ములకు మహోపద్రవములనుండి శాంతి ఎట్లు లభించును ?

తథా శ్లో॥ తయైవ విశ్వభోక్తారో ఽవిశ్వమాన్యాస్తయైవ హి ।
నిత్యా విశ్వభుజామత్ర పూజయిష్యన్తి మానవాః ॥ (విశ్వ భుజా విశ్వబాహుకేతి ప్రసిద్ధా)

భా ఎవరు ఇచ్చట విశ్వభుజయగు దేవిని పూజించెదరో అట్టివారే సమస్త భోగములను అనుభవించువారును ప్రపంచమందు అందరికిని మాన్యులును యగుదురు (విశ్వభుజయనగా విశ్వబాహుక)

**(౮౨) అవిముక్తేశ్వరో - బ్రహ్మవైవర్తే -**

శ్లో॥ అవి ముక్తేశ్వరం పూజ్య బ్రహ్మనారాయణాదిభిః ।
ఫలం ప్రాప్తం తదేవా ఽఽద్యం సర్వసామర్థ్యలక్షణమ్ ॥

భా అవిముక్తేశ్వరుని పూజించిన పిదపనే బ్రహ్మ విష్ణు మొదలైన వారికి మహాఫలము లభించినది అదియే సర్వసామర్థ్య లక్షణము గల్గిన లింగమైనది

లింగపురాణే - శ్లో॥ అవిముక్తం సదాలింగం యో ఽత్ర ద్రక్ష్యతి మానవః ।
న తస్య పునరావృత్తిః కల్పకోటి శతైరపి ॥

భా ఈ అవి ముక్త లింగమును దర్శించినవారికి కల్పకోటి శతములకైనను పునరావృత్తి భయము ఉండదు

స్కాందే - శ్లో॥ అవి ముక్తేశ్వరం నామ తన్మశాన విముక్తయే ।
జైగీషవ్యేన మునినా యత్ర రుద్రో ఽభిరాధితః ॥

భా॥ అవిముక్తేశ్వరుని సేవించిన వారికి శ్మశానము నుండి విముక్తి లభించును అచ్చటనే జైగీషవ్యమునిచే శివుడు చక్కగ ఆరాధింపబడినాడు

శ్లో॥ యత్ర సంధ్యాముపాసిత్వా బ్రాహ్మణః సకృదేవతు ।
సంధ్యా ముపాస్తవాంస్తు స్యాత్ పుమాన్షట్సమాః సమాః ॥

భా॥ అచ్చట సకృత్తుగానైనను సంధ్యోపాసనచేసిన నరుడు ఆరు సంవత్సరములు దీక్షగ సంధ్యావందనము చేసిన ఫలము పొందును

లైంగే - శ్లో॥ అవిముక్తేశ్వరం లింగం మమ దృష్ట్వేహ మానవః ।
సద్యః పాపవినిర్ముక్తః పశుపాశై ర్విముచ్యతే ॥

భా॥ నా స్వరూపమగు అవిముక్తేశ్వర లింగమును దర్శించిన మానవుడు వెంటనే పాపములనుండి విముక్తుడై భవపాశముల నుండియు విముక్తుడగును

శ్లో॥ అవిముక్తేశ్వరం లింగం దృష్ట్వా క్షేత్రే ఽవిముక్తకే ।
విముక్త ఏవ భవతి సర్వస్మాత్కర్మబంధనాత్ ॥

భా॥ అవిముక్త క్షేత్రముననున్న అవిముక్తేశ్వర లింగమును దర్శించిన వారు సర్వకర్మ బంధముల నుండి విముక్తులగుదురు

శ్లో॥ అర్చన్తి విశ్వేశం విశ్వేశో ఽర్చతి విశ్వకృత్ ।
అవిముక్తేశ్వరం లింగం భుక్తిముక్తి ప్రదాయకమ్ ॥

భా॥ విశ్వకర్తయగు విశ్వేశ్వరుని సర్వులు పూజింతురు అట్టిఅవిముక్తేశ్వర లింగమును విశ్వేశ్వరుడు అర్చించును అది భుక్తి ముక్తి ప్రదాయకమైనట్టిది

శ్లో॥ పురా న స్థాపితం లింగం కస్యచిత్ కేనచిత్ క్వచిత్ ।
కిమాకృతి భవేల్లింగం నైతద్వేత్త్యపి కశ్చన ॥

భా॥ పూర్వము ఎవని చేతను ఎవని కొరకును ఎప్పుడును లింగము స్థాపించబడలేదో అప్పుడు లింగము ఏ ఆకారములో నుండుననునది ఎవరికిని తెలియలేదు

శ్లో॥ ఆకారమవిముక్తస్య దృష్ట్వా బ్రహ్మాచ్యుతాదయః ।
లింగం సంస్థాపయామాసు ర్వసిష్ఠాద్యాస్తథర్షయః ॥

భా॥ అప్పుడు బ్రహ్మ, విష్ణువు మొదలగువారును వసిష్ఠాది పరమర్షులును అవిముక్తేశ్వర లింగమును జూచి తమ తమ పేరులతో లింగములను స్థాపించిరి

శ్లో॥ ఆదిలింగమిదం ప్రోక్త మవిముక్తేశ్వరం మహత్ ।
తతో లింగాంతరాణ్యత్ర జాతాని క్షితిమండలే ॥

భా ఈ మహత్తరమైన అవిముక్తేశ్వర లింగమే ఆది లింగమని చెప్పబడినది ఆపమ్మటనే అనేకానేక లింగములు ఈభూమండల మందు స్థాపించబడినవి

శ్లో॥ అవిముక్తేశనామాపి శ్రుత్వా జన్మార్జితాదఘాత్ ।
క్షణాన్ముక్తో భవేన్మర్త్యో నాత్ర కార్యా విచారణా ॥

భా అవిముక్తేశ్వరుని నామము విన్నంతనే అనేక జన్మలయందు చేసిన పాపములనుండి నరుడు ఒక్కక్షణములో విముక్తుడగును ఇందుకు సందేహములేదు

శ్లో॥ అవిముక్తేశ్వరం లింగం స్మృత్వా దూరగతో ఒపివా ।
జన్మద్వయకృతా త్పాపాత్ తత్ క్షణాదేవ ముచ్యతే ॥

భా అశక్తుడై అవిముక్తేశ్వర లింగమును చేరలేక దూరమునందుండి యైనను ఆలింగమును ఎవరు స్మరించునో అట్టివాని యొక్క రెండు జన్మలయందలి పాపములు తచే క్షణమే నశించును

శ్లో॥ అవిముక్తే మహాక్షేత్రే ఒవిముక్తమవలోక్యవ ।
త్రిజన్మజనితం పాపం హిత్వా పుణ్యమయో భవేత్ ॥

భా॥ అవిముక్త క్షేత్రముచేరి అచ్చట అవిముక్తేశ్వరుని దర్శించినచో మూడుజన్మల యందలి పాపములను పోగొట్టుకొని మానవుడు పుణ్యవంతుడగును

శ్లో॥ యత్కృతం జ్ఞానవిభ్రంశాదేనో జన్మసు పంచసు ।
అవిముక్తేశ సంస్పర్శాత్ తత్ క్షయేదేవ నాన్యథా ॥

భా॥ జ్ఞానవిభ్రంశము వలన (అజ్ఞానముచే) గత ఐదుజన్మలందు చేయుబడిన పాపములు అవిముక్తేశర మహాలింగ సంస్పర్శచేత నశించును

తథా – శ్లో॥ స్తుత్వా ఒర్చయిత్వా నత్వాచ యథాశక్తి యథామతి ।
అవిముక్తే ఒవిముక్తేశం స్తూయతే నమ్యతే ఒర్చ్యతే॥

భా॥ ఈ అవిముక్త క్షేత్రములో అవిముక్తేశ్వరుని యథాశక్తిగ యథామతితో ఎవరు స్తుతించి అర్చించి ప్రణతులు సమర్పింతురో అట్టి పుణ్యమూర్తులు ఇతరులచే ప్రశంసింపబడుదురు నమస్కరింపబడుదురు మరియు పూజింపబడుదురు

తథా – శ్లో॥ త్రిసంధ్యమవిముక్తేశం యో జపేన్నియతః శుచిః ।
దూరదేశవిపన్నో ఒపి కాశీమృతిఫలం లభేత్ ॥

భా॥ త్రిసంధ్యలయందును అవిముక్తేశ్వరుని నియతముగ ధ్యానించునట్టి

శుచిమంతుడు, దూరదేశమందు నివసించుచున్నా మరణించినను కాశీమృతిఫలమును పొందును

శ్లో॥ *అవిముక్తే మహాలింగం దృష్ట్వా గ్రామాంతరం వ్రజేత్ ।*
*లబ్ధ్వా ఽఽ శుకార్యసంసిద్ధిం క్షేమేణ ప్రవిశేత్ గృహమ్ ॥*
*(ఇత్యాది ఏకోన చత్వారింశో ఽధ్యాయః)*

భా॥ అవిముక్తమందు అవిముక్తేశ్వర మహాలింగమును సందర్శించి కార్యవశమున గ్రామాంతరమునకు వెళ్ళవలసి వచ్చినను అట్టివాడు శీఘ్రముగ తన కార్య సంసిద్ధిని పొంది పునః క్షేమముగ తన గృహమును (కాశిని )ప్రవేశించును (ఇత్యాదిగ 39 వ అధ్యాయమున చెప్పబడినది )

కాశిలోనే యుంటూ విధిలేక గ్రామాంతరము వెళ్ళవలసి వచ్చినప్పుడు అవిముక్తేశ్వరుని శ్రద్ధగ బిల్వపత్రాదులచే అర్చించి ఒకటి, రెండు బిల్వములను తన వద్ద భద్ర పరచుకొని వెళ్ళినచో వాని ప్రభావము వలన అతనికి కార్యసిద్ధికలుగుటయే గాక అతి శీఘ్రముగ పునః అవిముక్తేశ్వర సందర్శన భాగ్యము చేకూరునదియు తన వెంట తిరిగి తెచ్చిన ఆ బిల్వములను శ్రీ అవిముక్తేశ్వరులకు సమర్పించవలెననెడి సత్సాంప్రదాయము కాశిలో ప్రసిద్ధి గనినది.

39) అథోంకారః (బ్రహ్మవైవర్తే)

శ్లో॥ *ఓంకారేశ్వర మభ్యర్చ్య యోగసాంఖ్యాది సిద్ధిభాక్ ॥*

భా॥ ఓంకారేశ్వరుని పూజించినవాడు యోగసాంఖ్యాది సిద్ధిని పొందును.

*కౌర్మే వ్యాసః* – శ్లో॥ *ఇదం తద్విమలం లింగమోంకారం నామ శోభనమ్ ।*
*అస్య స్మరణమాత్రేణ ముచ్యతే సర్వ పాతకైః ॥*

భా॥ ఓంకారమను పేరుతో ప్రసిద్ధమైన ఈ స్వచ్ఛమగు లింగమును స్మరించినంత మాత్రమున సర్వపాతకములనుండి విడివడుదురు

శ్లో॥ *యదేతత్పరమం జ్ఞానం పంచాయతన ముత్తమమ్ ।*
*సేవితం సూరిభిర్నిత్యం వారాణస్యాం విమోక్షదమ్ ॥*

భా॥ కాశియందుండి మోక్షప్రదమగు ఈ ఉత్తమమైన పంచాయతనమును పరమ జ్ఞానము కొరకై బుధులు నిత్యము సేవింతురు

*పంచాయతనంచ* –

శ్లో॥ *కృత్తివాసేశ్వరం లింగం మధ్యమేశ్వర ముత్తమమ్ ।*
*విశ్వేశ్వరం తథోంకారం కపర్దీశ్వర మేవచ ॥*

ఏతాని గుహ్యలింగాని వారాణస్యాం ద్విజోత్తమాః ।
న కశ్చిదిహ జానాతి వినా శంభో రనుగ్రహాత్ ॥

భా॥ ఓ విప్రోత్తములారా! కాశీయందు కృత్తివాసేశ్వర మధ్యమేశ్వర విశ్వేశ్వర ఓంకారేశ్వర కపర్దీశ్వర లింగములు గుహ్యలింగములు ఇవి ఉత్తమమైనవి ఇచ్చట విశ్వేశ్వరుని అనుగ్రహము లేనిదే ఎవరరికిని వీని దర్శనము లభించదు మహిమ గోచరించదు

లైంగే :- శ్లో॥ పూర్వాముఖంతు తద్దేవి సిద్ధసంఘైః ప్రపూజితమ్ ।
ఓంకారేశ్వర నామానం దేవానామపి దుర్లభమ్ ॥

భా॥ వీనిలో తూర్పున యున్నదియు సిద్ధ సంఘములచేత మిక్కిలిగ పూజింపబడువట్టిది ఓంకార లింగము అది దేవతలకును దుర్లభమైనట్టిది

లైంగే:- శ్లో॥ అన్యచ్చ తే ప్రవక్ష్యామి తస్మిన్ స్థానే మరేశ్వరి
తిస్రో నద్యస్తు మధ్యస్థావహంతి చ శుభోదకాః ॥

భా॥ ఓ దేవదేవి ! నీకు మరియొక విషయమును చెప్పుచున్నాను ఆ స్థానమందు మూడునదులు పుణ్యోదకములను గలిగి వీని మధ్యగా ప్రవహించుచున్నవి

శ్లో॥ యాసాం దర్శన మాత్రేణ బ్రహ్మహత్యా నివర్తతే।
ఏకా పితామహ స్రోతా మందాకినీ తథా ఒ వరాః
మత్స్యోదరీ తృతీయాచ ఏతాస్తిస్రస్తు పుణ్యదాః॥

భా॥ వాని దర్శనమాత్రమున బ్రహ్మహత్యాపాతకము సైతము తొలగిపోవును వానిలో ఒకటి బ్రహ్మస్రోతస్సు రెండవది మందాకిని మూడవది మత్స్యోదరి ఈ మూడును పుణ్యప్రదములే

శ్లో॥ మందాకినీ తథా పుణ్యా మధ్యమేశ్వరసంస్థితా
పితామహస్రోతికాచ అవిముక్తే ఒతిపుణ్యదా ॥
మత్స్యోదరీచ ఓంకారే పూజితా సర్వదేవతైః॥

భా॥ పుణ్యనదియగు మందాకిని మధ్యమేశ్వరమందున్నది పితామహ(బ్రహ్మ) నది అవిముక్తమందు అతి పుణ్యవంతమైనది ఓంకారమందు సర్వదేవతలచేతను పూజింపబడెడిది మత్స్యోదరి.

శ్లో॥ తస్మిన్ స్థానే యదా గంగా ఆగమిష్యతి భామిని ।
తదాపుణ్యతమః కాలో దేవానామపి దుర్లభః ॥

భా॥ అవియున్నస్థానమునకు గంగ ఎప్పుడు వచ్చునో అప్పుడు మిక్కిలి పుణ్యప్రదమైన కాలము అట్టి సమయము దేవతలకును దుర్లభమైనది

శ్లో॥ *వరణాత్రిస్త్ర సలిలే జాహ్నవీ జల మిశ్రితే ।*
*తత్ర నాదేశ్వరే పుణ్యే స్నాతః శిమనుశోచతి ॥*

భా॥ వరణానది జాహ్నవీ జలముతో కలిసినచోటు నాదేశ్వర తీర్థము అందు స్నానము చేసిన వానికి ఎట్టి దుఃఖమును ఉండదు

శ్లో॥ *తస్మిన్ కాలేచ తత్రైవ స్నానం తత్ర కృతం మయా।*
*తేన హస్తతలాద్దేవి । కపాలం పతితం క్షణాత్॥*

భా॥ ఓ పార్వతీ । అట్టి పుణ్యసమయమందే ఒకసారి నేను ఆ తీర్థమందు స్నానము చేయగా నాచేతికి అంటుకొని యున్నట్టి కపాలము తత్ క్షణమే ఊడిపడినది

శ్లో॥ *కపాలమోచనం నామ తత్రైవ సుమహత్సరః ।*
*పావనం సర్వసత్త్వానాం పుణ్యదం సర్వ దేహినామ్ ॥*

భా॥ అచ్చట ఏర్పడినగొప్ప సరస్సుకపాలమోచనమను పేరు గలది యైనది పావనమైన ఆసరస్సు సర్వజీవులకు సర్వ దేహాలకు పుణ్యప్రదమైనది

శ్లో॥ ఓంకారేశ్వర నామ్నాచ తత్ర స్థానం కృతం మయా।
తేన మే రచతే దేవి। ఓంకారేశ్వర నామతః॥

భా॥ అచట నేను ఓంకారేశ్వర నామముతో ప్రతిష్ఠితుడనై యున్నాను ఓంకారేశ్వర నామముతో అచ్చట యుండుట నాకు మిక్కిలి ప్రియతమమైనది

శ్లో॥ *మత్స్యోదరీ జలే స్నాత్వా దృష్ట్వా చోంకారమీశ్వరమ్ ।*
*శోకో మోహో జరా మృత్యుః న చ తం స్పృశతే పునః ।*

భా॥ మత్స్యోదరీ జలమందు స్నానము చేసి ఓంకారేశ్వరుని దర్శనము చేసిన భక్తుని శోకము మోహము జర మృత్యువు మరల స్పృశించవు

*తథా*– శ్లో॥ *తస్మింస్తు యః శివః సాక్షాదోంకారేశ్వర సంజ్ఞితః ।*
*ఏతద్రహస్య మాఖ్యాతం తవ స్నేహాన్మహామునే॥*

భా॥ ఆ స్థానమందు ఓంకారేశ్వర నామముతో నేను ఉపస్థితుడనై యుందును నీ యందలి ప్రేమచే ఈ రహస్యమును నీకు చెప్పుచున్నాను

శ్లో॥ *అకారంచ ఉకారంచ మకారంచ ప్రకీర్తితమ్॥*
*తస్మిన్లింగే తు సంసిద్ధో మునిః కాలిక వృక్షికః ॥*

భా॥ అకార ఉకార మకారములచేత ప్రసిద్ధమైన ఆ ఓంకారలింగమందు కాలిక వృక్షికుడను ముని సిద్ధిని పొంది యున్నాడు

శ్లో॥ *అకారస్తత్ర విజ్ఞేయో విష్ణులోక గతిప్రదః ।*
*తస్య దక్షిణ పార్శ్వేతు ఓంకారం సంకీర్తితమ్॥*

భా॥ అచ్చట అ కారము విష్ణు లోక ప్రాప్తి ప్రదమని తెలియవలెను దానికి దక్షిణ పార్శ్వమందు ఓంకారమను పేరుతో కీర్తింపబడియున్నది

శ్లో॥ *తత్ర సిద్ధిం పరాం ప్రాప్తో దేవాచార్యో బృహస్పతిః ।*
*ఓంకారం తత్ర విజ్ఞేయం బ్రహ్మణః పద మవ్యయమ్ ॥*

భా॥ అచ్చట దేవాచార్యుడగు బృహస్పతి పరమ సిద్ధిని పొందినాడు అందుచే అచట ఓంకారము బ్రహ్మయొక్క పరమ పదమని గ్రహింపవలెను

శ్లో॥ *తయోస్తు ఉత్తరే భాగే మకార ఇతి సంజ్ఞితమ్ ।*
*తస్మిల్లింగేతు సంసిద్ధః కపిలర్షి ర్మహామునిః*

భా॥ ఆ రెండింటికిని ఉత్తర భాగమందున్న 'మ కారలింగము విష్ణు సంజ్ఞగలది. ఆ లింగమందు మహామునియగు కపిల మహర్షి సంస్థితుడై యుండును

తథా- శ్లో॥ *ప్రణవాఖ్యం పరం బ్రహ్మ యత్ర నిత్యం ప్రకాశతే ।*
*స పంచాయతనోపేత ఓంకారేశ ఉ యమద్భుతః ॥*

భా॥ ప్రణవ వాచ్య పరబ్రహ్మ ఎచ్చట నిత్యము ప్రకాశించుచుండునో అదియే అద్భుతమగు ఓంకారలింగము (ఓంకారేశ్వరము)

శ్లో॥ *ఏషా మత్స్యోదరీ రమ్యా యత్స్నాతో మానవోత్తమః ।*
*మాతుర్గర్భదరీం న విశేదితి నిశ్చయః ॥*

భా॥ ఇదియే రమ్యమైన మత్స్యోదరి ఇందు స్నానము చేసిన ఉత్తమ మానవుడు తిరిగి మాతృగర్భమును ప్రవేశింపడనుట నిశ్చయము.

కాశీఖండే –శ్లో॥ *స్నాత్వా మత్స్యోదరీ తీర్థే విలోక్యోంకార మీశ్వరమ్ ।*
*న జాతు జాయతే జన్తుః జననీ జఠరే క్వచిత్ ॥*

(ఇత్యాది ఓంకార ప్రాదుర్భావః తన్మహిమాచ త్రిసప్తతి చతుః సప్తతి తమయో రధ్యాయయోః విస్తరేణ జ్ఞేయమ్)

భా॥ మత్స్యోదరీ తీర్థమందు స్నానము చేసి ఓంకారేశ్వరుని సందర్శించిన ఏ ప్రాణియు జననీ జఠరమందు ఎప్పటికిని ప్రవేశింపదు (ఇది ఓంకార ప్రాదుర్భావము దానిమహిమ 73 74 అధ్యాయములలో విస్తారముగా తెలియదగును)

**(84) అథ త్రిలోచనః –కాశీఖండే**

శ్లో॥ *యత్రాస్తి తన్మహాలింగం వారాణస్యాం త్రిలోచనమ్ ।*
*తీర్థం పిలిప్పిలాఖ్యం తత్ ద్యునద్యాంభువి విశ్రుతమ్ ॥*

భా॥ గంగానదియందు ప్రసిద్ధమైన పిలిప్పిలయను తీర్థమున్నది అచ్చట కాశీయందు ప్రశస్తమైన త్రిలోచన మహాలింగమున్నది.

శ్లో॥ సర్వ తీర్థమయం తీర్థం తత్కాశ్యాం పరిగీయతే

భా॥ కాశీయందుఅది సర్వ తీర్థమయమైన తీర్థముగా పొగడబడుచున్నది

తథా—శ్లో॥ విరజాఖ్యాం తత్పీఠం తత్ర లింగం త్రివిష్టపమ్ ।
తత్పీఠం దర్శనాదేవ విరజా జాయతే నరః ॥

భా॥ ఆ పీఠము విరజ యని అచటి లింగము త్రివిష్టపము అని చెప్పబడును ఆ పీఠమును దర్శించినవాడు పాపరహితుడగును

తథా— శ్లో॥ స్నాత్వా పిలిప్పిలా తీర్థేత్రివిష్టప సమీపతః ।
దృష్ట్వా త్రిలోచనం లింగం కిం భూయః పరిశోచతి ॥
(ఇత్యాది పంచసప్తతి షట్సప్తతి తమయో రధ్యాయయోః )

భా॥ త్రివిష్టప సమీపమందు గల పిలిప్పిలా తీర్థమందు స్నానము చేసి త్రిలోచనలింగమును దర్శించినవాడు శోకరహితుడగును (ఇత్యాదిగ 75 76 అధ్యాయములందున్నది )

బ్రహ్మవైవర్తే :- శ్లో॥ త్రిలోచనేశ్వరం లింగం నాగయజ్ఞోపవీతినమ్ ।
దృష్ట్వా త్రైలోక్యవిభవ స్త్రుణీ భవతి నాన్యథా ॥(అథ త్రిలోచన ప్రాచ్యాం మహాదేవః)

భా॥ నాగయజ్ఞోపవీతుడగు త్రిలోచనేశ్వరుని దర్శించినవాడు త్రిలోకాధిపత్యమునైనను తృణీకరించును (త్రిలోచనునకు తూర్పున మహాదేవుడున్నాడు )

శ్లో॥ వారాణాస్యాం మహాదేవం సమభ్యర్చ్య సకృన్నరః ।
అభూత సంప్లవం యావచ్ఛివలోకే వసేత్సదా ॥

భా॥ కాశీయందు సకృత్తుగ నైనను మహాదేవుని అర్చించిన నరుడు ఈ భూత సృష్టి యంతయు మహాప్రళయమున లయమునొందువరకు శివలోకమునందు వసించును

శ్లో॥ మహాదేవ మహాపీఠం మమసాధక సిద్ధిదమ్ ।
తత్పీర దర్శనాదేవ మహాపాపైః ప్రముచ్యతే ॥

భా॥ సాధకులకు సిద్ధిప్రదమైనట్టిది నాయొక్క మహాదేవ పీఠము ఆ పీఠదర్శనమాత్రమున నరుడు మహాపాప విముక్తుడగును

(౭౮) అథ కామేశః లైంగే కామకుండం ప్రకృత్య

శ్లో॥ తస్మాదన్యేఽపి యే కేచిత్తీర్థే తస్మిన్నరాః శ్రితాః ।
ఆరాధయన్తే దేవేశం కామేశం చైవ సర్వదా॥

భా॥ ఇతర తీర్థములనేకములున్నప్పటికిని ఆ జనులచే మిక్కిలిగ ఆశ్రయింపబడెడి దేవ దేవుడగు కామేశ్వరుని సర్వదా ఆరాధించువారు

శ్లో॥ యో యస్య మనసా కామః తం తమాప్నోతి నిశ్చితమ్ ।
దక్షిణేన స్థితం లింగం రుద్రావాసస్య సుందరి ॥
కామేశ్వరమితి ఖ్యాతం సర్వకామ ఫలప్రదమ్
తప్తం తత్ర తపస్తీవ్రం కామదేవేన వై పురా॥
కుండం తదుద్భవం దేవి! పద్మోత్పల సమన్వితమ్ ।
కుండస్యైవ తటేరమ్యే ఉత్తమే వరవర్ణిని ॥

భా॥ ఎవరెవరి మనస్సున ఎట్టెట్టి కోరిక యున్నదో దానిని నిశ్చయముగ పొందుదురు రుద్రావాసమునకు దక్షిణముగ స్థితమైయున్నలింగము కామేశ్వరమని ప్రసిద్ధి పొందినది అది సర్వ కామములను తీర్చునట్టిది పూర్వమచ్చట కాముడు తీవ్రమైన తపము చేయగా పద్మములు కలువలతో గూడిన ఒక కుండముద్భవించినది

శ్లో॥ లింగం తత్ర స్థితం దివ్యం పశ్చిమాభిముఖం ప్రియే॥
గంధ ధూప నమస్కారైః ముఖవాద్యైశ్చ సర్వశః ॥
యో మామర్చయే త్తత్ర తస్య తుష్టోమహం సదా ॥
దదామి సర్వ కామాంశ్చ ధర్మమోక్షం తథైవచ ॥

భా॥ ఓ ప్రియా! ఆ కుండము యొక్క రమ్యమైన తీరమందు పశ్చిమాభిముఖముగ ప్రతిష్ఠితమై యున్న లింగము ప్రసిద్ధమైనది. అచ్చట నాస్వరూపమగు ఆ లింగమును గంధ ధూప నమస్కారాదులచేతను ముఖ వాద్యములచేతను చక్కగ పూజించిన వారి యెడల నేను సదా సంతుష్టిని పొంది సర్వ కామములను తీర్చి, వారికి ధర్మ, మోక్షములను గూడ గల్గింతును

శ్లో॥ బహవో ఒపి హి పాప్మానో బహుభి ర్జన్మభిః కృతాః
కామతీర్థాను సంస్నానాత్సాన్యంతి విలయం క్షణాత్ ॥
కామాః సమృద్ధి మాప్స్యంతి కామేశ్వర నిషేవణాత్ ॥ (ఇత్యాది పంచాశీత్య ధ్యాయే)

భా॥ బహు జన్మలయందు చేయబడినసంచితమైన పాపములన్నియు కామతీర్థమందు స్నానము చేసిన వెంటనే నశించును ఆ కామేశ్వరుని సేవించుటవలన భక్తుల కామములన్నియు సమృద్ధిగ నెరవేరును (ఇవ్వా ‿ 8 వ అధ్యాయమున గలదు)

**౩౬) అథ కపాలమోచనమ్ -కాశ్యే-**

శ్లో॥ కపాలమోచనం నామ దేవదేవస్య శూలినః ।
స్నాత్వా ఒ ఖ్యర్చ్య పితౄన్ భక్త్యా బ్రహ్మహత్యాం వ్యపోహతి ॥

*ఆగత్య తీర్థప్రవరం స్నానం కృత్వా విధానతః ।*
*తర్పయిత్వా పితౄన్ దేవాన్ ముచ్యతే బ్రహ్మహత్యయా॥*

భా॥ దేవదేవుడగు ఈశ్వరుని కపాలమోచన కుండమున స్నానము చేసి పితృదేవతలను అర్చించిన భక్తులయొక్క బ్రహ్మహత్యాది పాతకములు వెంటనే నశించును ఆ తీర్థశ్రేష్ఠమునకు వచ్చి విధి విధానముగ స్నానము చేసి పితరులకు దేవతలకు తర్పణము లొసగినవాడు బ్రహ్మహత్యాపాతకమునుండి విముక్తుడగును

*బ్రహ్మపురాణేఽపి కపాలమోచనం ప్రకృత్య -*

శ్లో॥ *తస్మిన్‌తీర్థేతు యె గత్వా పిండదానేన వై పితౄన్ ।*
*శ్రాద్ధైస్తు ప్రణయిష్యన్తి తేషాం లోకాక్షయో దివి॥*

భా॥ ఆ తీర్థమునకు వెళ్ళి పిండ ప్రదానముచేతను ఇతర శ్రాద్ధముల చేతను పితృదేవతలను తృప్తి పరచిన వారికి అక్షయలోకములు గల్గును

*వారాహే - శ్లో॥ తస్యచిత్త్వథ కాలస్య ద్వాదశాబ్దే ధరాధరే*
*వారాణసీం గతో దేవః తత్ర స్నానమథాఽకరోత్ ।*
*గంగాయాం తత్ర దేవేశో యావన్మజ్జతి భామిని*
*తావత్కాలం పతితం యల్లగ్నం బ్రహ్మణః పురా ॥*
*కపాలమోచనం నామ తతస్తీర్థ మనుత్తమమ్।*
*పృథివ్యాం ఖ్యాతి మగమత్వారాణస్యాం ధరాధరే॥*

భా॥ కాలము గడుచుచుండగా పండ్రెండవ సంవత్సరమందు మహాదేవుడు కాశీకి వెళ్ళి గంగయందు స్నానము చేయగా అంతవరకు ఆయన చేతికి సంలగ్నమైయున్న బ్రహ్మకపాలము ఊడిపడినది అంతట ఆ ఉత్తమ తీర్థము కపాలమోచనమను పేరుతో భూమండలమందు ప్రసిద్ధికెక్కినది

*లైంగే -శ్లో॥ కోటీశ్వరస్య దేవస్య ఆగ్నేయాం దిశి సంస్థితః ।*
*శ్మశానస్తంభ సంజ్ఞో ఽయం విఖ్యాతః సుప్రతిష్ఠితః ॥*
*మానవాస్తత్ర యాన్త్యేత ఇహ యైః దుష్కృతమ్ కృతమ్ ॥*
*యత్రస్తంభే సదా దేవి । అహం తిష్ఠామి భామిని ॥*

భా॥ కోటీశ్వర దేవునకు ఆగ్నేయ దిశయందు ప్రతిష్ఠితమై యున్న స్మశాన స్తంభమను పేరుగలది ప్రసిద్ధమైయున్నది దుష్కృత్యములు చేసినవారు అచటికి పోవుదురు ఆ స్తంభమందు నేను సదా సన్నిహితుడనై యుందును

శ్లో॥ *అత్ర గత్వాతు యః పూజాం మహాదేవి కరిష్యతి ।*
*సర్వపాప వినిర్ముక్తో గచ్ఛేచ్చ పరమాంగతిమ్ ॥*

భా॥ ఓ దేవి! అచ్చటకు వెళ్ళి పూజచేయునట్టివారు సర్వ పాపముల నుండి విముక్తులై పరమ పదము నొందుదురు

*తథా— శ్లో॥ కపాలమోచనం నామ త్రిషులోకేషు విశ్రుతమ్ ।*
*కపాలపతితం తత్ర స్నాతస్య మమ సుందరి ॥*
*తస్మిన్స్నాతో వరారోహే బ్రహ్మహత్యాం వ్యపోహతి ।*
*కపాలేశ్వర నామా తు తస్మిన్ తీర్థే వ్యవస్థితః ॥*

భా॥ అది కపాలమోచనమను పేరుతో ముల్లోకములందును ప్రసిద్ధి కెక్కినది. అచ్చట నేను స్నానము చేయగా కపాలము ఊడిపడినది అందుచే ఆకుండమందు స్నానము చేసినవారు బ్రహ్మహత్యాది పాతకములనుండి విముక్తులగుదురు అందుచే దానియందు కపాలేశ్వరుడను పేరుతో సదాసన్నిహితుడనై యుందును

*శ్లో॥ అశ్వమేధమవాప్నోతి దర్శనాత్తస్య సుందరి ।*
*తస్యైవ చోత్తరే పార్శ్వే తీర్థం త్రైలోక్య విశ్రుతమ్ ॥*
*తత్ర స్నాత్వా వరారోహే ఋణైర్ముక్తో భవేన్నరః ॥*
*ఋణమోచనకం నామ విఖ్యాతం భువి సుందరి॥*

భా॥ ఓ సుందరి! దానిని దర్శించినవారు అశ్వమేధ ఫలమును పొందుదురు దానికి ఉత్తర దిశయందున్న తీర్థము ముల్లోకములయందు ప్రసిద్ధి గాంచినది దానియందు స్నానము చేసినవారు ఋణవిముక్తులగుదురు అందుచే అది ఋణవిమోచనమను పేరుతో విఖ్యాతమైనది అదియే ఋణవిమోచన తీర్థము

*శ్లో॥ త్రీణి లింగాని తత్రైవ తిష్ఠన్తి మమ సుందరి ।*
*తాని దృష్ట్వా తు సుశ్రోణి నశ్యతే త్రివిధం హ్యృణమ్ ॥*

భా॥ ఓ సుందరి! అచ్చట మూడు లింగములు ప్రతిష్ఠితమై యున్నవి వానిని దర్శించినవారు త్రివిధ(దేవ ఋషి, పితృ) ఋణములనుండి విముక్తులగుదురు

*కాశీఖండే — శ్లో॥ కపాలమోచనం కాశ్యాం యే స్మరిష్యన్తి మానవాః ।*
*తేషాం వినంక్ష్యతి క్షిప్రం మిహాన్యత్రాపి పాతకమ్ ॥*
*అగత్య తీర్థప్రవరే స్నానం కృత్వా విధానతః ।*
*తర్పయిత్వా పితౄన్ దేవాన్ ముచ్యతే బ్రహ్మహత్యయా॥*

భా॥ కాశీయందలి కపాలమోచనము నెవరు దృఢచిత్తముతో స్మరింతురో అట్టివారు ఇచ్చటను అన్యత్ర చేసిన పాపము లన్నియు శీఘ్రముగ నశించును ఆతీర్థమునకు వచ్చి స్నానము చేసి విధి విధానముగా పితరులకు దేవతలకు తర్పణములు చేసినవారు బ్రహ్మహత్యాది పాపములనుండి విముక్తులగుదురు

తథా-శ్లో॥ అయం హి న కులస్తంభో యత్ర శ్రీకాలభైరవః ।
క్షేత్రపాపకృతః శాస్తి దర్శయన్ తీర్థయాతనామ్ ॥

భా॥ అదియే కులస్తంభమని ప్రసిద్ధిగన్నది అచ్చట గల శ్రీకాల భైరవుడు కాశీక్షేత్రమందుండి పాపము చేసినవారికి తీర్థయాతనలను గల్గించి దండించును

శ్లో॥ ఋణత్రయాద్విముచ్యన్తే యత్రస్నాతా నరోత్తమాః ।
తీర్థం విశుద్ధి జనకం తదేత దృణమోచనమ్॥

భా॥ ఎచ్చట స్నానము చేయుటచే నరులు ఋణత్రయమునుండి విముక్తులగుదురో అట్టి ఈ తీర్థము విశుద్ధి జనకమై ఋణ విమోచనమను పేరుగలదియైనది.

లైంగే శ్లో॥ గోప్రక్షేశ్వర మాదత్య దృష్ట్వా సంపూజ్యైవ మానవః ।
న దుర్గతి మవాప్నోతి కల్మషైశ్చ విముచ్యతే ॥

భా॥ గోప్రక్షేశ్వర దేవుని ఆశ్రయించి దర్శించి పూజించిన మానవులు కల్మషములనుండి విముక్తులై తిరిగి దుర్గతి పొందకుందురు

కాశీఖండే - శ్లో॥ వరణాయాం కృతస్నానైః శైలేశో యైః సమర్చితః
పితౄన్‌సంతర్ప్యచ ముదా దత్వా దానాని శక్తితః
న తేషాం పునరావృత్తి రత్ర సంసార వర్త్మని ॥

భా॥ వరణయందు స్నానముచేసి శైలేశుని చక్కగ పూజించి పితృదేవతలనుద్దేశించి తర్పణములు చేసి శక్తికొలది దానములు చేసినవారు ఈ సంసారచక్రమందు పునరావృత్తి లేకుందురు.

శ్లో॥ శైలేశ్వరం యే ప్రక్ష్యన్తి వరణాయా స్తటేధని ।
తేషాం కాశ్యాం నివసతాం దుఃఖం నాభిభవిష్యతి ॥

భా॥ వరణా ప్రవాహతీరమందున్న శైలేశ్వరుని దర్శించి కాశీయందు నివసించువారికి ఎన్నడును దుఃఖము కలుగదు

లైంగే- శ్లో॥ పిత్రా తే గిరిరాజేన స్వయం హిమవతా ప్రియే ।
మమ ప్రియంతు తత్ స్థానం జ్ఞాత్వా లింగం ప్రతిష్ఠితమ్॥
శైలేశ్వరమితి ఖ్యాతం దృశ్యతామిహ మాం స్థితమ్ ।
దృష్ట్వైవం మమతో దేవి । న దుర్గతి మవాప్నుయాత్ ॥

భా॥ ఓ దేవి! నాకు ఆ స్థానము మిక్కిలి ప్రియమైనదని తెలిసికొనిన నీ తండ్రియగు పర్వతరాజు హిమవంతుడు తనపేర అచట ఒక లింగమును స్థాపించెను నన్ను దర్శింపగోరి వచ్చు భక్తులకు ఆలింగము శైలేశ్వరమను పేరుతో దర్శనమిచ్చుచున్నది. దానిని దర్శించినవాడు ఎన్నటికి దుర్గతినొందడు

కాశీఖండే – శ్లో॥ తత్ర కర్కోటవాపీచ లింగం కర్కోటకేశ్వరమ్ ।
తస్యాం వాప్యాం నరః స్నాత్వా కర్కోటేశం సమర్చ్యచ ॥
కర్కోటనాగమారాధ్య నాగలోకే మహీయతే ।
కర్కోట నాగో యైర్దృష్టః తద్వాప్యాం విమలోదకైః ।
క్రమతే న విషం దేహే స్థావర జంగమమ్ ॥

భా॥ అచ్చట కర్కోటవాపి కర్కోటకేశ్వర లింగము ఉన్నవి ఆ వాపియందు స్నానము చేసి కర్కోటకేశ్వరుని చక్కగఆర్చించి కర్కోటనాగమును ఆరాధించినవాడు నాగలోకమందు శ్రేష్ఠుడై భోగములను అనుభవించును స్వచ్ఛమైన ఉదకముగల ఆ వాపి యందు కర్కోటనాగుని చూచినవారి దేహమందు స్థావర జంగమముల యొక్క విషము ఎక్కదు

లైంగే శ్లో॥ ఇంద్రేశ్వరా ద్దక్షిణతో వాపీ కర్కోటకస్యచ ।
తత్ర నర జలే స్నాత్వా దృష్ట్వా కర్కోటకేశ్వరమ్ ॥
నాగానామాధిపత్యం తు జాయతే నాత్ర సంశయః ।
కర్కోటకా త్పశ్చిమేన నాతిదూరేవ్యవస్థితమ్
భ్రమి చండేశ్వరం నామ బ్రహ్మహత్యాపహారకమ్ ॥

భా॥ ఇంద్రేశ్వరునకు దక్షిణముగా కర్కోటక వాపియున్నది అపవిత్ర జలమందు స్నానము చేసి కర్కోటకేశ్వరుని దర్శించినవారికి నాగులపై అధిపత్యము గల్గుననుటలో సందేహము లేదు కర్కోటకేశునకు పశ్చిమముగా కొంచెము దూరములోనే భ్రమిచండేశ్వరమను లింగము కలదు అది బ్రహ్మహత్యాపాపహారకమైనది

37) అథ వృషభధ్వజ మహిమా – (తత్ర సనత్కుమార సంహితాయాం దేవీం ప్రతి భవః)

శ్లో॥ గంగాయాం స్థాపితః పాదస్త్వయైవ పితృముక్తయే ।
సన్నిధిః క్రియతే ఽత్రాపి యథోక్తం కృపయా త్వయా ॥

భా॥ గయ యందు పితృముక్తి కొరకై నీ పాదముంచబడినది ఇచ్చట గూడ అనుకంప గల్గిన నీచేత సన్నిధి చేయబడినది

శ్లో॥ మత్పాద దర్శనా దేవ తత్ర యాన్తి పరాంగతిమ్ ।
జ్ఞాతయో ఽజ్ఞాతయోవాఽపి యదర్థం వా ఽపి యః స్పృశేత్ ॥
పితృతీర్థేన విపదం రుద్ర పాదం విదుర్బుధాః ।
తతో ఽపస్త రుజం జ్ఞేయం వృషభధ్వజమిదం ప్రియే॥

భా॥ ఓ దేవి! నాపాదదర్శనము చేతనే జనులు పరమగతిని పొందుదురు

తెలిసిగాని తెలియక గాని నన్ను స్పృశించినవారికి ముక్తి గల్గుటచే పితృతీర్థమునకు సమీపమున గల దీనిని రుద్రపాదమని విజ్ఞులు పేర్కొందురు అట్టి ఈ వృషభధ్వజము అనంతగుణ ప్రదమని తెలియదగినది

తథా- శ్లో॥ నరో రూపేణ భగవాన్నిత్యం విష్ణు రిహస్థితః ।
ధర్మో యః సర్వ శాస్త్రేషు వృషో ఽ యం భగవానః ॥

భా॥ ఇచ్చట నరోవర రూపమున విష్ణు భగవానుడు నిత్యము సన్నిహితుడై యుండును సర్వ శాస్త్రముల యందును ధర్మువు అని పేర్కొనబడిన బ్రహ్మము ఇచ్చట వృషభరూపమున యున్నాడు

శ్లో॥ సంపశ్యన్ప్రాణినాం కర్మ సదా సంనిహితః ప్రభుః ।
అతో నాతః పరం కించిత్ పితౄణాం తారణం ప్రియే ॥

భా॥ ప్రాణుల కర్మలకు సాక్షియగుచు భగవానుడిచట సంనిహితుడై యున్నాడు పితృదేవతలను తరింప చేయుటకు ఈ వృషభధ్వజేశ్వరుని దర్శనమునకు మించినది మరియొకటిలేదు

శ్లో॥ దక్షిణాధ్వాన మాశ్రిత్య యే ఽ వ్యథో రౌరవాశ్రయాః ।
నిపాతితే ఽత్రనై పిండే య్రైః కైర్వా యత్ర కారణాత్ ॥

భా॥ దక్షిణ దిక్కునకు పోవుచు రౌరవాది వివిధ నరకములందు పడినవారికి ఇచట పిండప్రదానము చేసిన కారణము చేత వారికందరికిని పరమగతిని అనుగ్రహించుచున్నాను

శ్లో॥ అనుజానామి నై దేవి తేషాం చ పరమాం గతిమ్ ।
అయాతానాం పునస్తేషాం క్షేత్రవాసంచ శాశ్వతమ్ ॥
యో యత్ర పితృరూపేణ సంతుష్టోస్మి న సంశయః ॥

భా॥ అట్టి వారికి ఈ కాశీ క్షేత్రము శాశ్వతముగ లభించును అచ్చట పితృరూపముతో నేను సంతుష్టుడనై యుండుననుటలో సందేహము లేదు

లైంగే శ్లో॥ కపిలాహ్రద నామానం ఖ్యాతం సర్వ సురాసురైః ।
తస్మిన్ హ్రాదేతు యః స్నానం కృత్వా భక్తి పరాయణః ॥
వృషభధ్వజం యో దద్యాత్ రాజసూయఫలం లభేత్ ॥

భా॥ కపిలా హ్రాదమను పేరుగల తీర్థము సకల సురాసురులందును ప్రసిద్ధమైనది. దానియందు స్నానము చేసి భక్తి పరాయణుడై వృషభధ్వజుని సేవించిన వారికి రాజసూయయాగ ఫలము గల్గును

కాశీఖండే - శ్లో॥ నరకస్థా యే కేచిత్పితరః సపితామహాః ।
పితృలోకస్తు గచ్ఛన్తి తస్మిన్ శ్రాద్ధే కృతేతు వై ॥

భా॥ అచ్చట శ్రాద్ధము పెట్టిన వాని పితృ పితామహాలు నరకస్థితులై యున్నను పితృలోకమునకు పోవుదురు

శ్లో॥ గయాతోఽష్టగుణం ప్రోక్తం పురాణార్థ విశారదైః ।
తస్మిన్ శ్రాద్ధే కృతే భద్రే పితౄణామనృణో భవేత్ ॥

భా॥ పురాణార్థము తెలిసినవారిచే గయకంటె అష్ట గుణకముగ అధికముగ చెప్పబడినది. అచటి శ్రాద్ధముచే పితృఋణమును తీర్చుకొనినవాడగును.

శ్లో॥ కపిలాహ్రదతీర్థే ఽస్మిన్ స్నాత్వా సంయతమానసః
వృషభధ్వజమిమం దృష్ట్వా సర్వయజ్ఞఫలం లభేత్ ॥

భా॥ కపిలా హ్రద తీర్థమందు శ్రద్ధాయుక్తుడై స్నానము చేసి వృషభధ్వజేశ్వరుని దర్శనము చేసిన వానికి సర్వ యజ్ఞ ఫలము లభించును

భా॥ తతో వారాణసీం గత్వా దేవ మర్చ్య వృషధ్వజమ్ ।
కపిలాహ్రద ఉపస్పృశ్య రాజసూయఫలం లభేత్ ॥

భా॥ వారాణసికి వెళ్ళి కపిలాహ్రదమందు స్నానము చేసి వృషభధ్వజుని సేవించిన వానికి రాజసూయఫలము లభించును

కాశీఖండే - ఏతస్మిన్ కాపిలే తీర్థేకాపిలేయ పయో ఽమృతే
యే పిండాన్ నిర్వపిష్యన్తి శ్రద్ధయా శ్రాద్ధదానతః ॥
తేషాం పితౄణాం సంతృప్త్యైదాస్యంతి కపిలాం శుభామ్

భా॥ ఈ కాపిలతీర్థమందలి అమృతమువంటి కాపిలేయ పయస్సుతో పితరులకు పిండప్రదానము చేసి శ్రద్ధగ శ్రాద్ధము పెట్టినవారి పితృదేవతలు వాయాజ్ఞచే సంతృప్తులగుదురు.

తథా - శ్లో॥ శ్రాద్ధే పితౄణాం సంతృప్త్యై దాస్యంతి కపిలాం శుభామ్
యే ఽత్రతేషాం పితృగణో నసేత్ క్షీరదరోధసి ॥

భా॥ ఇచ్చట పితరులకు శ్రాద్ధము పెట్టు సమయమున ఒక కపిల గోవును దానము చేసినచో అట్టివారి పితృగణములు క్షీర సముద్ర ప్రాంతమున నివసింతురు

శ్లో॥ వృషోత్సర్గః కృతో యైస్తు తీర్థేఽస్మిన్ స్నార్షభ ధ్వజే ।
అశ్వమేధ పురోడాశైః పితరస్తేన తర్పితాః ॥

భా॥ ఈ వృషభ ధ్వజతీర్థమున వృషోత్సర్గము చేసినచో అట్టివారి పితరులు అశ్వమేధ పురోడాశముచే తృప్తి చెందుదురు.

శ్లో॥ గయాతోష్ట గుణం పుణ్యమస్మిన్ తీర్థే పితామహాః ।
అమాయాం సోమయుక్తాయాం శ్రాద్ధెకాపిలధారికే ॥

భా॥ ఈ కాపిల తీర్థమందు అమావాస్యతో గూడిన సోమవారమునాడు శ్రాద్ధము నిర్వహించినచో అట్టివాని పితృపితామహాదులు గయయందు శ్రాద్ధము పెట్టిన దానికి ఎనిమిది రెట్ల ఫలితము పొందుదురు

శ్లో॥ యేషాం గర్భే భవేత్ స్రావో యే ఒ దంత జననామృతాః ।
తేషాం తృప్తిః భవే న్నానం తీర్థే కాపిల ధారికే ॥

భా॥ ఎవరికి గర్భస్రావము జరుగునో ఎవరు పుట్టక మునుపే చనిపోవుదురో అట్టివారికి తీర్థజలముచే తృప్తిగల్గును

తథా – శ్లో॥ సీమా బహిర్గతమపి క్షేయం తీర్థమిదం శుభమ్ ।
మధ్యేవారాణసిశ్రేష్ఠం మమ సాన్నిధ్యతో నరైః ॥

భా॥ కాశీకి చెప్ప బడిన పరిమాణమునకు కొంచెము బయట నున్నప్పటికిని ఈతీర్థము నా సాన్నిధ్యముచే వారాణసి మధ్యనున్నట్టి క్షేత్రమువలెనే మిక్కిలి శ్రేష్ఠమైనది

తథా (మధుస్రవా ఘృతకుల్యా క్షీరనీరధి వృషభధ్వజ పైతామహ గదాధర పితృతీర్థ కాపిలధార సుధాఖని శివగయా రూపాణి దశ నామాన్యపి ఉక్త్వా తత్ర ఉక్తమ్

శ్లో॥ ఏతాని దశనామాని తీర్థస్యాస్య పితామహాః ।
భవతాం తృప్తికారీణి వినా ఒ పి శ్రాద్ధతర్పణైః ॥

భా॥ ఇచ్చట శ్రాద్ధతర్పణములేకున్నను ఈ పదిపేర్లు స్మరించినచో పితరులకు తృప్తి గల్గును

(38) అథ విష్ణుపాదోదకమ్ కాశీఖండే

శ్లో॥ తదా ప్రభృతి తత్తీర్థం పాదోదకమితీరితమ్ ।
పాదౌ యదాదౌ శుభదౌ క్షాళితౌ పీతవాససా ॥

భా॥ అప్పటినుండి ఆ తీర్థము పాదోదకమను పేరుతో ప్రసిద్ధినందినది దానికి కారణము విష్ణువు తన శుభకరమగు రెండు పాదములను అందు ప్రక్షాళనము చేసికొనెను

శ్లో॥ తత్ర పాదోదకే తీర్థే యే స్నాస్యంతీహ మానవాః ।
తేషాం వినశ్యతి క్షిప్రం పాపం సప్త భవార్జితమ్ ॥

భా॥ అచ్చట పాదోదకమందు ఎవడు స్నానము చేయునో అట్టివాని ఏడుజన్మల పాపములు వెంటనే నశించును

శ్లో॥ తత్ర శ్రాద్ధం నరః కృత్వా దత్వా చైవ తిలోదకమ్ ।
సప్త సప్త తథా సప్త స్వవంశ్యాన్ తారయిష్యతి ॥
(ఏకవింశతిం వంశ్యానిత్యర్థః) (21 తరములని యర్థము)

భా॥ అచ్చట శ్రద్ధతో శ్రాద్ధమును పెట్టి పితరులకు తిల తర్పణము చేసినచో తన వంశస్థులు 21 తరములవారు తరింపబడుదురు

శ్లో॥ గంగాయాం యాదృశీ ప్రీతిః లభ్యతే ప్రపితామహైః ।
తీర్థే పాదోదకే కాశ్యాం తాదృశీ లభ్యతే ధ్రువమ్ ॥

భా॥ గంగయందలి తర్పణాదులచే పితరులకెంతటి ప్రీతిగల్గునో అట్టిప్రీతి పాదోదక తీర్థ స్నానాదులచే లభించును

శ్లో॥ కృతపాదోదక స్నానం పీతపాదోదకోదకమ్ ।
దత్తపాదోద పానీయం నరం న విరయః స్పృశేత్ ॥

భా॥ పాదోదకమందు స్నానము చేసి ఆ జలము పానము చేసిన వారికి ఇతరులకా తీర్థము జలమును త్రాగుటకు ఇచ్చినవారికిని ఎప్పటికిని నరకముండదు

శ్లో॥ కాశ్యాం పాదోదకే తీర్థే యైః కృతానోదక క్రియా ।
జన్మైవ విఫలం తేషాం జలబుద్బుద సంనిభమ్ ॥ ఇత్యాది ॥

భా॥ కాశీయందలి పాదోదక తీర్థమందు స్నానము చేయని వారియొక్కయు అందు ఉదక క్రియలు నిర్వర్తింపనివారి యొక్కయు జీవనము నీటిబుడగవలె వృథాయగును

తథా - శ్లో॥ సంగమేశం మహాతీర్థం ప్రతిష్ఠాప్యాది_కేశవః ।
దర్శనా దఘహం నృణాం భుక్తిం ముక్తిం దిశేత్ సదా ॥

భా॥ ఈ వరణా గంగా సంగమేశ్వర మహాతీర్థమును ఆదికేశవుడు ప్రతిష్ఠించినాడు దాని దర్శనార్థము వచ్చు మానవుల పాపములను ఆయన పోగొట్టి వారికి భుక్తిని ముక్తిని గల్గించును

తథా - శ్లో॥ సంగమే తత్ర సంస్నాతః సంగమేశం సమర్చ్య చ ।
నరో న జాతు జననీగర్భ సంభవ మాప్నుయాత్ ॥

భా॥ సంగమతీర్థమందు స్నానము చేసి సంగమేశ్వరుని అర్చించిన నరుడు తిరిగి జననీ గర్భమును పొందడు

లైంగే - శ్లో॥ కేశవస్య తు పూర్వేణ విశ్రుతం సంగమేశ్వరమ్ ।
తేన దృష్టేన స్పృష్టేన ముక్తిః ! జన్మై నహి సమాగమః ॥

భా॥ ఆది కేశవ పాదోదక తీర్థమునకు తూర్పున ప్రసిద్ధి పొందిన

సంగమేశ్వరమున్నది దానిని దర్శించిన వారికి వెంటనే ఇష్ట జనులతో సమాగమము గల్గును

స్కాందే - శ్లో॥ స్థాపితం సంగమే చాస్మిన్ బ్రహ్మణా లింగముత్తమమ్ ।
సంగమేశ్వరనామానం ఖ్యాతం జగతి విశ్రుతమ్ ॥

భా॥ ఈ క్షేత్రమున బ్రహ్మచే స్థాపించబడిన ఉత్తమ లింగము సంగమేశ్వరమను పేరుతో ఈ భూమి యందంతటను ప్రఖ్యాతి పొందినది

శ్లో॥ సంగమే దేవ నద్యోశ్చ యః స్నాత్వా మనుజః శుచిః ।
అర్చయేత్ సంగమేశానం తస్య జన్మభయం కుతః ॥ ఇత్యాది ॥

భా॥ ఈ సంగమమందు గంగయందు స్నానము చేసి శుచియైన నరుడు సంగమేశ్వరుని అర్చించినచో అతనికి పునర్జన్మ భయము లేదు

శ్లో॥ శైలరాజేన రత్నాని యాని పుంజీకృతాన్యహో ।
సర్వరత్నమయం లింగం జాతం తత్పుష్కృతాత్మనః ॥
సర్వేషామిహ లింగానాం రత్నభూతమిదం పరమ్ ।
అతో రత్నేశ్వరం నామ వరం నిర్వాణరత్నదమ్

భా॥ రత్నములన్నిటిని ప్రోగుచేసి సర్వరత్న మయమైన శ్రేష్ఠమగు ఏలింగము పర్వత రాజైన హిమవంతునిచే స్థాపించబడినదో అది లింగములన్నిటిలో రత్నమువంటిదియై మోక్షరత్నమును గల్గించునట్టిదియై రత్నేశ్వరమను పేరుతో ప్రసిద్ధి కెక్కినది

తథా - శ్లో॥ యాని బ్రహ్మాండమధ్యే ఽత్ర సంతి లింగాని పార్వతి ।
తైరర్చితాని సర్వాణి రత్నేశే ద్రష్టుః సమర్చితః ॥

(ఇత్యాది ప్రశంసా రత్నేశ్వర ప్రాదుర్భావశ్చ షష్టితమే ఽధ్యాయే )

భా॥ ఈ రత్నేశ్వరలింగము చక్కగ అర్చించబడినచో దానివలన బ్రహ్మాండమధ్యమందుగల సమస్తలింగములు అర్చింపబడినట్లు యగును

(ఇత్యాది రత్నేశ్వర ప్రశంస రత్నేశ్వర ప్రాదుర్భావము 60వ అధ్యాయములో గలదు )

శ్లో॥ రత్నేశ్వర ప్రసాదేన ముక్త్వా రత్నాన్యనేకశః ।
పురుషార్థమహారత్నం నిర్వాణం కో న లబ్ధవాన్ ॥

భా॥ శ్రేష్ఠమని భావించబడునట్టి అనేక రత్నములను పరిత్యజించి ఈ రత్నేశ్వర ప్రసాదముచే పురుషార్థమహారత్నమగు మోక్షమును ఎవరు ప్రాప్తించుకొనకుండును?

శ్లో॥ రత్నేశ్వరో ఽర్చితో దద్యాత్మహారత్నాని భక్తితః ।
రత్నైః సమర్చ్య తల్లింగం స్త్రీ రత్నాది లభేన్నరః ॥

భా॥ రత్నేశ్వరుని భక్తితో పూజించినవారికి ఆయన అనేక రత్నములనిచ్చును ఆ లింగము నెవరైనను రత్నములచే పూజించినచో స్త్రీరత్నము వారికి భార్యగా లభించుటయే గాక మిగిలిన సమస్తమైనకోరికలు నెరవేరును (తత్తజ్జాతిషు యత్ శ్రేష్ఠం తత్ రత్న మిత్య భిధీయతే)

**కృత్తి వాసేశ్వరః- హంసతీర్థః -**

**కాశీఖండే - గజాసురం ప్రతి ఈశ్వరః -**

శ్లో॥ ఇదం పుణ్యం శరీరం తే క్షేత్రే ఽ స్మిన్ముక్తి సాధనే ।
మమ లింగం భవత్వత్ర సర్వేషాం ముక్తిదాయకమ్ ॥
(కృత్తి వాసేశ్వరం నామ మహాపాతక నాశనమ్ )

తథా శ్లో॥ దృష్టే నానేన లింగేన పూజితేన స్తుతేన చ ।
కృతకృత్యో భవేన్మర్త్యః సంసారం న విశేత్పునః ॥

భా॥ నీ యొక్క పుణ్యశరీరము ముక్తి సాధనమగు ఈ క్షేత్రమున నాయొక్క లింగముగ యేర్పడి అందరకును ముక్తినిచ్చునట్టిది యగును అదియే మహాపాతకములను గూడ పోగొట్టునట్టి కృత్తి వాసేశ్వరలింగము ఈ లింగమును దర్శించి పూజించిన నరుడు కృతకృత్యుడై మరల సంసారమున ప్రవేశించడు ఇట్లు గజామరునికి వరమిచ్చి శివుడాతనిని అనుగ్రహించెను

తథా - శ్లో॥ జన్మాంతర సహస్రేణ మోక్షో ఽ న్యత్ర మదుర్లభః ।
కృత్తివాసేశ్వరేలింగే లభ్యస్త్వేకేన జన్మనా ॥

భా॥ అన్యత్ర వేలకొలది జన్మలు గతించినను మోక్షము మిక్కిలి దుర్లభము గావచ్చును గాని కృత్తివాసేశ్వరలింగమును అర్చించినచో ఆ ఒక్క జన్మయందే మోక్షము లభించును

**అథ హంసతీర్థం ప్రశస్యత్య -**

శ్లో॥ తస్మిన్ కుండే నరః స్నాత్వా కృత్వాచ పితృతర్పణమ్ ।
కృత్తివాసేశ్వరం దృష్ట్వా కృతకృత్యోనరోభవేత్ ॥

భా॥ హంసతీర్థ కుండమందు స్నానము చేసి పితృతర్పణము చేసి కృత్తివాసేశ్వరుని దర్శించిన నరుడు కృతకృత్యుడగును

బ్రహ్మవైవర్తే - శ్లో॥ కృత్తివాసం మహాలింగం వాసకాఖ్యకరం వరమ్ ।
యస్య దర్శన మాత్రేణ నమోక్షాది మదుర్లభమ్ ॥

భా॥ కృత్తివాస మహాలింగము వాసకాఖ్యమును గల్గించునట్టిది దానిని దర్శించినచో మోక్షము దుర్లభముగాదు

కౌర్మేకృత్తివాస సంజ్ఞా నిమిత్తముక్తమ్ (కృత్తివాసమను పేరుగల్గుటకు కారణము ఇట్లు చెప్పబడుచున్నది )

శ్లో॥ హత్వాగజాకృతిం దైత్యం శూలేనావజ్ఞయాహరః ।
వాసస్తస్యాఽకరోత్ కృత్తిం కృత్తివాసేశ్వర స్తతః ॥

భా॥ గజాకృతిగల దైత్యుని అవలీలగసంహరించి ఈశ్వరుడు అతని చర్మమును వస్త్రముగ ధరించుటచే అప్పటినుండి కృత్తివాసేశ్వరుడను పేరుతో ప్రసిద్ధుడైనాడు

తథా శ్లో॥ జన్మాంతర సహస్రేణ మోక్షో ఽన్యత్రా ఽఽప్యతే న వా ।
ఏకేన జన్మనా మోక్షః కృత్తివాసేఽత్ర లభ్యతే ॥

భా॥ అన్యత్ర సహస్ర జన్మలచే మోక్షము లభించునో లేదో తెలియదు కాని కృత్తివాసమందు ఒక జన్మలోనే మోక్షము నిశ్చయము

లింగపురాణే –శ్లో॥ రుద్రాణాంచ శరీరంతు మధ్యమేశ్వర మీరితమ్ ।
కృత్తివాసం శిరః ప్రాహరేతత్ప్రియతరం మమ ॥

భా॥ మధ్యమేశ్వరము రుద్రునియొక్క శరీరముగను కృత్తివాసము శిరస్సుగను చెప్పబడినది అందుచే ఇది నాకు మిక్కిలి ఇష్టమైనది

తథ్యా– శ్లో॥ పశ్చిమాభిముఖశ్చాహం తస్మిన్నాయతనే స్థితః
కృత్తివాసేశ్వరం దేవం యే నమన్తి శుభార్థినః
తే రుద్రస్య శరీరేతు ప్రవిష్టా అపునర్భవాః
అనేనైవ శరీరేణ ప్రాప్తా నిర్వాణ ముత్తమమ్॥

భా॥ ఆ ఆలయమున నేను పశ్చిమాభిముఖుడనై యున్నాను శుభమును గోరుచు కృత్తివాసేశ్వరునకు నమస్కరించిన వారు రుద్రుని శరీరమునందు ప్రవేశించిన వారై పునర్భవము లేని వారగుదురు అనగా ఈ శరీర ముండగనే ఉత్తమ నిర్వాణమును పొందిన వారగుదురు

కౌర్మే– శ్లో॥ ధన్యాస్తు ఖలు తే విప్రా మందాకిన్యాం కృతోదకాః
అర్చయన్తి మహాదేవం మధ్యమేశ్వర మీశ్వరమ్॥

భా॥ మందాకినిలో స్నానము చేసి మధ్యమేశ్వరుని అర్చించినవారు ధన్యులు

స్నానం దానం తతః శ్రాద్ధం పిండనిర్వపణం త్విహ
ఏకైకశః కృతం విప్రాః పునాత్యాసప్తమం కులమ్॥
మందాకినీ ముపస్పృశ్య రాహుగ్రస్తే దివాకరే
యత్ఫలం లభతే మర్త్యః తస్మాద్దశగుణం త్విహ॥

భా॥ ఇచ్చట స్నానము దానము శ్రాద్ధము పిండప్రదానము వరుసగ చేసిన

విప్రులు ఏడు జన్మల వరకు తమ కులము వారినుద్ధరింతురు సూర్య గ్రహణ సమయమున అన్యత్ర యున్నట్టి తీర్థములందు స్నానము చేసినచో మానవుడెంతటి ఫలమును పొందునో అంతకు పదిరెట్ల ఫలమును మందాకినియందలి స్నానముచే పొందును *లింగపురాణే*

శ్లో॥ *మందాకినీ జలే స్నాత్వా దృష్ట్వాచై మధ్యమేశ్వరమ్।*
*ఏకవింశకులోపేతో రుద్రలోకే వసేచ్చిరమ్॥*
*స్నానం దానం జపో హోమః స్వాధ్యాయః పితృతర్పణమ్।*
*పిండనిర్వపణం చైవ సర్వం భవతి చాక్షయమ్॥*

భా॥ మందాకిని యందు స్నానము చేసి మధ్యమేశ్వరుని దర్శించిన వాడు తన వంశమందలి ఇరువది యొక్క తరముల వారితో గలిసి చిరకాలము రుద్రలోకమున నివసించును అచ్చట చేసిన స్నానము దానము జపము హోమము స్వాధ్యాయము పితృ తర్పణము పిండ ప్రదానము మొదలగునవి యన్నియు అక్షయ ఫలహేతువులగును

40) అథవృద్ధ కాలేశ్వరః- కాశీఖండే -

శ్లో॥ *వృద్ధ కాలేశ్వరం నామ లింగమేతన్మహీపతే।*
*దర్శనాత్ స్పర్శనాత్తస్య పూజనాచ్ఛ్రవణాన్నతేః॥*
*వృద్ధకాలేశ లింగస్య సర్వం ప్రాప్నోతి వాంఛితమ్॥*

భా॥ ఓ రాజా! ఈ లింగము వృద్ధ కాలేశ్వర మనుపేరు గలది ఈ లింగమును దర్శించినను స్పృశించినను పూజించినను ఆ లింగ మహిమను శ్రవణము జేసినను ప్రణతులర్పించినను అట్టివాడు వాంఛితము లన్నిటిని పొందును

శ్లో॥ *కూపః కాలోదకోనామ జరావ్యాధి వినాశకృత్।*
*తదీయ జలపానేన న మాతుః స్తనపానవాన్॥*

భా॥ కాలోదకమను పేరుగల ఈ కూపజలము ముసలితనమును వ్యాధిని పోగొట్టును ఆ కూపజలమును పానము చేసిన వారికి మాతృస్తన్యమును మరల పానము చేయునగత్య ముండదు మరల జన్మలేదు

శ్లో॥ *కృతకూపోదకస్నానః కృత్వై తల్లింగపూజనమ్।*
*వర్షేణ సిద్ధిమాప్నోతి మనోఽభిలషితాం నరః॥*

భా॥ ఈ కూపోదకముతో స్నానము చేసి లింగమును ఒక్క సంవత్సర కాలము నియమముగ పూజించువారికి మనస్సు నందభిలషించిన కోరికలన్నియు సిద్ధించును

శ్లో॥ *న కుష్ఠం న చ విస్ఫోటా న రంధ్రా న వివర్చికా*
*పీతాత్ స్పృష్టాత్ ప్రతిష్ఠన్తి కపః కాలోదకోదకాత్॥*
*వాగ్నిమాంద్యం నచై శూలం నమేహో న ప్రవాహికా।*

న మూత్ర కృచ్ఛ్రం నో పామా పాపీయస్యాస్య సేవనాత్ ॥
భూతజ్వరాశ్చ యే కేచిద్యే కేచిద్విషమ జ్వరాః॥
తే క్షిప్రముపశామ్యంతి హ్యేతత్కూపోదసేవనాత్॥

భా॥ ఈ కాలోదకమును త్రావినవారికి కుష్ఠు వ్యాధి స్ఫోటకము గజ్జి కఫము మొదలగు రోగములన్నియు శాంతించును ఇంకను ఈ జలపానము వలన అగ్నిమాంద్యము శూల మేహవ్యాధి గ్రహణి (అతిసారరోగము) మిరుడు (అతిమూత్రవ్యాధి) కర్పాణి (గజ్జి ముదురుట వలన గల్గు వ్యాధి) మొదలగు రోగములు గూడ ఉపశమించును మరియు భూత జ్వరము విషజ్వరముల వంటివి గూడ ఈ జలపానముచే వెంటనే శాంతించును

శ్లో॥ వృద్ధకాలేశ్వర లింగే సేవితే న దరిద్రతా
నోపసర్గా నవా రోగా న చాప్తం నామజం ఫలమ్॥

భా॥ వృద్ధ కాలేశ్వర లింగమును సేవించిన వారికి దరిద్రము రోగములు రోగ వికారములు పాపములు పాప జనితదుష్ట ఫలితములేవియు ఉండవు.

శ్లో॥ ఉత్తరే కృత్తి వాసస్య వారాణస్యాం ప్రయత్నతః॥
వృద్ధకాలేశ్వరం లింగం ద్రష్టవ్యం సిద్ధికాముకైః॥

భా॥ సిద్ధి కాముకులగు వారు కాశీయందు కృత్తివాసేశ్వరునకు ఉత్తరమున నున్న వృద్ధ కాలేశ్వరుని ప్రయత్న పూర్వకముగ దర్శించవలెను

లింగపురాణే -శ్లో॥ తత్రపూజా జపోహోమః కాలేశే క్రియతే హి యత్ ఇత్యుపక్రమ్య-

శ్లో॥ బహునాత్ర కిముక్తేన కాలేశే దేవి యత్కృతమ్।
తత్సర్వ మక్షయం తేషాం పునర్జన్మ న విద్యతే॥

భా॥ కాలేశ్వరుని వద్ద చేయబడిన పూజ జపము హోమము మొదలగునవి యని ప్రారంభించి ఓ దేవీ! ఎక్కువగ చెప్పవలసినది ఏమి యున్నది? కాలేశ్వరుని వద్ద ఏమి చేసినను అది అక్షయమై తత్కర్తలకు పునర్జన్మ లేకుండ జేయును అని ఈశ్వరుడు చెప్పెను

తథా- శ్లో॥ తస్య దేవస్య చాగ్రేతు కూపస్తిష్ఠతి వై శుభః॥
తత్ర కాలోదకం నామ ఉదకం దేవి తిష్ఠతి॥
తస్మైన ప్రాశనాద్దేవి పూతో భవతి మానవః॥

భా॥ ఓ దేవీ! ఆ దేవునకు ఎదుట కాలోదకమను పేరుగల శుభంకరమైన కూపమున్నది దాని జలమును త్రావిన నరుడు పవిత్రుడగును

బ్రహ్మవైవర్తే- శ్లో॥ వృద్ధ కాలేశ్వరం లింగం మహాకాల నివారణమ్।
కలికాల మహాజ్వాలా జ్వాలం జీవన జీవనమ్॥

భా॥ వృద్ధ కాలేశ్వర లింగము మహాకాలుని గూడ నివారింపగల్గినది కలికాలమహా జ్వాలలందు దహింపబడుచున్న వారికి పునః జీవన దానము చేయును

కాశీఖండే శ్లో॥ *కాలేశ్వర సమీపేతు దక్షిణే వరవర్ణిని!*

*మృత్యునా స్థాపితం లింగం సర్వరోగ వినాశనమ్॥(ఇదం అపమృత్యుహరేశ్వర నామ్నా ప్రసిద్ధం)*

భా॥ ఓ దేవీ! కాలేశ్వరుని సమీపమందు దక్షిణ దిశగా మృత్యువు చేత స్థాపించబడిన లింగము సర్వరోగ వినాశకమై యున్నది (ఇదియే అపమృత్యు హరేశ్వరమను పేరుతో ప్రసిద్ధి చెందినది)

**41) ఘంటాకర్ణ హ్రదము:-**

శ్లో॥ *ఘంటాకర్ణ హ్రదే స్నాత్వా దృష్ట్వా వ్యాసేశ్వరం శివమ్*
*యత్ర కుత్ర విపన్నోఽపి వారాణస్యాం మృతో భవేత్॥*

భా॥ ఘంటాకర్ణ హ్రదమందు స్నానము చేసి శివంకరుడగు వ్యాసేశ్వరుని దర్శించినవాడు పిమ్మట ఎక్కడ మరణించినను కాశీయందు మృతిచెందిన వాడే యగును

శ్లో॥ *ఘంటాకర్ణే మహాతీర్థే శ్రాద్ధం కృత్వా విధానతః*
*అపి దుర్గతి మాపన్నా నుద్ధరేత్ సప్తపూర్వజాన్॥*

భా॥ ఘంటాకర్ణ తీర్థమందు విధి విధానముగ శ్రాద్ధమును నిర్వహించినచో దుర్గతిని పొందిన ఏడు తరముల యందలి తన పితరులను ఉద్ధరించును

శ్లో॥ *యద్వంశ్యా మునయః కాశ్యాం ఘంటాకర్ణే మహాహ్రదే!*
*కృతోదకక్రియాః ప్రాప్తాః పరాం సిద్ధి ఘటోద్భవ॥*

శ్లో॥ *వ్యాసేశ్వరస్య పూర్వేణ లింగం పశ్చాన్ముఖం స్థితం*
*పరాశరేణ మునినాస్థాపితం మమ భక్తితః॥ (ఇత్యాది)*

భా॥ ఓ అగస్త్య మహర్షీ ఘంటాకర్ణ మహాహ్రదమందు తర్పణము శ్రాద్ధములు చేసినచో అతని వంశస్థులైన పూర్వీకులగు మునులు పరాంసిద్ధిని పొందుదురు వ్యాసేశ్వరునకు తూర్పు దిశయందు పశ్చిమ ముఖముగ నున్న లింగము నా భక్తుడగు పరాశరమునిచే స్థాపించబడినది

శ్లో॥ *వ్యాసకుండే నరః స్నాత్వా అర్చయిత్వా సురాన్పితౄన్!*
*అక్షయాం ల్లభతే లోకాన్యత్ర తత్రాభికాంక్షితాన్॥*

భా॥ వ్యాసకుండమందు స్నానము చేసి దేవతలను పితృదేవతలను అర్చించిన నరుడు తాను కాంక్షించిన అక్షయ లోకములను పొందును

శ్లో॥ *వ్యాసతీర్థ సమీపే తు పశ్చిమేన యశస్విని*
*ఘంటాకర్ణహ్రదం నామ సర్వసౌఖ్య ప్రదాయకమ్*

స్నానం కృత్వా హ్రదే తస్మిన్ వ్యాసేశస్య తు దర్శనాత్
యత్ర యత్ర మృతో దేవి! వారాణస్యాం మృతో భవేత్॥
తత్ర దేవి! తనుం త్యక్త్వా లభేత్ గాణేశ్వరీం గతిమ్॥

భా॥ ఓ యశస్వినీ! వ్యాస తీర్థ కూపమునకు పశ్చిమముగా సర్వసౌఖ్య ప్రదాయకమగు ఘంటాకర్ణ హ్రదమున్నది అందు స్నానము చేసి వ్యాసేశ్వరుని దర్శించినవాడు అన్యత్ర ఎచ్చట మరణించినను కాశీయందు మృతిపొందిన వాడే యగును అచ్చట దేహ త్యాగము చేసినచో శివగణముల యందు స్థానమును పొందును

తథా - శ్లో॥ వ్యాఘ్రేశ్వరేతి విఖ్యాతం సర్వదేవైః స్తుతం శుభే
తేన దృష్టేన లభత ఉత్తమం పదమవ్యయమ్॥

భా॥ సర్వ దేవతల చేతను స్తుతించబడిన వ్యాఘ్రేశ్వర లింగము కలదు దానిని దర్శించినవాడు ఉత్తమమైన అక్షయ పదమును పొందును

తథా - జ్యేష్ఠేశ్వరం ప్రకృత్య -

శ్లో॥ తేన లింగేన దృష్టేన పూజితేన స్తుతేన చ
కృతకృత్యో భవేద్దేవి సంసారే న పునర్విశేత్॥
పూర్వాముఖం తు తల్లింగం జ్యేష్ఠ స్థాన మిదం శుభమ్॥
మానవానాం హితార్థాయ తత్ర స్థానే స్థితో హ్యహమ్॥

భా॥ జ్యేష్ఠేశ్వర లింగమును దర్శించి పూజించి స్తుతించినవాడు కృతకృత్యుడై మరల సంసార భయము లేనివాడగును దానికి తూర్పు ముఖముగా నున్నది శుభప్రదమగు జ్యేష్ఠ స్థానమున బడును మానవుల హితము కొరకై నేనిచ్చట సన్నిహితుడనై యుందును

42) తథా సముద్రకూపం ప్రకృత్య -

శ్లో॥ చతుస్సముద్ర స్నానే తు యత్ఫలం లభతే నరః
తత్ఫలం సకలం తస్య ఉదక స్పర్శనాత్ప్రభో॥

భా॥ నాలుగు సముద్రములందు స్నానము చేసినచో మానవుడెట్టి ఫలమును పొందునో అట్టి ఫలము సముద్ర కూపజల స్నానముచే లభించును

తథా పచనము కదా చిన్మహాదేవం ప్రతి కుపితా భవానీ హిమాచలం ప్రతి ప్రస్థితా తత్ప్రతి బంధార్థం దండకాష్ఠం శివేన క్షిప్తం। తత్పాతస్థలే తటాకం జాతం తస్య దండేన ఖాతత్వా ద్దండఖాత మితి సంజ్ఞా దండశ్చ దండీశ్వరో జాత ఇతి దండఖాతోత్పత్తి మభిధాయోక్తమ్॥

భా॥ ఒకానొకప్పుడు మహాదేవునిపై కోపించిన భవాని హిమాచలమునకు పోవుటకై బయలుదేరెను ఆమెను ఆపుటకై శివుడొక దండకాష్ఠమును అడ్డముగ విసిరెను

అది పడినచోట ఒక తటాకము ఏర్పడెను. ఆ దండముచేత త్రవ్వబడినది యగుటచే అది దండఖాతమను సంజ్ఞ గల్గినదయ్యెను ఆ దండమే దండీశ్వరుడుగ మారెను అని దండఖాతోత్పత్తి విషయము చెప్పబడినది

శ్లో॥ *తత్ర స్నా[illegible] దేవి కృతకృత్యో భవేన్నరః॥*
*దండఖాతే నరః స్నాత్వా తర్పయిత్వా వ్యక స పితౄన్॥*
*నరకస్థాస్తు యే దేవి! పితృలోకే వసన్తు తే॥*

భా॥ ఓ దేవీ! అందు స్నానము చేసినవాడు కృతకృత్యుడగును దండఖాతమందు స్నానము చేసి తన పితరులకు తర్పణము లిచ్చినచో నరకమందున్నప్పటికిని వారందరు పితృలోకము చేరి అచట నివసింతురు

శ్లో॥ *పిశాచత్వగతా యే చ నరాః పాపేన కర్మణా*
*తథా పిండప్రదానేన దేహాన్నోద్ధరణం స్మృతమ్॥*

భా॥ పాపకర్మలు చేయుటచే పిశాచత్వమును పొందినవారు గూడ తమ వంశస్థుడెవరైనను అచ్చట పిండ ప్రదానము చేసినంతనే పిశాచత్వము తొలగిపోయి వారు ఉద్ధరింపబడుదురు

శ్లో॥ *దండఖాతే నరః స్నాత్వా కిం భూయః పరిశోచతి।*
*యస్య స్మరణమాత్రేణ పాపసంఘాత పంజరమ్,*
*నశ్యతే శతధా దేవి! దండ ఖాతస్య దర్శనాత్॥*

భా॥ దండ ఖాతమందు స్నానము చేసిన నరునకు ఆ పిమ్మట దుఃఖ కారణమేదియు ఉండదు ఆ దండఖాత దర్శనము చేత పాపసంఘాత పంజరము నూరుముక్కలుగ భగ్నమగును

(కాశీఖండేతు దండఖాతోత్పత్తి రన్యథోక్తా విప్రా ఇతి ప్రక్రమ్య (కాశీఖండమందు ఓ విప్రోత్తములారా! యని ప్రారంభించి దండఖాతోత్పత్తి మరియొక విధముగ చెప్పబడినది)

శ్లో॥ *ఖాతం ఖాతంచ దండాగ్రైర్భూమిం కన్దాది వృత్తయః॥*
*చక్రుః పుష్కరిణీం రమ్యాం దండఖాతాభిధాం మునే॥*

భా॥ కందాదులగు విప్రులు తమ దండాగ్రములతో భూమిని మరల మరల త్రవ్వి రమ్యమైన పుష్కరిణిని ఉత్పన్నము చేసిరి అది దండఖాతమను పేరుగలిగినదియైనది

*(భూమిం ఖాత్వా ఖాత్వేత్యర్థః కందాదిభిః విప్ర విశేషణం)*

(ఖాతం ఖాతమనగా భూమిని మరల మరల త్రవ్వియని అర్థము కందాదులనునది కందమూలాశనులగు విప్రులకు విశేషణము)

లైంగే - శ్లో॥ జంబుకోఽత్ర హతో దైత్యో మయాఽతో జంబుకేశ్వరః
తమేనం మాం యత్ర దృష్ట్వా సర్వాన్కామా నవాప్నుయాత్॥

భా॥ జంబుకుడను పేరుగల దైత్యుడు నాచే చంపబడినాడు అందుచే ఇది జంబుకేశ్వరమైనది అటువంటి నన్ను ఇచ్చట దర్శించిన వారు సర్వకామములు పొందినవారగుదురు

వాసిష్ఠ- లైంగేతు -

శ్లో॥ పురా జంబుక రూపేణ అసురా దేవకంటకాః
నిహతా హిమవత్పుత్రి! జంబుకేశస్త తోప్యహమ్॥

భా॥ ఓ హైమవతీ! పూర్వము జంబుక రూపమున దేవతలను బాధించునట్టి అసురులు ఇచట నాచే నిహతులైరి అందుచేత నేను జంబుకేశ్వరుడనని ప్రశస్తి పొందితిని

తథా- శ్లో॥ అగ్నీశ్వరేతి నామానం సర్వపాప క్షయం కరమ్।
తం దృష్ట్వా మానవో దేవి! అగ్నిలోకం చ గచ్ఛతి॥

భా॥ అగ్నీశ్వరుడను పేరుగల్గి సర్వపాపములను క్షయమొనర్చునట్టి నన్ను ఇచ్చట దర్శించు మానవులు అగ్ని లోకమునకు పోవుదురు

48) లైంగే - జైగీషవ్యేశ్వరం ప్రకృత్య-

శ్లో॥ తస్మాత్ తత్పంస్కృతం లింగం పూజయిష్యన్తి యే నరాః
జ్ఞానం తేషాం ధ్రువం దేవి! అచిరాజ్జాయతే దివి॥

భా॥ ఓ దేవీ! అచ్చట సంస్కరించబడిన లింగరూపమున నన్ను ఎవరు పూజింతురో వారికి శీఘ్రముగనే జ్ఞానము గల్గుట నిశ్చయము

శ్లో॥ త్రిరాత్రం తత్ర కృత్వా వై యో నరః పూజయిష్యతి।
గుహాం ప్రవిశతే చైవ జ్ఞానయుక్తో భవేన్నరః॥

భా॥ మూడు రాత్రుల పర్యంతము నన్ను పూజించినట్టివారు గుహను ప్రవేశించిన వారును జ్ఞానయుక్తులగుట నిశ్చయము

తథా- శ్లో॥ దృష్ట్వేదం మమ లింగం తు జ్యేష్ఠస్థానే సమాశ్రితమ్।
న శోచతే పునర్మర్త్యః సిద్ధో జన్మని జన్మని॥

భా॥ జ్యేష్ఠ స్థానమందు ప్రతిష్ఠింపబడి యున్న నాయొక్క లింగమును దర్శించినవారు జన్మ జన్మలందు సిద్ధులగుటచే వారికి శోకకారణముండదు

తథా- శ్లో॥ జ్యేష్ఠవాప్యాం నరః స్నాత్వా తర్పయిత్వా పితామహాన్।

*జ్యేష్ఠేశ్వరం సమాలోక్య న భూయో జాయతే భువి॥ (తత్సమీపే నివాసేశ్వరోఽపి జ్ఞేయః॥)*

భా॥ జ్యేష్ఠ వాపియందు స్నానము చేసి పితరులకు తర్పణము లిచ్చి జ్యేష్ఠేశ్వరుని దర్శించినవారు తిరిగి భూమియందు జన్మించరు

(దానికి సమీపమందే యున్న నివాసేశ్వరుని గురించి గూడ తెలియదగినది)

*తథా శ్లో॥ జ్యేష్ఠేశ్వరోఽర్చ్యః ప్రథమం కాశ్యాం శ్రేయోర్థిభిర్నరైః॥*
*జ్యేష్ఠాగౌరీ తతోఽభ్యర్చ్యా సర్వ జ్యైష్ఠ్య మభీప్సుభిః॥*

భా॥ అందరిలోను పెద్దరికమును కోరుకొను నరులచే కాశీయందు మొదట జ్యేష్ఠేశ్వరుడు పూజింపదగినవాడు అటు పిమ్మట జ్యేష్ఠాగౌరి అర్చింపదగినది

*తథా శ్లో॥ జైగీషవ్యేశ్వరం నామ లింగం కాశ్యాం సుదుర్లభమ్॥*
*త్రీణివర్షాణి సంసేవ్య లభేద్యోగం న సంశయః॥*

భా॥ కాశీయందు జైగీషవ్యేశ్వరమను పేరుగల ఈ లింగము దుర్లభమైనది ఈ లింగమును మూడు సంవత్సరములు శ్రద్ధగ సేవించిన వారు నిశ్చయముగ యోగసిద్ధిని పొందుదురు

*శ్లో॥ జైగీషవ్య గుహాం ప్రాప్య యోగాభ్యసన తత్పరః॥*
*షణ్మాసేన లభేత్సిద్ధిం వాంఛితాం మదనుగ్రహాత్॥ (కాశీఖండే చతుష్పంచాశోఽధ్యాయే)*

భా॥ జైగీషవ్యగుహను పొంది ఆరు నెలలు యోగాభ్యాసన తత్పరుడైన వాడు నాయనుగ్రహముచే తాను కోరిన సిద్ధిని పొందును (అని కాశీఖండమందు ఏబది నాల్గవ అధ్యాయమున నున్నది )

44) కపర్దీశ్వరః-

*శ్లో॥ కపర్ది నామ గణపః శంభోరత్యంత వల్లభః॥*
*పిత్రీశా దుత్తరే భాగే లింగం సంస్థాప్య శాంభవమ్॥*

భా॥ ఈశ్వరున కత్యంత ప్రీతిపాత్రుడైన కపర్దియను పేరుగల గణపతి పిత్రీశ్వరునకు ఉత్తర భాగమందు శివలింగమును స్థాపించెను

*శ్లో॥ కుండం చకార తస్యాగ్రే విమలోదక సంజ్ఞకమ్॥*
*యస్య తోయస్య సంస్పర్శాత్ విమలో జాయతే నరః॥*
*(ఇత్యువత్రస్య పైశాచ్యాన్ముక్తస్య కస్య చిత్పిశాచస్య వచః)*

భా॥ ఆ లింగమునకు ఎదుట విమలోదకమను పేరుగల కుండమును గల్పించెను అందలి నీటియందు స్నానము చేసిన నరుడు తప్పక నిర్మలుడగును (అని ప్రారంభించి పిశాచత్వము నుండి ముక్తి పొందిన ఒకానొక పిశాచము యొక్క వచనము లిట్లున్నవి)

శ్లో॥ పిశాచమోచనం తీర్థ మద్యా ఉ_ఉ_రభ్య మమా ఉ_ఉ_జ్ఞయా
అన్యేషామపి పైశాచ్య మిదం స్థానాద్ధరిష్యతి॥

భా॥ నేడు మొదలుకొని నా పేరుతో ఇది పిశాచమోచనమను పేరుగల తీర్థమగును ఇది ఇతరుల పిశాచత్వమును గూడ తొలగించును

శ్లో॥ అస్మిన్ తీర్థే మహాపుణ్యే యే స్నాస్యంతీహ మానవాః
పిండాన్ నిర్వపిష్యన్తి సంధ్యాతర్పణ పూర్వకమ్॥

శ్లో॥ దైవాత్పైశాచ్య మాపన్నాః తేషాం పితృపితామహాః॥
తేఽపి పైశాచ్యముత్సృజ్య యాస్యంతి పరమాం గతిమ్॥

భా॥ ఇచ్చట పుణ్య ప్రదమైన స్నానము చేసి సంధ్యా, తర్పణ పూర్వకముగ పిండ ప్రదానము చేసినవారు వారి పితృ పితామహులు దైవ వశిచే పిశాచత్వమును పొందియున్నను అట్టి పిశాచత్వము నుండి వారిని ముక్తులను గావించి వారికి పరమగతిని ప్రాప్తింప జేసిన వారగుదురు

తథా- శ్లో॥ పిశాచమోచనే స్నాత్వా కపర్దీశం సమర్చ్యచ।
కృత్వా తత్రాన్నదానంచ పరోఽప్యత్రాపి నిర్భయః॥

భా॥ పిశాచమోచనమందు స్నానము చేసి కపర్దీశ్వరుని పూజించి అచట అన్నదానము చేసినవారు పరలోకమందును భయరహితులై యుందురు

కూర్మపురాణే - శ్లో॥ ఇదం దేవస్య తల్లింగం కపర్దీశ్వర ముత్తమమ్।
స్మృత్వై వాశేష పాపౌఘం క్షిప్రమస్య విముంచతి॥

భా॥ మహాదేవుని స్వరూపమై ఉత్తమమైన ఈ కపర్దీశ్వర లింగమును స్మరించినంతనే పాప సమూహములన్నియు తక్షణమే నశించును

శ్లో॥ కామక్రోధాదయో దోషా వారాణసీ నివాసినామ్।
విఘ్నా సర్వే వినశ్యన్తి కపర్దీశ్వర పూజనాత్॥

భా॥ పిశాచ మోచనకుండమందు స్నానము చేసి సమీపముననే గల ఈ కపర్దీశ్వరుని పూజించినట్టి వారాణసీ నివాసులకు గల్గు కామక్రోధాది దోషజనిత సర్వ విఘ్నములు నశించి పోవును

వచనము అత్ర తపస్యతః శంకుకర్ణాఖ్యాన్మునే రుపదేశం ప్రాప్య కశ్చిత్పిశాచః పిశాచమోచనే స్నాత్వా కపర్దీశం సంపూజ్య పైశాచాన్ముక్తశ్చ దృష్ట్వా శంకుకర్ణేన బ్రహ్మపారసంజ్ఞకం స్తోత్రం కృతమ్ ఇత్యాద్యపి తత్రైవ జ్ఞేయమ్॥

భా॥ ఇచ్చట తపస్సు చేయుచున్న శంకు కర్ణుడను పేరుగల ముని యొక్క

ఉపదేశముచే ఒకానొక పిశాచము పిశాచ మోచన కుండమందు స్నానము చేసి కపర్దీశ్వరుని పూజించి పిశాచత్వము నుండి ముక్తి పొందెను అది చూచిన శంకుకర్ణుడు బ్రహ్మపార మను పేరుగల స్తోత్రమును చేసెను ఈ విషయము గూడ పై పురాణము నుండియే తెలియుచున్నది

**45) అన్యాని లింగాని**

వచనము ఏవమన్యానపి లింగపురాణ కాశీఖండాదితో లింగాని జ్ఞేయాని గ్రంథాతి విస్తర ప్రసంగాత్తు నోచ్యన్తే తత్రాపి పరిగణనోద్దేశ మాత్రార్థా సాకల్యేనతు కాశీస్థ లింగాని వక్తుమేవ న శక్యన్తే తదుక్తం కాశీఖండే।

భా॥ ఈ విధముగ ఇతర లింగములను గురించి గూడ లింగ పురాణము కాశీఖండము మొదలగు వానినుండి తెలియదగును గ్రంథ విస్తరణ భీతిచే అవి ఇచ్చట చెప్పబడలేదు అయినప్పటికిని పరిగణ నోద్దేశ మాత్రముగ కాశీలోని లింగముల నన్నిటిని గురించి సంపూర్ణముగ చెప్పుటకు ఎవరికిని శక్యము గాదు కాశీఖండమందును ఇట్లే చెప్పబడినది

శ్లో॥ ఉద్దేశమాత్ర లింగాని కథితాని మయా మునే।
ద్వి త్రి కృత్వా స్థాపితాని భక్త్యా లింగాని కానిచిత్॥

భా॥ ఓ మునీ! ఉదాహరణమునకై కొన్ని లింగములను గూర్చియే చెప్పితిని కొన్ని లింగములు రెండు మూడు కలిపి స్థాపించబడినవి యున్నవి

శ్లో॥ న తాని పునరుక్తాని శ్రద్ధయా -ర్చ్యాని సర్వశః॥
ఏతాని యాని లింగాని యాని కుండాని యే-వటాః
యా వాప్యః తాని సర్వాణి శ్రద్ధేయాని మనీషిభిః
యేతేషాం దర్శనాత్ పానాత్ఫల ముత్తరోత్తరమ్॥ (అంధవః కూపాః)

భా॥ అట్టి వానిని గురించి పునరుక్తియగునవి చెప్పలేదు గాని అవియన్నియును శ్రద్ధతో పూజించదగినవి. చెప్పబడినట్టి కుండములు నూతులు బావులు ఇవి యన్నియును బుద్ధిమంతులచే సేవించదగినవి వీనియొక్క దర్శన స్నానాదులచే గల్గు ఫలము ఉత్తరోత్తరముగ అతిశయించి యుండును

శ్లో॥ అత్రత్యానాం చ లింగానాం కూపానాం సరసామపి।
వాపీనాం చాపి మూర్తీనాం కః సంఖ్యాతుం ప్రభుర్భవేత్॥

భా॥ ఇక్కడ యున్నట్టి లింగములు కూపములు సరస్సులు బావులు విగ్రహములు వీనియొక్క సరియైన సంఖ్యను చెప్పుట కెవరికిని సాధ్యము గాదు

తథా- శ్లో॥ యాని లింగాని సంతీహ తాని సర్వాణ్యసంశయమ్।
నిర్వాణ శరణాన్యేవ వ్యయంభూ స్థాపితాన్యపి॥

భా॥ ఇచ్చట ఎన్ని లింగములున్నవో అవియన్నియును స్వయంభువులు స్థాపితమైనవి కూడ నిస్సంశయముగ మోక్షదాయక మగుచున్నవి

తథా॥ శ్లో॥ *అసంఖ్యాతాని లింగాని పార్వత్యానంద కాననే।*

*స్థూలాన్యపిచ సూక్ష్మాణి నానారత్నమయానిచ॥*

*నానాధాతుమయానీశే దార్షదాన్యప్యనేకశః॥*

*స్వయంభూన్యప్యనేకాని దేవర్షి స్థాపితాన్యపి॥*

*అసురోరగమర్త్యైశ్చ దానవైరప్సరోగణైః॥*

*దిగ్గజైః గిరిభిః తీర్థైః ఋక్ష వానర కిన్నరైః*

*పతత్రిముఖై ర్దేవి స్వస్వ నామాంకితానివై।*

*ప్రతిష్ఠితాని యానీహ ముక్తి హేతూని తాన్యపి॥*

భా॥ ఓ పార్వతీ! ఈ ఆనందకాననమందు అసంఖ్యాకమైన లింగములున్నవి కొన్ని స్థూలమైనవి మరికొన్ని సూక్ష్మమైనవి కొన్ని నానారత్న ఖచితమైనవి మరికొన్ని వివిధ ధాతుమయములైనవి కొన్ని పెక్కు ఋషులు స్థాపించినవి కొన్ని స్వయం భూలింగములు కొన్ని దేవతలచేత స్థాపించబడినవి కొన్ని సిద్ధ చారణ గంధర్వ యక్ష, రాక్షసాదులచేత స్థాపించి పూజించబడినవి మరికొన్ని అసురులు ఉరగులు మర్త్యులు దానవులు అప్సరోగణములు దిగ్గజములు పర్వతములు ఇతర తీర్థములు ఋక్షవానర విశేషములు కిన్నరులు ఖగ ప్రముఖులు మొదలైన వారిచేత వారి వారి పేర్ల మీదుగా ప్రతిష్ఠించబడినవి అవి యన్నియును ముక్తి హేతువులగుచున్నవి

శ్లో॥ *అదృశ్యాన్యపి దృశ్యాని దురవస్థాన్యపి ప్రియే॥*

*భగ్నాన్యపి చ కాలేన తాని పూజ్యాని సుందరి॥*

భా॥ ఓ సుందరీ! ఇందు కొన్ని కాలవశమున అదృశ్యమైనవి కొన్ని దృశ్యములైనవి మరికొన్ని దురవస్థయందున్నవి కొన్ని భగ్నమైనవి అయినప్పటికిని అవి యన్నియును పూజింపదగినవియే (దురవస్థయందున్నవి యనగా మ్లేచ్ఛాదుల స్పర్శ కలిగి వ్యత్యస్తమైనవి పతనము చెందినవి లేక స్థలాంతరమునకు తరలించబడినవి)

శ్లో॥ *పరార్థశత సంఖ్యాని గణితాన్యేకదా మయా।*

*గంగాంభస్యపి తిష్ఠన్తి షష్టికోటి మితానిచ॥*

భా॥ ఒకానొకప్పుడు నాచే పరసంఖ్యను దాటియున్నట్టి లింగములు గణింపబడినవి గంగా జలమందే అరువది కోట్ల సంఖ్యగల లింగములున్నవి

శ్లో॥ సిద్ధ లింగాని తానీహ తిష్యే దృశ్యత్వ మాయయు॥
(తథా శివకర్మ యాత్రాయాం)
తీర్థయాత్రాం ప్రతిదినం కుర్వ న్నానం సవత్సరమ్
న ప్రాప్య సర్వతీర్థాని లింగం కాశ్యాం తిలే తిలే॥

భా॥ అటువంటి సిద్ధ లింగము లిచ్చట తిష్యా నక్షత్రసమయమున అవియన్నియు దర్శనమిచ్చునని శివకర్మ యాత్రా సందర్భమున చెప్పబడినది కాశియందు ప్రతిదినము తీర్థ యాత్ర చేయుచున్నను ఒక సంవత్సర కాల పరిమితికైనను కాశియందలి సర్వ తీర్థములను లింగములను సేవించుట సాధ్యము గాదు ఏమనగా కాశియందు తిలమాత్ర ప్రమాణము గల ప్రతి స్థలమందును లింగములు తీర్థములు గలవు.

శ్లో॥ అన్యాని దేవి లింగాని శతశో౽థ సహస్రశః
న మయా తాని శక్తాని బహుత్వా న్నాధిగమ్యతా॥
(లైంగేపి తృతీయాధ్యాయాత్షోడశాంతం లింగాని ఉక్త్వా ఉక్తం)

భా॥ ముఖ్యమైన పదునారు లింగములను గూర్చి చెప్పి, లింగ పురాణమందు తృతీయాధ్యాయములో ఇంకను ఇట్లు చెప్పబడినది ఓ దేవీ! ఇంకను అన్య లింగములు వందల కొలది వేలకొలదిగను గలవు బహుత్వము వలన వానిని తుద ముట్ట నేను చెప్పలేను.

శ్లో॥ ఉద్దేశ మాత్రం కథితం మయా తుభ్యం వరాననే!
న శక్యో విస్తరో వక్తుం వర్షకోటి శతైరపి॥

భా॥ ఉద్దేశ మాత్రముగ వానిని గురించి నీకు చెప్పితిని శతకోటి సంవత్సరముల కాలపర్యంతమును వానిని గురించి చెప్పుటకు సాధ్యము గాదు

శ్లో॥ ఏతాని సిద్ధ లింగాని కూపాః పుణ్యా హ్రదాస్తథా
వాప్యోనద్యో౽థ కుండాని మయాతే సంకీర్తితాః॥
లింగాని స్పర్శయిత్వా న సంసారే న విశేత్పునః॥

భా॥ నీకు తెలియుటకై సిద్ధ లింగములు కూపములు పుణ్య సరస్సులు నదులు బావులు కుండములు మొదలగునవి యన్నియును కీర్తింపబడినవి ఈ పుణ్య తీర్థములలో దేనియందైనను స్నానము చేసి శ్రద్ధా యుక్తులై లింగములను దర్శించి స్పృశించినవారు పునః సంసారమందు ప్రవేశించరు

శ్లో॥ పృథివ్యాం యాని తీర్థాని అంతరిక్ష వరాణిచ
తేషాం మధ్యేతు యాన్యేషా మయా తే కథితా శుభః
తీర్థయాత్రా వరారోహ కథితా పాపనాశినీ

*యేన నైషా కృతా దేవి! స ఉవశ్యం ముక్తి భాగ్భవేత్॥*

*(ఇతి నానాతీర్థాని లింగాని చ సంక్షేపేణ)*

భా॥ ఈ భూమియందును అంతరిక్షమందును యున్నట్టి తీర్థములలో ఏవిశ్రేష్ఠములో వానినన్నిటిని గూర్చి నీకు చెప్పితిని తీర్థయాత్ర పాపనాశకమని చెప్పబడినది శ్రద్ధగా తీర్థయాత్ర చేయువారు నిశ్చయముగ ముక్తి భాగులగుదురు (ఇది సంక్షేపముగ నానా తీర్థములు లింగములను గురించిన వృత్తాంతము)

**40) అథవిశ్వేశ్వర ప్రాదుర్భావ కథనం - తాద్యే -**

వచనము తత్ర కల్పాదౌ నారాయణ నాభి సరోజాదుత్పన్నో బ్రహ్మా యదా చతుర్దిక్షు విలోకయన్నాన్య మపశ్యత్తదా ఉహంకార యుక్తో ఉహమేవ సర్వజగత్కారణీభూత ఇత్యాది మేనే।

భా॥ కల్పాదియందు నారాయణుని నాభికమల మందుత్పన్నుడైన బ్రహ్మనాల్గు దిక్కుల యందు పరికించి చూచి మరెవ్వరిని గానక అహంకార యుక్తుడై ఈ సర్వ జగత్తునకు కారణ భూతుడను నేనే యని తలచెను

శ్లో॥ *ఏవ మజ్ఞాన సంభిన్నం విజ్ఞాయ భగవాన్హరిః॥*
*స్వరూపం దర్శయామాస కోఽసీతి ద్రుహిణం బ్రువన్॥*

భా॥ అజ్ఞానము వలన ఇట్లు తలచుచున్న బ్రహ్మకు విష్ణువు ప్రత్యక్షమై నీవెవరవని బ్రహ్మను అడిగెను

బ్రహ్మోవాచ - శ్లో॥ *అహం భూతేశ్వరః సాక్షాత్భవతః కారణం పరమ్।*
*సర్వమేతన్మయా సృష్టం కిం మాం వేత్సి న తత్త్వతః॥*

భా॥ నేను భూతేశ్వరుడను సాక్షాత్తు నీకును కారణ భూతుడను ఇది యంతయు నాచే సృష్టించబడినది నన్ను తెలిసికొనజాలవా? యని బ్రహ్మ చెప్పెను

నారాయణ ఉవాచ - శ్లో॥ *అహో అవిద్యా మాహాత్మ్యమయం మన్నాభి పద్మజః॥*
*ఈశ్వరం మాం న జానాతి విరించి ర్మూఢమందధీః॥*

శ్లో॥ *పద్మయోనే! విశ్వ హేతుం స్వీయ మన్నాభిపంకజమ్।*
*దృష్ట్వా పశ్యాన్ని జగురుం మామేవ శరణం వ్రజ॥*

(ఏవం అహం పూర్వమహంపూర్వమితి వాగ్యుద్ధం కృత్వా శస్త్రాస్త్రైః శతవర్షపర్యన్తం యుధ్యతో ద్వయో న కశ్చిత్ పరాజీయత)

భా॥ నారాయణుడిట్లు చెప్పెను అహో! అవిద్య యొక్క మహత్తు ఎంత

దొడ్డది నా యొక్క నాభిపంకజము నుండి జన్మించి తనకు ఈశ్వరుడైన నన్ను తెలిసికొనలేక ఈ బ్రహ్మ మూఢుడైనాడు అని ఓ బ్రహ్మ చూడుము నీ యొక్క పుట్టుకకు కారణమైనది నాయొక్క నాభికమలము నీకు జనకుడనగు నన్ను శరణు పొందుము (ఇట్లు నేనే నీకంటె ముందటివాడను నీకు కారణ భూతుడను అనుచు వారిరువురు పరస్పరము కలహించి దానితో శాంతింపక శస్త్రాస్త్రములతో నూరు సంవత్సరముల పర్యంతము యుద్ధము చేసినను జయాపజయములను నిర్ణయించుకొన జాలకపోయిరి)

శ్లో॥ *అపశ్యతా మథాభ్యాశే లింగం తేజోమయం పరమ్।*
*శరచ్చంద్రాయుత సమం ప్రభా భాస్వర మైశ్వరమ్॥*

భా॥ అంతట వారి సమీపమందు మిక్కిలి తేజోమయమై పది వేలమంది రాకాసుధాకరుల కాంతితో సమానమైన తేజస్సుతో ప్రకాశించుచున్న ఈశ్వర లింగమును గాంచిరి

శ్లో॥ *వీక్ష్య తద్వ్యాపకం జ్యోతిః నిష్ప్రభౌ విస్మితౌ చ తౌ*
*కర్తవ్యం నాన్వవిద్యేతా మీషదాగత సాధ్వసౌ॥*

భా॥ సర్వత్ర వ్యాపించుచున్న తేజస్సు కల్గిన యాలింగమును చూచి నిష్ప్రభులై (కాంతి హీనులై) బ్రహ్మ, విష్ణువులు ఆశ్చర్యపడిరి కొంచెము తడబడినవారై కర్తవ్యమును గుర్తింపజాలకపోయిరి

శ్లో॥ *సౌమ్యమేతన్మహాజ్యోతిః సౌమ్యమగ్రేస్థితం పునః*
*తర్కయంతౌ విధిహరీ దదృశాతే తదంతరా॥*
*పురుషం పింగం జటిలం దిగ్వాస సమలంకృతమ్।*
*భుజగైః నృకపాలైశ్చ కుందేందు విమలద్యుతిమ్॥*
*తం దృష్ట్వైన తయో రాసీదయమేవ పరః పుమాన్।*
*ఇతి బుద్ధిః తతస్తాభ్యాం సంస్తుతో వైదికైః స్తవైః॥*

భా॥ అప్పుడు సౌమ్యరూపమున వారి ఎదుట ఆవిర్భవించిన ఆ మహాజ్యోతి ర్లింగమును జూచి బ్రహ్మ, విష్ణు లిరువురు ఇది ఏమియగునాయని తర్కించుకొనుచున్నవారై ఆ లింగ మధ్యమందు ఒక పురుషుని గాంచిరి అతడు పింగళవర్ణము గలవాడై జటాజూటముగల్గి దిగంబరుడై అలంకార యుక్తుడై సర్ప భూషణుడై నరకపాలములతో గూడి మల్లిమొగ్గలు చంద్రుని వంటి స్వచ్ఛమైన కాంతితో సాక్షాత్కరించెను అతనిని చూచినంతనే ఆ ఇరువురి మనస్సునందు ఇతడే మనకంటె పరమాత్మయను బుద్ధి కలిగెను అప్పుడు వారిరువురు అతనిని వైదికస్తోత్రములతో స్తుతించిరి

సదాశివ ఉవాచ – శ్లో॥ భవద్భ్యా మిదముద్భాని యల్లింగం దృష్ట మద్భుతమ్।
స్తుతం చ తేన ప్రీతో ఽహం వృణీతాం వరమాదిజౌ॥

భా॥ మీ మధ్య ఆవిర్భవించిన అద్భుతమైన నా యీ లింగ స్వరూపమును మీరు దర్శించితిరి మీరు చేసిన స్తోత్రముచే నేను సంతుష్టుడ నైతిని ఆదిజాలు (మొదట జన్మించిన) అయిన మీరిద్దరు మీకు ఇష్టమైన వరములు కోరుకొనుడని సదాశివుడు పలికెను

తా ఊచతుః శ్లో॥ సదాశివ! ప్రసన్నశ్చేత్ త్వయి నౌ నిశ్చలామతిః।
సదా భవతు భూతేశ వరమన్యం వృణీమహే॥

భా॥ వారిట్లు పలికిరి ఓ సదాశివా! నీవు ప్రసన్నుడవైనచో నీ యందు మాకు సదా నిశ్చల భక్తి యుండునట్లు అనుగ్రహింపుము మరియొక వరమును గూడ కోరుకొనుచున్నాము

శ్లో॥ ఏకం సరా కురు విభో! సంశయం నౌ హృదిస్థితమ్।
యద్భవాం స్తైజసం లింగమధితిష్ఠతి నిత్యశః॥
తస్యం సమాఖ్యం కిం రూపం కిం ప్రభావం కిమాశ్రయమ్।
ఏతత్సర్వం మహేశాన వక్తుమర్హ స్యశేషతః॥

భా॥ మా హృదయమందొక గొప్ప సంశయము ఏర్పడియున్నది దానిని తొలగింపుము నీవు అధిష్ఠించియున్న ఈ తేజో లింగమునకు పేరేమి? దానియొక్క నిజస్వరూప మెట్టిది? దాని ప్రభావమేమి? అది దేనిని ఆశ్రయించుకొని యుండును? మా యీ సంశయములను నివృత్తి చేయుటకు నీవే తగినవాడవు

శివ ఉవాచ – శ్లో॥ యదే తత్పరమం లింగం పశ్యతం పురతః స్ఫురత్।
తద్విశ్వేశ్వర సంజ్ఞం హి సచ్చిదానంద విగ్రహమ్॥
లయం లింగశరీరస్య విశ్లేషం గమయేత్పరమ్।
తేన లింగమితి ఖ్యాత మపవర్గైక సాధనమ్॥

భా॥ మీ ఎదుట ప్రకాశించుచున్న ఈ సచ్చిదానందరూపమైన లింగము విశ్వేశ్వర సంజ్ఞ కలది ఇది లింగశరీరమును విశ్లేషించి పరమగతిని గల్గించును గనుక లింగమను పేరు గలిగి అపవర్గైక సాధనమగుచున్నది

శ్లో॥ వ్యాపకత్వేఽపి చైతన్య నిర్వికారస్య తత్త్వతః।
పరిచ్ఛిన్నతయాఽవస్థా సాధారణ్యావసత్తయే॥
యథా వ్యోమ పరిచ్ఛిన్నం ఖ్యహేతుతయా సమమ్।

స్వయమేవ పరిచ్ఛేదం ప్రాప్నోతీద మపీదృశమ్॥

భా॥ ఇది నిజముగ నిర్వికారమైనది యైనను వ్యాపకత్వము గల్గినది పరిచ్ఛిన్నమగుటచే అవస్థాసాధారణమును (మామూలు స్థితిని) పోగొట్టునది, ఆకాశమందు వ్యాపించుటచే శబ్దకారణమైనది స్వయముగ (తనంతట తానుగ) ఈ విధముగ పరిచ్ఛేదమును పొందుచున్నది

శ్లో॥ ప్రభావః శ్రూయతామస్య నిత్యానంద స్వరూపిణః ।
అత్ర త్యక్తాసవః సన్తః సచ్చిదానందరూపతామ్ ।
యథాయోగ్యం లభన్తే హి నాత్ర కార్యావిచారణా ॥

భా॥ నిత్యానంద స్వరూపమగు ఈ లింగము యొక్క ప్రభావమును వినుడు ఇచట ప్రాణత్యాగము చేసినవారు యథాయోగ్యముగ సచ్చిదానందరూపత్వమును పొందుదురు అందు సంశయింప పనిలేదు (సనత్కుమార సంహితా చతుర్థాధ్యాయే ఽప్యేవం ప్రాదుర్భావః కథితః । విశేశ్వరలింగేఽస్పృశ్యస్పర్శ నిబంధనో దోషో నాస్తి । ప్రత్యహం తే నైవ పూజ్యాతన్నిరాకరణాత్ । తదుక్తం కాశీఖండేఽత్రైవ) సనత్కుమార సంహిత చతుర్థాధ్యాయమందుగూడ ఈ లింగ ప్రాదుర్భావము ఇట్లే చెప్పబడినది విశ్వేశ్వరలింగమునకు స్పృశ్యాస్పృశ్యదోషములేదు ప్రత్యహమువిశ్వేశ్వరుని చేతనే పూజింపబడుటచే ఆ దోషనిరాకరణముచే స్పర్శదోషములేదు అట్టటనే ఆ విషయము చెప్పబడినది

శ్లో॥ బ్రాహ్మేముహూర్తే మణికర్ణికాయాం స్నాత్వా సమారాధయతి స్వయమేవ
అస్పృశ్య సంస్పర్శ విశోధనాయ కలౌ నరాణాం కృపయా హితాయ ॥
(ఇతి విశ్వేశ్వరలింగ ప్రాదుర్భావ కథనం)

భా॥ విశ్వేశ్వర లింగమునకు స్పృశ్యాస్పృశ్యదోషము లేదు బ్రాహ్మీముహూర్తమున మణికర్ణికయందు స్నానము చేసి నిన్ను పూజించి స్పృశించినచో కలియుగమందు సమస్త మానవులకు పాపములు పోయి వారికి హితము గల్గును (ఇది విశ్వేశ్వరలింగ ప్రాదుర్భావకథనము)

అథ అస్యైవ సంక్షేపతో మహిమా -

స్కాందే శ్లో॥ అస్మిన్మహానందవనే యదేతత్ లింగం సుధాధామ సుధామధామ ।
అనన్త పాతాళ తలాత్ స్వయంభు సముత్థితం భక్తకృపావశేన ॥ ఇత్యాది॥
(సుధాధామః అమృతాస్పదం సుధామధామః సుధామ్నాం సుతేజసాం పదం)

భా॥ ఈ ఆనందవనమగు కాశీయందు అమృతాస్పదమగు తేజోమూర్తిగా ఈ లింగము భక్తులయందలి యనుగ్రహ విశేషమున నారూపముగవస్త

పాతాళలోకములనుండి స్వయంభువుగా ఉద్భవించి ...

పాద్మే - శ్లో॥ మణికర్ణికాఖ్యాం తీర్థం స్నాత్వా విశ్వే ... ।
సకృత్ దృష్ట్వా న చైతేషాం గర్భవాస ... భవ ॥

భా॥ దేవతా స్వరూపిణియగు మణికర్ణిక యందు స్నానము చేసి దర్శనము చేసినవారికి తిరిగి గర్భవాస దుఃఖము గలుగదు

తథా శ్లో॥ తస్యలింగం తత్ర భాతి దివ్యం విశ్వేశ్వరాభిధమ్ ।
తస్యదర్శన మాత్రేణ తత్త్వ జ్ఞాన విధాయకమ్ ॥
పాపం క్షయ మవాప్నోతి సర్వధా నాత్ర సంశయః ।
రాగద్వేష వినిర్ముక్తాః కామక్రోధవివర్జితాః ।
విశ్వేశ్వరాభిధం లింగం పశ్యన్తి జ్ఞానచక్షుషా ॥

భా॥ ఆ పరమేశ్వరుని దివ్యలింగము విశేశ్వర నామముతో అక్కడ ప్రకాశించుచున్నది దానిని దర్శించినంతనే తత్త్వ జ్ఞానము గల్గును ఈ విశేశ్వరనామముగల లింగమును జ్ఞానచక్షువులైనవారే దర్శించి తత్త్వమును గ్రహింపగలరు దీని దర్శనము వలన నిస్సంశయముగ పాపక్షయమగును అట్టివారు రాగద్వేషములు కామక్రోధములు మొదలగువానినుండి విముక్తులగుదురు

బ్రహ్మవైవర్తే కలిం ప్రతి బ్రహ్మవచః శ్లో॥ యే భజన్తి మహాత్మానం శివం చాపి జనార్దనమ్ ।
న తేషాం త్వత్కృతో దోషః కాశ్యాం నివసతామపి ॥

భా॥ పరమాత్ముడగు శివుని గాని జనార్దనునిగాని భజించువారికిని కాశియందు నివసించు వారికిని నీ సంబంధమగు కలిదోషముంటదు

తథా - శ్లో॥ లింగం మహానందకరం విశ్వేశాఖ్యం సనాతనమ్ ।
నమస్కృత్య విముచ్యేత పురుషః ప్రాకృతైర్గుణైః ॥

భా॥ విశ్వేశ్వరనామముగల నాయొక్క సనాతన లింగమును నయనానందకరముగ దర్శించి నమస్కరించినవారికి ప్రాకృతగుణములనుండి విముక్తి గలుగును

తథా :- శ్లో॥ వారాణసీం ప్రాప్య సుదుర్లభాం సురైరపీష్ట దేవం జగతో ఽపి తారమ్
నిత్యం న పశ్యన్తి సుదుర్ధియో నరా వ్యగ్రాః కలిగ్రస్త ధియో భవన్తి ॥

భా॥ సుదుర్లభమైన కాశిని చేరి నప్పటికిని దేవతలకును ఇష్టదేవుడై జగత్తును తరింప చేయునట్టి ఈ విశేశ్వరలింగమును దుర్మతులెవ్వరు దర్శింపరో అట్టివారు వ్యగ్రులై కలిచే నాక్రమింపబడిన బుద్ధిగలవారగుదురు

తథా :- శ్లో॥ స్వయమేవ భవో భాసైః పూజయేత్ శాశ్వతం శివమ్ ।

*అత ఏవ స్వభూః కాశ్యాం పూజనీయో భవః సదా ॥*

భా॥ స్వయముగనే శాశ్వతుడగు ఇక్కడి స్థానమునందు పూజించవలెను అందుచేతనే కాశీయందలి విశ్వేశ్వరరూపభవుడు సదా పూజనీయుడు

సనత్కుమార సంహితాయాం శ్లో॥ ఇదం తత్పరమం జ్యోతిర్లింగస్య దేవి స్వరూపాత్మకమ్. శివానందం పరంధామ దుష్ప్రాప మకృతాత్మభిః ॥

భా॥ ఓ దేవీ! ఇచ్చట పరమైన జ్యోతిర్లింగము నీ స్వరూపముతో గూడియున్నది. శివానందము పరంధామమునగు ఈ లింగము పాపాత్ములకు దుష్ప్రాపము

శ్లో॥ *యోగినస్తత్ర పశ్యన్తి క్షీణపాపా విమత్సరాః*

భా॥- యోగులగువారు క్షీణ పాపులై మత్సర రహితులై దీనియొక్క నిజ తత్త్వమును గ్రహింపగలరు

తథా – శ్లో॥ *ఇదం మాహేశ్వరం జ్యోతి రపాతాళాత్ సముత్థితమ్*
*అతీత్య సత్యలోకాదీననంతం దివ్యమైశ్వరమ్॥*

భా॥ పాతాళమునుండి ఉద్భవించినదియై సత్యలోకము మొదలగు వానినిగూడ దాటి యున్నట్టి దివ్యమైనదియే ఈ విశ్వేశ్వరలింగము.

తథా – శ్లో॥ *అన్యేఽపి యే ఽర్థకామా ఉపాసతే మామ్ తేఽప్యన్తే స్వభిష్టాని విధాయ కామ్యాత్ ॥*

*మద్భక్తి యోగేన నియోజయామి, నాధో వ్రజేన్మాం సకృదప్యుపాస్య॥*

భా॥ ధనము కొరకైనను నన్ను ఉపాసించినవారిని గూడ వారి యభీష్టములను ముకూర్చి, నాయందు భక్తిగల యోగులుగ వారిని వియోగింపెదను సకృత్తుగానైనను నన్నుపాసించినవాడు ఎన్నడును అధోగతిని పొందడు

తథా –శ్లో॥ *స్నాత్వా ముముక్షు ర్మణికర్ణికాయాం మృడాని గంగా హృదయే త్వదాస్యే*
*విశ్వేశ్వరం పశ్యతి యోఽపి కోఽపి శివత్వ మాయాతి పునర్భవజ్ఞః॥*

భా॥ ఓ మృడానీ! ముముక్షువై మణికర్ణికయందు స్నానముచేసి, గంగాహృదయ స్వరూపమగు నీనమ్ముఖమున విశ్వేశ్వరుని దర్శించినవాడు పునర్జన్మ రహితుడై శివత్వమును పొందును.

తథా – శ్లో॥ *సంప్రాప్య కాశీం శివరాజధానీం, భక్త్యాతదగ్రే మణికర్ణికాయామ్ ।*
*దృష్ట్వాఽథవిశ్వేశ్వరమేకదా ఽఽ ద్యే, స్పృష్ట్వా ప్రణామః పరమోహిధర్మః ॥*

భా॥ శివరాజధాని యగు కాశిని చేరి భక్తితో అగ్రభాగమందున్న మణికర్ణికయందు స్నానము చేసి విశ్వేశ్వరుని దర్శించి స్పృశించి ప్రణామము చేయుట అందరకును మధర్మము.

*లింగపురాణే – శ్లో॥ వారణాస్యాం మహాదేవి తత స్థానే స్థితో హ్యహమ్ ।*
*తం దృష్ట్వా మనుజో దేవి! సర్వపాపైః ప్రముచ్యతే ॥*

భా॥ ఓ మహాదేవీ! వారణాసి యందు ఆ స్థానమున నేను ప్రతిష్ఠితుడనై యున్నాను. అట్టి నన్ను దర్శించిన మనుజుడు భవపాప విముక్తుడగును.

*కాశీఖండే – శ్లో॥ యది జాతు విదంధక ధ్వంస తవ నామైవ ముఖాత్ వినిసృతమ్ ।*
*శివశంకర చంద్రశేఖరేత్యవశ్యత్వవ్య న సంసృతిః పునః ॥*

భా॥ ఓ అంధకాసుర సంహారీ! శివ శంకర! చంద్రశేఖర! యనుచు నోరార నిన్ను పరవశుడుగానైనను స్తుతించినవారికి తిరిగి సంసారమనునది యుండదు.

*శ్లో॥ మమేహ పరమం జ్యోతి రాపాతాళా ద్వ్యవస్థితమ్ ।*
*అతీత్యసత్యలోకాది సవంతం లింగరూప ధృత్ ॥*

భా॥ నాయొక్క పరమజ్యోతి పాతాళమునుండి అవిర్భవించి సత్యాదిలోకములను దాటి లింగరూపమున ఉపస్థితమై యున్నది.

*శ్లో॥ అస్మిన్ క్షేత్రేతు యేనాహం దృష్టః స్పృష్టః సమర్చితః ।*
*సంప్రాప్య తారకం జ్ఞానం న స భూయో ఽభి జాయతే ॥*
*యో మామిహ సమభ్యర్చ్య మ్రియతే ఽన్యత్ర కుత్ర చిత్ ।*
*జన్మాంతరే ఽపి మాం ప్రాప్య స విముక్తో భవిష్యతి ॥*

భా॥ ఈ క్షేత్రమునందున్న నన్ను దర్శించి పూజించినవారికి అంత్యకాలమున తారకమంత్రమునుపదేశించి జ్ఞానము గల్గింతును అట్టివారికి తిరిగి పుట్టుట యనునదియుండదు.

నన్ను ఇచ్చట బాగుగ పూజించి దైవవశమున అన్యత్ర మరణించినను జన్మాంతరమందు మరల నన్ను పొంది ముక్తులగుదురు

*తథా – కాశ్యాం యో రాజధాన్యాం మే హిత్వా మా మన్య మర్చయేత్ ।*
*స వరాకోఽల్పధీ ర్మూఢ ఽల్పాయుష్మ ర్ముక్తి వర్జితః ॥*

భా॥ నా రాజధానియగు ఈకాశీ యందు నన్ను వదలి ఇతరులనర్చించిన వాడు ముక్తిహీనుడగును

*తథా – శ్లో॥ కాశ్యాం లింగాన్యనేకాని కాశ్యాం తీర్థాన్యనేకశః ।*
*తథా ఽపి సేవ్యో విశ్వేశః స్నాతవ్యా మణికర్ణికా ॥*

భా॥ కాశీయందనేక లింగములు అనేక తీర్థములు ఉన్నవి అయినప్పటికిని విశ్వేశ్వరుడే సేవింపదగినవాడు. మణికర్ణిక యందే స్నానము చేయనగును

*శ్లో॥ సర్వలింగార్చనాత్పుణ్యం యావజ్జన్మ యదర్జ్యతే ।*
*సకృత్ విశ్వేశ మభ్యర్చ్య శ్రద్ధయా తదవాప్యతే ॥*

భా॥ యావజ్జీవము సర్వలింగములను పూజించినచో ఎట్టి ఫలము గల్గునో అట్టి ఫలము విశేశ్వరుని సకృత్తుగనైనను అర్చించుటచే గల్గును

శ్లో॥ యజ్జన్మనాం సహస్రేణ నిర్మలం పుణ్యమర్జితం।
తత్పుణ్య సంవర్తేన భవేత్ విశ్వేశ దర్శనమ్॥
గవాంకోటి ప్రదానేన సమ్యక్ దత్తేన యత్ఫలమ్।
తత్ఫలం సమ్యగాప్నోతి విశ్వేశ్వరవిలోకనాత్॥

భా॥ వేలకొలది జన్మలలో చేసినట్టి అర్చనచే ఎట్టి నిర్మలపుణ్యము గల్గినదో ఆ పుణ్యపరిపాకముచేతనే విశ్వేశ్వరదర్శనము లభించును కోటి గోవులను విధివిధానముగ దానము చేయుటచే ఎట్టి ఫలముగల్గునో విశేశ్వర దర్శనముచే అట్టి ఫలము గల్గును

తథా శ్లో॥ అయం విశేశ్వరః సాక్షాత్ స్థావరాత్మా జగత్ప్రభుః॥
సర్వేషాం సర్వసిద్ధీనాం కర్తా భక్త జనానామపి॥

భా॥ ఈ విశేశ్వరుడు సాక్షాత్తు స్థావర రూపములో నున్న జగత్ప్రభువు అందరకును ముఖ్యముగ భక్తులకు సర్వసిద్ధులనొసంగునట్టి కర్త

తథా- శ్లో॥ అనుగ్రహాయ సర్వేషాం భక్తానా మిహ సర్వదా।
స్థాస్యామి లింగరూపేణ చింతితార్థ ఫలప్రదః॥
అహం సర్వేషు లింగేషు తిష్ఠామ్యేవ న సంశయః।
పరంత్వియం పరామూర్తిః మమ లింగస్వరూపిణీ॥

భా॥ సర్వ భక్తులను అనుగ్రహించుట కొరకై ఇచ్చటనే సర్వదా వాంఛితార్థఫలప్రదాయకుడనై లింగరూపముతో నుందును కాని లింగస్వరూపములోనున్న ఈ విశ్వేశ్వరలింగము నాయొక్కపరామూర్తియె

తథా – శ్లో॥ సర్వతీర్థేషు సస్నాన సర్వయాత్రాం వ్యధాత్ స చ।
మణికర్ణ్యాంతు యః స్నాతో యో విశ్వేశం విలోకత॥
సత్యం సత్యం పునః సత్యం సత్యం సత్యం పునఃపునః।
దృశ్యో విశ్వేశ్వరం నిత్యం స్నాతవ్యామణికర్ణికా॥

భా॥ సర్వతీర్థములందు స్నానము చేసినను సర్వయాత్రలు చేసినను మణికర్ణికలో స్నానముచేసి, విశ్వేశ్వరుని దర్శించినవారే ధన్యుడు ఇది నిజము ముమ్మాటికిని నిజము మాటిమాటికి నిజము మణికర్ణికయందు స్నానము చేయవలెను విశ్వేశ్వరుని దర్శింపవలెను యనుట అక్షరసత్యము

తథా   శ్లో॥   యేన లింగమిదం దృష్టం శ్రద్ధయా ... చక్షుషా ।
సాక్షాత్కారేణ తేనాహం దృష్ట ఏవ ... సంశయః ॥

భా॥ ఈ లింగమును శ్రద్ధాశుద్ధనేత్రములతో దర్శించినవానికి నేను సాక్షాత్కరించి కనిపింతుననుటలో సందేహములేదు

శ్లో॥ శ్రవణాదస్య లింగస్య పాతకం జన్మసంచితమ్ ।
క్షణాత్ క్షయతి శృణ్వన్తు దేవా ఋషి గణైః సహ ॥

భా॥ ఈలింగమును గురించి వినిన క్షణమునందే జన్మసంచితమైన పాపము నాశము నొందును దేవర్షిగణములందరు ఈ విషయమును శ్రద్ధగా వినవలెను

శ్లో॥ స్మరణాదస్య లింగస్య పాపం జన్మద్వయార్జితమ్ ।
అవశ్యం నశ్యతి క్షిప్రం మమ వాక్యాన్నసంశయః ॥

భా॥ ఈ లింగమును స్మరించినంతనే జన్మద్వయమందు ఆర్జింపబడిన పాపము నావాక్యము వలన వెంటనే నశించును

శ్లో॥ ఏతల్లింగం సముద్దిశ్య గృహాన్నిర్గమణ క్షణాత్ ॥
విలీయతే మహాపాపమపి జన్మత్రయార్జితమ్ ॥

భా॥ ఈ లింగమునుద్దేశించిదర్శింపగోరి ఇంటినుండి బయలుదేరిన క్షణముననే జన్మత్రయార్జితమైన పాపము నశించును

శ్లో॥ దర్శనా దస్యలింగస్య హయమేధ శతోద్భవమ్ ।
పుణ్యం లభేత నియతం మమానుగ్రహతో ... సురాః ॥

భా॥ ఓ దేవతలారా! నాయొక్కఈ లింగమును దర్శించినవారికి నియతముగ నూరు అశ్వమేధయాగముల సౌనర్చినంతటి ఫలము నాయనుగ్రహముచే లభించును

శ్లో॥ స్వయంభువో ... స్య లింగస్య మమ విశ్వేశితుః సురాః ।
రాజసూయ సహస్రస్య ఫలం స్యాత్ స్పర్శమాత్రతః ॥

భా॥ ఓ దేవతలారా! నాయొక్కఈ విశ్వేశ్వరలింగము స్వయంభూలింగము దీనిని స్పృశించినచో సహస్రరాజసూయయాగములు చేసిన ఫలము లభించును

శ్లో॥ పుష్పమాత్ర ప్రదానాచ్చ చులుకోదక పూర్వకమ్ ।
శతసౌవర్ణికం పుణ్యం లభతే భక్తియోగతః ॥

భా॥ పుడిసెడు ఉదకముతో అభిషేకము చేసి ఒక పుష్పమును సమర్పించినచో నూరుబంగారుపూలతో అర్చించిన ఫలము లభించును

శ్లో॥ పూజామాత్రం విధాయాస్య లింగరాజస్య భక్తితః
సహస్ర హేమకమల పూజాఫల మవాప్యతే॥

భా॥ ఈ లింగమును ... ... ... ...
సహస్రహేమకమలములతో పూజించిన ఫలము ...చును

శ్లో॥ విహాయ మహతీం పూజాం పంచామృతస్నా... ...।
అస్య లింగస్య లభతే పురుషార్థ చతుష్టయమ్ ॥

భా॥ పంచామృతములతో అభిషేకించి ఈలింగమును బాగుగా అర్చించినచో పురుషార్థ చతుష్టయము సిద్ధించును

శ్లో॥ వస్త్రపూత జలైర్లింగమ్ స్నాపయిత్వా సురామరాః
లక్షాశ్వమేధజం పుణ్యం నిత్యం ప్రాప్నోతి సత్తమః ॥

భా॥ ఓ దేవతలారా! వస్త్రముతో వడగట్టిన జలముతో ఈ లింగమును అభిషేకించినచో అట్టి సత్తముడు నిత్యము లక్ష అశ్వమేధయాగములు చేసిన ఫలమును పొందును

శ్లో॥ సుగంధ చందన రసైః లింగమాలిప్య భక్తితః।
ఆలిప్యతే సురస్త్రీభిః సుగంధైః యక్షకర్దమైః ॥

భా॥ సుగంధము చందనరసముమొదలగు వానితో భక్తిపూర్వకముగా విలేపనము చేసి పూజించినచో అట్టివాడు దేవతాస్త్రీలచే సుగంధము అత్తరు మొదలగు వానితో అలది సేవించినంతటి సుఖముపొందును

శ్లో॥ సామోద ధూప దానైశ్చ దివ్యగంధాశ్రయో భవేత్।
ఘృతదీప ప్రబోధైశ్చ జ్యోతీరూప విమానగః ॥

భా॥ సుగంధముగల ధూపదానములతో పూజించినచో దివ్యగంధముగల శరీరముగలవాడగును నేతితో దీపము పెట్టి సేవించినవారికి జ్యోతీరూపముతో విమాన గమనము గల్గును

శ్లో॥ కర్పూరవర్తి దీపేన సకృద్దత్తేన భక్తితః।
కర్పూరగౌర దేహశ్రీః భవేత్ ఫాలవిలోచనః ॥

భా॥ సకృత్తుగానైనను కర్పూరపు కణికలతో దీపదానము చేసిన వానికి కర్పూరమువంటి స్వచ్ఛమైన తెల్లని శరీరశోభ లభించి ఫాలవిలోచనుడగును

శ్లో॥ దత్వా నైవేద్యమాత్రంతు సిక్థే సిక్థే యుగంయుగమ్।
కైలాసాద్రౌ వసేద్ధీమాన్ మహాభోగ సమన్వితః ॥

భా॥ ఒక్కొక్కపాత్రయందు ఒక్కొక్కసారి నైవేద్యము పెట్టినచో అట్టివాడు ఒక యుగ పర్యంతము లేక నైవేద్యము యొక్క ఒక్కొక్కముద్దకు ఒక్కొక్క యుగమువంతున మహాభోగములతో గూడి కైలాసాదియందు నివసించును

శ్లో॥ విశ్వేశే పరమాన్నం యో దద్యాత్ సాజ్యం సశర్కరమ్ ।
త్రైలోక్యం తర్పితం తేన తదేవ పితృ మానవమ్ ॥

భా॥ విశ్వేశ్వరునకు ఘృతశర్కరలతో పరమాన్నమును నైవేద్యము చేసినచో దానిచే త్రిలోకములందలి దేవ పితృమానవులందరు తృప్తులగుదురు

శ్లో॥ ముఖవాసం తు యో దద్యాత్ దర్పణం చారుచామరమ్ ।
ఉల్లోచం సుఖపర్యంకం తస్య పుణ్య ఫలం మహత్ ॥
(ముఖవాసః = తాంబూలాది॥ ఉల్లోచో=వితానం )

భా॥ తాంబూలము దర్పణము అందమైన చామరము వితానము(అరుగు) సుఖకరమైన పర్యంకము విశ్వేశ్వరున కర్పించినచో అట్టి వానికి గొప్ప పుణ్యఫలము లభించును

శ్లో॥ పూజోపకరణం ద్రవ్యం యో ఘంటా గర్గ రాదికమ్ ।
భక్త్యా మే భవనే దద్యాత్ స వసే ద్మత్రమే ఽ స్థితే ॥

భా॥ పూజోపకరణములగు ద్రవ్యములు ఘంట తాళము మొదలగు వానిని భక్తితో ఎవరు నాకు సమర్పించునో అట్టివాడు నాయొక్క నివాసమున నా సమీపమందే నివసించును

శ్లో॥ యో గీతవాద్య నృత్యానామేకం మత్ప్రీతయే న్యధాత్ ।
తస్యాగ్రతో దివారాత్రం భవేత్ తౌర్యత్రికం మహత్ ॥

భా॥ ఎవరు గీత వాద్య నృత్యాదులతో ఒక్కసారియైనను నన్ను సంతోషపెట్టుదురో అట్టివారి యెదుట దివారాత్రములు మంగళవాద్యములు మ్రోగుచుండును

శ్లో॥ చిత్రలేఖన కర్మాది ప్రాసాదే మే ప్రకారయేత్ ।
యః సచిత్రాన్ మహాభోగాన్ భుంక్తే మత్పురతః స్థితః ॥

భా॥ నా ఆలయమందు చిత్రలేఖనాదులనమర్చి అలంకరించినవారు నాయెదుటయుండి చిత్ర విచిత్రములైన భోగములననుభవించును

శ్లో॥ యస్తు విశ్వేశ్వరం దృష్ట్వా హ్యన్యత్రాపి విపద్యతే ।
తస్య జన్మాంతరే మోక్షో భవత్యేవ నసంశయః ॥

భా॥ ఎవరు విశ్వేశ్వరుని దర్శించి విధి వశమున అన్యత్ర మరణించినను అట్టివానికి జన్మాంతరమందు మోక్షముగల్గుననుటలో సందేహములేదు

శ్లో॥ విశ్వేశాఖ్యాతు జిహ్వాగ్రే విశ్వనాథ కథాశ్రుతౌ ।
విశ్వేశశీలనం చిత్తే యస్య తస్య జనిః కుతః॥

భా॥ జిహ్వాగ్రమందు విశ్వనాథుని స్తుతించుచు విశ్వనాథుని కథలను వినుచు చిత్తమందు విశ్వేశ్వరుని ధ్యానించుచుండు వానికి మరల జన్మ ఎక్కడిది?

తథా శ్లో॥ యైర్న విశ్వేశ్వరో దృష్టో యైర్న విశ్వేశ్వరః స్మృతః ।
కృతాంత దూతాస్తైఃదృష్టాః తైః వృతా గర్భవేదనా॥

భా॥ ఎవరు విశేశ్వర దర్శనముచేయరో మరియు విశ్వేశ్వర స్మరణ చేయరో అట్టివారు యముని దూతలను చూచినవారై తదనంతరము మాతృగర్భవేదనను పొందుదురు

శ్లో॥ యైరిదం ప్రణతం లింగం ప్రణతాస్తే సురాసురైః ।

భా॥ ఎవరు ఈశ్వర లింగమునకు ప్రణతులర్పింతురో అట్టివారు సురాసురులకు నమస్కారయోగ్యులగుదురు

శ్లో॥ యద్యదభీష్టతమం స్వస్య సదైవ తత్తత్ లింగేఽత్ర దేయం మమ భక్తిభాగ్భిః
ఇహాప్యముత్రాపి న తస్య సంక్షయో యథేహ పాపస్య కృతస్య పాపిభిః ॥

శ్లో॥ దూరేస్థితైః రప్యధి బుద్ధి భిర్ద్విజైః లింగం సమారాధ్య మమేదమత్ర
మయైవ దత్తైఃశుభవస్తుజాలైః విశ్రేయసశ్రీః వరయేత్ సతస్తాన్ ॥

(ఇత్యాది విస్తరః కాశీఖండ శతతమే ఽధ్యాయే జ్ఞేయః)

భా॥ నాభక్తులైనవారిచే ఎయ్యది తమకు ఇష్టమైనది హితమైనదియని భావించబడునో అట్టివానిని నాకు సమర్పించవలెను అట్టివారికి వారు ఇచ్చట చేసిన పాపమునకు క్షయము గలిగినట్లే పరమందుగూడ వారి పుణ్యమునకు క్షయముండదు దూరమందుండియైనను భావనయందు నాయొక్క ఈలింగమును ఆరాధించినవారు నాచే ఇవ్వబడిన శుభవస్తు సమూహములను పొంది అంతమున ముక్తిని పొందుదురు

(ఇట్లు కాశీఖండమున నూరవ అధ్యాయమున విస్తరించి చెప్పబడినది )

మాత్స్యే - శ్లో॥ సర్వదానాని యో దద్యాత్ సర్వ యజ్ఞేషు దీక్షితః ।
సర్వతీర్థాభిషిక్తః స యః ప్రపద్యేత మామిహ ॥

భా॥ సర్వ దానములను శ్రద్ధగ జేసినవాడు సర్వయాగములను దీక్షగ నిర్వహించినవాడు సర్వతీర్థములందు స్నానము చేసినట్టి పుణ్యాత్ముడు నన్ను ఇచ్చట పొందగల్గును

భారతే దానధర్మేషు

శ్లో॥ శక్రేణతు పురా దేవ వారాణస్యాం జనార్దన ।
ఆరాధితో౽భూత్ భక్తేన దిగ్వాసా భస్మగుంఠితః॥
ఆరాధ్య స మహాదేవ దేవదేవత్వ మాప్తవాన్ ॥

భా॥ ఓ జనార్దనా! పూర్వము వారణాసియందు ఇంద్రుడు భక్తితో దిగంబరుడై శరీరమంతట భస్మము నలదుకొని నన్ను గూర్చి తీవ్ర తపస్సు చేసి దేవతలపై యాధిపత్యమును పొందినాడు

వారదియు శ్లో॥ కాశీ విశ్వేశ్వరం లింగం జ్యోతిర్లింగం తదుచ్యతే ।
తద్దృష్ట్వా పరమంజ్యోతి రాప్నోతి మనుజోత్తమః ॥

భా॥ కాశీవిశ్వేశ్వరలింగము జ్యోతిర్లింగమని చెప్పబడుచున్నది దానిని దర్శించినవాడు పరమ జ్యోతిని పొందుచున్నాడు

తథా – శ్లో॥ కాశ్యాం మహేశ్వరం లింగం పూజితం నమితం స్మృతమ్ ।
నతస్య విద్యతే కృత్యం సంసృతి ర్నైవ జాయతే ॥

భా॥ కాశీయందు విశ్వేశ్వరలింగమును దర్శించి పూజించి స్మరించి నమస్కరించినవానికి మరి ఇంక చేయవలసిన కృత్యమేదియు ఉండదు

శివపురాణే – శ్లో॥ కాశ్యాం శ్రీదేవదేవస్య విశ్వనాథస్య పూజనమ్ ।
సర్వపాపహరం పుంసా మనన్తాభ్యుదయావహమ్ ॥
సంసారదావ నిర్దగ్ధ జీవభూరుహ జీవనమ్ ।
దుఃఖార్ణవౌఘ పతిత ప్రాణి నిర్వాణకారణమ్ ॥ఇత్యాది॥

భా॥ కాశీయందు దేవదేవుడగు విశ్వనాథుని పూజించుట మానవులకు సర్వపాపహరము అనంతాభ్యుదయములను గల్గించునట్టిది సంసారమనెడు దావాగ్నిచే దహించబడిన జీవనవృక్షమునకు మరల జీవితమును గలిగించునట్టిది దుఃఖము మరియు పాప సముద్రమందు మునిగి యున్నవారిని గట్టెక్కించి మోక్షమును గల్గించునట్టిది.

అథ విశ్వనాథ ప్రాసాదమహిమా – కాశీఖండే –

శ్లో॥ త్రైలోక్య నగరేచాత్ర కాశీరాజగృహం మమ ।
తత్రాపి భోగభవన మనర్ఘ్య మణినిర్మితమ్ ॥

భా॥ ముల్లోకములందునుకాశీనగరము వాశిష్టము అందు రాజగృహము అనర్ఘ్య మణినిర్మితమైన మా భోగభవనము మిక్కిలి ప్రీతికరమైనది.

శ్లో॥ మోక్షలక్ష్మీ విలాసాఖ్యః ప్రాసాదే మే౽తి శర్మభూః ।
పతత్రిణో౽పి ముచ్యన్తే యం కుర్వాణాః ప్రదక్షిణమ్ ॥

భా॥ మోక్షలక్ష్మీ విలాసమను పేరుగలదియై శుభపరంపరలనిచ్చు నట్టిది నా

ఆలయము పక్షులు గూడ దానికి ప్రదక్షిణము చేసినచో ముక్తి పొందుచుండును

శ్లో॥ స్వేచ్ఛయా విచరన్తః ఖే ఖేచరా అపిదేవతాః ।
మోక్షలక్ష్మీ విలాసాఖ్య ప్రాసాదస్య విలోకనాత్ ॥
శరీరాత్ దూరతో యాతి బ్రహ్మహత్యా ऽపి నాన్యథా॥

భా॥ స్వేచ్ఛగా ఆకాశమందు విహరించు దేవతలు గూడ మోక్షలక్ష్మీ విలాసమను పేరుగల నా ఆలయమును దాటి ఉల్లంఘన భీతిచే దూరముగ తొలగిపోవుదురు దానిని దర్శించినవారికి బ్రహ్మహత్యగూడ వెంటనే తొలగిపోవును

శ్లో॥ మోక్షలక్ష్మీ విలాసస్య కలశో యైః నిరీక్షితః ।
నిధాన కలశాస్తం తు న ముఞ్చన్తి పదేపదే ॥

భా॥ ఆ మోక్షలక్ష్మీ విలాసముయొక్క కలశమును చూచినవారికి నిధిభాండములు సదా లభించును

శ్లో॥ దూరతో ऽపి పతాకాऽపి మమ ప్రాసాద మూర్ధగా ।
నేత్రాతిథీకృతా యైస్తు నిత్యం తేऽతిథయో మమ ॥

భా॥ దూరమునందుండియైనను నా ఆలయముపైన ఎగురుచు కన్పించు పతాకము చూచినవారు నాకు అతిథులవలె గౌరవనీయులు

శ్లో॥ భూమిం భిత్వా స్వయంజాతః తత్ప్రాసాద మిషేణ హి
ఆనందాఖ్యస్య కందస్య సోऽస్త్యేవ పరమోऽంకురః ॥
మమ సర్వగత స్యాపి ప్రాసాదో ऽయం పరాస్పదమ్ ।
పరం బ్రహ్మ యదామ్నాతం పరమేవ నిషద్గిరా ॥

భా॥ నేను ఈ ఆనందవనమందు భూమిని భేదించుకొని ఈ ఆలయ మిషచే ఆవిర్భవించినాను ఇది శాశ్వతానందమును గల్గించు మొలక నేను అంతట వ్యాపించి యున్నను నా యీ ప్రాసాదము పరాంకోటి (శ్రేష్ఠతమము) యైనది. ఉపనిషత్తుల యందు వేదములయందు కీర్తింపబడిన పరబ్రహ్మము ఏదిగలదో దాని స్వరూపమే ఇది

(47) <u>అథముక్తి మండపోద్యా</u> -

శ్లో॥ నిఃశ్రేయసస్య శ్రియోధామ తద్యామ్యాం మండపో ऽస్తి మే ।
తత్రాహం సతతం తిష్ఠే తత్పదో మండపం మమ ॥

భా॥ నాకు దక్షిణదిశయందున్న మండపము ముక్తి లక్ష్మికి నివాస స్థానము అచ్చటనేను ఎల్లప్పుడును ఉపస్థితుడనై యుందును అది నాయొక్క సద్వృత్తులు గొరదగిన మండపము

శ్లో॥ నిమేషార్ధ ప్రమాణంచ కాలం తిష్ఠతి నిశ్చలః ।
తత్ర యస్తేన వై యోగః సమభ్యస్తః సమాశతమ్ ॥

భా॥ అచ్చట అర్ధనిమేషకాలము అయినను నిశ్చలమనస్కుడై ఎవడుండునో అతనికి నూరు సంవత్సరములు యోగమును వక్రమముగ అభ్యాసము చేసినట్టి ఫలము గల్గును

శ్లో॥ నిర్వాణమండపం నామ తత్ఖ్యాతం జగతీ తలే।
తత్రర్చం సంజపన్నేకాం లభేత్ సర్వశ్రుతేః ఫలమ్ ॥

భా॥ అది ఈ భూలోకమున నిర్వాణమండపమని ఖ్యాతి గాంచినది అచ్చట ఒక్క ఋక్కునైనను సమ్యక్‌రీతిని జపించినచో సర్వవేదములు పారాయణ చేసిన ఫలము గల్గును

శ్లో॥ ప్రాణాయామస్తు యః కుర్యా దేకశం ముక్తిమండపే ।
తేనాష్టాంగః సమభ్యస్తో యోగో ఒ-న్యత్రాయుతం సమాః ॥

భా॥ ముక్తి మండపమందు ఒక్కసారియైనను నియమముగ ప్రాణాయామము చేసిన వానికి అన్యత్రపదివేలసంవత్సరములు అష్టాంగయోగమును చక్కగ అభ్యాసముచేసినట్టి ఫలముగల్గును

శ్లో॥ నిర్వాణమండపే యస్తు జపేదేకం షడక్షరమ్ ।
కోటిరుద్రేణ జప్తేన యత్ఫలం తస్య తద్భవేత్ ॥

భా॥ -నిర్వాణమండపమున ఒక్కసారియైనను షడక్షరీ మంత్రమును జపించిన వానికి కోటిరుద్రజపము చేసినంతటి ఫలము గల్గును

శ్లో॥ శుచిర్గంగాంభసి స్నాతో యో జపేత్ శతరుద్రియమ్ ।
నిర్వాణమండపే జ్ఞేయః స రుద్రో ద్విజవేషభృత్॥

భా॥ గంగానది యందు స్నానము చేసి శుచియై ముక్తి మండపమున శతరుద్రియమును జపించినవాడు ద్విజవేషమున నున్నట్టి సాక్షాత్తు రుద్రుడేయని భావించవలెను

శ్లో॥ బ్రహ్మయజ్ఞం సకృత్ కృత్వా మమ దక్షిణమండపే।
బ్రహ్మలోకమవాప్యాథ పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥

భా॥ నాయొక్క దక్షిణమండపమందు బ్రహ్మయజ్ఞమును సకృత్తుగ నైనను చేసినవాడు బ్రహ్మలోకమును పొంది పరబ్రహ్మ పదవిని పొందును

శ్లో॥ ధర్మశాస్త్ర పురాణాని సేతిహాసాని తత్రయః ।
పఠేన్నిరభిలాషః సన్ స తిష్ఠేన్మమ వేశ్మని॥

భా -అచ్చట ఎట్టి అభిలాష లేకుండ ధర్మశాస్త్ర, పురాణ ఇతిహాసము పఠించినవాడు నాలోకమున స్థిరముగ నుండును

శ్లో॥ వాయుభక్షణతో ఽన్యత్ర యత్పుణ్యం శరదాం శతమ్ ।
తత్పుణ్యం ఘటికార్ధేన మౌనే దక్షిణమండపే ॥

భా అన్యత్ర వాయు భక్షణతో నందసంవత్సరములు తపస్సు చేసిన గల్గుఫలము దక్షిణమండపమందు మౌనియై అర్థఘటిక కాలము గడిపినంతనే గల్గును

శ్లో॥ ముక్తిమండపికాయాన్తు కుర్యాదనశనం బుధః ।
సర్వపాపవినిర్ముక్తో నరో మోక్షమవాప్నుయాత్ ॥

భా ముక్తి మండపమందు అనశనమును పాటించిన సజ్జనుడు సర్వ పాపములనుండి విముక్తుడై మోక్షమును పొందును

శ్లో॥ మితం కృష్ణల-కేనాపి యో దద్యాత్ ముక్తిమండపే।
స్వర్ణం సౌవర్ణయానేన స ను సంచరతే దివి॥

భా ముక్తిమండపమందు గురువింద గింజయంత పరిమాణము గల బంగారమునైనను దానము చేసినవాడు బంగారవు విమానములో ఆకాశమందు సంచరించును

శ్లో॥ తత్రైకం జాగరం కుర్యాత్ యస్మిన్ కస్మిన్ దినేఽపి యః ।
ఉపోషితోఽర్చయేల్లింగం స సర్వవ్రతపుణ్యభాక్ ॥

భా ముక్తిమండపమున ఏ ఒక్కదినమైనను జాగరముచేసి ఉపవసించి విశ్వేశ్వర లింగమును అర్చించినవాడు సర్వవ్రతములను దీక్షగ ఆచరించినట్టి పుణ్యమును పొందును

శ్లో॥ తత్ర దత్వా మహాదానం తత్ర కృత్వా మహావ్రతమ్ ।
తత్రాధీత్యాఖిలం వేదం వ్యవతే స నరో దివః ॥

భా అచ్చట మహాదానములు చేసినను మహావ్రతమును పాటించినను సర్వవేదమును పారాయణ చేసినను అట్టివాడు శాశ్వత స్వర్గమును పొందును

శ్లో॥ ప్రయాణం కుర్వతో యస్య ప్రనామో ముక్తిమండపే ।
నమా మనుప్రవిష్టోఽత్ర తిష్ఠేద్యావదహాంభవం ॥

భా ముక్తి మండపమందు నన్ను దర్శించి నమస్కరించి ప్రయాణము(

(ప్రాణప్రయాణము) చేసిన వాడు నేను అచ్చట యున్నంతకాలము నాయందులీనమై యుండును

తథా – శ్లో॥ ముక్తిమండపికాయాన్తు నిమేషార్ధనివేశనాత్ ।
తత్ర ధర్మకథాలాపాత్ పురాణ శ్రవణాదపి ।
కాశ్యాం నివసతామేవం ధర్మరాశిః పదేపదే ॥
(అత్ర శ్రుతం స్వరాదిఫలం క్షేత్రాంతర మృతవిషయం)

భా కాశీయందు నివసించుచు ముక్తిమండపమందు ధర్మకథా లాపము పురాణశ్రవణము చేసినవానికి ధర్మరాశి పదే పదే పెరుగుచుండును (ఇచ్చట చెప్పబడిన స్వర్గాదిఫలము ముక్తిమండపమును దర్శించి అన్యత్ర మృతినందిన వాని విషయకమని గ్రాహ్యము)

తథా– శ్లో॥ స్మరంతి యే మామనవర్ధమండపే కించిత్ యధాశక్తి దదస్యతి స్వం।
శృణ్వన్తి పుణ్యాశ్చ కథాః క్షణం స్థిరాః తే కోటి గోదానఫలం భజన్తేః ఇత్యాది ॥

భా ముక్తి మండపమందు నన్ను స్మరించుచు కొద్దిగనైనను దానము చేసినవారును ఇచ్చట ఏ ఒక్క క్షణమైనను స్థిరముగయుండి నా యొక్క పుణ్య కథలను వినినవారును కోటి గోవులను దానము చేసినట్టి ఫలమును పొందుదురు

తథా– శ్లో॥తత్ప్రాసాదపురోభాగే మమశృంగార మండపః ।
(పురోభాగే అగ్రభాగే) (తేనపశ్చిమదిశి భైరవప్రదేశపూర్వభాగేజ్ఞానమండపస్య వక్ష్యమాణత్వాత్)

భా (నాయొక్క ముక్తి మండపమునకు అగ్రభాగమందు శృంగార మండపమున్నది దానికి పశ్చిమ దిక్కునందు భైరవ ప్రదేశము దానికి పూర్వభాగమున జ్ఞానమండపమున్నదని చెప్పబడ నున్నది )

శ్లో॥ శ్రీపీఠం తద్ధి విజ్ఞేయం విశ్రీక శ్రీసమర్పణా ।
మదర్థం తత్రయో దద్యాత్ దుకూలాని శుచీన్యహో ॥

భా అది శ్రీపీఠమని తెలియదగును అచ్చట యావత్సంపద దానము చేయుదగును అచ్చటనున్నట్టి నన్ను ఉద్దేశించి శుభ్రమైనదుకూలములను దానము చేయవలెను

శ్లో॥ మాల్యాని సువిచిత్రాణి యక్షకర్దమవంతి చ ।
నానానేపథ్య వస్త్రాని పూజోపకరణాన్యపి ॥

*సశ్రీయాఽలంకృతః తిష్ఠేత్ యత్రకుత్రాపి సత్తమః॥*

భా ఎవరు అచ్చట నన్ను ఉద్దేశించి చిత్రవిచిత్రములైన పూలదండలను సుగంధ ద్రవ్యములను అలంకారవస్త్రములను పూజోపకరణములను దానముచేయుదురో వారెచ్చటనున్నను శ్రీమంతులేయగుదురు

తథా- శ్లో॥ *మోక్షలక్ష్మీవిలాసాఖ్య ప్రాసాదస్యోత్తరే మమ ।*
*ఐశ్వర్యమండపం రమ్యం తత్రైశ్వర్యం దదామ్యహమ్ ॥*

భా మోక్షలక్ష్మీ విలాసమను పేరుగల మండపమునకు ఉత్తర దిశయందున్నది ఐశ్వర్య మండపము అచ్చట భక్తులకునేనైశ్వర్య మిత్తును

తథా శ్లో॥ *మత్ప్రాసాదాత్పూర్వభాగే జ్ఞానమండపమస్తి యత్ ।*
*జ్ఞానం దిశామి సతతం తత్రమాం ధ్యాయతాం సతామ్ ॥*

భా నాప్రాసాదమునకు తూర్పుభాగమున జ్ఞాన మండపమున్నది అచ్చటనన్ను ధ్యానించిన భక్తులకు సదా జ్ఞానముమ గల్గించుదును

శ్లో॥ *భవానీరాజసదనే మమాస్తి హి మహానసమ్ ।*
*యత్రత్రైవహ్నుతం పుణ్యైః నిర్విశామి ముదైవ తత్ ॥*

భా భవానీ యొక్కరాజసదనమున నావంటశాలయున్నది అచ్చట పుణ్యపురుషులచే నివేదన చేయబడిన పదార్థమును నేను సంతోషముతో స్వీకరింతును

శ్లో॥ *విశాలాక్ష్యా మహాసౌధే మమ విశ్రామ భూమికా ।*
*తత్ర సంసృతిఖిన్నానాం విశ్రామం శ్రాణయామ్యహమ్ ॥*

భా విశాలాక్షిమహాసౌధమున నావిశ్రామస్థానమున్నది సంసార బాధలవలన ఖిన్నులైన వారికి అచ్చట విశ్రాంతిని గల్గించుచుందును

శ్లో॥ *నియమస్నానతీర్థంచ చక్రపుష్కరిణీ మమ ।*
*తత్ర స్నానవతాం పుంసాం తన్నైర్మల్యం దిశామ్యహమ్॥*

భా చక్రపుష్కరిణీ తీర్థములో నియమముగ స్నానముచేసిన వారికి నిర్మలత్వమును ప్రసాదింతును

శ్లో॥ *వరం లింగార్చనం స్థాన మవిముక్తేశ్వరం మమ ।*
*తత్ర పూజాం సకృత్ కృత్వా కృతకృత్యో నరో భవేత్ ॥*

భా అవిముక్తేశ్వర లింగము నాయొక్క అర్చనకు ఉత్తమమైన స్థానము అచ్చట సకృత్తుగనైనను పూజచేసినవాడు కృతకృత్యుడగును

శ్లో॥ *సాయం పశుపతేః సంధ్యాం కుర్యాత్ పాశుపతేశ్వరే ।*
*విభూతిధారణాత్తత్ర పశుపాశై ర్నబాధ్యతే ॥*

భా  సాయంకాలము పశుపతీశ్వరునుద్దేశించి పాశుపతసంధ్యను ఉపాసించవలెను అచ్చట విభూతిని ధరించుట వలన పశుపాశములచేత ( సంసార బంధములచేత ) బాధించబడదు

శ్లో॥  ప్రాతఃసంధ్యాం కరోమ్యేవ సదోంకారనికేతనే ।
తత్రైకాఽపికృతా సంధ్యా సర్వపాతక కృంతనీ ॥ ఇత్యాది ॥

భా  ఓంకారనికేతనమను మండపమున ప్రాతః సంధ్యనుపాసించవలెను అచ్చటఒక్కసారి యైనను సంధ్యోపాసన చేసినచో అది సర్వపాపములను నశింపజేయునట్టిదియగును

## (48) అథ దండపాణి మహిమా - తత్ర కాశీఖండే

వచనము  గంధమాదనపర్వతే రత్నభద్రనామా గంధర్వః పంపూర్ణభద్రాఖ్యం సుతం జనయిత్వా దిష్టాంగతిం లేభే । తతః పూర్ణభద్రః సర్వాభీష్టవిశిష్టోఽపి భూయస్యపి కాలేసుతమలబ్ధ్వా దుఃఖితః, కనకకుండలాఖ్యాం పత్నీమాహూయ ఉవాచ । ఇయం పమృద్ధిః సుతం వినా మాం న సుఖయతి । తద్యది సుతావాప్తౌ ఉపాయోఽస్తి తర్హి బ్రూహీతి । తతఃసా ఉవాచ । కాంత! సదాశివభక్త్యా న కించిత్ దురాపం । తతః పుత్రాప్తయే స సేవ్య ఇతి । తతః స యక్షో గీతివిద్యయా శ్రీశివమారాధ్య
అల్పైరేవ అహోభిః తస్యాం పత్న్యాం సుతం లేభే ।తస్య హరికేశ ఇతి నామ అకార్షీత్ । పంచకాలేఽపి పూజన నామగ్రహణ కథాశ్రవణాదినా శివమేవ భేజే । పిత్రా స పుత్రో గృహేదీయతాం మనః ఇతి అసకృత్ శిక్షితోఽపి యదా భక్తిః న జహౌ । తదా ఎతరం క్రుద్ధం సమీక్ష్య గృహాన్నిర్గత్య క్షుత్ తృడ్భ్యాం వ్యాకులీభూయ బాల్యేశ్రుతం కస్యచిత్ బ్రాహ్మణస్య వచః సస్మార ।

భా  గంధమాదనపర్వతమందు రత్నగర్భుడను గంధర్వుడు పూర్ణభద్రుడను కుమారుని గాంచెను ఆ పూర్ణభద్రుడు అభీష్టములన్నియు పొందియున్నను చాలాకాలము సంతానము లేకపోవుటచే దుఃఖించినవాడై కనకకుండలయను పేరుగల తన భార్యను పిలిచి ఇట్లనెను  సంతానము లేని సంపత్సమృద్ధి నాకు సుఖము నిచ్చుటలేదు కుమారుడుగల్గుటకు ఏదైనా ఉపాయమున్నచో చెప్పుము అనెను  ఆమె ఇట్లు చెప్పెను నాథా! సదాశివుని భక్తిచే పొందరానిది ఏదియును లేదు  అందుచే పుత్రలాభము కొరకు [illegible] పడగును అని చెప్పెను  అంతట ఆయక్షుడు తన గీతివిద్యచే సదాశివుని ఆరాధించి అనతికాలముననే తనభార్యయందు కుమారుని గాంచెను  అతనికి హరికేశుడు

అని నామకరణము చేసెను అతడు బాలుడయ్యును పూజనము నామసంకీర్తనము కథాశ్రవణాదులచేత శివుని మిక్కిలిగ సేవించెను నీమనస్సును గృహవిషయములందు మరల్చుము యని మాటి మాటికి తండ్రి చెప్పినను శివభక్తిని విడువలేదు అందులకు తండ్రి కోపించగా హరికేశుడు గృహము విడిచి వెడలిపోయెను మార్గమున ఆకలిదప్పులచే మిక్కిలి పీడించబడి బాల్యమందు ఒకానొక బ్రాహ్మణుని వలన వినిన మాటలను అతడిట్లు స్మరించెను

శ్లో॥ పదేపదే సమాక్రాంతా యే విపద్భిరహర్నిశమ్ ।
యేషాం క్వాపి గతిర్నాస్తి తేషాం వారాణసీ గతిః ॥

భా॥ ఎవరికి అడుగడుగున ప్రత్యహము విపత్తులు గల్గుచుండునో ఎవరికి ఏవిధమగు గతియు అన్యత్ర లేదో అట్టివారికి కాశియే గతి

శ్లో॥ పాపరాశిభిరాక్రాంతా యే దారిద్ర్యపరాజితాః ।
యేషాం క్వాపిగతిర్నాస్తి తేషాం వారాణసీ గతిః ॥

భా॥ ఎవరు పాపరాశిచే ఆక్రమించబడి దారిద్ర్యముచే కొట్టుమిట్లాడుచున్నారో ఎవరికి గత్యంతరములేదో వారికి కాశియే గతి

శ్లో॥ సంసారభయభీతాయే యే బద్ధాః కర్మబంధనైః ।
యేషాం క్వాపిగతిర్నాస్తి తేషాం వారాణసీగతిః ॥

భా॥ ఎవరు సంసార భయముచే భీతులై కర్మబంధములచే బంధించబడి యుందురో ఎవరికి అన్యగతి లేదో అట్టివారికి కాశియే గతి

వచనము ఏవం విచింత్య వారాణసీం గతః । తత్రచ తపశ్చచార । ఏతస్మిన్నేవకాలే శివః శివయా సహ ఆనందవనం పశ్యంస్తత్రాఽఽగతః తపస్యన్తం హరికేశం దదర్శ । తతస్తమతీవ కృశం దృష్ట్వా భవానీ శివం వ్యజిజ్ఞపత్ ।అయం తవ భక్తో వరోఽస్మైదేయ ఇతి । తతోమహాదేవేన వృషాదవతీర్య హస్తేన దయయా సంస్పృష్టః సన్మహాదేవం నిరీక్ష్య తుష్టావ । తయాస్తుత్యా తుష్టో భవో వరాన్దదౌ ।

భా॥ ఇట్లాలోచించి ఆహరికేశుడు కాశిని చేరెను అచ్చట స్థిరపడి తపస్సు చేసెను ఆకాలమందే శివుడు పార్వతితో గూడి ఆనందవనమున విహరించుచు అచ్చటకు వచ్చి తపస్సు చేయుచున్న హరికేశుని చూచెను అతడు మిక్కిలి కృశించి యుండుటను గమనించిన పార్వతి శివునకిట్లు విన్నపము జేసెను ఇతడు మీయొక్క అనన్య భక్తుడు ఇతనికి వరమునీయవలసినది యని చెప్పెను అప్పుడు మహాదేవుడు వృషభవాహనము నుండి దిగి దయాళువై చేతితో అతనిని స్పృశించెను హరికేశుడు మహాదేవుని తన

యెదుట దర్శించి స్తోత్రము చేసెను అతనిస్తుతికి సంతోషించిన మహాదేవుడు అతనికిట్లు వరములనిచ్చెను

శ్లో॥ *త్వం దండపాణిర్నామ్నా వై ఽధునా ।*
*సర్వాన్గణాన్ శాధి మమాజ్ఞయోత్కటాన్ ॥*

భా నీవు ఇకమీదట దండపాణి యను పేరుగల వాడవగుదువు నీవు నాయాజ్ఞచే ఈసర్వగణములను శాసించగలవు

శ్లో॥ *గణావిమౌ త్వామనుయాయినౌ సదా ।*
*నామ్నా యథార్థౌ నృణ సంభ్రమోద్భ్రమౌ ॥*

భా ఈగణములన్నియు నీఆజ్ఞను మన్నించుదురు నీపేరుకు తగినట్లు మానవులందు సంభ్రమ విభ్రమములను గల్గింతువు

శ్లో॥ *త్వమన్నదః కాశినివాసినాం సదా ।*
*త్వం ప్రాణదో జ్ఞానద ఏక ఏవహి ॥*

భా నీవు కాశీవాసులకు సదా అన్నదాతవగుదువు వారికి నీవు ఒక్కడవే ప్రాణదాతవు జ్ఞానదాతవు అగుదువు

శ్లో॥ *త్వం మోక్షదో మన్ముఖసూపదేశత ।*
*స్త్వం నిశ్చలాం సద్వసతిం విధాస్యసి ॥*

భా నాముఖత ఉపదేశముచే నీవు వారికి మోక్షమిప్పింతువు నిశ్చలమనస్కులైన సద్భక్తులకు నీవుస్థిరమైన వసతిని గల్పింతువు

శ్లో॥ *త్వం విఘ్నపూగైః పరిపీడ్య పాపినః ।*
*సంభ్రాంతి ముత్పాద్య వినేష్యసే బహిః ॥*

భా పాపులైన వారికి నీవు విఘ్నపరంపరలను గల్పించి భ్రాంతిలో పడవైచి కాశీనుండి బయటకు వెడలగొట్టెదవు

శ్లో॥ *ఆనీయ భక్తాన్ క్షణతో ఽపి దూరతో ।*
*ముక్తిం వరాం దాపయితా ఽపి పింగల ॥*

భా ఓ పింగళా! భక్తులైన వారిని నీవు దూరమున నుండియు రప్పించి వరమైన ముక్తిని ఇప్పింతువు

శ్లో॥ *త్వత్సాత్కృతే క్షేత్రవరే ఽత్ర యక్షరాట్ ।*
*కస్త్వామనారాధ్య విముక్తి భాజనమ్ ॥* *( యక్షరాడితి సంబోధనం)*

భా ఓ యక్షరాజా! నీస్వాధీనమునందుంచబడిన ఈక్షేత్రమున ముక్తికారయితవగు నిన్ను ముందుగ పూజింపక ఎవరును ఉండరు

శ్లో॥ నభాజనం పూర్వత ఏవ తే చరే ।
త్రతః సమర్చాం మమ భక్త ఆచరేత్ ॥ (నభాజనం పూజామ్)

భా ముందుగనిన్ను పూజించిన పిమ్మటనె నన్ను అర్చించుదురు

శ్లో॥ పూర్ణభద్రసుత దండనాయక త్ర్యక్షయక్ష హరికేశ పింగల ।
కాశివాసవసతాం సదాఽన్నద, జ్ఞానమోక్షద గణాగ్రణీర్భవ ॥

భా పూర్ణభద్రసుతుడవు, దండనాయకుడవు మూడుకన్నులు గల యక్షుడవు పింగళరూపముగల హరికేశా! నీవు కాశీవాసులకు సదా అన్నదాతవు మోక్షదాతవునై గణములకు నాయకుడవగుము

శ్లో॥ మద్భక్తియుక్తో ఽపి వినా త్వదీయాం భక్తిం న కాశీవసతిం లభేత ।
గణేషు దేవేషు హి మానవేషు, తదగ్రమాన్యో భవ దండపాణే ॥

భా నాభక్తుడైనను నీయందు భక్తిలేనివాడు కాశీనివాసమును పొందలేడు గణములందు దేవతలందు మానవులందును నీవు అగ్రపూజకు అర్హుడవగుదువు.

శ్లో॥ జ్ఞానోదతీర్థే విహితోదకక్రియో యస్త్వాం సమారాధయితా గణేశమ్ ।
స ఏవలోకే కృతకృత్యతామగాన్, మమానులానుగ్రహతోఽత్ర పుణ్యవాన్ ॥

భా జ్ఞానోదతీర్థమందు ఉదకక్రియలను నిర్వర్తించి గణనాయకుడనైన నిన్ను చక్కగ ఎవరు ఆరాధింతురో అట్టివారు ఈలోకమున కృతకృత్యులై నా అనుగ్రహము చేత పుణ్యవంతు లగుదురు

శ్లో॥ త్వం దక్షిణస్యాం దిశి దండపాణే! సదైవ మే నేత్రసమక్ష మత్ర ।
త్వం దండయన్ ప్రాణభృతో నిరీహానిహ ఽ ఽ న్య న్భూన్ స్వానభయం దిశన్వై ॥

భా ఓ దండపాణీ! దక్షిణ దిశయందు నీవు నాకన్నుల ఎదుటనే యుండి, దేహధారులైన పాపులను దండించుచు భక్తులకుఅభయమిచ్చుచు నుండుము

యక్షరాజాష్టకం స్తోత్రమ్ –

(1) శ్లో॥ రత్నా భద్రాంగజోద్భూత పూర్ణభద్రసుతోత్తమ ।
నిర్విఘ్నం కురు మే యక్ష కాశీవాసం శివాస్త్రయ ॥

(2) శ్లో॥ ధన్యో యక్షః పూర్ణభద్రో ధన్యా కాంచనకుండలా ।
యయోర్భక్తయిపితే ఽ భూర్దండపాణే మహామతే ॥

(3) శ్లో॥ జయ యక్షపతే ధీర జయపింగలలోచన ।
జయ పింగజటాధార జయదండమహాయుధ ॥

(4)శ్లో॥ అవిముక్తమహాక్షేత్ర సూత్రధారోగ్రతాపస ।
దండనాయక భీమాస్య జయ విశ్వేశ్వరప్రియ ॥

(5)శ్లో॥ సౌమ్యానాం సౌమ్యవదన భీషణానాం భయానక ।
క్షేత్రపాపధియాం కాల మహాకాల మహాప్రియ ॥

(6)శ్లో॥ జయప్రాణద యక్షేంద్ర కాశీవాసాన్నమోక్షద ।
మహారత్నస్ఫురద్రశ్మిచయ చర్చిత విగ్రహ ॥

(7)శ్లో॥ మహాసంభ్రాంతి జనక మహోద్భ్రాంతి ప్రదాయక ।
అభక్తానాంచ భక్తానాం సంభ్రాంత్యుద్భ్రాంతి నాశక ॥

(8)శ్లో॥ ప్రాంతవేషత్వచతుర జయ జ్ఞానవిధిప్రద ।
జయ గౌరిపదాబ్జాలే మోక్షేక్షణ విచక్షణ ॥

(9)శ్లో॥ యక్షరాజాష్టకం పుణ్యమిదం నిత్యం త్రికాలతః ।
జపామి మైత్రావరుణే వారాణస్యాప్తి కారణమ్ ॥

(10)శ్లో॥ దండపాణ్యష్టకం ధీమాన్ జపన్నైస్మై ర్నజాతుచిత్ ।
శ్రద్ధయా పరిభూయేత కాశీవాసఫలం లభేత్ ॥

భా (1) రత్నభద్రుని కుమారుడైన పూర్ణభద్రుని యొక్క సుపుత్రుడా! శివ ప్రాప్తి కొరకు వాయొక్క కాశీవాసమును విఘ్నరహితముగావింపుము

(2) మహామతే! దండపాణీ! ఏపుణ్యాదంపతుల గర్భఫలముగ నీవు జన్మించితివో అట్టి కాంచనకుండల పూర్ణభద్రులు మిక్కిలి ధన్యులు

(3) ఓ యక్షాధీశా! పండితశ్రేష్ఠా! పింగళనేత్రా! ఎఱ్ఱని జటాజూటము గలవాడా! దండము మహాయుధముగ గలవాడా! నీవు సర్వోత్కర్షతో వర్ధిల్లుము

(4) అవిముక్త మహాక్షేత్రమునకు సూత్రధారుని వంటివాడా! మహా తపస్వీ! దండనాయక! భయంకరవదనా! విశ్వేశ్వరునకు ప్రియమైన వాడా! నీవు సర్వోత్కర్షతో వర్ధిల్లుము

(5) సాధుజనుల పట్ల ప్రసన్నవదనుడవు భయంకరులకు భయంకరుడవు. కాశీక్షేత్రమందు పాపబుద్ధిగలవారలకు నీవు యముడవు మహాకాలుడగు విశ్వనాథునకు మిక్కిలి ప్రియమైన వాడవు. నీవు సర్వోత్కర్షతో వర్ధిల్లుము

(6) ఓయక్షాధిపతీ! కాశీవాసులకు నీవు ప్రాణప్రదాతవు. వారికి నీవు అన్నప్రదుడవు మరియు మోక్షప్రదుడవు నీవు మహారత్నముల యొక్క కిరణసమూహములచే వ్యాప్తమైన శరీరము గలవాడవు

(7) అభక్తులకు నీవు సంభ్రాంతి విభ్రాంతిని గల్గించునట్టివాడవు భక్తులయొక్క సంభ్రాంతి విభ్రాంతులను నశింపజేయునట్టి వాడవు నీవు సర్వోత్కర్షతో వర్ధిల్లుము

(8) కాశీవాసులకు మోక్షమొసంగుటకై పూర్వరంగమును సిద్ధపఱచుటయందు మహానిపుణుడవు భక్తులకు తత్త్వజ్ఞాన నిధిని సమకూర్చునట్టి వాడవు గౌరీదేవి పాదారవిందములందు నీవు తుమ్మెదవు కాశీవాసులకు మోక్షము నిప్పించుటయందు గొప్ప విచక్షణా శీలివి

(9) మిత్రావరుణపుత్రుడగు ఓఅగస్త్యా! పుణ్యవంతమగు ఈయక్షరాజాష్టకమును నేను నిత్యము మూడువేళల జపించుచుందును ఈఅష్టకము కాశీప్రాప్తి హేతువు అనిస్కందుడు చెప్పెను

(10) ఈయక్షరాజాష్టకమును శ్రద్ధగ పఠించుబుద్ధిశాలి విఘ్నములచే ఎన్నడును పరాభవించబడడు అతడు కాశీవాసఫలమును పొందును

**మత్స్యపురాణే శ్రీమహాదేవ ఉవాచ**

శ్లో॥ *జరామరణ సంత్యక్తః సర్వరోగవివర్జితః ।*
*భవిష్యసి గణాధ్యక్షో వరదః సర్వపూజితః ॥*

భా నీవుజరామరణములు లేనివాడవై సర్వరోగములనుండి విముక్తుడవై గణాధ్యక్షుడవై వరదాయకుడవును సర్వులచే పూజించబడినవాడవును అగుదువు.

శ్లో॥ *అజేయశ్చాపి సర్వేషాం యోగైశ్వర్య సమన్వితః ।*
*అన్నదశ్చాపి లోకేభ్యః క్షేత్రపాలో భవిష్యసి ॥*

భా అందరకును అజేయుడవై యోగైశ్వర్యములతో గూడుకొనిన వాడవగుదువు లోకులందరకు అన్నదాతవై ఈకాశీక్షేత్రపాలకుడవగుదువు

శ్లో॥ *మహాబలో మహాసత్త్వో బ్రహ్మణ్యో మమచ ప్రియః ।*
*త్ర్యక్షశ్చ దండపాణిశ్చ మహాయోగీ తథైవచ ॥*

భా మహాబలుడవు మహాసత్త్వుడవు (బలమునుపయోగించుకొనునట్టి సామర్థ్యము) బ్రహ్మణ్యుడవునునై నాకిష్టమైనవాడవగుదువు అట్లే (ఈశ్వరునకు) దండపాణివై మహాయోగివగుదువు

శ్లో॥ *ఉద్భ్రమః సంభ్రమశ్చైవ గణౌ తే పరిచారకౌ ।*
*తవాజ్ఞాం చ కరిష్యేతే లోకస్యోద్భ్రమ సంభ్రమౌ ॥*

భా ఉద్భ్రమ సంభ్రమములను రెండు గణములు నీకుపరిచారకులై నీయాజ్ఞచే లోకులను ఉద్భ్రమ సంభ్రమములు గలవారినిగ చేయుచుందురు

*తథా*–శ్లో॥ *దేవబ్రాహ్మణ విద్విష్టా దేవభక్తి వినిందకాః ।*
*బ్రహ్మఘ్నాశ్చ కృతఘ్నాశ్చ తథా నైకృతికాశ్చయే॥*

*లోకద్విష్టా గురుద్విష్టాః తీర్థాయతనదూషకాః ।*
*సర్వపాపరతాశ్చైవ యేచాన్యే కుత్సితా భువి ॥*
*తేషాం నాస్తీహ వాసోఽత్ర స్థితోఽసౌ దండనాయకః ।*
*రక్షణార్థం నియుక్తం వై దండనాయక ముత్తమమ్ ॥*

భా  దేవ బ్రాహ్మణులను ద్వేషించువారు దైవభక్తులను నిందించువారు బ్రహ్మహంతలు కృతఘ్నులు అట్లే వికటముగ ప్రవర్తించువారు లోకులను ద్వేషించువారు గురువులను ద్వేషించువారు తీర్థములను ఆలయములను దూషించువారు ఇంకను సర్వవిధములైన పాపములను చేయువారు కుత్సితులు ఎవరెవరుగలరో దండనాయకుడిచ్చట ఉపస్థితుడైయుండగా అట్టివారికి కాశిలోస్థానము లేదు ఉత్తములయొక్క రక్షణార్థము దండనాయకుడిచ్చట నియుక్తుడై యున్నాడు

శ్లో॥  పూజయిత్వా యథా శక్త్యా గంధపుష్పాది ధూపనై॥
 ఈశ్వరాను గృహీతా హి గతిం గాణేశ్వరీం గతాః ॥ ఇత్యాది ॥

భా  యథాశక్తిగ గంధపుష్పాదులచే దండపాణిని పూజించినవారే ఈశ్వరునిచే అనుగ్రహింపబడుదురు గణాధిపత్యమును పొందుదురు (ఇత్యాదిగ శివపురాణమందును ఇట్లే చెప్పబడినది)

**(48) అథ భైరవ ప్రాదుర్భావః – కాశీఖండే త్రింశోఽధ్యాయః**

శ్లో॥  *కోఽసౌ భైరవనామాఽత్ర కాశీపుర్యాం వ్యవస్థితః ।*
*కింరూపమస్య కింకర్మ కాని నామాని చాస్యవై ॥*
*కథ మారాధితశ్చైవ సిద్ధిదః సాధకస్య వై ।*
*ఆరాధితః కుత్ర కాలే క్షిప్రం సిధ్యతి భైరవః ॥*
*( ఇత్యగస్త్యేన పృష్టే స్కందేన ఉక్తమ్ )*

భా  అగస్త్యుడు కుమారస్వామిని ఇట్లు అడుగుచున్నాడు "భైరవుడను ఆయన ఎవరు? ఈకాశియందున్న ఆయన రూపమేమి? ఆయనచేయుపనిఏమి? ఆయననివిధనామములేవి? ఎరీతిని ఆరాధించినచో సాధకునకు ఆయన సిద్ధిప్రదుడగును? ఏ కాలమునందారాధించినచో భైరవుని అనుగ్రహము శీఘ్రముగ సిద్ధించును?"దానికి కుమారస్వామి ఇట్లు సమాధానము చెప్పెను

వచనము  పూర్వం మేరౌ ఋషిభిః క సకలలోక ... ... ...హాః పృష్టః । తతః స స్వాత్మానమేవ అహమేవేశ్వరః సర్వశ్రేష్ఠ ఇతి। కథితవాన్। తత్

ఽసహమానేన విష్ణునా ఉక్తమ్ అహం శ్రేష్ఠ ఇతి తతస్తావహంశ్రేష్ఠత్వే వివదమానే చతురోపి వదాన వృష్టవంత తైశ్చ శివః శ్రేష్ఠః ఇత్యుక్తేఽపి యదా బ్రహ్మణో మాయా మోహితస్య అభిమానో నాపయాతః। తదా సదాశివః ప్రాదుర్భూయ స్వకోపతః పురుషాన్తర ముత్పాద్య అయంబ్రహ్మ త్వయాదండ్య ఇతి తమూచే। కించ।

భా పూర్వమొకప్పుడు మేరువునందలి ఋషులు ఎవరు అందరికన్న శ్రేష్ఠుడు? అని బ్రహ్మనడిగిరి దానికి బ్రహ్మ నేనే సర్వమునకు ఈశ్వరుడను అందుచే నేనే సర్వశ్రేష్ఠుడను అని చెప్పెను అది సహించని విష్ణువు నేనే సర్వ శ్రేష్ఠుడను అని పలికెను అంతట వారిద్దరిట్లు శ్రేష్ఠుడెవరు అని వాదించుకొనుచు తీర్పునకై వేదములను అడిగిరి వేదములు శివుడు సర్వశ్రేష్ఠుడు అని చెప్పినను మాయామోహితుడగు బ్రహ్మకు స్వాభిమానము పోలేదు అప్పుడు సదాశివుడు సాక్షాత్కరించి తన కోపమునుండి మరియొక పురుషుని ఉద్భవింపజేసి అతనితో ఈ బ్రహ్మనీచే దండింపదగినవాడు అని పలికెను

శ్లో॥ కాలవద్భ్రాజసే సాక్షాత్ కాలరాజస్తతో భవాన్ ।
విశ్వం భర్తుం సమర్థోఽసి భరణాత్ భైరవః స్మృతః ॥

భా నీవు కాలునివలె ప్రకాశించుచున్నావు కనుక కాలరాజు అనబడుదువు ఈవిశ్వమునంతను భరించుటకు సమర్థుడవు కనుక భైరవుడు అనబడుదువు

శ్లో॥ ఆమర్దయిష్యసి భవాన్ యద్దుష్టాత్మనో యతః ।
ఆమర్దక ఇతి ఖ్యాతిం తతః సర్వత్ర యాస్యసి ॥

భా నీవు కోపించినవాడవై దుష్టాత్ములను మర్దించుదువు గనుకనీవు ఆమర్దకుడవు అనుఖ్యాతిని పొందుదువు

శ్లో॥ యతః పాపాని భక్తానాం భక్షయిష్యసి తత్క్షణాత్ ।
పాపభక్షణ ఇత్యేవ తవ నామ భవిష్యతి ॥

భా నిన్ను దర్శించిన వెంటనే భక్తులపాపములను భక్షించి పోగొట్టుదువు గనుకనీవు పాపభక్షకుడు అను పేరు గల్గను

శ్లో॥ అధిపత్యంచ కాశ్యాం తే కాలరాజ! సదైవహి ।తత్ర యే పాపకర్తారః తేషాం శాస్తా త మేవ వా ॥

శుభాశుభం చ తత్కర్మ చిత్రగుప్తో లిఖిష్యతి ॥(ఇతి వరాన్ లబ్ధ్వా సః)వామాంగుష్ఠ నఖాగ్రేణ చకర్త చ శిరోవిధేః ।

భా ఓకాలరాజా! కాశీయందు నీయాధిపత్యమే ఎల్లప్పుడు ఉండును ఇచ్చట

పాపములు చేయునట్టి వారినందరిని శాసించునట్టి వాడవునీవే  కాశియందున్న వారి శుభాశుభకర్మలను చిత్రగుప్తుడు లిఖించడు  ఇట్టి వరములను పొంద అతడు తన ఎడమ చేతి బొటనవ్రేలి కొనగోటితో బ్రహ్మశిరస్సును త్రుంచివేసెను

వచనము  ఏవం నిందాకారి వక్త్రయుతే పంచమే శిరసిచ్ఛిన్నే భవో బ్రహ్మహత్యాసంజ్ఞాం అతిభీషణాం స్త్రియముత్పాద్య తాం ప్రత్యువాచ । త్వయా కాశీప్రవేశావధి అస్మిన్ స్థేయమ్ । త్వం చ భైరవ । ఏతం కపాలం ధారయన్ వ్రతంచ ఆరాధయేతి । తతః స త్రైలోక్యే విచరన్ కాశీం ప్రాప । ప్రవిష్టమాత్రేచ తస్మిన్ కపాలం హస్తాత్ పపాత । హత్యాచ పాతాళం గతా ।

భా  ఇట్లు నిందించిన నోరుగల ఆ ఐదవశిరస్సును త్రుంచగా శివుడుబ్రహ్మహత్యయను సంజ్ఞ గల అతిభీకరమైన ఒక స్త్రీ రూపమును పుట్టించి ఇట్లు పలికెను  కాశీచేరువరకు నీవు భైరవుని యందు ఉండుము  ఓ భైరవా! ఈకపాలమును ధరించి వ్రతమును పాటింపుము"  అంతట అతడు మూడులోకములందు తిరుగుచు క్రమముగ కాశిని చేరెను  అతడు కాశికి చేరినంతనే కపాలమతని హస్తమునుండి పడిపోయెను  ఆబ్రహ్మహత్యయు పాతాళమునకు వెడలిపోయెను

శ్లో॥  *తతః కపాలమోచనం తీర్థం పుణ్యకృత్యే తు భైరవః ।*
*తత్రైవ తస్థౌ భక్తానాం భక్షయన్నఘ సంతతిమ్ ॥ ఇతి ॥*

భా  అప్పటినుండియు ఆకపాలమోచన తీర్థమును తన నివాసముగ జేసికొని భైరవుడు భక్తులపాప సమూహములను భక్షించుచు అచ్చట యుండెను

**(42) అథ భైరవమహిమా -**

(తత్ర పాపభక్షా మర్దకేశ్వరౌ తద్రూపావేవ ఇతి కాశీఖండే ఉక్తమ్) (అచ్చట యున్న పాపభక్ష అమర్దకేశ్వరులు అతని ప్రతి రూపము లేయని కాశీఖండమందు చెప్పబడినది)

శ్లో॥  *పాపభక్షణ మాసాద్య కృత్వా పాపశతాన్యపి*
*కుతో బిభేతి పాపేభ్యః కాలభైరవ సేవకః ॥*

భా  పాపశతములను చేసిన వాడైనను పాపభక్షేశ్వరుని ఆశ్రయమును పొంది కాలభైరవసేవకుడైనవాడు అట్టి పాపముల వలన ఎట్టి భయమును పొందడు

శ్లో॥  *ఆమర్దయతి పాపాని దుష్టానాం చ మనోరథాన్ ।*
*ఆమర్దక ఇతిఖ్యాతః తతో ఽసౌ కాలభైరవః ॥*

భా  దుష్టులయొక్క మనోరథములను మర్దించి వానిని పాడుచేయును గనుక కాలభైరవుడు ఆమర్దకుడు అనుపేరును గూడ పొందెను

శ్లో॥ కలిం కాలం కలయతి సదా కాశీనివాసినామ్ ।
అతః ఖ్యాతిం పరాం ప్రాప్తః కాలభైరవ సంజ్ఞితామ్ ॥

భా కాశీవాసులైన వారికి కలికాలమందు కలిబాధను లేకుండ చేయుచున్న గనుక కాలభైరవుడు అను పేరు పొందెను

శ్లో॥ ఏభైవ యస్య భక్తేభ్యో యమదూతా సుదారుణాః ।
పరమాం భీరుతాం ప్రాప్తాః తతో ఽసౌ భైరవః స్మృతః ॥

భా ఆకాల భైరవుని యొక్క భక్తుల విషయములో మిక్కిలి భయంకరులైన యమదూతలు సైతము కర్మభీరువులగుదురు కనుక ఆయనకు భైరవుడు అనుపేరు గలిగెను

తథా శ్లో॥ యత్కించిదశుభం కర్మ కృతం మానుష బుద్ధిభిః ।
తత్సర్వం విలయం యాతి కాలభైరవ దర్శనాత్ ॥

భా మానుషబుద్ధివశమున ఏదైనా అశుభకర్మచేసినవారు భైరవ దర్శనము చేసినచో నంతను పోగొట్టుకొందురు

శ్లో॥ విశ్వేశ్వరేఽపి యే భక్తా నో భక్తాః కాలభైరవే ।
కాశ్యాం తే విఘ్నసంఘాతం లభన్తేతు పదేపదే ॥

భా విశ్వేశ్వరుని భక్తులయ్యును కాలభైరవుని యందు భక్తి చూపనివారు కాశియందు అడుగడుగున విఘ్నపరంపరలను ఎదుర్కొందురు

శ్లో॥ తీర్థే కాలోదకేస్నాత్వా కృత్వా తర్పణమత్వరః ।
విలోక్య కాలరాజంచ నిరయా దుద్ధరేత్ పితౄన్ ॥

భా కాలోదక తీర్థమందు స్నానముచేసి శ్రద్ధగ తర్పణములుచేసి కాలరాజును దర్శించినవారు తమపితృదేవతలను నరకమునుండి ఉద్ధరింతురు

తథా శ్లో॥ అమర్దకేశ్వరం దృష్ట్వా తస్మిన్ పక్షేతు యత్కృతమ్ ।
తత్సర్వం నశ్యతే పాపం కాలభైరవరూపిణమ్ ॥

భా కాలభైరవరూపుడగు ఆమర్దకేశ్వరుని దర్శించిన వారి పాపము లన్నియు నశించును

శ్లో॥ తస్మిన్ అమర్దకే పీఠే జప్త్వాఽభీష్టదేవతామ్ ।
షణ్మాసం సిద్ధిమాప్నోతి సాధకో భైరవాజ్ఞయా ॥

భా అమర్దకపీఠమున ఇష్టదేవతను గురించి జపించిన సాధకులు ఆరునెలలలో భైరవాజ్ఞ చేసిద్ధిని పొందుదురు

తథా- శ్లో॥ యం యం చింతయతే కామం పాపభక్షణ సేవయా ।
బలిపూజోపహారైశ్చ తం తం స సమవాప్నుయాత్ ॥

భా॥ పాపభక్షేశ్వరుని సేవించి బలి పూజ ఉపహారములను సమర్పించిన భక్తులుఏయే కోరికలు కోరుకొందురో అవి యన్నియును నెరవేరును

తథా- శ్లో॥ తథైవ భైరవాశ్చాష్టౌ దిక్ష్వష్టాసు ప్రతిష్ఠితాః ।
రక్షన్తి సతతం కాశీం నిర్వాణశ్రీ నికేతనమ్ ॥

భా॥ అట్లే ఎనిమిది దిక్కులందు ఎనమండుగురు భైరవులు సుప్రతిష్ఠితులై ముక్తిలక్ష్మీ స్థానమగు కాశిని సదా రక్షించుచుందురు

శ్లో॥ రురుశ్చండోఽసితాంగశ్చ కపాలీ క్రోధనస్తథా ।
ఉన్మత్తభైరవః తద్వత్ క్రమాత్ సంహారభీషణౌ ॥
( విద్యుజ్జిహ్వాదయః చతుష్షష్టి వేతాలాశ్చ ద్విసప్తతితమేఽధ్యాయే జ్ఞేయాః )

భా॥ రురువు, చండుడు అసితాంగుడు కపాలి క్రోధనుడు ఉన్మత్తుడు సంహారభైరవుడు భీషణభైరవుడు - ఈ ఎనమండుగురు అష్టభైరవులు (విద్యుజ్జిహ్వుడు మొదలైన అరువది నాల్గుమంది భేతాళులను గూర్చి 72వ అధ్యాయమున చూడవగును.)

## (౭౦) అథ భవానీ మహిమా - కాశీఖండే

శ్లో॥ యోగం క్షేమం సదా కుర్యాత్ భవానీ కాశివాసినామ్ ।
తస్మాత్ భవానీ సంసేవ్యా సతతం కాశివాసిభిః ॥

భా॥ కాశివాసులకు భవాని సదాయోగక్షేమములను గల్గించుచుండును అందుచే కాశీవాసులకు భవాని సదాసేవింపదగినది

శ్లో॥ గృహమేధ్యత్ర విశ్వేశో భవానీ తత్కుటుంబినీ ।
సర్వేభ్యః కాశిసంస్థేభ్యో మోక్షభిక్షాం ప్రయచ్ఛతి ॥ ఇత్యాది ॥

భా॥ ఇచ్చట విశ్వేశ్వరుడు గృహమేధి భవాని ఆయనగృహిణి కాశిలో నుండగోరినట్టి వారికందరికిని ఆమె మోక్ష భిక్షను ప్రసాదించును

సనత్కుమార సంహితాయాం

శ్లో॥ యే యే ఽభివాంఛన్తి సమస్తభోగానిహాపి ముక్తిం పరతోఽప్యవిఘ్నామ్ ।
తేభ్యః సమస్తం దదతీ భవానీ సనత్యజస్రం గృహిణీ మృడస్య ॥

భా॥ ఎవరెవరు ఎట్టి కోరికలను కోరుకొందురో అట్టివారికి భవాని ఈలోకమున సమస్త భోగములను గల్గించి ఎట్టి అడ్డంకులు లేకుండ పరమమైన ముక్తిని గల్గించుచు ఈకాశియందు సదాశివుని గృహిణియగు భవాని నిరంతరము

వసించుచుండును

బ్రహ్మవైవర్తే -శ్లో॥ దీనం వదాన్యం మహదల్పకంవా పుణ్యం మహాపాతక సంయుతంవా।
అరాధితా సమతాం సంవిధత్తే దయాపరా భోగమోక్షైకహేతుః ॥
( ఇత్యాది స్తుతిస్తు నిత్యయాత్రాయాం వక్ష్యతే )

భా తనను ఆరాధించినవారు దీనులైనను దాతలైనను గొప్పవారైనను అల్పులైనను పుణ్యవంతులైనను మహాపాపులైనను దయావరురాలైన భవాని వారినందరిని సమానముగ అనుగ్రహించి వారందరికి మోక్షకారణమగుచున్నది ( ఇంకను ఇటువంటి దేవీస్తుతి నిత్యయాత్రయందు చెప్పబడుచున్నది )

**(౮౬) అథ ఆదిత్యోద్దేశః :- కాశీఖండే :-**

శ్లో॥ లోలార్క ఉత్తరార్కశ్చ సాంబాదిత్య స్తథైవచ చతుర్థో ద్రుపదాదిత్యో మయూఖాదిత్య ఏవచ ఖఖోల్కాశ్చారుణాదిశ్చ వృద్ధకేశవసంజ్ఞకౌ దశమో విమలాదిత్యోగంగాదిత్యస్తథైవచ। ద్వాదశశ్చ యమాదిత్యః కాశీపుర్యాం ఘటోద్భవతమో-ధికేభ్యో దుష్టేభ్యః క్షేత్రం రక్షన్తి సర్వదా ॥

భా ఓ అగస్త్యమహర్షీ కాశీపురియందు లోలార్కుడు ఉత్తరార్కుడు సాంబాదిత్యుడు ద్రుపదాదిత్యుడు మయూఖాదిత్యుడు ఖఖోల్కాదిత్యుడు అరుణాదిత్యుడు వృద్ధార్కుడు కేశవాదిత్యుడు విమలాదిత్యుడు గంగాదిత్యుడు యమాదిత్యుడు అనుద్వాదశాదిత్యులున్నారు. తామసప్రకృతి గల దుష్టులనుండి వారు క్షేత్రమును ఎల్లప్పుడు రక్షించుచుందురు

తత్రాపి:- శ్లో॥ లోలార్కస్త్వసి సంభేదే దక్షిణస్యాం దిశి స్థితః।
యోగక్షేమం సదా కుర్యాత్ కాశీవాసి జనస్యచ ॥

భా అందులోలార్కుడు అస్సీసంగమ దక్షిణదిక్కున యుండి కాశీవాసుల యోగక్షేమములను సదా అరయు చుండును

శ్లో॥ తస్యార్కస్య మనోలోలం యదాసీత్ కాశిదర్శనే।
అతో లోలార్క ఇత్యాఖ్యా కాశ్యాం జాతా వివస్వతః ॥

భా కాశీకి వచ్చినటువంటి సూర్యుని మనస్సు కాశిని దర్శించగనే లోలాయిత (అందులగ్న) మయ్యెను అందుచే లోలార్కుడను పేరు అయనకు ప్రఖ్యాతమయ్యెను

శ్లో॥ లోలార్క సంగమే స్నాత్వా దానం హోమం సురార్చనమ్।

యత్కించిత్ క్రియతే కర్మ తదానన్త్యాయ కల్పతే ॥

భా॥ లోలార్క సంగమమందు స్నానము చేసి యథాశక్తి దానము, హోమము, దేవతల యొక్క అర్చనము మొదలగునవి ఏవిచేసినను అవి అనంత ఫలము నిచ్చును.

శ్లో॥ నరః స్నాత్వాఽసిసంభేదే సంతర్ప్య పితృదేవతాః
శ్రాద్ధం విధాయ విధినా పిత్రానృణ్య మవాప్నుయాత్ ॥

భా॥ అసీసంగమమందు స్నానముచేసి విధివిధానముగ పితృదేవతలకు తర్పణము శ్రాద్ధము నాచరించినవాడు పితౄఋణమును తీర్చుకొనినట్టివాడగును

తథా- శ్లో॥ న తస్య దుఃఖం నో పామా న దద్రూ ర్నచ చర్చికాః
లోలార్కమర్కం యః పశ్యేత్ తత్పాదోదక సేవకః ॥

భా॥ లోలార్కుని దర్శించి అతని పాదోదకమును సేవించిన వానికి ఎట్టి దుఃఖముగాని గజ్జి మొదలగు చర్మరోగములు శరీరమున దద్దురులు దురద మొదలగునవి గాని ఏవియు బాధించవు

శ్లో॥ వారాణస్యా ముషిత్వాఽపి యో లోలార్కం న సేవతే
సేవంతే తం నరం నూనం క్లేశాః క్షుద్వ్యాధి సంభవాః ॥

భా॥ కాశీయందుండి గూడ ఎవడులోలార్కుని సేవించడో అటువంటి మానవుడు నిశ్చయముగ క్షుద్వ్యాధిజన్యములైన క్లేశములకు లోనగును

శ్లో॥ సర్వేషాం కాశీతీర్థానాం లోలార్కః ప్రథమం శిరః ।
తతో ఽంగాన్యన్యతీర్థాని తజ్జలప్లావితాని హి ॥

భా॥ కాశీయందలి తీర్థములన్నిటికి లోలార్కకుండము శిరస్థానము వంటిది మిగిలిన తీర్థములన్నియు దాని యొక్క జలముతో కూడుకొనినవియై దానికి అంగములవంటివి యగుచున్నవి

శ్లో॥ అథోత్తరస్యా మాశాయాం కుండమర్కాఖ్య ముత్తమమ్ ।
తత్ర నామ్నోత్తరార్కేణ రశ్మిమాలీ వ్యవస్థితః ॥

భా॥ అనంతరము ఉత్తరదిక్కునందు అర్కకుండ మనుపేరుతో ఉత్తమమైన కుండమున్నది అచ్చట ఉత్తరార్కుడను నామముతో సూర్యుడు వ్యవస్థితుడై యున్నాడు

శ్లో॥ తాపయన్ దుఃఖసంఘాతం సాధునాప్యాయయన్ రవిః ।
ఉత్తరార్కో మహాతేజాః కాశీం రక్షతిసర్వదా॥

భా॥ మహాతేజస్సు గల ఆ ఉత్తరార్కుడు సాధువుల దుఃఖసమూహములను తపింపజేసి వారిని ఆహ్లాదపరుచుచు కాశిని సదా రక్షించుచుండును

తథాః- ఖర్కర్యా దేరప్రస్తావే:-

శ్లో॥ ఖర్కరీకుండ మిత్యాఖ్యా ఖర్కకుండస్య జాయతామ్ ।
ఏతస్యాః ప్రతిమా పూజ్యా భవిష్యత్యత్ర మానవైః ॥

భా ఖర్కరీ అనుకుండమందు పుట్టినటువంటి అనూర్యప్రతిమ సర్వులచేతను పూజింపదగినది ( ఏతస్యాఃఖర్కర్యాః )

శ్లో॥ సాంబో వారాణసీం ప్రాప్య సమారాధ్యాంశుమాలినమ్ ।
కుండం తత్ స్నపతః కృత్వా నిజాం ప్రకృతి మాప్తవాన్ ॥

భా సాంబుడు (శ్రీకృష్ణుని కుమారుడు) వారాణసినిచేరి సూర్యుని ఆరాధించి ఆకుండములో స్నానముచేసి తన కుష్ఠరోగమును బాపుకొని సహజస్థితిని పొందెను.

శ్లో॥ సాంబాదిత్య తదారభ్య సర్వవ్యాధి హరో రవిః ।
దదాతి సర్వభక్తేభ్యోఽనామయాః సర్వసంపదః ॥

భా అప్పటినుండి సాంబాదిత్యుడను పేరుతో అచ్చట సూర్యుడు సర్వవ్యాధులను హరించి భక్తులకు ఆరోగ్యమును సర్వసంపదలను ఇచ్చుచున్నాడు (రవిణా ద్రౌపద్యై వరప్రదానే)( సూర్యునిచే ద్రౌపదికి వరప్రదానము జరుగుటచేత

శ్లో॥ విశ్వేశాద్దక్షిణే భాగే యో మాం త్వత్పురతః స్థితమ్ ।
ఆరాధయిష్యతి నరః క్షుద్బాధా తస్య నశ్యతి ॥

భా విశ్వేశ్వరునకు దక్షిణ దిక్కునందున్న నన్ను ( సూర్యుని ) ఎవరు ఆరాధింతురో అట్టివారికి ఆకలి బాధ యుండదు ( ద్రౌపది మూర్తికి అగ్రభాగమందు సూర్యచక్రమున్నది )

శ్లో॥ అన్యశ్చ మే వరో దత్తో విశ్వేశేన పతివ్రతే ।
తపసా పరితుష్టేన తన్నిశామయ వచ్మి తే ॥

భా ఓపతివ్రతా! (ద్రౌపదీ ) నాతపస్సుచే సంతోషించిన విశ్వేశ్వరుడు నాకు మరియొక వరమును గూడ ఇచ్చినాడు వినుము

శ్లో॥ ప్రాగేవ త్వాం సమారాధ్య యో మాం ద్రక్ష్యతి మానవః ।
తస్య త్వం దుఃఖతిమిర మపానుద నిజైః కరైః ॥

భా ఓ ఆదిత్యా! మొదటనిన్ను పూజించి తరువాత నన్ను దర్శించుమానవుని దుఃఖ తిమిరమును నీకిరణములచే నశింపజేయుము

శ్లో॥ యే మామత్ర భజిష్యన్తి మానవాః శ్రద్ధయాఽన్వితాః ।
త్వద్వరోద్యతపాణించ తేషాం దాస్యామి చింతితమ్ ॥

భా॥ నన్ను ఇక్కడ ఎవరు శ్రద్ధగ పూజించుచుందురో సేవింతురో అట్టివారికి కోరిన వరములను వరద హస్తముతో నేను ఇచ్చుచుందును

శ్లో॥ భవతీం మత్సమీపస్థాం యుధిష్ఠిర పతివ్రతామ్ ।
విశ్వేశాద్దక్షిణేభాగే దండపాణి సమీపతః ॥
యేఽర్చయిష్యన్తి భావేన పురుషావా స్త్రియోఽపివా ।
తేషాం కదాచిన్న భావి భయం ప్రియ వియోగజమ్ ॥
న వ్యాధిజం భయం క్వాపి న క్షుత్తృట్ దోషసంభవమ్ ।
ద్రౌపదీక్షణతః కాశ్యాం తవ ధర్మప్రియేఽనఘే ॥

భా॥ ఓపాండవపత్నియగు ద్రౌపదీసతీ! విశ్వేశ్వరునకు దక్షిణభాగమున దండపాణికి సమీపముగ నాకు దగ్గరగ యున్నట్టి నిన్ను పురుషుడు గాని స్త్రీగాని అర్చించినచో అట్టివారు ప్రియ విరహ దుఃఖమును పొందరు ధర్మపరురాలవు పుణ్యాత్మురాలవునైన నిన్ను, మరియు కాశీయందు ఉపస్థితురాలవైయున్న నిన్ను దర్శించిన వారికి రోగభయము గాని క్షుత్పిపాసల వలన గలుగు దుఃఖముగాని సంభవించదు

తథా వివః - శ్లో॥ మయూఖా ఏవ తే దృష్టా నచ దృష్టం కళేబరమ్ ।
మయూఖాదిత్య ఇత్యాఖ్యా తతస్తే ఽదితినందన ॥
త్వదర్చతాం నృణాం కశ్చిన్నవ్యాధిః ప్రభవిష్యతి ॥

భా॥ ఓఅదితి నందనా! నీయొక్క కిరణములే కన్పించుచున్నవిగాని నీశరీరము దృగ్గోచరమగుటలేదు అందుచే మయూఖాదిత్యుడు అనుపేరు నీకు గల్గును నిన్ను పూజించువరులకు ఎట్టివ్యాధియు గలుగదు

తథా - శ్లో॥ ఖఖోల్కనామ భగవానాదిత్యః పరికీర్తితః ।
త్రివిష్టపోత్తరే భాగే సర్వవ్యాధి విఘాతకృత్ (త్రివిష్టపం త్రిలోచనస్థానం)

భా॥ త్రిలోచన స్థానమునకు ఉత్తరభాగమునందు సర్వవ్యాధులను నివారించుచు ఖఖోల్కుడను పేరుతో సూర్యుడు ప్రతిష్ఠితుడై యున్నాడు

శ్లో॥ కాశీవాసి జనానేక గదయా మక్షయంకరః ।
వినతాదిత్య ఇత్యాఖ్యః ఖఖోల్కా స్తత్రసంస్థితః ॥

భా॥ కాశీవాసులకు వివిధ వ్యాధులను పోగొట్టి ఆరోగ్యమును గల్గించు వినతాదిత్యుడను పేరుతో ఖఖోల్కాదిత్యుడచ్చట నున్నాడు

శ్లో॥ ఇత్థం ఖఖోల్క ఆదిత్యః కాశీ విఘ్నతమోహరః ।
తస్య దర్శనమాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే ॥

భా ఇట్లు ఖఖోల్కాదిత్యుడు కాశీయందు విఘ్నతిమిరమును హరించుచుండును అయన దర్శనమాత్రమువనే సర్వపాపములు క్షయమగును

శ్లో॥ కాశ్యాం పైశంగిలే తీర్థే ఖఖోల్కస్య విలోకనాత్ ।
నరశ్చింతితమాప్నోతి నీరోగో జాయతే క్షణాత్ ( పైశంగిలే పిలిప్పిలా తీర్థ )

భా పిలిప్పిలా తీర్థమందున్నట్టి ఖఖోల్కాదర్శనము చేసిన నరుడు కోరిన కోరికలను పొంది సమస్త రోగవిముక్తుడగును

అథ అరుణం ప్రతి అర్క వరప్రదానం ( అరుణునకు సూర్యునివరము )

శ్లో॥ అత్ర త్వత్ స్థాపితాంమూర్తిం యే భజిష్యన్తి మానవాః ।
వారాణస్యాం మహాదేవోత్తరే తేషాం కుతో భయమ్ ॥

భా కాశీయందు మహాదేవునికి ఉత్తరముగ నీచేత స్థాపించబడిన మూర్తిని (అనగా అరుణాదిత్యుని ) ఎవరు సేవింతురో అట్టివారు నిర్భయులు

శ్లో॥ యే ఽర్చయిష్యన్తి సతత మరుణాదిత్య సంజ్ఞకమ్ ।
మామత్ర తేషాం నో దుఃఖం న దారిద్ర్యం న పాతకమ్॥

భా అరుణాదిత్యుడను పేరుగల నన్ను ఇచ్చట ఎవరు సేవింతురో అట్టివారికి దుఃఖముగాని దరిద్రముగాని పాతకము గాని అంటవు

శ్లో॥ వ్యాధిభి ర్నాభిభూయంతే నోపసర్గైశ్చ కైశ్చన
శోకాగ్నినా న దహ్యన్తే హ్యరుణాదిత్య సేవనాత్ ॥

భా ఏవిధమైన వ్యాధులు గాని సంకటములు గాని అరుణాదిత్యుని సేవించువారికి గలుగవు మరియు వారు శోకాగ్నిచే దహించబడరు అనగా వారికి శోకమే గలుగదని భావము

తథా దక్షిణేన విశాలాక్ష్యా ఇత్యుపక్రమ్య ( విశాలాక్షికి దక్షిణముగా నున్న అవి ప్రారంభించి)

శ్లో॥ వృద్ధేనా ఽఽ రాధితో యస్మాద్ధారీతేన తపస్వినా ।
ఆదిత్యో వార్ధకహరో వృద్ధాదిత్యస్తతః స్మృతః ॥

భా వృద్ధుడైన హారీతునిచే తపస్సు చేయబడి అరాధింపబడుటచే అచ్చట వృద్ధాప్యమును పోగొట్టునట్టి వృద్ధాదిత్యుడు అనిపేరుగాంచెను

శ్లో॥ వృద్ధాదిత్యం సమారాధ్య వారాణస్యాం ఘటోద్భవ ।
జరా దుర్గతి రోగఘ్నం జహుః సిద్ధిమాగతాః ॥

ఓ అగస్త్య మహర్షీ కాశీయందలి వృద్ధాదిత్యుని సేవించిన వారు పెక్కురు ముసలితనము దుర్గతి రోగములు పోయి సిద్ధిని పొందినవారైరి

*అథోత్తరేణ అదికేశవాదిత్యః (అదికేశవాదిత్యుని గురించి)*

శ్లో॥ *అతః స కేశవాదిత్యః కాశ్యాం భక్త తమోనుదః ।*
*సమర్చితః సదా దేయాన్మనసో వాంఛితం ఫలమ్ ॥*

భా॥ కాశీయందు భక్తుల యొక్క అజ్ఞాన తిమిరమును పోగొట్టునట్టి కేశవాదిత్యుడు భక్తుల మనోవాంఛితములను సదానెరవేర్చుచుండును

శ్లో॥ *కేశవాదిత్యమారాధ్య వారాణస్యాం నరోత్తమః ।*
*పరమం జ్ఞానమాప్నోతి యేన నిర్వాణభాక్ భవేత్ ॥*

భా॥ వారాణసిలో నరోత్తముడు కేశవాదిత్యుని అర్చించి పరమజ్ఞానమును పొందును దానిచే నతడు మోక్షగామి యగును

శ్లో॥ *తత్ర పాదోదకేతీర్థే కృతసర్వోదకక్రియః ।*
*విలోక్య కేశవాదిత్యం ముచ్యతే జన్మపాతకైః ॥*

భా॥ అచ్యుతపాదోదక తీర్థమందు స్నానముచేసి సర్వఉదక క్రియలు నిర్వర్తించి కేశవాదిత్యుని దర్శించిన నరుడు అనేక జన్మల పాపములనుండి విముక్తుడగును

శ్లో॥ *అతః పరం శ్రుణు మునే విమలాదిత్య ముత్తమమ్ ।*
*హరికేశ వనేరమ్యే వారాణస్యాం వ్యవస్థితమ్ ॥ ఇత్యుపక్రమ్య )*

భా॥ ఇప్పుడు ఉత్తమమైన విమలాదిత్యుని గురించి వినుము కాశీయందున్న రమ్యమైన హరి కేశవన మందు ( అని ప్రారంభించి )

శ్లో॥ *ఇత్థం సవిమలాదిత్యో వారాణస్యాం శుభప్రదః ।*
*తస్య దర్శనమాత్రేణ కుష్ఠరోగః ప్రశామ్యతి ॥*

భా॥ కాశీయందు వెలకొనియున్న విమలాదిత్యుడు మిక్కిలి శుభప్రదుడు ఆయనను దర్శించిన మాత్రమున కుష్ఠరోగము నివారణమగును

శ్లో॥ *గంగాదిత్యోఽస్తి తత్రాన్యో విశ్వేశా ద్దక్షిణేనవై।*
*తస్య దర్శన మాత్రేణ నరః శుద్ధిమియాదిహ ॥*

భా॥ విశ్వేశ్వరునికి దక్షిణదిశయందు గంగాదిత్యుడనుపేర మరియొక ఆదిత్యున్నాడు ఆయన దర్శనమాత్రము చేత నరులు శుద్ధత్వమును పొందుదురు

శ్లో॥ గంగాదిత్యం సమాసాద్య వారాణస్యాం నరోత్తమః ।
న జాతు దుర్గతిం క్వాపి లభతే న చ రోగభాక్ ॥

భా కాశీయందలి గంగాదిత్యుని సేవించిన వారికి ఎప్పటికిని దుర్గతిగాని రోగభయము గాని గలుగదు

శ్లో॥ *యమేశాత్పశ్చిమేభాగే వీరేశాత్పూర్వతో మునే ।*
*యమాదిత్యం నరోదృష్ట్వా యమలోకం నపశ్యతి ॥*

భా ఓ అగస్త్య మహర్షీ యమేశ్వరునికి పశ్చిమ భాగమున వీరేశ్వరునకు తూర్పుభాగమున గల యమాదిత్యుని దర్శించిన నరుడు యమలోకమును చూడడు

శ్లో॥ *యమేశంచ యమాదిత్యం యమేన స్థాపితం నమన్ ।*
*యమ తీర్థే కృతస్నానో యమలోకం నపశ్యతి ॥*

( అత్ర అర్థక్రమేణ పాఠక్రమ బాధాత్ స్నానానంతరం నతిః జ్ఞేయా )
పాఠక్రమాత్ అర్థక్రమో బలీయః ) ( ఇతి ద్వాదశాదిత్యాః )

భా యమతీర్థమునందు స్నానముచేసి యమేశ్వరుని మరియు యమునిచే స్థాపింపబడిన యమాదిత్యుని దర్శించిన వారు యమలోకమును చూడరు పాఠక్రమము కంటె అర్థక్రమము బలీయముగుటచే స్నానానంతరం దేవునికి నమస్కారము అని గ్రహింపవలెను )

(ఇది ద్వాదశాదిత్యులను గురించిన వృత్తాంతము)

## (౮౨) అథ షట్పంచాశత్ గణేశాః

( తత్ర కాశీఖండ శ్లోకలేఖనే అతివిస్తారాపాతాత్ తదర్థఏవ ఉచ్యతే)
( కాశీఖండమందు ఈ (56)గణపతులను శ్లోకములు మిక్కిలి విస్తారముగ నుండుటచే వాని భావము మాత్రమే చెప్పబడుచున్నది )

*(1) అసీసంగమే అర్కవినాయకః(2)క్షేత్రాద్దక్షిణే దుర్గావినాయకః(3) భీమచండీ సమీపే భీమచండీ వినాయకః (4)క్షేత్ర పశ్చిమే దేహలీవినాయకః5)క్షేత్రాద్వాయవ్యే ఉద్దండవినాయకః6)క్షేత్రోత్తరే పాశపాణివినాయకః7)వరణాసంగమేఖర్వవినాయకః 8)క్షేత్రప్రాచ్యాం (తూర్పున) సిద్ధివినాయకః(ఏతే అష్టౌ బాహ్యావరణే) 9)అర్కవినాయకాదుత్తరతః లంబోదరవినాయకః(10)దుర్గవినాయకాదుత్తరే కూటదంతవినాయకః(11)భీమచండీ వినాయకాత్ ఈశాన్యాం శాలకటంకట వినాయకః (12)దేహలీవినాయకాత్ ప్రాచ్యాం కూష్మాండవినాయకః(13)ఉద్దండా దాగ్నేయ్యాం ముండవినాయకః(14)పాశపాణేర్దక్షిణే వికటద్విజవినాయకః(15)ఖర్వాన్నైరృత్యాం రాజపుత్ర వినాయకః(16)తస్మాద్దక్షిణే ప్రణవవినాయకః(ఏతే అష్టౌ ద్వితీయావరణే)*

(17)లంబోదరాత్ ఉదీచ్యాం (ఉత్తరమున )వక్రతుండ వినాయకః(18)కూటదంతాదుత్తరే ఏకదంత వినాయకః (19)శాలకటంకటా దిశాన్యాం త్రిముఖ వినాయకః (20)కుష్మాండాత్పూర్వతః పంచాస్య వినాయకః(21)ముండాదాగ్నేయ్యాం హేరంబ వినాయకః (22)వికటదంతాత్ దక్షిణే విఘ్నరాజ వినాయకః(23)రాజపుత్రాత్ నైరృతే వరదవినాయకః (24)ప్రణవాద్యామ్యాం (దక్షిణమున) మోదక ప్రియ వినాయకః (ఏతే అష్టౌ తృతీయావరణే)
(25)వక్రతుండాదుత్తరే అభయద వినాయకః(26)ఏకదంతాదుత్తరే సింహతుండవినాయకః (27)త్రిముఖాదిశాన్యాం కూణితాక్ష వినాయకః(28)పంచాస్యాత్ ప్రాచ్యాం క్షిప్ర ప్రసాదన వినాయకః(29)హేరంబాదాగ్నేయ్యాం చింతామణి వినాయకః(30)విఘ్నరాజాద్దక్షిణే దంతహస్త వినాయకః(31)వరదాత్నైరృతే పిచిండిల వినాయకః(32)మోదకప్రియాత్దక్షిణే ఉద్దండముండ వినాయకః (ఏతే అష్టౌ చతుర్థా వరణే)
(33)అభయాదుత్తరే స్థూలదంత వినాయకః(34) సింహతుండాదుత్తరే కలిప్రియవినాయకః (35)కూణితాక్షాదీశాన్యాం చతుర్థ వినాయకః 36)క్షిప్రప్రసాదనాత్ ప్రాచ్యాం ద్వితుండ వినాయకః(37)చింతామణేః ఆగ్నేయ్యాం జ్యేష్ఠ వినాయకః(38)దంతహస్తాత్ యామ్యాం గజ వినాయకః (39)పిచిండిలా ద్దక్షిణే కాలవినాయకః(40)ఉద్దండముండాత్ యామ్యాం నాగేశ వినాయకః (ఏతే అష్టౌ పంచమావరణే.)
(41) ప్రాచ్యాం మణికర్ణి వినాయకః (42)అగ్నేయే ఆశావినాయకః (43)దక్షిణే సృష్టి వినాయకః (44)నైరృతేయక్షవినాయకః(45)పశ్చిమే గజకర్ణ వినాయకః(46)వాయవ్యే చిత్రఘంట వినాయకః(47)ఉత్తరే స్థూలజంఘ వినాయకః(48)ఈశాన్యాం మంగళవినాయకః (ఏతే అష్టౌ షష్ఠావరణే)
(49)మోద(50)ప్రమోద(51)ఆమోద(52)సుముఖ(53)దుర్ముఖ(54)జ్ఞాన(55)ద్వార(56)అవిముక్త వినాయకాః ( ఏతే అష్టౌప్రాగాది క్రమేణ సప్తమావరణే) ( భావము స్పష్టము)

శ్లో॥ షట్పంచాశ ద్గణముఖా నేతాన్యః సంస్మరిష్యతి ।
దూరదేశాంతరస్థో ఽపి సమృతో జ్ఞానమాప్నుయాత్ ॥

భా॥ కాశియందలి ఈ ఏబది ఆరుగణపతులను దూరదేశము నందు ఉండియునను సంస్మరించినవాడు మృతుడైనప్పుడు జ్ఞానమును పొందును

శ్లో॥ ఇమే గణేశ్వరాః సర్వే స్మర్తవ్యా యత్రకుత్రచిత్ ।
మహావిపత్సముద్రాంతః పతితం పాంతి మానవమ్ ॥ ఇతి ॥

భా॥ (భగీరథ హరిశ్చంద్ర కపర్ది బిందువినాయకాశ్చత్వారో పరేఽపి సంత్తి పంచాశదధ్యాయే జ్ఞేయాః ) (సర్వ సంపత్కరం నామ ఢుంఢి స్తోత్రమపి తత్రైవ జ్ఞేయమ్)

భా॥ ఈ ఎబది ఆరు గణపతులను తప్పక స్మరించవలెను స్మరణమ క్రమున ఏయి ఏఎత్యముద్రయుగ్నలై మానవులను వెంటనే ఉద్ధరింతురు (భగంథ వారి కృష్ణ కపర్ది బిందువినాయకులు నలుగురిని గురించి 77వ అధ్యాయమున తెలియదగినది అచ్చటనే సర్వసంసేత్కరమగు ఢుండి స్తోత్రము ను గూడ చూడనగును )

ఒథాత్ర విష్ణు మూర్తయ కాశీఖండే ఏకషష్ఠితమేఽధ్యాయే కాశ్చిత్ విష్ణుమూర్తిరుక్త్వాఽస్తుఽక్తమ్)

శ్లో॥ నారాయణాచ్ఛతం పంచశతంచ జలశాయిన ।
త్రింశత్కమఠ రూపాణి మత్స్యరూపాణి వింశతి ॥

శ్లో॥ గోపాలశ్చ శతం సాష్టం బుద్ధాస్సంతి సహస్రశ ।
త్రింశత్పరశురామాశ్చ రామా ఏకోత్తరం శతమ్ ।
విష్ణురూపో ఽ స్యహంచైకో ముక్తిమంటప మధ్యత ॥ఇతి॥

భా॥ నారాయణమూర్తులు నూరు జలాశయ మూర్తులు ఐదునూర్లు కమఠరూపములు ముప్పది మత్స్యరూపములుఇరువది గోపాలరూపములు నూట ఎనిమిద బుద్ధరూపములు వేలకలద ఎం కురాముందాపములు ముప్పద శ్రీరామరూపములు నూట ఒకటి ఉన్నవి ఒకే ఒక విష్ణు రూపముగ ముక్తి మండప మధ్యమందు నేను వెలిసియున్నాను అని విష్ణువచనము (కాశీ ఖండమున అరువది ఒకటవ అధ్యాయమున విష్ణుమూర్తులను గురించి చెప్పబడినది)

**(౬3) అథ ఆవశ్యక తీర్థాని** - బ్రహ్మవైవర్తే సూత -

శ్లో॥ అవశ్యకాని తీర్థాని శృణ్వంతు ద్విజసత్తమా ।
అస్నానాత్ ప్రత్యవాయీ స్యాదవిముక్తే స్థితో నర ॥

భా - ఓ ద్విజసత్తము లారా! అవిముక్త క్షేత్ర మందున్న మానవుడు ఏ తీర్థము లందు
స్నానము చేయకపోవుటచే అతనికి ప్రత్యవాయము గల్గునో అట్టి ముఖ్యతీర్థములను గురించి చెప్పెదను వినుడు

శ్లో॥ గంగాస్నానం నిత్యమేవ ప్రశస్తం గంగాస్నాయీ సర్వతీర్థేషు సస్నొ ।
గంగాస్నానా పేక్షయాఽన్యస్య యాత్రా నొకర్తవ్యా ధర్మదృగ్భి నృభర్త ॥

భా గంగాస్నానము నిత్యము జేయుట ప్రశస్తము గంగాస్నానము చేయువాడు సర్వతీర్థములందు స్నానము చేసినవాడే యగును గంగాస్నానముపేక్షించి ఇతర ప్రదేశములకు యాత్ర చేయదగినది గాదు ఇది ధర్మపరులగునరులకు అన్వయించును